# భగవాన్

# రమ మహర్షి



చిక్కాల కృష్ణారావు

ప్రచురణ నెం. 2



ప్రథమ ముద్రణ : డిసెంబరు 1990
రెండవ ముద్రణ : ఫిబ్రవరి 1993

కాపీలు : 1000

**ధర : రు. 40-00**

ప్రచురణ :
నాగమణి

ప్రతులకు :
చిక్కాల కృష్ణారావు
"కృష్ణ నిలయం", గొల్లవీధి,
భీమునిపట్నం
విశాఖజిల్లా - 531 163.

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-520 002.

నిత్యం నా మదిలో

మధురంగా మెదిలే

# అరుణాచల రమణునికి

చివరికి నన్ను అర్థం చేసుకుని

ఈ నా జీవితానికి అవకాశమిచ్చిన అమ్మ-నాన్నలకు,

నన్ను తీసుకుని మనసారా దీవించిన చలంగారికి,

హృదయపూర్వకంగా ఆశీర్వదించిన సౌరిస్‌గారికి,

ప్రేమతో నన్ను ప్రోత్సహించిన స్వామి యోగానందగారికి,

పుస్తక ముద్రణకు అభిమానంతో సహకరించిన

మిత్రుడు పాస్కల్ (ఫ్రాన్స్)కు,

గ్రంథ ప్రచురణకు సంతోషాన్ని వెలిబుచ్చిన

శ్రీ రమణాశ్రమం వారికి,

నా హృదయపూర్వక కృతజ్ఞతలు

# విషయ సూచిక

# ముందుమాట

నేను చదువుకునే రోజుల్లో, చలంగారి రచనలు చదివి, ఆయనకో ఉత్తరం రాశాను. దానికి సమాధానంతో పాటు, భగవాన్ శ్రీ రమణమహర్షి ఫొటో ఒకటి పంపించారు.

ఆ భగవానెవరో, నాకు తెలియదు - కాని ఆ ఫొటోలో వున్న ఆయన - His Gracious Smile - ఆ క్షణాన నన్ను ఆకర్షించి, ఆకట్టు కుంది. అంతే! వెంటనే ఆ పటాన్ని ఫ్రేమ్ కట్టించాను. దాన్ని చూసి నా మిత్రులు కొందరు చిరునవ్వారు.

ఆ తర్వాత నాలుగేళ్లకు చిన్నారావుగారితో కలిసి చలంగారిని చూడ్డానికి, తిరువణ్ణామలై వెళ్ళాను. ఆ మధ్యకాలంలో చలంగారు భగవాన్ మీద రాసిన కొన్ని వ్యాసాలు చదివాను. భగవాన్ ప్రతి ఒక్కరినీ "నిన్ను నీవు తెలుసుకో" అంటారు. ఎవరికైగా ఆ సూచన సరైనదీ, సూటైనదే అనిపించింది.

శ్రీ రమణస్థాన్‌లో వున్నన్ని రోజులూ, రోజూ చలంగారితో కలిసి, శ్రీ రమణాశ్రమానికి వెళ్లేవాడిని. తిరిగి శ్రీ రమణస్థాన్‌కివస్తే, సౌరిస్‌గారు భగవాన్ గురించి ఎన్నో సంగతులు చెప్పేవారు.

ఆ తర్వాత నాకు సంవత్సరంలో ఎక్కువ కాలం శ్రీ రమణ స్థాన్‌లో వుండే అవకాశం లభించింది. ఆ కాలంలో భగవాన్ రచన

లను, భగవాన్ గురించి అనేకమంది రాసిన గ్రంథాలను, పత్రి
వచ్చిన సమాచారాన్ని, శ్రీ రమణాశ్రమ గ్రంథాలయంలో లభ్య
విషయాల్ని చదివి, నాసంస్కార స్వభావాల్నిబట్టి భగవాన్‌తత్వ
గ్రహించాను.

భగవాన్ గురించి నాకేమి అర్థమైందో, దాన్నంతా, కే
ఆయన మాటలతోనే రాసుకున్నాను. చివరికి అది ఆయన జీవిత
తత్వంగా రూపొందింది.

ఈ పుస్తకాన్ని చదివినవారు ఇచ్చే అమూల్యమైన సలహా
సూచనలను సహృదయంతో తీసుకుని, గ్రంథాన్ని సరిదిద్దు
వారికి సదా కృతజ్ఞుడనై ఉంటాను.

కృష్ణ

# పరిచయం

ఈ భూమి మీద అప్పుడప్పుడూ, అక్కడక్కడా అపురూపంగా పూసే పువ్వులు వంటివారు ఈ గురువులూ, జ్ఞానులూ, మహర్షులూ, ప్రవక్తలు. అటువంటి వారిలో, భగవాన్ శ్రీ రమణ మహర్షి ఒకరు.

సృష్టి తమకు ఇచ్చిన సౌందర్యాన్ని, సౌరభాన్ని వెదజల్లి, కొంతకాలం ఈ భూమిమీద వుండి, తక్కిన వాటిమల్లేనే ఆ పువ్వులూ నేల రాలిపోతాయి. మనం వివేకవంతులమైతే, ఆ అందాన్ని అనుభవించి, ఆ సౌరభాన్ని ఆఘ్రాణించి ఆనందిస్తాం. మహర్షుల విషయంలోనూ అంతే !

ఇరవైఐదు వందల సంవత్సరాల క్రిందట బుద్ధ భగవానులూ, పన్నెండు వందల సంవత్సరాల కిందట శంకరాచార్యులూ మహాభి నిష్క్రమణ గావించారు. వారు తాము తెలుసుకున్న సత్యాన్ని ప్రపంచానికి తెలియజెప్పాలని ప్రచారం చేసి, బోధించారు. వారి మాదిరిగా కాక, భగవాన్ మహాభినిష్క్రమణ గావించినా, అరుణా చలంలో సహజ సమాధిస్థితిలో స్థిరనివాసులై, తన్నర్థించిన వారికి ఆత్మ విచారణ మార్గాన్ని సూచించారు.

తమను తాము తెలుసుకున్న మహాత్ములందరూ బాహ్య విషయాల్లో ఒకే విధంగా ఉండకపోవచ్చు. కాని, వారంతా ప్రేమ మయులు, కరుణాస్వరూపులు. వారు ఏం చేసినా, ఏం చెప్పినా, ఏం రాసినా - గీసినా - పాడినా అదంతా సమస్త ప్రాణికోటి పురోభి వృద్ధికోసమేనని, మనం గ్రహించాలి. ఎందుకంటే, జీవితంలో సత్యాన్వేషణ చేసిన మహాత్ములందరూ, కొన్ని జీవన ఫలాల్ని పోగుజేసి, బుట్టల్లో నింపుతారు. అటువంటివారు ప్రజల మధ్య వున్నా, రోడ్డు పక్కన కూర్చున్నా, ఎక్కడ-ఎట్లా వున్నా, తాము సేకరించిన ఫలాలను, ప్రేమతో తమ తమ రీతుల్లో అందరికీ పంచుతారు.

మధురకు ముప్పై మైళ్ళ దూరంలో "తిరుచ్చుళి" అనే గ్రామంలో, 30-12-1879 న, సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన వెంకట్రామన్‌కు, హైస్కూల్లో చదివేరోజుల్లో - పదహారవ ఏట - అతని ఆశ, ప్రయత్నం, కోర్కె, సాధన, ధ్యానం, తపం, జపం, యోగం, శిక్షణ, నియమ - నిష్ఠలు, ఏమీ లేకుండానే అకస్మాత్తుగా మృత్యు అనుభవం కలిగింది. అది అన్ని అనుభవాల్లోకి శక్తివంతమైన ఏకత్వానుభవం.

ఆ అనుభవంతో వెంకట్రామన్‌కు సద్యోముక్తి కలిగింది. సర్వైశ్వర్యభావం సిద్ధించింది. అసలు పరమార్థాన్ని తెలుసుకున్నారు. ప్రత్యేక గురువు అంటూ ఎవరూ లేకుండానే, కేవలం స్వబుద్ధితో విరాట్ స్వరూపాన్ని, ఆత్మ శాశ్వతత్వాన్ని, అసలు సత్యాన్ని, అంతిమ జ్ఞానాన్ని అవగాహన చేసుకున్నారు. అఖిల జగదాచార్య సింహాసనాన్ని అధిష్ఠించారు.

సూర్యోదయమైన తర్వాత పద్మం వికసించినట్లు, మృత్యు అనుభవంతో, వెంకట్రామన్ హృదయ పద్మం, పూర్తిగా విచ్చుకుంది. అప్పటి నుంచి ఆయన ఆత్మనిష్ఠులై, సహజ సమాధి స్థితిలో వున్నారు.

మెరపువలె వచ్చిన ఆ అనుభవం, మెరపువలె పోక, ఆ స్థితి ఆయనలో చివరి వరకు స్థిరంగా నిలిచింది. ఆ తర్వాత అన్నీ వదిలేసి, అరుణాచలం చేరి, ఏదీ అంటకుండా, ఏదీ పట్టకుండా, ఏదీ తనకు కప్పకుండా, ఏదీ తనను మూయకుండా, బాధించకుండా, బంధించకుండా ఏదీ భారంకాకుండా అలలు అణగిన మహాసాగరం మాదిరిగా, ఆత్మలోతుల్లో మరో యాభైనాలుగేళ్ళు జీవించారు.

క్రమంగా ఆయన చుట్టూ భక్తుల, శిష్యుల, పరిచారకుల, జిజ్ఞాసువుల, సాధకుల, సాధువుల, యాత్రికుల, మేధావుల రూపంలో పెద్ద ప్రపంచం అల్లుకుంది. స్థితప్రజ్ఞులై సమస్త వాంఛల్ని విసర్జించి,

కష్ట–సుఖాలకు, రాగ ద్వేషాలకు, భయక్రోధాదులకు అతీతుడై, అరుణాచలంపై సహజ సమాధి స్థితిలోవుండి, నిత్య కృత్యాల్ని నిర్వర్తించుకుంటున్న వెంకట్రామన్ని. కావ్య కంఠ గణపతి శాస్త్రిగారు చూశారు. అందరూ అన్ని కాలాల్లో ఏ సత్యాన్ని వెదికారో, ఏ జ్ఞానాన్ని కాంక్షించారో, ఆ సత్యమే-ఆ జ్ఞానమే అరుణాచలంపై వారికి దర్శన మిచ్చింది. ఆ తర్వాత ఆయన వెంకట్రామన్ సంగతులు అడిగి తెలుసుకుని, వారికి "భగవాన్ శ్రీ రమణ మహర్షి," అని నామ కరణం చేశారు.

క్రమంగా గ్రంథాలూ, అనుభవాలూ, ఉవాచలూ వెలువడ్డాయి. దేశ-విదేశీయులు భగవాన్‌కి ఆకర్షితులయ్యారు. గొప్ప, గొప్ప నిర్మాణాలతో త్వరలో శ్రీ రమణాశ్రమం ఏర్పడ్డది.

భగవాన్ కౌపీనధారియై, చాలా వరకు మౌనంగావున్నా, ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూవుండేవారు. ఆయన దర్శనం అందరికీ, అన్ని వేళలా అందుబాటులో వుండేది. సహజమైన ఆయన చిరునవ్వు, సమ్మోహనమైన ఆయన చూపు, నిర్మలమూ -పవిత్రమూ అయిన ఆయన వదనం, పసిబిడ్డవంటి తత్వం, ప్రతిఒక్కరినీ ఆకర్షించేవి.

అటువంటి మహోన్నత స్థితిలో వున్న భగవాన్ జీవితం, ఆశ్రమంలో ఓ నిర్ణీత కార్యక్రమంలో లిప్త పాటు తేడా లేకుండా నడిచింది. ఆయన ప్రతి పనినీ తనదిగా, ప్రేమగా, జాగ్రత్తగా, నెమ్మదిగా చేసేవారు. ఏ వస్తువు ఎక్కడ వుండాలో, అక్కడ వుండేటట్లు చూసేవారు. రేడియో ప్రకారం గడియారాన్ని సరిచేయించే వారు. రోజూ కేలండర్ మార్పించేవారు. హాలూ, సోఫాలూ శుభ్రంగా వున్నాయో, లేదో గమనించేవారు.

జీవితంలో అనేకవిధాల అణగారినవారూ, అధోగతిలో వున్నవారూ, శారీరకంగా-మానసికంగా అలసినవారూ, భగవాన్ సమక్షంలో శాంతిని, ఆనందాన్ని అనుభవించేవారు.

భగవాన్ సన్నిధే, ఒక దివ్యబోధ. కాని, కొందరు ప్రశ్నల జాబితాతో వచ్చేవారు. అడిగిన వెంటనే భగవాన్ అందరికీ సమాధానం చెప్పేవారు కాదు. కాని, ఎప్పుడో ఒకప్పుడు, ఓపికతో వేచి వున్న వారికి, వారి ప్రశ్నలకు ఆయన్నించి సమాధానం వచ్చేది. కొందరు ఆయన సన్నిధిలో కూర్చోగానే, తమ సంశయాల, ప్రశ్నల సంగతే మరచిపోయేవారు. "ఆయన సమక్షంలో అప్రయత్నంగా మనసు తిరుగుళ్ళూ, ఆలోచనల పోకళ్ళూ అద్భుతంగా అణగేవి" అంటారు అనుభవజ్ఞులు.

"భగవాన్ ఎదురుగా కూర్చుని లోదృష్టితో గమనిస్తే ఆరాటం, ఆందోళన, అశాంతి పోయి, హాయిగా, ఆనందంగా వుండేవార" మని కొందరు అంటారు.

"ఆయన సన్నిధిలో ఒక అసాధారణమైన, చిత్రమైన, అద్భుతమైన - అన్నిటికీ భిన్నమైన వాతావరణం వుండేది" అని కొందరు చెప్పేవారు.

ఏ అరమరికా, వేరు ఆలోచనా లేకుండా తమను తాము భగవాన్‌కి అర్పించుకుని, ఆశ్రమవాసం గడిపేవారంతా, ఏదో ఒక పని చేస్తూ, ఎప్పుడూ భగవాన్‌కి సన్నిహితంగా వుండేవారు. ఆ సన్నిహితమే వారి జీవితాలకు ఒక వరంగా, అదృష్టంగా, ఆనందంగా భావించేవారు. ఆర్తులకూ, అన్వేషకులకూ, భక్తులకూ, సాధువులకూ, పరిచారకులకూ, యాత్రికులకూ అందరికీ శ్రీ రమణాశ్రమంలో భగవాన్ ఒక దీపస్తంభంలాగ నిలిచి వెలిగారు. సన్నిధిలో వున్న వారినే గాక, తన మార్గాన నడిచే వారందరికీ ఆయన మార్గ

దర్శకుడు. శారీరక-మానసిక అలసట చెందిన వారు ఆ మహావృక్షం క్రింద సేదదీర్చుకునేవారు. పాతాళగంగ మాదిరిగా ఆయన ఎంతో మంది దప్పిక తీర్చారు. అంతేకాని వారిపై మూఢనమ్మకాన్ని రుద్ద లేదు. ఏ అతీత శక్తుల్ని ప్రదర్శించలేదు.

తనను సమీపించి ప్రశ్నించిన వారిని "ముందు నిన్ను నీవు తెలుసుకో! తర్వాత అన్నీ తెలుస్తాయి" అనేవారు భగవాన్. పండితులు, పీఠాధిపతులు, మతాధిపతులు సామాన్యమైన ఆ సలహా, సూచన విని, "తమకు ఆ మాత్రం తెలియదా" అని కొందరు అహంకరించేవారు. తమకు సరిగ్గా సమాధానం చెప్పలేదని మరి కొందరు బాధపడేవారు. భగవాన్ తమను మూర్ఖులుగా భావించారని కొందరు ఆవేశపడేవారు. ఎందుకంటే, భగవాన్ సలహా, సూచన తమకు ఏనాడో తెలుసునని వారి భావన. అందుచేత తమసంగతి కాక, మరి ఏ సంగతి అయినా చెప్పమనేవారు. ఆ సంగతులు చాలా వరకు పునర్జన్మ, మృత్యువు తర్వాత ఏమిటి - మొదలైన విషయాలు.

కాని, గణపతిశాస్త్రిగారు భగవాన్ జీవిత చరిత్ర రాస్తూ, "భగవాన్ పుట్టినరోజు మానవాళికే మహనీయమైనది. అది చరిత్రలో మరపురాని రోజు. ఈ తరానికి భగవాన్, మహాప్రవక్త. బుద్ధుడు, శంకరాచార్యులు మొదలైన వారివలె, ముందు తాను బంధ విముక్తులై, తర్వాత యావత్ మానవాళిని ప్రేమతో విముక్తిపరచ యత్నించారు. ఆత్మశక్తితో ధర్మాన్ని స్థాపించారు. బుద్ధుని దీక్ష, దయ, ప్రేమ, సమత్వం - శంకరాచార్యులవారి మేధాశక్తి, వితరణ, వివేకం, తాత్విక దృక్పథం కలిసి పుంజుకున్న పుణ్యమూర్తి భగవాన్.

"భగవాన్ తీక్షణమైన చూపు, సూర్యకాంతి వంటిది. దయకల ఆయన చిరునవ్వు, చంద్రకాంతివలె చల్లగా, హాయిగా, శాంతి నిచ్చేది. మూర్తీభవించిన చిదానందమూర్తివలె కనుపిస్తారు భగవాన్," అని వర్ణించారు.

బైట ఏం జరిగినా అది భగవాన్‌కి సత్యం కాదు. చివరికి తన దేహానికి జరిగినా, అదీ వాస్తవం కాదు. తాను దేహం కాదనీ, తానూ అందరివలె, అన్నింటివలె ఆత్మేనని - ఆ సంగతి తనను అనుసరించిన వారికి తెలియడంకోసం, వారి - వారి అనుభవాల్లోకి రావడం కోసం భగవాన్ పదే, పదే ఆత్మ విచారణ మార్గం గురించి చెప్పడమే కాక, ఆ విషయంలో ఎంతైనా ప్రేమనీ, కారిన్యాన్నీ చూపేవారు.

"ఆత్మ విచారణ" అనాదిగా వున్నదే! విచారమంటే, విషయ వాసనలన్నింటినీ విసర్జించడం. ఎందుకంటే, వాసనలు నిశ్శేషం కాకుండా ప్రాప్తించిన జ్ఞానం, స్థిరంగా వుండదు.

అపరిచ్ఛిన్నమైన, చిద్రూపమైన ఆత్మయథార్థ రూపం తెలియక, "దేహమే, ఆత్మ" అనే భావం కలుగుతుంది. ఎంతో అనుభవంతో ఆత్మను తెలుసుకున్న వారికీ, వివేకవంతులకు కూడా దేహాత్మ బుద్ధి తొలగడం బహుకష్టం. ఎందుకంటే, ఆ భావం మొదటి నుంచీ, మనలో అంత లోతుగా పాతుకుపోయి వుంటుంది.

నిర్మలమగు చిదాత్మ ఎక్కడ? రక్త, మాంసాదులతో— మల మూత్రాలతో కూడిన దేహమెక్కడ? దేహాత్మబుద్ధి వలన, అసలు మనమేమిటో మరచిపోతాం. అదే అజ్ఞానం. మరచిపోవడమే కాదు, అనాత్మను ఆత్మగా భావిస్తాం. అదీ జీవితంలో విషాదకరమైన సంగతి.

ఆ విధంగా అల్పం - స్వల్పం - సూక్ష్మం అయిన మనసు, బ్రహ్మాండం-అనంతం-అపారం అయిన ఆత్మను కప్పేస్తుంది. అది ఇంకా విచిత్రం.

ఆత్మవిమర్శే, గొప్ప పుణ్యం, పావనకార్యం. ఆత్మను విమర్శించినా, ధ్యానించినా గతి ఒక్కటే!

"ఆత్మ విచారణ" కష్టతరమనుకున్న వారికి, "శరణాగతి" రెండో మార్గం. "శరణాగతి" అంటే, మూలంలో, లీనం కావడం. అహం, ఆత్మ - శరణు జొచ్చడంతో, అహం - ఆత్మ అవుతుంది. తన ఉనికికి మొదటి కారణ మేదో, దానికి తనను అర్పించు కోవడమే, శరణాగతి.

"అహం, ఆత్మలో లీనమైన తర్వాత, శరణాగతి చెందడానికి వ్యక్తిత్వమెక్కడ వుంటుంది? అసలు అర్పించే దేమిటి? అర్పించే దెవరు? ఎవరికి? దేనిని?" అనే ప్రశ్నలు కలుగుతాయి. కాని, అర్పించుకున్నవానికి, అడగడానికి అధికారం వుండదు.

సంపూర్ణ శరణాగతి చెందిన వారిని సంరక్షించడం ఈశ్వరుని విధిగా చెపుతారు. వారు ఏ ప్రార్థనా చేయనక్కరలేదు. ఎందుకంటే, శరణాగతికి మూలం, "నేను నిస్సహాయుణ్ణి" అని. భక్తుడు శరణాగతి పొంది, ఈశ్వరునికి పూర్తిగా అర్పించుకుని, భక్తితో అహం తీసేసుకుని, నిర్వాణస్థితిని అందుకుని "నేను కాదు, ఉన్నది నీవే!" అంటాడు. అటువంటి సంపూర్ణ శరణాగతి చెంది, తర్వాత క్రమంగా, సంపూర్ణంగా తనను అర్పించుకోవడం సులభమౌతుంది.

తలపులు లేనిదే, ఏకాగ్రత. ఒకే తలపు - అదే స్ఫురణ-స్మరణ. అదే జపం, భక్తి. అంటే, అన్య ఆలోచన లేనిది. ఆ ఒక్క తలంపూ, జీవితంలో దైవం కావడ మంటే, తాను సంపూర్ణ శరణాగతి చెందడ మన్న మాట! అదే నిజమైన అర్పణ.

"అసలు శరణాగతి దేనికి? ఎవరికి?" అని ప్రశ్నిస్తే, "అంతిమ అధికారానికి" అని సమాధాన మిస్తారు. కాని, దానికి ఒక 'పేరు' ఆలోచించకూడదు. దానికి ఏ పేరైనా పెట్టుకోవచ్చు నంటారు భగవాన్.

"శరణాగతి చాలు. తక్కింది గురువు చూసుకుంటాడు," అనే స్థిరభావంతో, కొందరు ఆ భావాన్ని ఆశ్రయించుకుని ఆశ్రమాల్లో స్థిరపడతారు. వారిలో కొందరు తమ వ్యక్తిత్వాలను పూర్తిగా

తుడిచేసుకుని, అసలు తమ ఉనికికే ఒక ఆధారమంటూ లేకుండా చేసుకుంటారు.

తాను "లఘువు" (అల్పం-స్వల్పం) అనుకున్నంతకాలం, ఎవరికైనా గురువు వుండవలె. దేహాత్మ బుద్ధి వీడని వ్యక్తిదృష్టికే, గురు-శిష్య సంబంధం, ద్వైత భావం. భగవాన్ వంటి జ్ఞాని దృష్టి నుంచి, అన్నీ, అంతా, అందరూ ఒకటే, సమానమే. ఆ ఒక్కటీ-ఆత్మ. అందుచేత ఆయన గురు-శిష్య సంబంధాన్ని ఒప్పుకోలేదు. కాని, అర్థించిన వారికి, ఆత్మ విచారణ మార్గం చూపారు, విచారణ చేయలేనివారు, సంపూర్ణ శరణాగతి చెందమన్నారు - గురువుకో, ఈశ్వరునికో, ఆత్మకో. ఆ రెండుమార్గాలూ ఒకే లక్ష్యాన్ని చేరుస్తాయన్నారు భగవాన్. అనుభవజ్ఞానం లేక, నిలకడ కానక తిరుగాడే న్జ్ఞానులకు అనుభవజ్ఞానంతో తన నడవడితో ఉపదేశించిన సద్గురువు, శ్రీరమణులు.

వెలుగుతున్న దీపం, ఇతర దీపాల్ని వెలిగించడానికి సహాయపడునట్లు, జ్ఞాని సహాయం ఇతరులకు లభిస్తుంది.

అందం, ఆనందదాయకం, ఆరోగ్యకరం అయిన మన సహజ స్థితిని నిరాకరించి, మననిమనమే హద్దుల్లో, పరిమితుల్లో పెట్టుకుని; అపరిమితం, అనంతం, అపారం, అనన్యం, అవ్యక్తం అయినదాని కోసం, అన్వేషిస్తాం, అర్థించి ప్రార్థిస్తాం.

ఎంతకీ అంతం కానికష్టాల్ని, కలతల్ని, దుఃఖాల్ని, బాధల్ని, యాతనల్ని, నష్టాల్ని అనుభవిస్తూ; శాంతి, ఆనందం లేక, మళ్లా వాటికోసం గిలగిలలాడి, ఆ బాధల నుంచి తప్పించుకోవాలని చూసి, అనేక చోట్లకు తిరిగి, అనేకం అభ్యసించి, ఎందరొన్నో అర్థించి, ఎన్నో అనుసరించి, అనుష్ఠించి, చదివి - విని - చూసి - సాధన చేసి - ఏం చేసీ విముక్తి కానక, ఏ విధంగానైనా వాటి నుంచి బైట పడాలని తంటాలు పడతాం. అదీ మన తీరు.

ఆ సందర్భంలో మనం కలుసుకున్న ప్రతి ఒక్కరూ, మనకు ఏదో ఒకటి సూచిస్తారు, బోధిస్తారు. మనం చేసే సాధన, మనం వాంఛించే ముక్తి, మనం కోరుకునే సత్యం, మనం ఎన్నుకున్న గురువూ-అన్నీ, అంతా దేహానికే అంటగట్టి, ఆ మాయలో బ్రతుకుతాం. దేహం స్థూలం గనుక, మనమూ స్థూలమే ననుకుంటాం. దేహం రోగగ్రస్త మౌతుంది. అలసిపోతుంది. ఏం వొచ్చినా, అది మనకే వచ్చిందను కుంటాం. ఆ విధంగా మనల్ని మాయ కప్పివుంచుతుంది.

మన నిజమైన ప్రార్థనా ఫలితంగా ఆవిర్భవించినవాడే, మనవా గురువు. ఆ గురువు మన తప్పుడు జీవన విధానాన్ని మార్చుకోమనీ, శాశ్వతానందాన్ని పొందమనీ, చెప్పి నడుపుతాడు. కాని, మనం స్వయం కల్పిత రొదలో, మనం తవ్వుకున్న గోతిలో, మనం కట్టు కున్న సమాధిలో మనం కూరుకుపోతూ, ఒక్కోసారి భరించలేక ఆ మహాత్ముని చేతినే కరుస్తాం.

కాని, నిజమైన అన్వేషకుని ఆర్తిననుసరించి వచ్చిన గురువు, అతన్ని కప్పిన మాయ తెరను తొలగించి, అతన్ని అంతర్ముఖుని చేసినప్పుడు, అప్పుడు తెరపైకదలాడే బొమ్మను కాక, అసలు తెరనే చూసినప్పుడు - అప్పుడు మనం అనంత చైతన్య స్వరూపులమని అనుభవపూర్వకంగా తెలుసుకుంటాం. అప్పటి నుంచి, మనల్ని పట్టుకుని బాధించే,- వేధించే, పీడించే బాధలు, కష్టాలు, దుఃఖాలు, యాతనలు, సంసారం, విలువలు - అన్నీ మనల్ని బాధించడం మానేస్తాయి. అప్పుడు ఈ ప్రపంచం మనకు విడిగా, భిన్నంగా బైట లేదనీ, అదిమనలోనే వుందనీ, తెలుసుకుంటాం. స్థూలరూపంలో కనుపించే ప్రపంచం కూడా, శక్తివంతంగా దర్శన మిస్తుంది. ఆ అనుభవంతో సమస్త సంశయాలు కరిగి, తొలగి పోతాయి.

గురువువలెనే, శిష్యుడూ నిజానికి జ్ఞానస్వరూపమే! అతడా సత్యాన్ని ఎరుగకపోవడమే, అజ్ఞానం. గురువు ఆ మాయ తెరను

తొలగించడానికే బోధిస్తాడు. ఆయన బోధ, శుద్ధ సాత్వికం. గురువు దృష్టిలో, ఆ బోధ కూడా అజ్ఞానమే. కాని, శిష్యుని విషయంలో అతని అజ్ఞానాన్ని తప్పక తొలగించడానికి గురువు ఆ విధమైన కర్మ చేయక తప్పదు. శాశ్వతత్వం యొక్క సగుణ-సాకార స్వరూపమే, సద్గురువు. సాధకుడూ ఆ భావంతోనే సాధన చేయాలి. అందుకే అద్వైత స్థితిని అందుకున్న పరబ్రహ్మ స్వరూపమే, సద్గురువు అన్నారు మహాత్ములు.

కాని, జ్ఞానమందు ఆసక్తి కల సాధకుడు వివిధ గురువుల నుంచి జ్ఞానాన్ని సంపాదించాలని గురుగీత చెపుతోంది. పువ్వుల్లో భేదమున్నా, తేనె ఒక్కటే కదా? కాని, సాధకుడు మూలగురువు మీదే దృష్టి వుంచాలి. కాని, అంతిమ జ్ఞానాన్ని తెలియపరిచేందుకు, బ్రహ్మ వేత్త అయిన సద్గురువుకే అర్హత వుంటుంది.

"నిన్ను నీవు తెలుసుకో!" అన్నది భగవాన్ బోధ. ఆ బోధలో మర్మం లేదు, పితలాటకం లేదు, గూఢంలేదు, వక్రంలేదు, అల్పత్వం-సంకుచితత్వం- ఇరుకూ లేదు. అదంతా స్పష్టం, స్వచ్ఛం. ఆ మార్గం సూటైనది, సులభమైనది. అది తెరుచుకున్న విజ్ఞాన గ్రంథం. ప్రతి ఒక్కరూ తమ శక్తి సామర్థ్యాల్ని బట్టి దాన్ని గ్రహించగలరు.

భగవాన్ తన అనుభవాన్ని సూటైన, సులభమైనమాటల్లో, మార్గంలో చూపారు గనుక, సామాన్యులకు సహితం దాన్ని గ్రహించడం తేలికైంది. అది సర్వమత సారం. కనుక దాన్ని అనుసరించిన వారు, ఆత్మోన్నతిని అందుకుంటారు.

రమణుల ప్రతి వాక్యం, ఒక ఉపనిషత్తే. దాని సారాంశం గ్రహించాలంటే, బుద్ధి కుశలత, మనో నిర్మలత కావాలి.

తమను తాము మరచి నిద్రపోయే మనుష్యుల్ని మేల్కొల్పే యత్నంలో గురువులూ, ప్రవక్తలూ, జ్ఞానులూ, మహాత్ములూ- అన్ని కాలాల్లో, అన్ని మతాల్లో అవతరించి, వారి నిద్రను భగ్నం

చేస్తే, వారి అజ్ఞానాన్ని తొలగించారు; తాము నడచిన మార్గాన వారిని నడుపుతూ. భగవాన్ శ్రీరమణ మహర్షి కూడా, ప్రపంచానికి ఏదో చెప్పడానికే అవతరించారని పిస్తుంది. కాని, ఏదో మతం స్థాపించడానికీ, మనతో తర్కించడానికీ, మహాత్మ్యాలు చేయడానికీ, ఆశ్రమాల్ని నెలకొల్పడానికీ, ప్రజల్ని మూఢనమ్మకాల్లో వుంచడానికి రాలేదు. మన యందు అపారమైన ప్రేమతో మనల్ని బంధవిముక్తుల్ని చెయ్యాలని బోధించారు. ఎందుకంటే, మనిషి సహజంగా "నేను పాపిని" అని అనుకుని కృంగిపోతాడు. ముఖ్యం క్రిస్టియన్లు. "మనిషి పాపకూపంలో జన్మించాడు" అని జీసస్ అంటే, "అసలు మనిషే, పాపం," అన్నారు మహర్షి. మనిషిలో పాపం వుందనుకునే వారు, ఒక సంగతి గుర్తించాలి-నిద్రావస్థలో మానవ స్వభావం కాని, అసలు మానుషత్వం కాని వుండదు. మేల్కొన్న తర్వాతే 'నేను ఈ దేహం' అనే దేహాత్మ భావం కలిగేది. దేహమే తాను, అనుకోవడం మొదటి పాపం. అది ఆత్మ హత్యా సమానమన్నారు భగవాన్.

అన్వేషకుల ఆర్తిననుసరించి, వారి అంతస్థుకు వెళ్లి, అసలు సత్యాన్ని వివరించి చెప్పేవారు భగవాన్. దక్షిణామూర్తి, ఆది శంకరుల వలె ఆయన అద్వైతాన్ని బోధించినా, కర్మ యోగిగా అన్నీ చేసి చూపారు. భక్తులందరి మాదిరిగా కరిగి, ద్రవించి అరుణాచలాన్ని స్తుతించారు. బుద్ధుని వలె సర్వప్రాణికోటి యెడల సమత్వం, ప్రేమ, దయ చూపారు.

భగవాన్ ప్రేమ అపారం. ఆయన దయ అన్నింటినీ హృదయానికి హత్తుకునేది. ఆయన సమక్షంలో అల్పం-అధికం అంటూ లేదు. ఆయనకు రహస్యం అంటూ లేదు. ఆయన కదలికల్లో ఎక్కడా ఆసక్తి,- అనురాగం,- ఆపేక్ష,- ఆప్యాయత,- అభిమానం కనుపించదు. కాని, నిర్మలత్వం, పవిత్రత, స్వచ్ఛత,

సహజత్వం గోచరించేవి. ఆయన ప్రతి మాటా, వివేకవంతం- ఆయన ప్రతి పనీ, ఆమోదయోగ్యం. అందుచేత ఆయన అందరికీ ప్రియతములూ, పూజనీయులూ అయినారు.

ఆయన జీవితం, సమస్త గ్రంథాల,- మతాల,- సిద్ధాంతాల,- తత్వాల- వేదవేదాంతాల సారం కంటే, మహోన్నతం. ఆయన బోధలకన్నా, ఉపదేశాల కన్నా, మాటల కన్నా, ఆయన చూపు,- చిరునవ్వు- కదలిక,- ముఖ్యం మౌనం, ఎక్కువ అర్థయుక్తమైనవి, అందమైనవి.

ఆయన చుట్టూ అల్లుకున్నదంతా, ఆయన జీవిత చరిత్ర కాదు. కాని, ఆయన గురించి ఇతరులు మాట్లాడిన, భావించిన, యోచించిన వర్ణన మాత్రమే, అది. ఆయన చరిత్ర, వ్యక్తిగత జీవిత చరిత్ర కాదు. అది విశ్వాత్మ ప్రకాశం. అది శారీరక కదలికా. కర్మ వ్యవహారమూ కాదు. అది దివ్యాత్మ ప్రభావం. తానీ ప్రపంచంలో వున్నాననే భావన లేనివారు, భగవాన్. ఈ ప్రపంచమంతా ఆయనకు సినిమాతెర వంటిది. ఆ తెరపై కదలాడే బొమ్మలూ, నీడలూ. దృశ్యాలూ అన్నీ అసత్యం - ఆయనకు. ఆయనకు మిగిలింది, తెర మాత్రమే! ఆ తెరే- చిదాకాశం. దాన్నే "Light of Consciousness" అంటారు. అది నిర్మలం, నిశ్చలం, స్వచ్ఛం, ధవళం, శాశ్వతం. ఆ తెరే, "I am" అంటే, "నేనున్నాను" అనే ఎరుక.

విశ్వ తేజస్సు నుంచి వెలువడిన వెలుగు రవ్వ, అరుణాచలంపై కొన్నాళ్లు వెలిగి, అనేకమంది దివ్య జీవనానికి ఆధారమై, తిరిగి ఆ చిరుజ్యోతి, అఖండ జ్యోతిలో ఐక్యమైపోయింది **14-4-1950** తేదీన.

చిక్కాల కృష్ణారావు

దక్షిణ భారత దేశంలో మధురకు ముఖై మైళదూరంలో, "తిరుచ్చుళి" అనే గ్రామం వుంది. నేడు ఆ గ్రామం, రామనాథపురం జిల్లాలో వుంది. "తిరుచ్చుళి" అంటే, ఓంకారమని అర్థం.స్కంధ పురాణంలో, ఆ గ్రామాన్ని "త్రిశూలపురం" అన్నారు. ఆగ్రామంలో ఒక శైవ దేలవాయం వుంది. అందు పార్వతి, సహాయాంబగాను, పరమేశ్వరుడు - భూమినాథేశ్వరుడుగాను అవతరించి నట్లు పురాణాలు పేర్కొంటున్నాయి. ఆ దివ్యమూర్తులను "మాణిక్య వాచకర్, సుందరమూర్తి" అనే ఇద్దరు ఋషి కవులు స్తుతించినట్లు, పెరియ పురాణంలో వుంది. పూర్వం ఆ గ్రామంలో క్షామం వచ్చి నప్పుడు, "కౌండిన్యుడు" శివునిగూర్చి తపస్సు చేయగా, ఒక నది ఉద్భవించినట్లు, ఒక గాథ వుంది. కరువు నివారణ అయింది. అంచేత ఆ నదికి "కౌండిన్యనది" అని పేరు వచ్చింది.

పందొమ్మిదో శతాబ్దం నాల్గవ పాదంలో తిరుచ్చుళి గ్రామంలో "సుందరమయ్యర్ - అలఘమ్మ" అనే స్మార్త శాఖకు చెందిన ద్రావిడ బ్రాహ్మణ దంపతులున్నారు. వారు దైవభక్తులై, పవిత్ర జీవన్ములై కాలం గడిపేవారు. అలఘమ్మకు ఎన్నో స్తోత్రాలూ, గీతాలూ వచ్చు. ఆచారవంతురాలు. ఆమె ఉపదేశం కూడా పొందినది. సుందరమయ్యర్ నెలకు రెండు రూపాయలు జీతం మీద, గుమాస్తాపని చేస్తో, ఊళ్లోవాళ్ళకు దస్తావేజులూ అవీ రాసిపెడుతూ, మంచి మాటకారితనంతో, వ్యవహారదక్షతతో అందరికీ తలలో నాలుక మాదిరిగా మెలుగుతూ, తన తెలివితేటలతో పరీక్ష రాయ కుండా, పట్టాలేని ప్లీడరుగా ప్రభుత్వ అనుమతిమీద స్థానిక మెజిస్ట్రేట్ కోర్టులో పనిచేస్తూ, ఇంటా - బైటా మంచివాడనే పేరు తెచ్చుకున్నాడు. అతడు బీదసాదలకు, సాధు - సజ్జనులకు అతిథి సత్కారాలు చేసేవాడు. క్రమంగా అతడు కొంతడబ్బు కూడబెట్టి, తిరుచ్చుళిలో ఒక ఇల్లు కట్టాడు.

**1879** - డిశంబరు **30**వ, తేదీరాత్రి ఒంటిగంట వేళ, అంటే ప్రమాది సంవత్సర, మార్గశీర్షమాస, పునర్వసు నక్షత్రమందు అలఘమ్మ గర్భాన ఒక మగశిశువు జన్మించాడు. అది ఆర్ద్రా నక్షత్ర దర్శన పుణ్యదినం. పరమేశ్వరుడు, బ్రహ్మ - విష్ణువులకు జ్యోతి రూపంలో దర్శనమిచ్చిన పర్వదినమది. ఆ రోజున పరమేశ్వరుడు కరుణాస్వరూపుడై - గౌతమ, పతంజలి, వ్యాఘ్ర పాదాది మొదలైన మహర్షులకు చిదంబరంలో నటరాజై దర్శనమిచ్చిన పుణ్యదినం. ఆ శుభసమయాన్ని పురస్కరించుకుని ప్రతి సంవత్సరం భక్తులు ఆనందతాండవమూర్తిని మహావైభవంతో ఊరేగిస్తారు. ఆ రోజున తిరుచ్చుళిలో ఈశ్వరోత్సవం ముగిసి, స్వామి గర్భాలయం ప్రవేశించేప్పుడు, అలఘమ్మ ప్రసవించింది.

ఆ దంపతులకు అది ద్వితీయ సంతానం. పెద్దవాని పేరు, నాగస్వామి. వారిది తెలుగు సంప్రదాయం. పూర్వం ఆ వంశంలో తెలుగు విద్వాంసులు వున్నారు. వారు తండ్రిని "నాయనా" అని పిలిచేవారు. సుందరమయ్యర్ కులదైవం తిరుపతి శ్రీ వెంకటేశ్వర స్వామి కావడం చేత, ఆ బిడ్డకు "వెంకట్రామన్"అని పేరుపెట్టారు. ఆ తర్వాత ఆ దంపతులకు "నాగసుందరం" అనే కొడుకూ, "అలిమేలు" అనే కూతురూ, కలిగారు. వెంకట్రామన్ పిల్లలందరిమాదిరిగా పెరిగినా అతనిలో చురుకుదనంతక్కువ, నిద్ర ఎక్కువగా ఉండేది. అయినా అతడు పిల్లలతోకలిసి భూమినాథేశ్వరస్వామి ఆలయం ప్రక్కనవున్న కళ్యాణమండపంలోనో, కౌండిన్యనదీతీరంలోనో ఆటలాడుకునేవాడు. అతనికి ఎనిమిదవఏట, శాస్త్రోక్తంగా ఉపనయనం చేశారు.

సుందరమయ్యర్ పెద్ద తమ్ముడు సుబ్బయ్యర్, దిండిగల్లులో సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో హెడ్ గుమాస్తాగా పని చేసేవాడు

1891లో నాగస్వామి చదువు నిమిత్తం పినతండ్రి దగ్గరకు వెళ్లాడు. మరికొన్నాళ్ళ తర్వాత తిరుచ్చుళిలో వెంకట్రామన్ ప్రాథమిక చదువు పూర్తికావడంతో, అతడు కూడా దిండిగల్లు వెళ్ళాడు.

సుబ్బయ్యర్ తన కొడుక్కి పుట్టినరోజు పండగ చేసుకుని, ఆ రాత్రి వెంకట్రామన్ని ఇంట్లో ఉంచి, అందరూ ఆలయానికి వెళ్లారు. వారు తిరిగి ఇంటికి వచ్చేప్పటికి, వెంకట్రామన్ ఇంటి తలుపులూ, కిటికీలూ అన్నీ మూసేసి నిద్రపోయాడు. వాళ్లు ఎంత అరచి, పిలిచి, తలుపులు బాదినా, అతనికి మెలకువ రాలేదు. చివరికి ఒకరు గోడ దూకి, లోపలకు వెళ్లి తలుపులు తెరచినా, అతనికి మెలకువ రాలేదు.

వెంకట్రామన్ నిద్రావస్థ చాలా చిత్రమైనది. అతనితో ఆటల్లో గాని, దెబ్బలాటల్లోగాని గెలవలేనివాళ్లు, అతడు నిద్ర పోతున్నప్పుడు బాగా కొట్టిపోయేవారు. లేదా, అతనిముఖానికి మసి పూసేవారు, ఏం చేసినా, అతనికి మెలకువ వచ్చేది కాదు. "ఆ రకమైన నిద్ర, మంచి ఆరోగ్య లక్షణం. అది "సోమ్నాంబులిజం" కాదు కాని, అది కొంతవరకు, సమాధి స్థితిని పోలివుంటుంది," అని అన్నారు భగవాన్.

1891 లో సుబ్బయ్యర్‌కు మధుర బదిలీ అయింది. ఆయన కుటుంబంతో పాటు, నాగస్వామి, వెంకట్రామన్ కూడా మధుర వెళ్లారు. అక్కడ వెంకట్రామన్ మిడిల్‌స్కూల్లో చేరాడు.

1892 - ఫిబ్రవరి - 18వ తేదీన సుందరమయ్యర్ అకస్మాత్తుగా మరణించాడు. అప్పటికి నాగసుందరానికి ఆరేళ్లు. అలమేలు పసిపిల్ల. అలఘమ్మ ఆ పిల్లలిద్దర్నీ తీసుకుని "మానా మధుర" లో ఉంటున్న, చిన్న మరది నెల్లియప్పయ్యర్ ఇంటికి వెళ్ళింది.

వెంకట్రామన్ ఫోర్తుఫారమ్ చదివేందుకు, అమెరికన్ మిషన్ హైస్కూల్లో చేరాడు. అతనికి చదువుమీద కన్నా, ఆటలమీద ఆసక్తిమెండు. కాస్తసమయం చిక్కితేచాలు, మిత్రులతో కలిసి "వైఘ" నదిలో ఈతలు కొట్టేవాడు. లేదా, దగ్గరలో ఉన్న కొండలు ఎక్కేవాడు. చెట్లమీద నుంచీ, గుట్టలమీద నుంచీ దూకే ఆటలు ఆడేవాడు. కుస్తీలు పట్టేవాడు. అతనికి "ఫుట్‌బాల్" ఆట అంటే, అమితమైన ఇష్టం. అన్ని ఆటల్లో అతనిదే గెలుపు. అయినా అతను చదువుల్లో సూక్ష్మగ్రాహీ కాదు, ఏకసంధాగ్రాహి కూడాను. అతను అన్నింటిలోనూ సమర్థుడు కావడంతో. అందరూ అతన్ని "తంగకై్క" అంటే, "సువర్ణహస్తం," అని పిలిచేవారు.

1895 లో, వెంకట్రామన్ ఐదవఫారమ్ చదువుతున్నాడు. ఒక రోజున "రామస్వామి అయ్యర్" అనే తిరుచ్చుళి గ్రామవాసి యాత్రలు చేసి, తిరిగి స్వగ్రామం వెడుతూ, మధురలో వెంకట్రామన్‌కి కనుపించాడు. ఆయన్ని చూసి, "మీరు ఎక్కనుంచి వస్తున్నారు?" అని వెంకట్రామన్ అడిగాడు. దానికి ఆయన "అరుణాచలం" నుంచి అన్నారు. "అరుణాచలం" అనే మాట వినగానే, వెంకట్రామన్ ఆనందపారవశ్యంలో మునిగి పోయాడు.

అరుణాచల మనే మాట వెంకట్రామన్ హృదయాంతరాళంలో ఒక వెలుగు రవ్వ మాదిరిగా తళుక్కున మెరవడంతో, ఆ సంతోషాన్ని, ఆనందాన్ని, ఆవేశాన్ని ఆపుకోలేక ఆతృతగా "అరుణాచలం ఎక్కడ ఉంది?" అని అడిగాడు. వెంకట్రామన్ ఆశ్చర్యానికీ, అమాయకత్వానికీ, ఆతృతకీ ఆనందపడి, "తెలియదా? తిరువణ్ణామలై పేరు వినలేదా? అదే అరుణాచలం" అన్నారాయన.

"అరుణాచలం" అనే మాట వెంకట్రామన్ లేత హృదయాన్ని సూటిగా, వాడిగా తాకింది. కాని, అతనికి అరుణాచలం యొక్క గొప్పతనం కాని, దాని అర్థం కాని, దాని అంతరార్థం కాని, దాని

స్వరూపస్వభావాలు కాని. ఏమీ తెలియవు. కాని, అరుణాచలమనే మాట అతని మనసులో పదే,పదేస్ఫురణకు వచ్చింది. తనకూ,అరుణాచలానికి గల సంబంధమేమిటో అతనికి ఏమీ తెలియదు. కాని, "అరుణాచలం" అనే మాట విన్నప్పటినుంచీ, వెంకట్రామన్ మనసులో ఆ మాట ప్రజ్వలిస్తో, ప్రకాశిస్తో ప్రతిధ్వనించింది. ఆ నాటి సంగతిని భగవాన్ ఇట్లా వర్ణించి చెప్పారు:

"అరుణాచలం అచలంగా వుంది. అది ఆదికాలం నుంచీ నాలో నిగూఢ గా వుండి, ప్రకాశిస్తోనే వుంది. నేను దాని గురించి మరొకరి ద్వారా విన్నప్పుడు, అదే "తిరువణ్ణామలై" అన్నప్పుడు కూడా, నేను దాని అర్థాన్ని, ఔన్నత్యాన్ని గుర్తించలేకపోయాను. కాని, త్వరలో అరుణాచలం నన్ను తన దగ్గరకు తీసుకున్న తర్వాత, నా మనసు నిశ్చలమైపోవడం చేత, నేను దాన్ని మరింత సన్నిహితంగా సమీపించి, దర్శించి, అది అచలంగా ఉండటం గమనించాను."

అప్పటివరకు వెంకట్రామన్‌కి అరుణాచలమనే పుణ్యక్షేత్ర మొకటి ఉందని కూడా తెలియదు. ఆ క్షణం నుంచి "అరుణాచల" మనే మాట అతనికి ఒక మంత్రంగా, దీక్షగా మారిపోయింది. ఆ స్ఫురణే, అతని జీవితాన్నంతా వెలిగించింది.

కొన్ని రోజుల తర్వాత ఒకాయన సుబ్బయ్యర్ దగ్గరకువచ్చి, "పెరియ పురాణం" ఇచ్చి, చదవమన్నారు. అది అనేకమంది మహాత్ములైన నాయనారుల జీవిత గాథలతో కూడిన గ్రంథం. ఆ నాయనారులందరూ, శివభక్తులు. ఆ గ్రంథాన్ని వెంకట్రామన్ కూడా చదివాడు. ఆ మహాత్ముల వైరాగ్యం, బ్రహ్మైక్యం అతన్ని ఎంతగానో ఉత్తేజపరిచాయి. అతన్ని గట్టిగా ఆలోచింపజేశాయి, సర్వసంగపరిత్యాగం ద్వారా ఈశ్వరునిలో ఐక్యం కావడమనే

సంగతిని, ఆ గ్రంథం వ్యక్తపరచింది. ఆ గ్రంథం, అతనిలో భక్తి భావాన్ని రగిల్చింది.

ఆ మహాత్ముల యెడ భక్తి, గౌరవం ఏర్పడ్డాయి. పెరియ పురాణం చదవడంవల్ల, వెంకట్రామన్‌లో ఏదో అర్థం కానిగొప్ప అనుభూతి కలిగింది. ఆ మహాత్ములు చూపిన భక్తి, విశ్వాసం, ప్రేమ, దైవచింతన తనకూ సాధ్యమనుకున్నాడు, వెంకట్రామన్. అలాగే, జీవితంలో ఎంతో అందం, ఆనందం ఉన్నాయని గ్రహించాడు.

ఆ రోజుల్లో వెంకట్రామన్ తరచు మీనాక్షి ఆలయానికి వెళ్లేవాడు. ఆలయానికి వెళ్ళగానే, అతని ఒళ్లు పెద్ద జ్వరం వచ్చినంత వేడిగా ఉండేది. అయినా అతను దేవి మీనాక్షి సమక్షంలో ఆనందపారవశ్యంలో ఉండేవాడు.

1896లో నాగస్వామికి పెళ్ళయింది. అతని అత్తవారి ఊరు కూడా మధురే. ఆ సంవత్సరం వెంకట్రామన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువుతున్నాడు. కాని, అతన్ని అప్పటికే అరుణాచలం గట్టిగా ఆకర్షించి, వశం చేసుకుంది.

ఆ సంవత్సరం జూలై నెల మధ్యలో ఒకరోజున వెంకట్రామన్ మేడమీద గదిలో పడుకుని వుండగా, అకస్మాత్తుగా అతనికి ఒక అనుభవం కలిగింది. "నేను చనిపోతున్నాను. నేను చనిపోతాను" అని. ఆ సంగతి అతనికి నిష్కారణంగా అనిపించింది. అలా అని పించి, చివరికి అది ఒక అనుభవంగా మారింది. ఆ అనుభవాన్ని భగవాన్ ఇట్లా చెప్పారు:

"నా జీవితం గొప్ప మలుపు తిరిగే ఆరు వారాల ముందు, ఒక రోజు మధ్యాహ్నవేళ, నేను మా చిన్నాన్నగారి డాబా మీది గదిలో పడుకున్నాను. నా ఆరోగ్యము బావుంది. మెలకువగానే వున్నాను. కాని, నిష్కారణంగా "నేను చనిపోతున్నాను. నేను చనిపోతాను" అని పదేపదే అనిపించింది. అలా ఎందుకు అని పించిందో తెలుసుకోవాలని ప్రయత్నించడానికి కూడా వ్యవధి లేనంత అకస్మాత్తుగా అనిపించింది.

"అయితే, ఇప్పుడు నేనేం చెయ్యాలి?" అని యోచించాను. ఎంత ఆలోచించినా ఏమీ తోచలేదు. డాబాదిగి, ఆ విషయం పెద్దలతో గాని, బంధు - మిత్రులతో గాని, డాక్టరుతో గాని చెప్పి, వారి సలహా, సహాయం తీసుకోవాలని కూడా అనిపించలేదు. ఏమైనా ఆ సంగతి నాకు నేనే, అప్పటికప్పుడే, పరిష్కరించు కోవాలను కున్నాను.

ఆ మృత్యు తాకిడి, క్రమంగా నా మనసుపై పనిచేసింది. దానితో మనసు అంతర్ముఖమైంది. ఆ నా స్థితి గమనించి నాలో నేననుకున్నాను, "ఇప్పుడు నాకు మృత్యువు సమీపించింది. మృత్యు

వంటే ఏమిటి? చనిపోయేదెవరు? ఈ దేహం చనిపోతుంది. అయితే దేహంతోపాటు నేను చనిపోతానా? నేనూ దేహమైతే, చనిపోతాను. నేను దేహం కాకపోతే చనిపోను" అని అనుకుని. తక్షణం ఆ మృత్యు సంభవాన్ని అనుసరించి, శరీర అవయవాలన్నింటినీ బిగపట్టి, బిర్రబిగుసుకుని, వెల్లకిలా శవం మాదిరిగా నేల మీద పడుకుని, దాన్ని మరింత వాస్తవం చేశాను. శ్వాస ఆపాను. నోరు మూశాను. లోపల్నుంచి ఏ శబ్ధమూ - చివరికి "నేను" అనే ఆలోచన కూడా కలగకుండా, మనసును సహితం నిలిపేసి "ఇప్పుడు ఈ దేహం చనిపోయింది. దీన్ని స్మశానానికి మోసుకుపోయి దహనం చేస్తారు. అది కాలి, బూడిద అవుతుంది. కాని, "నేను" అనేది మాత్రం, దేహంతో పాటు చావక మిగిలివుంటుంది.

"నేను" అనేది శరీరం కాదు గనుక, అది దేహంతో పాటు చావదు, నాశనం కాదు," అనే భావం నాలో స్థిరపడింది. నాలో మనోవృత్తులు నాశనం కాలేదు. "నేను" అనే స్మృతి మిగిలేవుంది. దానితోపాటు వ్యక్తిత్వపు స్ఫురణ వుంది. లోపలా - బైటా అన్ని సంగతులు ఎప్పటిమాదిరిగా నాకు తెలుస్తూనే వున్నాయి. సర్వమూ నాకు స్పష్టంగా స్ఫురిస్తోంది. కాని, నా దేహం మాత్రం అచేతనంగా, నిశ్శబ్దంగా, జడం మాదిరిగావుంది. అంత స్పష్టంగా అన్ని సంగతులూ తెలుస్తోవుంటే, ఇంక ఇదేం చావు? అనిపించింది.

"నేను వున్నాను" అనే స్ఫురణ నాకు సంభవించిన మృత్యువుకు భిన్నంగా, అన్యంగా, విడిగా, దూరంగా ఉంది. నేనున్నాననే స్ఫురణనాలో అవిచ్ఛిన్నంగా ఉండడంతో, "నేను" అనేది దేహాన్ని మించిన చిద్వస్తువుగా గోచరించింది. మరణించేదిదేహం కాని, "నేను" కాదు అనే సంగతి, క్షణకాలంలో మెరపులాగ రూఢమైంది. ఆ చిద్వస్తువే, సద్వస్తువు. అది నాశనం కానిది. మృత్యువు దాని ఛాయలకే రాలేదు.

"ఆ నేను" అనేది నాలో జ్ఞానంతో జ్వలిస్తోవుంటే, దేహం జ్ఞానరహితంగా పడివుంది. అదంతా నా మందబుద్ధి ఆలోచన మాత్రం కాదు. అది ఒక ఆలోచనా ఫలితమూ కాదు. అది ఒక అనుభవం. నేను సూటిగా దర్శించిన సత్యమది. అది నాలో అంత స్పష్టంగా గోచరమైన సంగతి.

"నేను వున్నాను" అనేది ఒక్కటే చిద్వస్తువుగా, అసలు సత్యంగా, వాస్తవంగా తోచింది. నా మనో దేహ కదలికల అన్నింటికీ ఆ"నేనే" కేంద్రం అనిపించింది. ఆ క్షణంనుంచి ఆ "నేను" చాలా శక్తివంతంగా, తన మీద తానే దృష్టి నిలిపింది. ఆ దృష్టి క్రమంగా ఏకాగ్రమైంది. తత్ఫలితంగా అంతకుముందు నాకు కలిగిన మృత్యుభీతి, అదృశ్యమైంది. కాని, అనేక ఇతర ఆలోచనలు సంగీత స్వరాలు మాదిరిగా, నాలో వస్తూ–పోతూనే వున్నాయి. "నేను" అనేది ప్రధాన శృతి వలె, వాటి వెంట సాగుతూవుంది. దేహం, దేంట్లో లీనమైనా - అంటే, పనుల్లో - మాటల్లో - మననంలో - పఠనంలో, ఏ వృత్తిలో లీనమైనా, దానికి "నేనే" కేంద్రమన్న సంగతి ఆ క్షణాన నాకు స్పష్టంగా తెలిసింది. అది ఊహాతీతమైన సంగతి. ఆ క్షణాన నాలో ఏదో ఒక వింత శక్తి ఆవిర్భవించింది. ఆ శక్తి నన్నూ, నా మనసునూ, నా జీవితాన్ని పూర్తిగా తీసుకుని వశపరచుకుంది. ఆ శక్తి ప్రభావం వల్ల నేను పునర్జన్మ ఎత్తినట్లు అనిపించింది. నేను ఒక కొత్త మనిషిగా మారాను. నాలో ద్వంద్వ భావం నశించింది. ఆ తర్వాత అన్నింటి మీదా ఇష్టాలు పోయి, ఉపేక్షా భావం, ఉదాసీనం ఏర్పడ్డాయి.

"ఆ అనుభవం, నేను కోరుకున్నది కాదు. ఆ స్థితి, నేను ప్రయత్నించి తెచ్చుకున్నది కాదు. ఆ జ్ఞానాన్ని, నేను తెలుసుకోవాలని వాంఛించలేదు. ఆ సత్యాన్ని, దర్శించాలనే కుతూహలం నాలో లేదు. దానికి నేను ఆకర్షితుడనూ కాలేదు. దానిమీద నాకు ప్రత్యేక

ఆసక్తి లేదు. దేన్నో పొందాలనే కోర్కె, నాకుఎప్పుడూ లేదు. అప్పటికి నాకు ఆత్మ విషయమై ఒక నిర్దిష్టమైన, స్థిరమైన, స్పష్టమైన అభిప్రాయం గాని, దృష్టి గాని, ఆలోచన గాని ఏమీ లేదు. కాని, ఆ సంఘటన అలా జరిగిపోయింది. దైవికశక్తి నన్ను ఆక్రమించి, అకస్మాత్తుగా నాలో గొప్ప మార్పు తెచ్చింది. పెద్ద గాలిదుమారం, చిన్న ఇసుకరేణువును ఊడ్చేసినట్లు, ఆ మృత్యు అనుభవం, నన్ను అరుణాచలం చేర్చింది.

ఆ తర్వాత, వేదాంత గ్రంథాలు చదివాను. వాటిల్లో ఆత్మ గురించి ఏం రాశారో, అదే నా అనుభవమని గుర్తించాను."

*　　　*　　　*

ఆ అనుభవంతో వెంకట్రామన్‌కి దేహాత్మ భావం పోయింది. మృత్యుభీతి శాశ్వతంగా తొలగింది. శాశ్వత సత్యమైన "నేను" అనే దానికి పూర్తి ఎరుకలో నిలిచిపోయాడు వెంకట్రామన్.

ఆ స్థితి జాగ్రత్ - సుషుప్తి - స్వప్నం వంటి స్థితి కాదు. ఆ స్థితి కాలానికి కట్టుబడేది కాదు! కాని, అది ఎవరికిగాని కొత్తగా కలిగే స్థితి కాదు. అది సహజ స్థితి. అవిద్య వల్ల, సామాన్యులు ఆ స్థితిని గుర్తించరు. "అవిద్యను రూపుమాపితే, స్వయం ప్రకాశమైన "అసలు నేను"ను స్వరూపంగా దర్శించవచ్చు. అదే మోక్షం" అన్నారు భగవాన్ ఒకసారి.

మృత్యు భీతి కలగడంలో ఆశ్చర్యం లేదు. అది సహజం. కాని, వెంకట్రామన్ తనకు కలిగిన మృత్యు అనుభవాన్ని వదలక, గట్టిగా పట్టుకుని, దాని అసలు సంగతి తేల్చుకోవాలని తీవ్రంగా, శ్రద్ధగా, నిజంగా శక్తినీ, మేధస్సునీ, బుద్ధినీ కేంద్రీకరింపజేసి అన్వేషింప నారంభించేప్పటికి, దాని అసలు సంగతి బైటపడింది.

ఆ క్షణంలో అతని కేంద్రీకృతశక్తి, అన్వేషణాపటిమ, మృత్యు పరిధినే దాటి, పనిచేసింది. అది అలా పని చేయడమే, ఒక గొప్ప సంగతి. తత్ఫలితంగా అతనిలో దేహాత్మ భావం తొలగింది. అతను ఏ విధమైన యోగసాధనా చేయకుండా, ఆధ్యాత్మికోన్నత స్థితిని అందుకున్నాడు.

వెంకట్రామన్‌కు కలిగిన అనుభవం, మామూలు మనుష్యులకు అర్థం కావడం బహు కష్టం. ఎందుకంటే, అతనికి కలిగిన అనుభవంతో పోల్చి చూసుకోవడానికి, కనీసం తమకు కూడా అటువంటి అనుభవమేదో కలిగివుండాలి కదా? అంతటి అనుభవం కలిగినవారే, అతని స్థితిని అర్థం చేసుకోగలరు.

అనుభవం- అవగాహన- ఆత్మ సాక్షాత్కారం- మోక్షం- నిర్వాణం- దాన్ని ఏ పేరుతోనైనా పిలవండి. అదే అసలు సత్యం. దాన్ని పొందడానికి ఎంతటివారికైనా కొంతకాలం పడుతుంది. అది ఎంతకాలమని కాదు- వెయ్యేళ్లు కావచ్చు. క్షణకాలం కావచ్చు. మొగ్గ పూర్తిగా విచ్చుకోవడానికి కొంతకాలం పట్టినట్లే, మనో వికాసానికి కొంత కాలం పడుతుంది. అలా కాకుండా ఏదో మహిమగా, చిత్రంగా, అకాలంగా ఏ మొగ్గా విచ్చుకోదు. కాని, కొన్ని సంఘటనలు అకస్మాత్తుగా, బహు చిత్రంగా జరిగినట్లు అనిపించినా, వాస్తవానికి అవితీసుకోవలసిన కాలం, అవి ఎట్లానూ తీసుకుంటాయి. ఆ తర్వాత అన్ని పువ్వులు మాదిరిగా, అవీ పరిమళాన్ని విరజిమ్మి క్రమంగా ఎండి, వాడి, రాలిపోతాయి. అది ప్రకృతి సహజం.

జీవితమంతా సాధన చేసీ సాధింప శక్యం కానిది, వెంకట్రామన్‌కి అరగంటకాలంలో అత్యంత సులభంగా లభ్యమైంది. ఆ అనుభవంతో, అతనికి కాలమే ఆగిపోయింది. అతని శారీరక - మానసిక స్థితి, చచ్చి - బ్రతికినట్లుఉంది. దేహం, అదే కాని, అంతకు పూర్వం మనసు లేదు. కాని, మనసు వుంది. అది కాలిన తాడు

మాదిరిగా వుంది. కాంతికి విచ్చుకున్న మొగ్గ మాదిరిగా, అతను ప్రపంచాన్ని పరికించాడు. అతనిలో ద్వంద్వ ప్రవృత్తి నశించింది. తిరిగి అతనికి పసితనం వచ్చింది.

అనుభవానంతరం వెంకట్రామన్‌లోని మానవత్వం, దైవత్వంగా రూపొందింది. అతని వ్యక్తిత్వం, అద్భుతంగా పరిణామం చెందింది. పెనుతుఫాను తర్వాత ఏర్పడ్డ బ్రహ్మాండమైన నిశ్చలత్వం వలె, కొండల మధ్య రాజ్యమేలే నిశ్శబ్దంవలె, తీరానవున్న శిలల్ని తాకి, శాంతించే సముద్ర కెరటంవలె వుంది, అతని విలీనం. విచ్ఛేదం కాని, విరామం కాని లేని, నిశ్చలత్వం ఏర్పడింది. అది, సమస్తాన్ని తుడిచిపెట్టే నిశ్చలత్వం. అది మాయకు, భ్రాంతికి అతీతమైన స్థితి. ఆ స్థితిలోనే శాంతి, ఆనందం వుంటాయి. అటువంటి పరమోన్నత స్థితిలో నిలిచిపోయాడు, వెంకట్రామన్. అంతే, అసలు వున్న దానికి, చిద్వస్తువుకు "ఈశ్వరుడు - ఆత్మ - నేను" అనేవి వేరు కావనే ఎరుకే, జ్ఞానం. వెంకట్రామన్ పదిహేడవ ఏట ఆ జ్ఞానాన్నే పొందాడు.

ఆ క్షణం నుంచి వెంకట్రామన్ జీవన విధానం పూర్తిగా మారిపోయింది. సమస్తాన్ని సహృదయంతో తనలోకి తీసుకుని, అవగాహన చేసుకుంటో, తనపై దృష్టి కేంద్రీకరించుకుంటూ, చదివే పాఠ్య పుస్తకాల్ని, చుట్టూ వుండే బంధు - మిత్ర జనాన్ని, అన్నింటినీ నిరాకరిస్తో, తరచు ఒంటరిగా కూర్చుని, కళ్లుమూసుకుని నిశ్చలంగా, నిశ్శబ్దంగా, నిర్మలంగా ఉంటో అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు.

ఆనాటి నుంచి అతనిలో ప్రత్యేక వ్యక్తిత్వపు స్ఫురణ పోయింది. ప్రతిరోజు సాయంత్రం మీనాక్షి ఆలయానికి వెళ్ళి, గంటల తరబడి కూర్చునేవాడు. మహర్షుల, మహాత్ముల జీవిత చరిత్రలు చదివేవాడు. తరచు అతని కళ్ళల్లోంచి ఆనంద భాష్పాలు

కారేవి. ఆత్మలోతుల్లో లీనమై, మౌనంగా వుండేవాడు. తింటూ తిరుగుతూ, స్కూలుకు వెడుతున్నా, అతడు దేనిమీదా శ్రద్ధా, ఆసక్తి చూపేవాడుకాదు. ఆటలకు పోడు-స్నేహితుల్ని కలవడు. ఆ విధంగా యాంత్రిక జీవనం సాగించాడు. క్రమంగా అతనికి దేనితోనూ, ఎవరితోనూ ఎటువంటి సంబంధం లేకుండా పోయింది. దేహం మిగిలింది. అందుచేత ప్రపంచాన్ని సినీమా చూస్తున్నట్లు చూసేవాడు. జరిగిపోతున్న సంగతులకు, సంఘటనలకు సాక్షిగా వుంటూ, దేనికీ చలించకుండా వుండేవాడు. అతనిలో పాత అల వాట్లు పోయాయి. పాత విలువలు మారాయి. ఎవరితోనూ మాట్లాడడు.

అతనిలో వచ్చిన మార్పును ఇంట్లో వాళ్ళు గమనించారు. అప్పటి తన పరిస్థితిని భగవాన్ ఇట్లా చెప్పారు: "నాకు కలిగిన అను భవ ఫలితంగా, నాలో కొత్త తరహా ఎరుక వచ్చిందని గుర్తించాను. బంధు - మిత్రులతో వున్న సంబంధం, తెగిపోయింది. పెద్దవాళ్ళ తృప్తి కోసం, అప్పుడప్పుడూ పుస్తకం తెరిచేవాడిని. కాని, దృష్టి ఎక్కడో-అతీత శక్తుల మీద నిలిచేది. ఇతరులయెడ నా సంబంధం సాధువుగా, అణకువగా, విధేయతగా వుండేది. నా ఉదాసీన భావం చూసి, మిత్రులు నన్ను పలకరించడం మానుకున్నారు. ఒక్క అర గంట కాలంలో, నాలో అంత మార్పు వచ్చింది.

"నా అహంభావం అదృశ్యమై పోవడంతో, ప్రతిదాన్ని ప్రశాంతంగా జరుపుకుపోయేవాడిని. ఆటలు, వినోదాలు ఆగి పోయాయి. రోజులో చాలాసేపు ఒంటరిగా-నాకు ప్రీతైన ఆసనంలో-ధ్యానంలో కూర్చునేవాడిని. నన్ను నిర్మించి, నిలబెట్టిన శక్తితో ఏక మయ్యేవాడిని. ఆ కాలమంతా, ఆనందంగా గడిచేది. ఆ విధంగా ఆ మహాశక్తితో ఐక్యం కాని సమయాల్లో, నా ఒళ్ళంతా జ్వరం

వచ్చినట్లు వేడిగా వుండేది. ఆ తాపంతో, అశాంతిగా వుండేవాడిని. ఇంట్లోవాళ్ళు నన్ను నెమ్మదిగా మందలించడం ఆరంభించారు. ఒకొక్కసారి నన్ను చివాట్లు కూడా వేసేవారు. నాలో వచ్చిన మార్పు ఏమిటో వాళ్ళకు తెలియదు. "చదువు మీద ఇష్టం లేకపోతే అడవుల్లోకి పోయి, తపస్సు చేసుకోరాదా?" అనేవాడు మా అన్న. అప్పుడప్పుడూ నన్ను "యోగి - ముని" అని పరిహాసం చేసేవాడు.

"నాకు దేని మీదా, ముఖ్యంగా తిండి మీద ఇష్టాయిష్టాలు పోయాయి. ఏది పెడితే అది తినేవాడిని. మీనాక్షి గుడికి వెళ్ళి, దేవి విగ్రహం ముందు ఎంతోసేపు నిలబడి, "అమ్మా! నన్ను తీసుకో!" అని ప్రార్థించేవాడిని. ఉద్రేక తరంగాలు, నన్ను ముంచేవి. దేహాత్మ బుద్ధి వీడి, మరో పవిత్ర సంబంధంకోసం నా అంతరాత్మ గట్టిగా వెదికేది. కన్నీరు ధారగా కారేది. "ప్రభో, నన్ను కరుణించు. నన్నుతీసుకో" అని ఈశ్వరుణ్ణి ప్రార్థించేవాడిని. అంతే! నాకు ఇంకేమీ తెలియదు. జీవితం దుఃఖమయమనీ తెలియదు. నాకు పునర్జన్మ వద్దనీ, ముక్తి కావాలనీ లేదు. కాని, అసలు ఏమిటో, ఏమీ తెలియకుండానే దేనికోసమో ఆరాటం, ఆవేదన, ఆవేశం, పరితాపం. ఒళ్ళంతా దుర్భరంగా మంటలు. అప్పటికి నేను పెరియ పురాణం తప్ప మరే గ్రంథం చదవలేదు. స్కూల్లో బైబిల్ చదివాను. కొంచెం "తేవారాలు" చదివాను. పురాణాల్లోని ఈశ్వరుడే, నాకు ఈశ్వరుడు. పరబ్రహ్మ, సంసార బంధం వంటి మాటలు నేను వినలేదు. "సత్యం - శివం - సుందరం" అంటే ఏమిటో నాకు తెలియదు. తిరువణ్ణామలై వచ్చాక, "రిబుగీత" విన్న తర్వాత, ఇతర గ్రంథాలు కూడా విన్న తర్వాత నేను ఏ అనుభూతి పొందానో, దాన్నే ఆ గ్రంథాలూ చెపుతున్నాయని తెలుసుకున్నాను. ఆ నా అనుభవం, అది శుద్ధమనసు, లేక, జ్ఞానం. దాన్నే ప్రశాంతమైన అంతరజ్ఞానమనీ, మేల్కొవడమనీ అంటారనీ తెలుసుకున్నాను.

"ఆనాటి నుంచి నేను సదా అవిచ్ఛిన్న ఎరుకలో వున్నాను. దేని కోసమూ ఎటువంటి ప్రయత్నమూ చేయనవసరం లేదనీ, తీవ్రసాధన - తాత్త్వికచింతన అనవసరమనీ తెలుసుకున్నాను."

ఆ అనుభవం, వెంకట్రామన్ జీవితాన్ని పూర్తిగా మార్చేసింది. అతని దేహస్థితిలోనూ, మార్పు వచ్చింది. తనకు కలిగిన ఆ అనుభవాన్ని పురస్కరించుకుని ఒకసారి భగవాన్, "నేను ఈ దేహం కాదు. నేను శాశ్వతమైన ఆత్మస్వరూపాన్ని. రక్త-మాంసాదులతో కూడిన ఈ దేహంలో తాత్కాలికంగా వున్నాను," అన్నారు.

వెంకట్రామన్‌కు కలిగిన అనుభవం ప్రకారం చూస్తే, మనిషిలో "అసలు నేను-అబద్ధపు నేను" అనే రెండు "నేను"లు ఉన్నట్లు ధ్వనిస్తుంది. సత్యమైన "నేనే" శాశ్వతం, సాక్షీభూతం. అది స్వతంత్రమైనది. స్వయం ప్రకాశం కలది. లౌకిక వ్యవహారాలన్నింటినీ చక్కబెట్టేది. "మిథ్యా నేను" - అదే "అబద్ధపు నేను". తనను తాను తెలుసుకునే సాధకుడు, సత్యమైన "నేను"కూ, "మిథ్యా నేను"కూ మధ్య నున్న భేద భావాన్ని సూక్ష్మ బుద్ధితో గ్రహించిన వెంటనే, మిథ్యా నేను తలక్రిందులుగా పడిపోయి, సత్యమైన నేను తానుగా తోస్తుంది. ఆ "నేను" స్వరూపమే, ఆనందం, మౌనం.

కాని, ఎవరూ సర్వసాధారణంగా ఆ "నేను" అనేదాని గురించి ఎప్పుడూ తీవ్రంగా యోచించరు. అసలు తామేమిటో చిత్ర నిరూపణ చేసుకోరు. తామంటే, "దేహం-మేధస్సు-బుద్ధి" అనే అనుకుంటారు. కాని, "అసలు నేను" ఎవరు?" అని ఎవరూ ప్రశ్నించుకోరు. అందుచేత, ప్రతి ఒక్కరూ ముందు తమకు తాము ఏ అరమరికా లేకుండా లోపలా-బైటా, ప్రతి క్షణం అన్ని విషయాల్లో పరీక్షించుకోవాలి. పరిశీలించుకోవాలి. అదంతా సరైన పద్ధతిలో జరగాలి. తమను తాము తెలుసుకోనిది, ఎన్ని చేసీ, ఏంతెలుసుకునీ ప్రయోజనం వుండదు.

వెంకట్రామన్ మిత్రుల్ని పలకరించడం మానేశాడు. అతని వింత ప్రవర్తన ఇంట్లో వారిని హెచ్చరించింది. 1896 - ఆగస్ట్ - 29వ తేదీ శనివారం ఉదయం పదకొండు గంటలకు వెంకట్రామన్ మేడమీద గదిలో కూర్చుని, ఇంగ్లీషు వ్యాకరణం సరిగా చదవనందుకు ఆ పాఠాన్ని టీచర్ మూడుసార్లు చూసిరాసి, తీసుకురమ్మన్నాడని బెయిన్ ఇంగ్లీషు గ్రామర్ పుస్తకం చూసి రాయడం ఆరంభించి, రెండు సార్లు రాసి, మూడోసారి రాసే ముందు "ఇలా రాయడం వల్ల ఏం లాభం? ఏ లక్ష్యం లేకుండా పని చేయడానికి, నేను ఏమైనా యంత్రాన్నా?" అని అనుకుని, రాసే పుస్తకాన్ని మూసేసి, పద్మాసనం వేసుకుని ధ్యాన నిమగ్నుడయ్యాడు.

మొదటి నుంచీ వెంకట్రామన్ని గమనిస్తూ వున్న అన్న నాగస్వామి, ఆ సమయంలో అక్కడే వున్నాడు. అతడు వెంకట్రామన్ని చూసి, "ఇల్లూ, వాకిలీ, చదువు, సంధ్యా అక్కర్లేని వానికీ, సాధు జీవనం అవలంబించే వానికి ఇంత సౌకర్యాలు అనుభవించే అధికారం ఎక్కడ వుంది?" అని నిందాపూర్వకంగా మాట్లాడాడు. ఆ మాటలు వెంకట్రామన్ హృదయాన్ని వాడి బాణాల్లాగా గుచ్చుకున్నాయి. అతనిలోని ఆవేశాన్ని రెచ్చగొట్టాయి. నాగస్వామి నిందా వాక్యం, వెంకట్రామన్‌కి మేల్కొలుపుగా ధ్వనించి, "అవును, చదవని నాకు ఇల్లెందుకు, అరుణాచలం వుండగా?" అని అనుకుని, వెంటనే ఇల్లు వదలి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. అప్పటికే అతని హృదయ కవాటం పూర్తిగా తెరుచుకోవడం వల్ల, ఆనందపారవశ్యుడై, అరుణాచలం చేరుకొనేందుకు ఆరాటపడ్డాడు. నాగస్వామి అనిన మాటలు పరమ సత్యాలుగా తోచి, "నిజమే, చదువు మీద, ఒంటి మీద, ఇంటి మీద లక్ష్యం లేని నాకు, ఈ ఇంట్లో ఏం పని?" అనుకుని గృహ పరిత్యాగానికి నిశ్చయించుకున్నాడు.

వెంకట్రామన్ గదిలోంచి బైటికి వెడుతూ వుంటే, "ఎక్కడికి?" అని నాగస్వామి అడిగాడు.

"ఈ మధ్యాహ్నం మాకు స్పెషల్ క్లాస్ వుంది. నేను స్కూలుకు వెడుతున్నాను." అన్నాడు వెంకట్రామన్.

ఆ రోజు నాగస్వామి కాలేజీకి వెళ్ళలేదు. అతని కాలేజీ కూడా వెంకట్రామన్ హైస్కూలు దగ్గర వుండటం చేత, పెట్టెలో ఐదురూపాయలు ఉన్నాయి. పిన్నిని అడిగి తీసుకుని, నా కాలేజీ జీతం కట్టు, అన్నాడు.

తాను అరుణాచలం వెళ్ళడం పెద్ద వాళ్ళకు తెలిస్తే అభ్యంతర పెడతారని వెంకట్రామన్‌కి తెలుసు. కాని, సమయానికి నాగస్వామి తన కాలేజీ జీతం కట్టమంటూ ఐదురూపాయలు ఇవ్వడం దైవ నిర్ణయంగా భావించి, ప్రయాణం స్థిరం చేసుకున్నాడు, వెంకట్రామన్.

వెంకట్రామన్‌తో కలిసి చదువుకున్న రంగయ్యర్ ఒకసారి శ్రీరమణాశ్రమానికి వచ్చినప్పుడు, "నేను అరుణాచలం వెళ్ళిపోతున్నాను," అని నాతో ఒక్క మాటైనా చెప్పలేదేం?" అని భగవాన్ని అడిగితే, "ఆ క్షణం వరకు నా మనసులో ఆ ప్రసక్తే లేదు" అన్నారు.

వెంకట్రామన్ భోజనం చేసి, పినతల్లిని అడిగి ఐదురూపాయలూ తీసుకుని, ఇంట్లో ఒక పాత అట్లాస్ వుంటే దాన్ని చూసి, తిరువణ్ణామలైకి దగ్గర రైల్వేస్టేషన్ "దిండివనం" అనుకున్నాడు. కాని, ఆ మధ్యే "విల్లుపురం-కాట్పాడి" మధ్య రైలు మార్గం ఏర్పడిన సంగతి అతనికి తెలియదు. అందుచేత రైలు టిక్కెట్టు నిమిత్తం మూడు రూపాయలు తీసుకుని, "నేను నా తండ్రి ఆజ్ఞానుసారం ఆయన్నే వెతుక్కుంటూ వెళ్ళిపోతున్నాను. ఇది పుణ్యకార్యం కనుక నా కోసం ఎవరూ విచారించకండి. డబ్బు ఖర్చు

పెట్టి దీన్ని వెతక్కండి," అని ఒక చీటీ రాసి, "నీ కాలేజీ జీతం కట్టలేదు. ఇందులో రెండు రూపాయలు ఉంచుతున్నాను." అని రాసి, ముగింపులో "ఇట్లు" అని కొన్ని చుక్కలు పెట్టి, ఉత్తరం పూర్తి చేశాడు.

వెంకట్రామన్ పూర్వీకులలో ఒకరు తమ ఇంటి ముందు భిక్షకు నిలిచిన సన్యాసిని నిరాకరించడం చేత, ఆ సన్యాసి ఆగ్రహించి, ప్రతి తరంలోనూ ఈ ఇంటి నుంచి ఒకరు దేశదిమ్మరి సన్యాసి అగుదురుగాక!" అని శపించినట్లు చెపుతారు. తత్ఫలితంగా ప్రతి తరంలోనూ ఒకరు సన్యసించి వెళ్లారు. ఈ తరానికి ఆ వంతు వెంకట్రామన్‌కి వచ్చింది. భవబంధాలు అంత తేలికగా తెగిపోతే, దాన్ని శాపం అనడం కన్నా, అది వారి పాలిట వరం అనడం యుక్తం.

* * *

"నేను నా తండ్రిని వెతుక్కుంటూ వెడుతున్నాను. దీన్ని వెతక్కండి" అని వెంకట్రామన్ అనడం భక్తి, ప్రేమ, ఆరాధన మొదలైన ద్వంద్వ ప్రవృత్తుల నుంచి అతని మనసు ఏకత్వంమీదకు మళ్ళింది అనడానికీ, కర్తృత్వభావం నశించిందనడానికీ నిదర్శనం. అతనిలో అహం నివృత్తి కావడంతో "నేను" అనే ప్రత్యేక వ్యక్తిత్వ భావం పోయింది. అంతే, దేహాత్మబుద్ధి తొలగింది. తానూ, ఈశ్వరుడూ ఒకటేనన్న భావం ఏర్పడింది. అందుచేత ఈ జగత్తును సినీమా తెరమీది బొమ్మల వలె దర్శించి, విశ్వమంతా ఒకే చిదాత్మగా గ్రహించాడు. దేహాన్ని త్యజించి, ఆత్మశక్తిని పూర్తిగా నిరావరణం చేసి, మహాగగన చిదాకాశాన్ని దర్శించాడు వెంకట్రామన్. అది బాహ్యాంతరములందు జ్ఞానతేజం ఆవరించిన అనుభూతి.

ఒకసారి శ్రీ రమణాశ్రమంలో "చిదాకాశం" అనే విషయంపై చర్చ వచ్చినప్పుడు, భగవాన్ ఇచ్చిన వివరణ :

సమస్త విశ్వం, ఒకే చిత్స్వరూపం. అది పరిపూర్ణం, అపరిచ్ఛిన్నం. అది స్వతంత్రమైనది, స్వయంప్రకాశం కలది, సర్వవ్యాపి. స్థూలదృష్టికి, అసలు చిత్స్వరూపం కనపడదు. అయినా ఎవరూ దాన్ని చూడ్డానికి యత్నించరు. కాని, మనం అనుక్షణం చూసేది కేవలం కంటికి కనుపించే ప్రతిబింబాల్ని మాత్రమే. అంతే, రగులుతున్న మహాగ్నిలోంచి జ్వాలలూ, కణాలూ తమంతట తాము పైకి లేచి, కొంతకాలం నిలిచి, వెలిగి, తిరిగి ఆ మహాగ్నిలో కలిసి పోవునట్లు, విశ్వ చైతన్య క్షేత్రంలో అనంతమైన విశ్వాలూ, గోళాలూ తమంతట తాము లేస్తూ, అణగుతూ వుంటాయి. అందుచేత సమస్త చరాచరం చిత్తును ఆశ్రయించి వుంటుంది. ఆ చిత్తు, దర్పణం మాదిరిగా అన్నింటినీ ప్రకాశింపజేసి, ప్రతిబింబింపజేసి మనకు తెలిసేటట్లు చేస్తుంది. కాని, దర్పణానికీ చిత్‌కూ ఒకటే తేడా వుంది. దర్పణానికి బైట ఒకటి విడిగావుండి వుంటే, అది దర్పణంలో ప్రతి బింబిస్తుంది. చిత్‌నుంచి ఏదీవిడిగాలేదు. కాని, ఏ అవసరం లేకుండానే చిత్ తన యందు తానే జగత్ప్రతిబింబాన్ని సంకల్పించి, సృష్టించు కుంటుంది. ఆ జగత్తుకు ఆశ్రయమైన స్వాత్మ రూపం తెలియక, అజ్ఞానం వల్ల మనము ఆ జగత్తును స్వతంత్ర రూపం కలదిగా చూస్తాం. అంతే, చిత్తులో భాసించు జగత్తూ, చిత్స్వరూపమే! జగత్తూ, చిత్తూ ఒక్కటే.

ప్రతిబింబాలు వున్నా, లేకపోయినా, దర్పణం ఎప్పుడూ దర్పణమే. దర్పణమందలి ప్రతిబింబాల సమూహామే, దర్పణ స్వరూపం. మనకు కనుపించే సమస్త చరాచరం, అశేష దృశ్యజాలం కేవలం దృక్స్వరూపం. ఈ జగత్తునందలి అనేక పదార్థాలే, వివిధ శక్తులు. ఆ శక్తుల స్వరూపమే చిత్స్వరూపం. ప్రతిబింబాలు కూడా దర్పణ పదార్థమే, కాని, వేరు కావని గ్రహించాలి.

మనలోంచి వచ్చే ప్రతి ఆలోచనా, ఆశా, ప్రయత్నం అన్నీ, అంతా చిత్తే. ఈ జగత్తంతా ఆ చిత్ యొక్క - చిద్విలాసమే. కాని, దర్పణం వలె చిత్ యొక్క గుణం, జడం కాదు. అది జ్ఞాన స్వరూపం. దర్పణం, జడం కనుక దానికి మరకలు పడవచ్చు. చిత్‌కి అటువంటిది ఏమీ లేదు. అది నిత్య స్వయం ప్రకాశం. అన్య పదార్థం వల్లా, ఇతర సంపర్కం వల్లా దర్పణానికి మకిలి పట్టవచ్చు. కళాయి చెడవచ్చు. కాని, చిత్ లో ఏదీ కలవదు. కలిసేందుకు అది మినహా మరొకటి లేదు. అసలు ఉన్నదీ చిత్ ఒక్కటే. అందుచేత చిత్ నైర్మల్యమే. దర్పణం, పరిమితం. చిత్, అపారం- అనంతం- అఖండం. అదే సత్యం.

* * *

వెంకట్రామన్ రైల్వేస్టేషన్‌కు వెళ్ళాడు. ఆ రోజు రైలు ఆలస్యంగా వచ్చింది. దిండివనానికి టిక్కెట్టు కొనగా, మూడు అణాలు (పందొమ్మిది పైసలు) మిగిలాయి.

వెంకట్రామన్ కూర్చున్న రైలు పెట్టెలో, ఒక ముస్లిం సాధువున్నాడు. ఆ మౌల్వీ అనేక మంచి సంగతులు చెపుతోవుంటే, వెంకట్రామన్ మినహా అందరూ దృష్టి పెట్టి, శ్రద్ధగా వింటున్నారు. ఆసాధు వెంకట్రామన్ వైపు తిరిగి అతని ధ్యానం, ఆవేదనా గమనించి, "స్వామి, తమరు ఎక్కడకు వెడుతున్నారు?" అని ప్రేమగా అడిగాడు.

వెంకట్రామన్ కళ్ళు తెరచి, "తిరువణ్ణామలై వెడుతున్నాను," అన్నాడు. "నేనూ అక్కడికే" అన్నాడు ఆ సాధు. "మీరూ తిరువణ్ణామలైకేనా" అని సంభ్రమాశ్చర్యాలతో ప్రశ్నించాడు, వెంకట్రామన్.

"కాదుతే, "తిరుక్కోయిలూరు"కు. అది దాని దగ్గరస్టేషన్," అన్నారాయన. "తిరువణ్ణామలైకి రైలు వుందా?" అని అడిగాడు. "మీ ప్రయాణం చాలా బావుందే! టిక్కెట్టు ఎక్కడికి తీసుకున్నారు?" అని ఆ మౌల్వీ అడిగాడు. "దిండివనానికి" అన్నాడు వెంకట్రామన్. "అయ్యో! ఎంత పొరపాటు చేశారు. విల్లుపురంలో ఈ రైలుదిగి, కాట్పాడి వెళ్ళే రైలు ఎక్కండి," అని చెప్పాడు, మౌల్వీ.

వెంకట్రామన్ మళ్లా సమాధి స్థితికి వెళ్ళిపోయాడు. సూర్యాస్తమయ సమయానికి రైలు తిరుచునాపల్లి చేరింది. అతనికి ఆకలేసి మూడు పైసలు పెట్టి రెండు బేరీకాయలు కొని, ఒక కాయలో కొంచెం తిని, మళ్లా ధ్యానంలో మునిగిపోయాడు.

తెల్లవారుజామున రైలు విల్లుపురం చేరింది. ఆ సాధు ఎక్కడ మాయమయ్యారో, మళ్ళా వెంకట్రామన్‌కి కనబడలేదు. విల్లుపురం నుంచి తిరువణ్ణామలై నడచి వెళ్ళాలని అతని ఉద్దేశ్యం. తెల్లవారే వరకు స్టేషన్‌లో కూర్చుని, తర్వాత ఎవరినీ, ఏమీ వివరం అడక్కుండా, ఏ రోడ్డు తిరువణ్ణామలై వెడుతుందో తెలియక అన్ని రోడ్లూ తిరిగి, తిరిగి అలసిపోయి, ఆకలేస్తే ఒక హోటల్ ముందు ఆగి, భోజనం పెట్టమన్నాడు. "ఇప్పుడు భోజనం సిద్ధంగాలేదు. మధ్యాహ్నానికి తయారౌతుంది," అన్నాడు హోటల్ యజమాని,

వెంకట్రామన్ ఆ హోటల్ ముందే కళ్లు మూసుకుని కూర్చున్నాడు. వంట తయారైన తర్వాత అతనికి భోజనం పెట్టారు. అతను భోజనం చేసి, తన వద్ద మిగిలిన పైసలు ఇవ్వబోతే, ఆ హోటల్ యజమాని అతని తీరు చూసి, అతని వెంట ఎటువంటి సామాను లేకపోవడం, అతని వాలకం, విధానం, నిదానం, సాధుత్వం గమనించి, "అసలు నీ వద్ద ఎంత సొమ్ముంది?" అని అడిగి తెలుసుకుని, అతన్నించి ఏమీ తీసుకోలేదు. ఆ పైసలతో అతను "మాంబలం పట్టు" వరకు టిక్కెట్టు కొని, మళ్లా రైలు ఎక్కాడు.

మధ్యాహ్నానికి వెంకట్రామన్ "మాంబలంపట్టు" చేరుకున్నాడు. అక్కడ నుంచి పదిమైళ్లు నడచి చీకటిపడేప్పటికి "అరయ వల్లూరు"చేరుకున్నాడు.అదిపుణ్యక్షేత్రం.ఆ వూళ్లో ఒకకొండదిబ్బమీద అతుల్యనాథేశ్వరాలయం వుంది. అది ఏకశిలపై నిర్మాణమై వుంది. వెంకట్రామన్ ఆ ఆలయంలోకి వెళ్ళి మండపంలో జ్ఞానసంబందార్ విగ్రహం పక్కన కూర్చున్నాడు. కొంతసేపటికి ఆ ఆలయ ఆవరణ అంతటా ఓ దివ్య కాంతి విస్తరించడం గమనించాడు. ఆ వెలుగు గర్భాలయంలోంచి, వస్తోందేమోననుకుని, ఆ ప్రదేశమంతా వెదికి చూశాడు. ఎక్కడా ఏమీ కనుపించలేదు. బహు చిత్రంగా ఆ దివ్యకాంతి ఆవరణ అంతటా వ్యాపించి వుంది. క్రమంగా ఆ కాంతి తగ్గింది. ఆ తర్వాత అతడు ధ్యానంలో మునిగిపోయాడు.

ఆ కాంతి విషయమై ఒక గాథ వుంది. పదిహేనవ శతాబ్దంలో "జ్ఞానసంబందార్" అనే మహాత్ములు వుండేవారు. ఆయన మూడవ ఏట, తండ్రి వెంట "షియాలి" అనే పుణ్యక్షేత్రానికి యాత్రకు వెళ్ళారు. అక్కడ ఆయన తండ్రి, ఒక కొలనులో దిగి, మునిగి స్నానం చేస్తుండగా, తండ్రి కనపడలేదని ఆ బాలుడు కంగారుపడి ఏడ్వనారంభించాడు. ఆ సమయాన పార్వతీపరమేశ్వరులు గగన వీధిని వెడుతూ, ఆ బాలుని ఏడ్పు విని, కిందికి దిగి వచ్చారు. పార్వతి ఆ బాలుణ్ణి తన వొడిలోకి తీసుకుని పాలు ఇచ్చి, అతన్ని ఊరడించి వెళ్ళిపోయింది.

అతని తండ్రి స్నానం చేసి వచ్చి, పిల్లవాని పెదవుల మీద పాల చారలు వుండటం గమనించి, "ఏమి జరిగింది?" అని అడిగితే, ఆ బాలుడు ఆశువుగా ఈశ్వరుణ్ణి స్తుతిస్తూ కీర్తనలు పాడాడు. అతని తండ్రి ఆశ్చర్యపోయి, అసలు విషయం వివరంగా చెప్పమని అడగగా, అతడు తనకు పార్వతీ పరమేశ్వరులు దర్శన మిచ్చిన సంఘటన ఇట్లా వర్ణించాడు: చెవులకు కుంతలాలు పెట్టుకున్న దొంగ, నా మనసును దొంగిలించాడు," అని.

జ్ఞాన సంబందార్‌కి పదహారవఏట వివాహమైంది. ఆయన యాత్రలు చేస్తో "అరయనల్లూరు" వెళ్ళారు. ఆ శివక్షేత్రంలో ఆయనకు జ్యోతి దర్శనమైంది. ఆ జ్యోతే వెంకట్రామన్‌కూ దర్శన మిచ్చింది.

అరయనల్లూరు ఆలయంలో వెంకట్రామన్ ధ్యాన నిమగ్నుడైన సమయంలో అర్చకులు వచ్చారు. వారు పూజ ముగించి ఆలయం తలుపులు మూసేస్తో, అతన్ని తట్టి లేపారు. అతనికి బాగా ఆకలై, తినడానికి ఏమైనా పెట్టమని వారిని అడిగాడు. "ఏమీ లేదు, ముందు బైటికి నడు," అన్నారు అర్చకులు. అతడు గుడి బైటికి వస్తోవుంటే, "ఇక్కడకు కొంచెం దూరంలో "కల్లూరు" అనే వూరు వుంది. అక్కడ ఒక ఆలయం వుంది. ఆ ఆలయంలో కూడా మేమే పూజలు చేస్తాం. అక్కడ ఏమైనా దొరుకుతుందేమో చూద్దువుగాని, మా వెంట రా," అన్నారు.

వెంకట్రామన్ వారి వెంట వెళ్ళాడు. అక్కడ పూజ ముగిసేప్పటికి రాత్రి తొమ్మిది అయింది.అతనికి బాగా ఆకలై, నీరసంగా వున్నాడు-దానికి తోడుఆ రోజు ఎంతోదూరం నడిచి అలిసిపోయాడు. అక్కడ అర్చకులు పూజానంతరం ప్రసాదాలు పంచుకున్నారు కాని, వెంకట్రామన్‌కు పెట్టలేదు. "తినడానికి నాకేమైనా పెట్టండి" అని అతను మళ్ళా వారిని అడిగాడు. "ఏమీ మిగల లేదు" అన్నారు అర్చకులు. కాని, ఆలయ వాయిద్యగాళ్ళలో ఒకతను వెంకట్రామన్ స్థితి చూసి, జాలిపడి తన వాటా ప్రసాదాన్ని అతనికి ఇచ్చాడు. అతడు దాన్ని తీసుకుని, గుడి బైటుకు వెళ్ళి, ప్రసాదం తినే ముందు మంచినీళ్ళు తాగాలని ఒక ఇంటి ముందు నిలబడి, నీళ్ళు అడిగాడు. వాళ్ళు నీళ్ళు ఇచ్చే లోపల అతను సొమ్మసిల్లి నడివీధిలో పడిపోయాడు. అతను తెప్పరిల్లి చూసేప్పటికి చుట్టూ జనం వున్నారు. ప్రసాదం దుమ్ములో పడి వుంది. దాన్ని ఏరుకుని తిని, నీళ్ళుతాగి, అక్కడే నిద్ర పోయాడు.

తెల్లవారింది. ఆ రోజు గోకులాష్టమి. తిరువణ్ణామలై ఇంకా ఇరవైమైళ్ళ దూరంలో వుంది. అతనికి ఆకలేసింది. తన చెవులకు వున్న అంటుజోళ్ళు అమ్మేసి కాని, తాకట్టు పెట్టిగాని కొంత సొమ్ము తీసుకుని తాత్కాలిక అవసరాలు తీర్చుకోవాలనుకున్నాడు. కాని, "వాటిని ఎవరికి, ఎట్లా అమ్మాలి?" అనే ప్రశ్న వచ్చింది. అతను అట్లా నడచి వెడుతూ ఒక ఇంటి ముందు ఆగి, "ఆకలేస్తోంది. అన్నం పెట్టండి." అని అడిగాడు. అది ముత్తు కృష్ణ భాగవతార్ గారి ఇల్లు. అప్పటికి వారి ఇంట్లో ఇంకా వంట కాలేదు. కాని, అతని పరిస్థితి గమనించి భాగవతార్‌గారి అక్క జాలిపడి, చల్ది అన్నం వుంటే పెట్టి, "కృష్ణాష్టమి పూజ అయ్యే వరకు వుండి, ప్రసాదం తీసుకో, అన్నది.

పూజ అయిన తర్వాత అతనికి ఆమె మళ్ళా భోజనం పెట్టి, దారిలో తినమని కొంత ప్రసాదం పొట్లం కట్టి ఇచ్చింది. కాని, అతను ఇంత నడవలేక భాగవతార్‌గారి దగ్గరకు వెళ్లి, అయ్యా, నేను యాత్రకు బయలు దేరాను. దారిలో నా సామానంతా పోయింది. నాకు దిక్కు తోచకుండా వుంది. నా చెవుల అంటు జోళ్ళు తీసుకుని నాలుగు రూపాయలు ఇవ్వండి" అని అడిగాడు వెంకట్రామన్. భాగవతార్‌గారు ఆ అంటుజోళ్ళు చూసి "బంగారం మంచిది. జాతి కెంపులు. ఫరవాలేదు" అనుకుని, అతనికి నాలుగు రూపాయలు ఇచ్చి, తన ఎడ్రస్ కూడా రాసి ఇచ్చాడు - అతను ఎప్పుడైనా వచ్చి, డబు ఇచ్చి, తన అంటుజోళ్ళు తాను తిరిగి తీసుకునేందుకు వీలుగా. వెంకట్రామన్ బైటికివచ్చి, ఆయన ఇచ్చిన ఎడ్రస్ కాగితం చింపిపారేశాడు. ఆ రాత్రి వెంకట్రామన్ రైలు స్టేషన్‌లోనే పడుకున్నాడు.

**1896** సెప్టెంబరు - ఒకటవ తేదీ ఉదయం వెంకట్రామన్ తిరువణ్ణామలై చేరుకున్నాడు. అదే అతని జీవిత లక్ష్యం. అరుణాచలం చేరడంతో, అతని యాత్ర పూర్తిగా ముగిసింది. * * *

వెంకట్రామన్ జీవితంలో జరగవలసిన సంగతులు, సంఘట నలు అన్నీ ఒక దాని తర్వాత ఒకటి, సక్రమంగా జరిగిపోయాయి. కాని, అతను ఆ సంగతుల్లో ఏ ఒక్క దాని గురించీ ముందుగా యోచించలేదు, యత్నించలేదు, ఆశించలేదు. అదంతా దైవనిర్ణయం వలె జరిగిపోయింది. అతను ఏదీ చదివి - చూసి - విని - యోచించి సర్వసంగ పరిత్యాగం చేయలేదు. ఒక్క వేటుతో దేహాత్మభావం తెగిపోవడంతో, అతని హృదయంలోంచి వైరాగ్యభావం దానికదే పెల్లుబికింది. మహాయోధునివలె ఒక్కదూకున అరుణాచలం చేరి, నిత్య సహజాత్మ నిష్ఠాగరిష్ఠుడైనాడు.

రైలు తిరువణ్ణామలై స్టేషన్ సమీపించేటప్పటికి తెల్లవారు తోంది. అరుణకాంతులు పడి, అరుణగిరి, అరుణాచలేశ్వరాలయం ప్రకాశిస్తున్నాయి. వెంకట్రామన్ రైలుదిగి, ఆ ఉదయ కాంతిలో ఒక కాంతికిరణం మాదిరిగా, సరాసరి ఆలయం ప్రవేశించాడు. ఆలయంలో మరమ్మత్తులు జరుగుతున్న కారణంగా, ఉదయం ఎనిమిది గంటలవరకూ తెరవబడని ద్వారాలు, ఆ రోజుబహు చిత్రంగా తెరచివున్నాయి. అతను సరాసరి గర్భాలయంలోకి వెళ్ళి, "తండ్రీ,నీ ఆజ్ఞ మేరకు వచ్చాను" అన్నట్లు అరుణాచలేశ్వరుని ముందు నిలబడ్డాడు. చిరకాల వాంఛ సిద్ధించినట్లు తృప్తిపడ్డాడు. ఆ ఏకాంత సంయోగానందంలో అతని కళ్లు ఆనందభాష్పాలతో నిండాయి. మృత్యు అనుభవం నాటినుంచీ అతన్ని విడవకుండా వున్న శరీర తాపం, మనో ఉద్రేకం ఆలయ ప్రవేశంతో ఉపశమించాయి. నెల్లాళ్ళ నుంచి పీడిస్తున్న తలనొప్పి, తగ్గిపోయింది. భావోద్వేగం, భావసం ఘర్షణ నుంచి మనసు శాంత పడింది. అన్ని వేదనలూ అంతమై, అనిర్వచనీయానందంలో మునిగిపోయాడు, వెంకట్రామన్. తాను శరీరంకన్నా భిన్నమైన సద్వస్తువైనట్లే, ఈశ్వరుడు ప్రపంచంకన్నా అన్యమైన చిత్స్వరూపుడుగా అతనికి దర్శనమిచ్చాడు. అంతే,

తానూ - ఈశ్వరుడూ ఒకటేనన్న భావం అతనిలో ఏర్పడింది. దేహమే "నేను" అనుకునే ద్వైత భావం పోయి, దేహం - "నేను కాదు" అనే అద్వైత భావం స్థిరపడింది. అంతటా, అన్ని కాలాల్లో ఒకే విధంగా వున్న చిద్వస్తువే, తనలోనూ, ఈశ్వరుడిలో నూ-అంతటా ఒకటిగా వున్నదనీ, అది నిత్య - సత్య - స్వరూపంగా, శాశ్వతంగా, అనంతంగా, అపారంగా వున్నదనే అనుభూతి కలిగింది. అంటే, ఏకత్వభావం ఏర్పడింది. అదే అరుణాచలేశ్వరాలయంలో వెంకట్రామన్‌కు జరిగిన మహాయోగం. మహాయోగమంటే, మనం నేర్చినదాన్నంతా మరచిపోయేటట్లు జరగడం. వాస్తవంగా మనం నేర్చినదంతా, అజ్ఞానం. అది ఐక్యతకు అడ్డు, అవరోధం, అభ్యంతరకరం. ఆవిధంగా అజ్ఞానంలో పెరిగిన వ్యక్తిత్వాన్ని, జ్ఞానాగ్నికి అర్పించడాన్నే మహాయోగ మంటారు. దాన్నే సిద్ధియోగమనికూడా అంటారు.

ఆనాటి నుంచి వెంకట్రామన్‌లో ఆలోచనలు ఆగిపోయాయి. సంకల్పరహితుడైనాడు. ఆ మహాభినిష్క్రమణకు కారణంలేదు, ఆలోచన లేదు, ఉద్దేశ్యంలేదు, ప్రయత్నం లేదు, ఆశ, కోర్కె ఏమీ లేదు. ఆ స్థితి అతనికి కొత్తగా, వింతగా, ఆశ్చర్యకరంగా లేదు. సహజంగా వుంది. అతనిలో అరుణాచలం చేరుకున్నాననే సంతోషం తప్పమరేంలేదు. అతను కొంతసేపు ఆలయంలో అటూ, ఇటూ తిరిగాడు. అతని చూపులో గతంలేదు, భవిష్యత్తులేదు. అంత నిరామయంగా వున్నాడు. అతనికి వున్నది, ఆ క్షణం మాత్రమే. అంతే! ఆ విధంగా వెంకట్రామన్ మరో యాభై నాలుగు ఏళ్లు వున్నాడు.

అరుణాచలేశ్వరాలయంలోంచి వెంకట్రామన్ బైటికి వచ్చాక, ఒక మంగలి ఎదురై "మీరు తలనీలాలు ఇస్తారా?" అని అడిగాడు. వెంకట్రామన్ అంగీకరించి, అతని వెంట "అయ్యంగులం" అనే కోనేరు దగ్గరకు వెళ్ళాడు. అక్కడ

తలనీలాలిచ్చి, ఆ మంగలికి ఇవ్వవలసిన డబ్బు ఇచ్చేసి, మిగిలిన సొమ్ము కొలనులో విసిరిపారేశాడు. అంతే! జీవితంలో మళ్ళా - ఎప్పుడూ డబ్బుముట్టలేదు. కల్లూరు నుంచి తెచ్చుకున్న ప్రసాదం కూడా కొలనులో విసిరేసి "ఈ మొద్దుకు ఈ పిండివంటలు ఎందుకు" అనుకున్నాడు. ఆ తర్వాత యజ్ఞోపవీతం తెంపిపారేసాడు. కట్టు కున్న ధోవతి చింపి, చిన్న ముక్క కౌపీనంగా ధరించాడు. "ఈ కట్టెకు స్నానం ఎందుకు?" అనుకుని మళ్లా అరుణాచలేశ్వరాలయా నికి వెళ్ళాడు. దారిలో జల్లువాన అతని ఒంటిని శుద్ధి చేసింది. అప్పటికి అరుణాచలంలో కొన్నేళ్లుగా వర్షం లేదు.

ఆ రాత్రి వెంకట్రామన్ ఆలయం ముందున్న మండపంలో పడు కున్నాడు. ఒంటిమీద బట్టలు లేకపోవడంవల్లా, వర్షంలో తడవడంవల్లా, అతనికి చలి అనిపించి, దగ్గరలో వున్న ఒక ఇంటి వరండాలో నిల బడితే,అతని పిచ్చివాలకం చూసి,ఇంటియజమాని అరచి తరిమేశాడు.

* * *

అరుణాచలేశ్వరాలయం ఎంతో విస్తీర్ణమైనది. దానిపొడవు 1480 అడుగులు - వెడల్పు 680 అడుగులు. తూర్పు గోపురం ఎత్తు 216 అడుగులు. పదకొండు అంతస్తులు. ఆ ఆలయ ఆవరణలో ఎన్నో మండపాలు, చిన్నా - పెద్ద గోపురాలు, పరివార దేవతల ఆలయాలు, శాలలూ, కొలనులూ, పూలతోటలూ వున్నాయి. సంసారాన్ని విసర్జించిన వారికీ, సన్యాసులకూ, సాధువులకూ, సాధకులకూ, అన్వేషకులకూ, భిక్షకులకూ, బైరాగులకూ, భక్తు లకూ, యోగులకు, అనాథులకు- అందరికీ ఆ ఆలయం నివాసానికి అనుకూలమైన ప్రదేశం. వెంకట్రామన్ కూడా వాళ్ళతో కలసి అందున్న వెయ్యికాళ్ళమండపంలో కూర్చున్నాడు.

ఆ కూర్చోవడం, కూర్చోవడంకొన్ని వారాలు కూర్చున్నాడు. పెద్ద మర్రిచెట్టు, చిన్నవిత్తనంలో దాగి వున్నట్లు, పెద్ద ప్రపంచం, స్వల్పభావంలో దాగివుందన్న పరమసత్యాన్ని తెలుసుకున్న వెంకట్రామన్, అందు ఆత్మ నిష్ఠుడై కూర్చున్నాడు. ఆ జగత్సత్యమే, గురువై అతనికి మహోపదేశం చేసింది. అందుకే అతనికి ఏనాడూ ప్రపంచంపై ఆసక్తిలేదు. అతనికి బాహ్యాంతర జీవితమంటూ విడి, విడిగాలేదు. ఉన్నది ఒకటే జీవనవాహిని. అది నిత్యచైతన్య స్రవంతి. అది సూర్యకాంతి వలె అన్ని దిక్కులకూ సమంగా ప్రసరించింది. ఆ స్థితిలో వెంకట్రామన్ చివరి వరకూ వున్నాడు. అతని ప్రతిభ, ప్రజ్ఞ, ప్రభావం, మధ్యాహ్న సూర్యకాంతి వలె, అన్ని దిక్కులకూ విస్తరించి, ప్రపంచాన్ని ఆశ్చర్య పరచి, ప్రజల్ని ఆకర్షించి, ఆనంద పరచింది.

ఆనాటి తన విషయం గురించి భగవాన్ ఇట్లా చెప్పారు: "నేనెప్పుడూ ఎటువంటి సాధనా చేయలేదు. కనీసం "సాధన" అంటే ఏమిటో కూడా నాకు తెలియదు. నాకు అన్యంగా, భిన్నంగా ఒకటి వుండి వుంటే, దాన్ని పొందాలనీ, తెలుసుకోవాలనీ, ఆ లక్ష్య మేదో చేరుకోవాలనే ఆశా, ప్రయత్నం ఏమైనా నాలో వుండి వుంటే, నేను దాని గురించి యోచించేవాడినేమో! నాకు ఏదైనా లక్ష్యమంటూ వుంటే, దాన్ని సాధించేందుకు, సాధన చేసేవాడినేమో! దేన్ని పొందేందుకూ నాకు ఆనాడు ఏ ఆశాలేదు. ఇప్పుడైతే కళ్ళు తెరచి కూర్చుంటున్నాను కాని, ఆ రోజుల్లో ఊరికే కళ్ళు మూసుకుని కూర్చునే వాడిని. కళ్ళు తెరవడంకష్టంగా వుండేది. రాత్రికి, పగలుకు తేడా కూడా తెలిసేదికాదు నాకు. ప్రపంచం పట్టేది కాదు. దేహస్ఫురణ వుండేది కాదు."

వెంకట్రామన్ తిరువణ్ణామలై వచ్చిన మర్నాడు వేయికాళ్ళ మండపంలో తిరుగుతూ వుండగా, ఒక మౌనస్వామి చూసి, జాలి

పడి, కొంచెం అన్నం తెప్పించి పెట్టారు. అది భిక్షాన్నం. ఉప్పుడు బియ్యం అన్నం. అన్నంలో కొంచెం ఉప్పు, పుల్లటి నీళ్ళు పోసుకుని తిన్నాడు. నంజుకునేందుకు ఊరగాయ ముక్క వుంది. అదే అతని మొదటి భిక్ష.

ఆ తర్వాత వెంకట్రామన్ అరుణాచలేశ్వరాలయంలో వున్న పెద్ద విప్పచెట్టు కింద కూర్చున్నాడు. ఆ ఆలయంలో నాట్యం చేసే ఇరవై ఏళ్ళ దేవదాసి రత్తమ్మ వెంకట్రామన్ని చూసి, భక్తి భావం కలిగి, ఇంటికి వెళ్ళి, తల్లితో చెప్పి, అన్నం తీసుకొచ్చి, అతని నోట్లో బలవంతంగా పెట్టింది. ఆ తర్వాత అతనికి రోజూ ఆ విధంగా అన్నం పెట్టాలనుకుంది. కాని, ఎవరో ఒకరు సహాయం లేనిది అంత మనిషిని కదిపి, అన్నం తినిపించడం ఆమెకు సాధ్యం కాలేదు. చివరికి ఏదో విధంగా ఆమె అతనికి అన్నం పెట్టేది. అతను తరచు స్థలాలు మారడం వల్లా, ఇతరుల సహాయం కావలసిరావడం వల్లా ఆమె అతనికి అన్నంపెట్టడం కుదరలేదు. కాని, క్రమంగా రత్తమ్మ కులవృత్తి మానేసి, ఒకరితోనేవుండి, తర్వాత పెళ్ళి చేసుకుని, జీవితంలో స్థిరపడింది.

వెంకట్రామన్ చాలావరకు కళ్ళు మూసుకునే వుండేవాడు. చూసినవారు అతనేదో తీవ్ర సాధన చేస్తున్నాడనుకునేవారు. గొప్ప సాధన చేస్తే, బైటనుంచి తమలోకి ఏదో వచ్చిపడుతుందనుకుంటారు; కొందరు. అది వట్టి భ్రమ. సాధనలో విజయం సాధించామనీ అంటారు. ఏదో చేయగా తెలిసేది కాదు; ఆత్మ. ఏమీ చెయ్యక ఊరికే నిశ్చలంగా వున్నవారికే ఆత్మ సిద్ధించేది. అంటే, ఉన్న దాన్ని ఉన్నట్లుగా గ్రహించడమే, సాధన. దానికి జగద్భావం నశించాలి. చిత్తవృత్తి నిరోధన సాధనగా కలవారికే, మోక్షప్రాప్తి. ఆత్మ ఎప్పుడూ సిద్ధమే. కాని, మనకు అది తెలియదు. జగద్బుద్ధి దాన్ని కప్పడంచేత, ఆ విషయం మనకు అవగతం కాదు.

వెంకట్రామన్ కళ్లు మూసుకుని కూర్చుంటే, స్వామి సమాధి స్థితిలో వున్నారనేవారు. "సమాధి స్థితి" అంటే, ఒక విధమైన పారవశ్యం, లేక, మైమరపు. ఇంద్రియాలు నిశ్చేతనాలైనా వాటి ప్రవృత్తులు వుంటాయి. వెంకట్రామన్ సమాధిస్థితిలో వుండే మొదటి రోజుల్లో, ఒంటిమీద కౌపీనం ఒక్కటే వుండేది. కొన్నాళ్ళకు అది చీకి, చిరిగి, ఊడిపోయింది. ఆ సంగతి కూడా గమనించని స్థితిలో కొన్నాళ్లు వున్నాడు. ఒకసారి ఒళ్ళంతా పుళ్లుపడి, అవి చితికి, చీము కారి, కౌపీనం తడిచి, చీకి, చిరిగి వూడిపోయింది. అంతలో కార్తీక దీపోత్సవం వచ్చింది. స్వామి నగ్నంగా వుండటం ఒక సాధు చూసి, ఒక కొత్తబట్ట తెచ్చి, అతని ఒంటికి చుట్టబెట్టారు. ఎవరో ఒకరు తిండి పెట్టేవారు; ఆలయ ఆవరణలో అతను ఏ చెట్టు కింద అయినా కూర్చుంటే, అతని ఒళ్ళంతా దుమ్ముపట్టేది. ఆ దుమ్ము శీతాకాలం మంచుకు తడిచేది. తర్వాత, ఎండకు ఎండేది. ఆ విధంగా అతని ఒంటి మీద దుమ్ము అట్టకట్టి వుండేది. ఒక్కొసారి వెంకట్రామన్ చలికి తట్టుకోలేక ముడుచుకుని కూర్చునేవాడు.

వెంకట్రామన్ మాట్లాడకపోతే, స్వామి మౌనవ్రతం పూనారనుకున్నారు. కాని, అసలేం జరిగిందంటే, అంటూ భగవాన్ ఒకసారి ఇట్లా చెప్పారు : "నేను అరుణాచలేశ్వరాలయంలో వేయి కాళ్ళ మండపంలో ఉన్నప్పుడు, ఒక సాధు పక్కన కూర్చున్నాను. ఆయన నాకు భిక్షాన్నం పెట్టేవారు. గుంపుల నుంచీ, వారి ప్రశ్నల నుంచీ తప్పించుకునేందుకు ఆ సాధు మౌనవ్రతం పూనారు. ఆ పద్ధతి తాత్కాలిక అనుకూల పద్ధతిగా తోచి, నేనూ ఆ పద్ధతినే అనుకరించాను. అంతేకాని నేను మౌనవ్రతం పూనలేదు ఏనాడూ. ఊరికే మౌనంగా వుండేవాడిని. అవసరమైనప్పుడు మాట్లాడేవాడిని."

ఈ సృష్టికి మాటే మూలం. మనుష్యుల మధ్య సంబంధాన్ని తెలిపే కొక్కెమే మాట. కాని, మాట అసలు సత్యం కాదు. అది వాస్తవమూ కాదు. అలాగే, వాస్తవమూ మాట కాదు. మాట ఎప్పటికి, విషయం కాదు. మాటలు, వట్టి నిర్జీవ వస్తు సముదాయాలు. బ్రహ్మం తెలిసిన మౌని, నిరంతరం ఆత్మయందు రమిస్తాడు. అతనికి ఇతరములతో పని లేదు. మౌనం వహించాలనే ప్రమాణం, కేవలం ప్రమాణమే అవుతుంది. అది కొంతవరకే ధ్యానానికి ఉపయోగపడుతుంది. నోరు మూసి, మనసు చేత పనిచేయిస్తే, లాభమేముంది? నిజమైన ధ్యానంలో మనసు నిలిస్తే, ఇంక మాటల అవసరమేముంది? మౌనం కాక, మనో విజృంభణలేని ధ్యానమే, మౌనం. మాట, మౌనానికి భంగకారి. మౌనం, నిరహంకార స్థితిని ప్రకటిస్తుంది. మౌనమంటే, నిర్వ్యాపారత్వంకాదు. అలాగే మనిషి మొద్దు స్వరూపం దాల్చడం కాదు. తలంపులు మాని ఊరక ఉండటం కాదు. అది అవాఙ్మానస గోచరమైన స్థితి.

మౌనం నిరంతర భాషణ. ఆలోచనలు ఆగిన తర్వాత పరస్పర అవగాహన చేసుకోడానికి పనికివచ్చేభాష, మౌనం. అది విశ్వజనీనమైన భాష. అది ఆగని వాక్ప్రవాహం. మాటలు దానికి అడ్డు కట్టలు. వాక్కులు, అవాంతరాలు. మౌనం, శక్తివంతమైన భాష.

అంతులేని జనన - మరణాలకు అంతం, మౌనం. అటువంటి మౌనం, మూర్తివంతమైనదే వెంకట్రామన్. అంతే, అతనే మౌనం. అటువంటి మహర్షి, మౌన బోధ చేస్తారనేది ఉత్త అర్థంలేని సంగతి. ఎందుకంటే, మౌనం మౌనం ద్వారా మౌనాన్నిఎట్లా బోధిస్తుంది?

మౌనానందంలో ప్రశ్నలు, సమాధానాలు, సందేహాలు, సంశయాలు ఏమీ వుండవు. మౌనపులోతుల్లోమునిగి, వీలైనంతవరకు మౌనంగా వుండటమే జీవితంలో ముఖ్యమైన సంగతి. అదే ఆత్మనిష్ఠత్మ. అదే ఆత్మ విచారణ. కాని, సముద్రం పైన అలల అల్లకల్లోలంవలె సంగతులు, సంఘటనలు విషయాలు తన చుట్టూ జరుగుతూవుంటే వెంకట్రామన్ వాటికి కేవలం సాక్షిగా వుండేవాడు. ఎవరైనాసరే, ఆ స్థితిలోవున్న వారికి బాహ్య విషయాలన్నీ క్రమంగా నిస్సారమైనవిగా, తాత్కాలిక మైనవిగా తోచక మానవు.

మౌనమంటే, మాట్లాడక పోవడం కాదు. మనోవృత్తుల విజృంభణల్ని ఆపుజేయడం. మౌనం, ప్రపంచాన్ని నిరాకరించదు. కాని, ప్రపంచాన్ని గ్రహిస్తుంది, సహిస్తుంది, భరిస్తుంది, అనుభవిస్తుంది. ఆ మౌనమే, సత్యం - శివం - సుందరం. అదే ఆనందం, శాంతం. అదే ఆత్మం. అదే మోక్షం.

* * *

అహం లేనిదే ఆత్మ. అది సాక్షి మాత్రమే. అదే నీవు. అది పొందవలసింది గాదు. అసలు వున్నదీ, అది ఒక్కటే. ఇతర మెల్లా, భ్రాంతి. కావున, అనుక్షణం ఆత్మగా వుండటమే సాధన. "వుండు-వూరికే వుండు" అంటారు భగవాన్. అది చాలు. కాని, వూరికే వుండటానికి అడవులు, కొండలు, గుహలు, గదులు చేరవలసిన పని లేదు. నిత్య జీవన వ్యవహారాలన్నింటినీ సక్రమంగా చక్కబెట్టుకుంటూ, వుంటే చాలు. కాని, కర్తగా తాదాత్మ్యం మానుకోవాలి. కర్తృత్వ భావన లేకుండా పనిచేయడ మంటే,

కర్త లేని కర్మ. కర్తృత్వం నశించిన వెంకట్రామన్ ద్వారా జరిగేది, కర్మకాదు. అది కేవలం జడ చేష్ట. కర్త లేనప్పుడు, కర్మ ఎట్లా వుంటుంది?

అసలు వున్నది "సత్" ఒక్కటే. ఇంకేం లేదు. దాన్నించి "వ్యక్తి భావన" అదే "అహంకారం" పుడుతుంది. అది ఎండమావి వంటిది. ఆ తలపుల మధ్య, వ్యక్తి కొనసాగుతాడు. ఆ తలపులు రూపు గొన్నదే, జగత్తు. ఆ తలపుల ప్రవాహంలో సమస్తం క్షణంలో కనుపించి, మరుక్షణంలో మాయమౌతుంది. అవన్నీ ఆత్మవ్యక్త రూపాలు. గనుక, ఆత్మకు అన్యంగా ఏదీలేదు. ఆ సంగతి అనుభవంలోకి తెచ్చుకోవడానికే సాధన. అన్ని పేర్లూ, ఆత్మకు మారు పేర్లు. ఆత్మ- దైవం- మంత్రం- కుండలిని- ఏది తీసుకుని సాధన చేసినా, ఆత్మే దర్శన మిస్తుంది. మనః పరిణతినిబట్టి ఆత్మయే వెలిగా, గురువుగా వ్యక్తమౌతుంది. ఆ గురువు అనుగ్రహంవల్ల స్వాత్మయే, సత్తనీ, దానికి అన్యంగా ఏదీ లేదనీ తెలుసుకుంటాడు సాధకుడు.

•

అహం మూలాన్వేషణ సాధనలో, భగవాన్ చెప్పే పద్ధతి చాలా సులభమైనది. ఆ సాధనా విధానంలో కాలాన్ని వృధాచేసే నియమాలు, నిష్ఠలు, ఆచార - వ్యవహారాలు, పద్ధతులు. సాంప్రదాయాలు - ఏమీ లేవు. దేహాన్ని యాతన పెట్టి, దాన్ని శుష్కింపచేసే యోగవిధానమూ కాదు. అది ప్రాణాయామమూ కాదు. అంతులేని మంత్రజపంకాదు. స్తుతి గీతాలాపన, గ్రంథపఠనం కాదు. కాని, అది సహజమైన, నిజమైన లోదృష్టితో కూడిన అన్వేషణ. తన గురించి బాహ్యంగా, ఆంతరంగికంగా - అన్ని విషయాలతో, సమస్యలతో సంపూర్ణంగా ప్రతి ఆలోచననూ అది ఎక్కడనుంచి పుడుతోందో ఆ మూలాన్ని అన్వేషించడం.

"నేను" అనేది మొదటి ఆలోచన. అదే "అహం" అయితే "ఆ నేను ఎవరు? అసలు ఆ నేను ఏమిటి?" అనేదే అన్వేషణ. "నేనెవరు?" అనే ప్రశ్నకు అర్థమేమిటంటే, "అహంమూలం ఏమిటి?" అని. నిజం చెప్పాలంటే, "నే నెవరు?" అనే ప్రశ్నకు సమాధానం లేదు. ఎందుకంటే, "నే నెవరు?" అని నిజంగా ప్రశ్న లోపల్నించి రావడమే, అన్వేషణకు సరైన సమాధానం.

అహం అనేది మొదటినుంచీ, మనలో చాలా గట్టిగా, లోతుగా పాతుకుని వుంటుంది. ఆ అహం, నిరంతరం శ్రమించి,నలిగి, బాధలు పడి, తనకో ప్రత్యేక స్థానం అంటే, తన కాళ్ళపై తాను నిలిచేశక్తి, సామర్థ్యం సంపాదించుకుంటుంది. అటువంటి అహం, మనం అనుకున్నంత తేలికగా, తొందరగా అంతంకావడానికి ఎంత సాధన చెయ్యాలో! ఆ విధంగా స్థిరపడిన అహం, తాను ఓడిపోయి, నిర్జీవమై, నిర్వీర్యమై పోవడానికి ఒప్పుకుంటుందా? బికారి కావడానికి అది అంగీకరిస్తుందా? అందుచేత చివరి వరకు ఆ అహం తన హక్కునూ. అధికారాన్నీ నిలుపుకోవడానికే చూస్తుంది.

"సాధన" అంటే, వికాసంతోకూడిన ఒక సజీవమైన సంగతి. ఎదుగుదల, పెరుగుదలతో కూడిన విషయమది. మొగ్గ, పువ్వుగా విచ్చుకున్నట్లు, జీవుడు, ఈశ్వరుడుగా ఎదగడం. మొగ్గ, సూర్యుని వైపు తిరగడం వంటిది సాధన. అంటే, జీవుడు ఈశ్వరునివైపు దృష్టి మరల్చడం.

అటువంటి సాధన లక్ష్యం, మనో నాశనం కాక మనోలయం కోసమై వుండాలి. తాత్కాలికంగా ఆలోచనల్ని ఆపుజేసేయత్నమే, ఏకాగ్రత. ఆ ఏకాగ్రత సాధనలో ఒక్కొసారి సమాధి స్థితి వరకు వెళ్ళినా, మళ్ళా, మామూలు స్థితికి రాగానే పూర్వం మాదిరిగా కంటే, మరింత వేగంగా, తీవ్రంగా, శక్తివంతంగా ఆలోచనలు ముసురుకుంటాయి.

సాధన సక్రమంగా సాగాలంటే, ఏకాగ్రత, వైరాగ్యం, అనాసక్తత అవసరం. దానికి సాత్వికాహారం ముఖ్యం. ఆసక్తి, మమకారం, ఇష్టం, పరధ్యానం మొదలైనవి సాధనకు అవరోధాలు. కనుక "నే నెవరిని?" అనే ప్రశ్న పదే, పదే వేసుకో నవసరం లేదు. నిజంగా ఒక్కసారి లోపల్నించి గట్టిగా ప్రశ్నించుకుని, ఏకాగ్ర చిత్తంతో అహం మూలాన్ని కనుక్కోగలిగితే, ఇంక ప్రాణాయామం వంటి సాధనలతో పనిలేదు. ఎందుకంటే ప్రాణాయామం, పరిగెత్తే గుర్రానికి కళ్ళెం వంటిది. ఆలోచనా చక్రాలకు "బ్రేక్స్" వంటిది. కాని, ప్రాణాయామం, ఏకాగ్రతకు మాత్రమే ఉపయోగపడుతుంది. ఏకత్వాన్ని పొందేందుకు అనుసరించే పద్ధతులలో అదొకటి. చెడ తిరిగే మనసును, నిశ్చలంచేయడానికీ, ఏకత్వాన్ని పొందడానికి ప్రాణాయామం సహాయపడుతుంది. ప్రాణాయామం సహాయంతో మనసును అదుపులో పెట్టుకోవడం సాధ్యమైన తర్వాత, ఒకటి - రెండు అనుభవాలు కలిగాయనే తృప్తితో సాధన ఆపేయకూడదు. మనసు, ఆత్మలో లయమయ్యే వరకు, సాధన చేయవలసిందే!

సాధనా ఫలితంగా పరిపక్వమైన తర్వాత ఒకేసారిగా జ్ఞానం కలుగుతుంది. అంటే, "జ్ఞానం" అనేది కొంచెం కొంచెంగా కలగడం అంటూవుండదు. ఒకేసారి సంపూర్ణంగా కలిగిన జ్ఞానం, మరల తొలగదు. అదే వెంకట్రామన్ విషయంలో జరిగింది.

లక్ష్యం చేరేందుకు సరైన, సూటైన మార్గం 'నేనెవరను' అను విచార మార్గం, కనుపిస్తూ వుంటే, అనవసరంగా అన్నిదార్లూ తిరిగి, కాలయాపన చేయడం మూర్ఖం. ఆ విషయంలో ఒకరు భగవాన్ని అడిగారు, అన్నిదారులూ, ఆలయానికే తీసుకుపోతా యంటారు. మీరు "నేనెవరను" అను విచారమార్గం ఒక్కటే సూటైనది అంటారేమిటి?" అని. దానికి భగవాన్, "అవును, అన్ని దారులూ ఆలయానికే తీసుకుపోయినా, నేనెందుకు ఇదొక్కటే

సూక్ష్మమైనదని అంటున్నానంటే, ఈ మార్గం సరాసరి గర్భాలయానికి తీసుకుపోతుంది. నీకు సత్య సందర్శన భాగ్యాన్ని కలిగిస్తుంది, అన్నారు.

మూలాన్ని చేరాక, అక్కడ "లోపలా-బైటా" అనేవి వుండవు. ఎందుకంటే, మూలమే, ఆత్మ. అది అంతటా, ఒకటిగా- తానుగా ఆక్రమించి వుంది. అసలు సత్యం తెలిశాక, అంతా, అన్నీ ఆత్మలోనే వున్నాయనే గ్రహింపు కలుగుతుంది. వెంకట్రామన్ ఆ పరమసత్యం తెలుసుకుని, ఆత్మనిష్ఠుడైనాడు.

వెంకట్రామన్ తిరువణ్ణామలై వచ్చేప్పటికి, అక్కడ "శేషాద్రి స్వామి" అనే మహాత్ములు ఉన్నారు. ఆయన 1870లో, వందవాసి తాలూకా "వంజూరు"లో జన్మించారు. ఆయన చిన్నప్పుడే, తల్లి - తండ్రి - నా అన్నవారంతాపోయారు. కాని, ఆయన పన్నెండేళ్ళకు ముందే ఎన్నో గ్రంథాల్ని, పురాణాల్ని, శాస్త్రాల్ని చదివారు. ఆ తర్వాత సంగీతం, సాహిత్యం, వ్యాకరణం, జ్యోతిషం మొదలైన శాస్త్రాల్లో మంచి పాండిత్యం, ప్రావీణ్యత సంపాదించారు. ఆయనకు శ్లోకరచన, పాట కట్టడం ఆటవంటివి. కంచి కామాక్షి, ఆయన ఇష్ట దేవత. పన్నెండవ ఏట ఇల్లు వదలి, దేశదిమ్మరై, యోగాభ్యాసం చేసి, తాంత్రిక విద్యలు కూడా నేర్చి, పదిహేడవ ఏట మంత్ర దీక్ష తీసుకుని, వాటిల్లో పరిపూర్ణులైనారు. ఎన్నో అద్భుతశక్తుల్ని సంపాదించారు.

1890 లో, తిరువణ్ణామలై వచ్చి, పిచ్చి అభినయించి, ప్రజల్ని తప్పించుకు తిరిగేవారు, మురికి బట్టలతో మిఠాయి దుకాణాల్లో పడి తిని, కొంత పిల్లలకు పంచి, కొంత పిట్టలకు విసిరేసే వారు. అదంతా అల్లరిగా కాక, తమపై అనుగ్రహంగా భావించే వారు, ఆ వర్తకులు. కాని, ఆయన నియమం లేకుండా చేసే కొన్ని పనులు, కొందరికి కంటకంగా వుండేవి. ఆయన విషయం ఏమీ తెలియక, తికమకపడి, "అంతటి యోగి పుంగవులు అట్లా ప్రవర్తిస్తున్నా రేమిటి?" అని కొందరు గొడవ పడేవారు. ఒక్కోసారి కుక్కలతో కలిసి వీధుల్లో తినేవారు. దుమ్ములో పడుకునేవారు. ఊరికే చొప్పదంటు ప్రశ్నలు వేసేవాళ్ళనూ, భక్తి - శ్రద్ధలు లేకుండా తనను అనుసరించే వాళ్ళనూ, తిట్టి, కొట్టి తరిమేవారు. వెంకట్రామన్ వేయికాళ్ళ మండపంలో వున్నప్పుడు, అల్లరి పిల్లలు అతనిపై రాళ్ళు రువ్వేవారు. ఆ సంగతి శేషాద్రి స్వామికి తెలిసి,

అక్కడకు వెళ్ళి, పిల్లల్ని తరిమి, వెంకట్రామన్ని చూసి, "ఇతను అసామాన్య ఋషి," అని గుర్తించి, ఆ క్షణంనుంచి అతని విషయమై శ్రద్ధ వహించి, పిల్లల బారినుంచి ఆదుకున్నారు.

అల్లరి పిల్లలకు శేషాద్రిస్వామి తెలుసు గనుక, వెంకట్రామన్ని, "చిన్న శేషాద్రి, లేక బ్రాహ్మణస్వామి" అని పిలిచేవారు. శేషాద్రిస్వామి ఎంత కనిపెట్టి వెంకట్రామన్ని చూస్తున్నప్పటికీ, అల్లరి పిల్లలు అతనిపై రాళ్ళు రువ్వడం మానలేదు. అందుచేత బ్రాహ్మణ స్వామి "పాతాళలింగం" ఆలయానికి వెళ్ళి కూర్చున్నారు. అది వేయికాళ్ళ మండపంలో ఒక భాగం. అది భూగర్భ ఆలయం. అది ఒక మహాత్ముని సమాధి. దానిపైనే వేయికాళ్ళ మండపం నిర్మించబడింది అంటారు. అదిఏళ్ళ తరబడి సంస్కార రహితంగా వుంది. ఆ ఆలయం భూగర్భంలో వుండటంచేత చీకటిగా, నేల తేమగా వుంది. అందు తేళ్ళు, జెర్రులు, చీమలు, దోమలు, పురుగులు చేరి, బ్రాహ్మణ స్వామి ఒళ్ళంతా కరిచాయి. దానితో ఆయన ఒళ్ళు, పుళ్ళు పడింది. అయినా ఆయన అక్కడ నుంచి కదలలేదు. ఆ పుళ్ళతాలూకు మచ్చలు ఆయన ఒంటి మీద చాలా కాలం వున్నాయి. ఆ రోజుల్లో వేయికాళ్ళ మండపంలో ఒక ఏనుగు మాత్రమే వెంకట్రామన్‌కి తోడుగా వుండేది. ఆయన దుర్భర స్థితి చూసిన రత్నమ్మాళ్, ఆయన్ని తన ఇంటికి రమ్మని ఎంతో బ్రతిమాలింది. ఆమె మాట ఆయన విన్నట్టు లేరు. ఆమెను కన్నెత్తి చూడలేదు. ఆమె పెట్టింది తినలేదు. చేసేది లేక ఆమె ఒక శుభ్రమైన బట్ట ఆయన చుట్టూ పరచి వెళ్ళిపోయింది.

శేషాద్రిస్వామి వెంకట్రామన్ స్థితి చూసి, వెంకటాచల మొదలియార్‌తో, "పాతాళలింగ ఆలయంలో ఒక స్వామి ఘోర తపస్సు చేస్తున్నారు," అని చెప్పగా, ఆయన తక్షణం అక్కడకు వెళ్ళి, స్వామి పరిస్థితి చూసి, కొందర్ని పిలుచుకునివచ్చి, స్వామిని

చేతులమీద బైటికి తెచ్చి, సుబ్రహ్మణ్యస్వామి ఆలయం దగ్గర కూర్చోబెట్టారు. స్వామి అక్కడ రెండు నెలలున్నారు. స్నానంలేక ఒళ్ళంతా దుమ్ముపట్టి, మురికికంపు కొట్టేది. ఎందరో భక్తులు, యాత్రికులు వచ్చి, వెంకట్రామన్ని చూసి, ఏదో ఒక పదార్థం బలవంతంగా నోట్లో పెట్టి వెళ్ళేవారు.

ఒకాయన రోజూ అరుణాచలేశ్వరాలయానికి వచ్చి, ఈశ్వర దర్శనం చేసుకుని, తిరిగి వెళ్ళేప్పుడు కాస్సేపు బ్రాహ్మణస్వామి చెంత తప్పని సరిగా కూర్చునేవారు. ఆయన తిరువణ్ణామలైలో మంచి పలుకుబడిగల వ్యక్తి. రుద్రాక్షలు, విభూతిరేఖలతో గంభీరంగా వుండేవారు. ఆయన ఎప్పుడూ స్వామిని పలకరించ లేదు. కాని, ఒక రోజున తన ఇంట ఉన్నతోద్యోగులకు గొప్ప విందు ఏర్పాటు చేసి, ఆ విందుకు బ్రాహ్మణస్వామిని కూడా ఆహ్వానించాలనుకున్నారు. ఆయన స్వామి దగ్గరకు వెళ్ళి, "ఇవాళ కొంతసేపు యోగం, తపస్సు ఆపి, మా ఇంటికి భోజనానికి రండి" అన్నారు, చాలా చనువుగా, ఆప్యాయంగా, ప్రేమగా. దానికి స్వామి, రానన్నట్లు తల వూపారు. ఆయన అది గమనించక, స్వామి చెయ్యి పట్టుకుని, బలవంతంగా ఇంటికి తీసుకుని వెళ్ళి, భోజనం వడ్డించి, తనకు తృప్తిగా తినే వరకు స్వామిని వదలలేదు. స్వామికి ప్రేమతో అటువంటి బలవంతపు భోజనాలు ఈశాన్య మఠాధిపతులూ పెట్టారు.

ఆ రోజుల్లో అరుణాచలేశ్వరాలయ ఆవరణలో ఒక మౌన స్వామి వుండేవారు. ఆయన బ్రాహ్మణ స్వామి విషయంలో శ్రద్ధ తీసుకుని, ఉమాదేవిని అభిషేకించిన పంచామృతాన్ని రోజూ ఓ గ్లాసుడు తీసుకొచ్చి, స్వామికి ఇచ్చేవారు. ఆలయ అర్చకులు అది చూసి, ఆ పంచామృతంలో కర్పూరం వగైరా కలుస్తాయని చెప్పి, ఆ తర్వాత స్వామికి స్వచ్ఛమైన పాలు ఇచ్చే ఏర్పాటు చేశారు.

బ్రాహ్మణస్వామి అక్కడనుంచి ఆలయ ఆవరణలోనే వున్న పూలతోటలోకి మకాం మార్చారు. ఆయన ఎక్కడ వున్నా, సమాధి స్థితి వదలలేదు. సమాధి స్థితి అంటే, పరిగెత్తే గుర్రం ఆగడం. అది మళ్ళా ఏ క్షణాన్నయినా కదిలి, పరిగెత్తడానికి సిద్ధంగా వుండటం. సమాధి స్థితిలో ఇంద్రియాలు మామూలుగా వుంటాయి కాని, చైతన్య-శూన్యంగా వుంటాయి. ఇంద్రియాలు చీకటిలో కలసి నప్పటి స్థితి - నిద్రావస్థ. ఇంద్రియాలు వెలుగులో కలసినప్పటి స్థితి, సమాధి స్థితి.

సమాధి స్థితి అంటే, దేహాత్మబుద్ధిని అధిగమించడం. ఎందు కంటే, దేహాత్మబుద్ధే; సర్వానర్థహేతువైన బంధం. అది ఆత్మను కప్పుతుంది. కనుక వివేకి ఆత్మానాత్మ వివేచనం చేస్తాడు. దానిచే అనంత స్వరూపమైన తనను తెలుసుకుని, పరమానందం పొందు తాడు.

సమాధి స్థితి, నిద్రావస్థకు భిన్నమైన స్థితి. దేహం, దాని సహజ ఎరుకా, రెండూ కలసినటువంటి స్థితిలో వున్నవారికే, ఆత్మ అవగతమౌతుంది. "దాన్నే నిర్వికల్ప సమాధి" అంటారు. అంటే, వాస్తవంలో లీనమై, ప్రపంచానికి ఎరుకలో లేకపోవడం. అటువంటి స్థితిలో వున్నవారు ఇంకా ఏం కావాలని వాంఛించి ధ్యానాదులు, తపస్సు చేస్తారు? వారు ఏం చేసినా ప్రజలకూ,

సమస్త ప్రాణికోటికి ఇంకా, ఇంకా శక్తినీ, శాంతినీ, ఆనందాన్ని, అభివృద్ధిని, వికాసాన్ని ఇవ్వడానికే ఏదో ఒకటి చేస్తారు. అంతే, వారు తమ ముందు తామే తపస్సో, ధ్యానమో చేస్తున్నట్లు వుంటుంది.

వెంకట్రామన్ పూలతోటలోంచి వాహనాల హాలులోకి మకాం మార్చారు. అంతలో కార్తికదీపం వచ్చింది. దీప దర్శనానికి దేశం నలుమూలలనుంచీ భక్తులూ, యాత్రికులూ, సాధువులు, సన్యాసులు, యోగులు, బైరాగులు వేల సంఖ్యలో వచ్చారు. వాళ్ళంతా స్వామి దర్శనం చేసుకున్నారు. గుంపులు మరీ విపరీతమైనాయి. వాటిని అదుపులో పెట్టడానికి స్థూలకాయుడైన "ఉద్దండి నాయనార్" అనే ఆయన పూనుకున్నారు.

ఉద్దండి నాయనార్ తిరుమణి గ్రామవాసి. ఆయన గొప్ప పండితుడు, దైవభక్తుడు, జిజ్ఞాసువు. వేదాంత గ్రంథాలన్నీ చదివినా ఆయనకు కోరిన శాంతి లభించలేదు. 1896లో ఆధ్యాత్మిక సాధన నిమిత్తం తిరువణ్ణామలై వచ్చి, అరుణాచలేశ్వర ఆలయంలో ప్రదక్షిణం చేస్తూ వుండగా, విప్పచెట్టు కింద తదేక ధ్యానంలో కూర్చున్న బ్రాహ్మణస్వామిని చూసి, "ఈయన్ని సేవిస్తే, ఆత్మోపలబ్ధి అగును" అని అనుకుని, ఆ క్షణం నుంచి ఆయన భక్తులై, సేవచేసుకోనారంభించారు. ఆయనే స్వామికి ప్రథమ పరిచారకులు. ఒకసారి భగవాన్ నాయనార్ గురించి మాట్లాడుతూ, "ఉద్దండి నాయనార్, వైరాగ్యమూర్తి" అన్నారు.

నాయనార్‌కు మొదట్లో స్వామినుంచి దీక్ష తీసుకుని, ఉపదేశం పొందాలనే ఆశ వుండేది. కాని, స్వామి మౌనంగా వుండేవారు. స్వామి ఎప్పుడూ సమాధి స్థితిలో వుండటం చేత, వారిమౌన వ్రత భంగం చేయడం ఇష్టంలేక, ఆధ్యాత్మిక పఠనంతో కాలం గడిపేవారు, నాయనార్. స్వామి ఎప్పుడూ ఆయనతో ఏ విషయంలోనూ మాట్లాడ లేదు.

బ్రాహ్మణస్వామి కీర్తి రోజురోజుకీ వ్యాప్తిచెందింది. ఆరోజుల్లో తిరువణ్ణామలై "అన్నామలై తంబిరాన్" అనేఆయన కఠిన నియమాలు పాటిస్తో, నగరమంతా తిరిగి, తేవారాలు పాడుతూ, (తేవారాలంటే- సుందర మూర్తి, మాణిక్య వాచకర్, అప్పర్ - మొదలైన మహాత్ములు రచించిన శైవగీతాలు) భిచ్చ మెత్తుకుంటో కాలక్షేపం చేసేవారు. ఆయన ఒక రోజున బ్రాహ్మణ స్వామిని చూసి, ఆకర్షితులై సాష్టాంగ నమస్కారం చేశారు. ఆనాటినుంచి ఆయన రోజూ స్వామి దర్శనం చేసుకుంటో. భిక్షాటన చేసి, ఆ పదార్థాల్లోంచి కొంత స్వామికి పెట్టే వారు. ఆ విధంగా స్వామికి ఇద్దరు పరిచారకులు ఏర్పడ్డారు..

తిరువణ్ణామలైకి దక్షిణదిశనున్న "గురుమూర్తం" అనేమఠం యజమాని బ్రాహ్మణస్వామి సంగతి విని, ఆయన తమ మఠంలో వుంటే బాగా డబ్బు సంపాదించవొచ్చునని ఆశించి, ఉద్దండి నాయనార్‌తో సంప్రదించగా "అయ్యా, నేను ఎప్పుడూ స్వామితో మాట్లాడలేదు," అన్నారు.కాని, అన్నామలై తంబిరాన్ ఆ విషయంలో కలగజేసుకుని, స్వామితో "స్వామీ, గురుమూర్తం తపస్సుకు అన్ని విధాలా అనుకూలంగా వుంటుంది. కనుక తమరు మకాం అక్కడకు మారిస్తే బావుంటుందని కోరుతున్నాం" అన్నారు. దానికి స్వామి అంగీకరించారు. అన్నీ వదలి వచ్చిన భక్తులకు, సాధకులకు అటు వంటి ఆలోచనలు కలగటం శోచనీయం.

1897 ఫిబ్రవరిలో బ్రాహ్మణస్వామి, ఉద్దండి నాయనార్, తంబిరాన్ ముగ్గురూ గురుమూర్తం చేరుకున్నారు. అది ఒక చిన్న ఆలయం. దైవశిఖామణి దేశికుని సమాధిపై కట్టిన ఆలయమది. అన్నామలై తంబిరాన్ ఆ ఆలయంలో నియమంగా పూజలు చేసేవారు. భిక్షాన్నం పేదలకు పెట్టేవారు. గురుమూర్తం వెళ్ళినా స్వామి జీవన విధానంలో మార్పు లేదు. నేల తేమగా వున్నా, చీమలు, చెదలు కుట్టినా, ఆయన లక్ష్యం చెదరలేదు.

స్వామి జుట్టు క్రమంగా జడలు కట్టుకుపోయింది. గోళ్లు విపరీతంగా పెరిగాయి. వర్షాకాలం కారణంగా నేల మరీ తేమగా వుంటోందని, స్వామి కూర్చునేందుకు ఒక పీట వేశారు. ఆయన పీటమీద కూర్చుని, గోడకు ఆనుకునేవారు. కదలక దీర్ఘ కాలం కూర్చోవడం వల్ల, గోడమీద నల్ల మచ్చ పడింది. ఆ మచ్చ చాలాకాలం వరకు అట్లానే వుంది. కొందరు ఆయన్ని "గురుమూర్తం స్వామి" అని పిలిచేవారు.

ఒక రోజున తంబిరాన్ స్వామికి దండలు వేసి, గంధంపూసి, మంత్రాలు చదివి, హారతి ఇచ్చారు. విగ్రహానికి పూజ చేసినట్లు చేశారు. ఆ మర్నాడు స్వామి తాను ఆనుకుని కూర్చునే గోడ మీద "దీనికి ఈ సేవలు చాలు," అని తమిళంలో రాశారు. అది చూసి స్వామికి తమిళం తెలుసునని అందరూ సంతోషించారు.

స్వామి దర్శనార్థం రోజూ ఎందరో భక్తులు, యాత్రికులు గురుమూర్తం వచ్చేవారు. ప్రసాదాలు, పళ్లూ తెచ్చేవారు. ఆ ప్రసాదాలన్నింటినీ కలిపి స్వామి ముందు పెడితే, వాటిల్లోంచి ఓ పిడికెడు తీసుకునేవారు. జనం రద్దీ ఎక్కువయ్యేకొద్దీ, స్వామి చుట్టూ కర్రలతో అడ్డు కట్టారు.

ఒక వారం రోజుల్లో తిరిగి వస్తానని తంబిరాన్ ఎక్కడికో వెళ్ళారు. ఆయన వెళ్లిన కొన్ని రోజులకు నాయనార్‌కు స్వగ్రామం నుంచి పిలుపు వచ్చింది, వెంటనే రమ్మని. స్వామిని వదిలేసి ఆయనా వెళ్ళిపోయాడు. భక్తులు ఎక్కువ కావడంవల్ల, స్వామికి ఎవరో ఒకరు భోజనం పెట్టేవారు. కాని, గుంపుల నుంచి స్వామిని తప్పించడమే సమస్య అయింది. మల - మూత్ర విసర్జనకు తప్ప, స్వామి కదిలేవారు కాదు. ఎప్పుడూ సమాధి స్థితిలో వుండేవారు. భక్తులు ఎక్కువయ్యారే కాని, నిలిచి స్వామి సేవ చేసేవారు లేరు.

ఆ రోజుల్లో అయ్యంగులం వీధిలో వున్న విఘ్నేశ్వరుని భక్తి, శ్రద్ధలతో సేవిస్తో "పలనిస్వామి" అనే మలయాళీ సాధు వుండేవారు. ఆయన శుద్ధభక్తుడు. సరళ విశ్వాసి. ఉప్పు కలవని పదార్థం గణపతికి నైవేద్యంగా పెట్టి, తాను రోజుకో పూట భోజనం చేసేవారు. ఆయనకు తమిళం కొంచెం తెలుసు. అందుచేత తమిళం లోని అక్షరాలు కూడబలుక్కుని, పుస్తకాలు చదివేవారు.

ఒకరోజున శ్రీనివాస అయ్యంగార్ పలనిస్వామితో "ఈ రాతి దేవుణ్ణి కొలుస్తావెందుకు? గురుమూర్తంలో రక్త - మాంసాదులతో, సజీవ చైతన్యంతో వెలిగిపోతున్న యువకుడైన స్వామి వున్నారు; పురాణాల్లో ధ్రువుడు వలె తపస్సు చేసుకుంటో. వెళ్ళి, ఆయన్ని సేవించి, తరించు" అన్నారు. అదే మాట ఆ తర్వాత చాలామంది మిత్రులు, హితులు అనడంతో పలనిస్వామి వెళ్ళి స్వామి దర్శనం చేసుకుని, ఆయన సేవకు కుదిరారు. "నీ పూర్వజన్మ ఫలం మంచిది. స్వామి సేవ చేసుకో!" అన్న మిత్రుల మాట ఫలించింది. ఆ రోజు నుంచి ఆమరణాంతం ఆయన స్వామి నీడగా, స్వామే - తల్లి, తండ్రీ, గురువు, దైవం, సఖుడు, సమస్తంగా ఎంచి, అచంచల విశ్వాసంతో సేవ చేసి, తరించిన అదృష్టవంతుడు పలనిస్వామి.

పలనిస్వామి ఊళ్ళోకి వెళ్లేముందు సామిని గుడిలో వుంచి, బైట తాళం వేసి వెళ్ళేవారు. ఊళ్లోంచి వస్తో కైవల్య నవనీతం, వేదాంత చూడామణి, వాసిష్ఠం - మొదలైన గ్రంథాలు తెచ్చి, వాటిని స్వామికి చదివి, వినిపించేవారు. అప్పటికి స్వామికి పెరియ పురాణం తప్ప, మరే ఇతర గ్రంథ పరిచయమూ లేదు.

ఆ రోజుల్లో స్వామి పూర్తి ఉపేక్షాభావంతో వుండేవారు. ముఖ్యంగా దేహం విషయంలో. ఒంటికి స్నానం లేదు. దేహ పోషణ విషయంలో శ్రద్ధ, ఆసక్తి లేదు. "యోగసిద్ధివల్ల స్వామి అట్లా చిన్నగా కనుపిస్తున్నారు గాని, ఆయన వయసులో చాలా

పెద్దవారు" అనుకునేవారు కొందరు. కదలక స్థిరంగా ఒకే చోట కూర్చోవడం వల్ల, క్రమంగా స్వామి దేహం క్షీణించింది. నడకే కష్టమైంది. అది చూసి పళనిస్వామి ఆయన్ని పట్టుకోబోతే, "నన్నెందుకు పట్టుకుంటారు?" అనేవారు.

తిరువణ్ణామలై తాలూకా ఆఫీసు హెడ్ ఎకౌంటెంట్ వెంకట్రామయ్యర్ స్వామి శిష్యులై రోజూ గురుమూర్తం వెళ్ళి, దర్శనం చేసుకునేవారు. ఒక రోజున స్వామి కూర్చున్న చోటున గోడమీద స్వామి తమిళంలో వ్రాసినది చదివి, ఓ కాగితం పెన్సిల్ స్వామి చేతికి ఇస్తో, "తమ పేరూ - ఊరూ రాయండి" అని అడిగారు. స్వామి మాట్లాడకపోయేటప్పటికి, రాయమని ఆయన ప్రేమగా బ్రతిమాలుతూ అడిగారు. అయినా స్వామి ఏమీ రాయలేదు. "మీ నుంచి సమాధానం రాకపోతే, నేను తిండి తినను," అన్నారాయన.

స్వామి కాగితం - పెన్సిల్ తీసుకుని, పళనిస్వామి తెచ్చిన పెరియ పురాణం ఒత్తుగా పెట్టుకుని, తన పేరు, ఊరు ఇంగ్లీషులో రాశారు. "తిరుచ్చుళి" లోని "ళ" అక్షర వర్ణక్రమం ఇంగ్లీషులో రాసినది వెంకట్రామయ్యర్‌కు అర్థం కాలేదు. స్వామి ఆ సంగతి గమనించి, పెరియపురాణంతెరచి, అందులో సుందరమూర్తి తిరుచ్చుళి గురించి రాసినభాగం చూపించారు. అది చూసి, స్వామి సామాన్యులు కారని గ్రహించారు వెంకట్రామయ్యర్.

గురుమూర్తానికి దగ్గరలో ఒక మామిడితోట వుంది. ఆ తోట యజమాని - వెంకట్రామనాయకర్ స్వామిని తన మామిడితోటలో వుండవలసినదిగా కోరారు. అతని కోర్కె ప్రకారం స్వామి 1897-మే- నెలలో మామిడితోటలోకి మకాం మార్చారు. స్వామి అనుమతి

లేనిదేఎవరినీ కుటీరంలోకి ప్రవేశింపనీయరాదని ఆయన తోటమాలితో గట్టిగాచెప్పారు. ఆ మామిడితోటలో స్వామి, పలనిస్వామి గ్రంథాలు చదువుకుంటూ కాలక్షేపం చేసేవారు.

ఒక రోజున స్వామి ఒక చింతచెట్టుకింద కూర్చున్నారు. అది చింతలతోపు. ఆ సంవత్సరం ఆ చెట్లన్నీ విరివిగా కాసి, పండి, సిద్ధంగా వున్నాయి. ఎవరూ లేని సమయం చూసి, కొందరు దొంగలు తోపులో ప్రవేశించి, స్వామిని చూసి, మొదట భయపడి తర్వాత "ఇతని కంటిలో ఇంత కారం కొట్టి మన పని మనం కానిద్దాం" అనుకున్నారు. ఆ మాటలు స్వామికి వినిపించాయి. కాని, ఆయనేమీ చలించలేదు. వారిలో ఒకడు "ఇతని గురించి ఇంత గొడవ పడతారెందుకు? ఇతను మనకేమీ అపకారం చేయడు. మన పని త్వరగా ముగించండి," అని వచ్చిన పని పూర్తిచేసుకుని వెళ్ళారు ఆ దొంగలు.

వెంకట్రామన్ ఎవరికీ, ఏమీ చెప్పకుండా ఇంట్లోంచి వెళ్ళి పోయినందుకు, అన్న నాగస్వామి, పినతండ్రి సుబ్బయ్యర్ చాలా గొడవ పడి, మానామధురలో వుంటున్న అలఘమ్మకు టెలిగ్రాం ఇచ్చారు. ఆ వార్తవిని ఆమె ఎంతో రోదించింది. మరదుల్ని అనేక చోట్లకు పంపించి వెంకట్రామన్ని వెదికించింది. క్రూరమైన విధి, తిరుగులేని సాధుశాపం, కుటుంబ విచ్ఛిత్తికి దారితీసిందని విలపించింది. వెంకట్రామన్ని వెదకడానికి వెళ్ళిన వారంతా నిరాశతో తిరిగి వచ్చారు. అలఘమ్మ బ్రతుకు శూన్యమైపోయింది. జీవితమే వ్యర్థంగా తోచింది ఆమెకు.

పెద్దకొడుకు నాగస్వామిని, అతని భార్యను చూసుకుని అలఘమ్మ కొంత దుఃఖాన్ని దిగమింగింది. నాగస్వామి రిజిస్ట్రార్ ఆఫీసులో గుమాస్తాగా చేరాడు. అంతలో 1898 - మే - ఒకటవ తేదీన సుబ్బయ్యర్ మరణించాడు. అతని అంత్యక్రియలకు మానా మధుర నుంచి అలఘమ్మ, నెల్లియప్పయ్యర్ మధుర వచ్చారు. సుబ్బయ్యర్ ఇంటి వ్యవహారాలు చక్కబడేవరకు, వారు మధురలో వున్నారు.

మధురలో "తిరుజ్ఞాన సంబంధర్" మఠంలో అన్నామలై తంబిరాన్ తన గురువు - అరుణాచల నివాసి - బ్రాహ్మణస్వామి గురించి గొప్పగా చెప్పడం, తిరుచ్చుళి యువకుడు ఒకడు విని, ఆ సంగతి అలఘమ్మకు చెప్పగా, వెంటనే నెల్లియప్పయ్యర్ మరొక మిత్రునితో కలసి, తిరువణ్ణామలై వెళ్ళి, స్వామి వుంటున్న మామిడి తోట దగ్గరకు వెళ్ళారు. ఆ తోటమాలి వారిని స్వామి దర్శనానికి అనుమతి ఇవ్వలేదు. అప్పుడు నెల్లియప్పయ్యర్ ఒక చీటీ రాసి, అతనికి ఇచ్చారు: "నెల్లియప్పయ్యర్ - ప్లీడర్ - మానామధుర - స్వామి దర్శనార్థం వచ్చారు," అని.

తోటమాలి ఆ చీటీ స్వామికి ఇచ్చాడు. స్వామి ఆ చీటీచూసి, దాని వెనుక నాగస్వామి దస్తూరి గుర్తించారు. వారికి దర్శనం ఇవ్వడానికి స్వామి అంగీకరించారు. నెల్లియప్పయ్యర్ వెంకట్రామన్ని చూసి, ఆశ్చర్యానందాలతో నిశ్చేష్టులై తమలోని ఒకరైనా అటువంటి ఉన్నతస్థితిలో ఉన్నందుకు సంతోషించారు. కాని, స్వామి వారిని కన్నెత్తి చూడలేదు. నెల్లియప్పయ్యర్ స్వామి దేహస్థితిచూసి, దిగులుపడి, "స్వామీ, మీరు మానామధుర వస్తే, సమస్త సౌకర్యాలూ సమకూర్చి, సక్రమంగా సేవలు జరిగే ఏర్పాటు చేస్తాను," అన్నారు. స్వామి ఆ మాటలు విననట్లు లేదు. స్వామి మౌనంగా వున్నారు. నెల్లియప్పయ్యర్ తిరువణామలైలో ఐదారు రోజులు వున్నారు. అలఘమ్మకు ఉత్తరం రాశారు, "నీ కొడుకు గొప్ప స్థితిలో వున్నాడు. పూర్తిగా మారి పోయాడు - అతను తిరిగి ఇంటికి వచ్చే ప్రసక్తిలేదు," అని.

**1898** - సెప్టెంబరు ప్రాంతంలో, స్వామి అరుణగిరినాథర్ గుడి దగ్గరకు మకాం మార్చారు. ఆదిశంకరులు ప్రతిష్ఠించిన శివలింగమున్న ఆలయమది. అక్కడకు వెళ్ళిన తర్వాత పలని స్వామితో, "ఇకనుంచి మీదారి మీది, నాదారి నాది. మీరో వీధికి భిక్షకు వెళ్ళండి. నేనో వీధికి భిక్షకు వెడతాను," అన్నారు స్వామి. ఎందుకంటే, ఇతరుల సేవ, సహాయం స్వామికి ఇష్టం లేదు. పలనిస్వామి ఎంత ప్రాధేయపడినా స్వామి వినలేదు. పైగా, "మన మిద్దరం ఇకనుంచి కలిసి వుండవద్దు" అని ఖచ్చితంగా చెప్పారు స్వామి. ఆ మాట పలనిస్వామికి పెద్ద అఘాతమైంది, స్వామి సేవే జీవిత పరమావధిగా పెట్టుకున్నారాయన. స్వామిని చూడకుండా ఒక్క క్షణం బ్రతకలేననుకున్నారు. అందుచేత స్వామి ఆజ్ఞ మేరకు ఆయన అక్కడనుంచి వెళ్ళినట్లు వెళ్ళి, సాయంత్రానికి స్వామి చెంతకు చేరుకున్నారు.

స్వామి మౌనంగా భిక్షాటనకు వెళ్ళేవారు. తాను భిక్ష ఎత్తిన సంగతి ఒకసారి మాటల్లో భగవాన్ ఇట్లా చెప్పారు :

"నేను భిక్ష ఎత్తే రోజుల్లో, లోకానికి చక్రవర్తి ననిపించేది. చేతిలో ఒక మట్టి మూకుడైనా వుండేదికాదు. ఎవరి ఇంటి ముందు అయినా ఆగి, చప్పట్లు చరిచేవాడిని. వారు ఏదైనా పెడితే, దోసిలి పట్టి, అక్కడే తిని చేతులు తలకు తుడుచుకుంటూ వెళ్ళిపోయేవాడిని. ఒకే ఇంటికి రెండుసార్లు వెళ్ళేవాడిని కాదు. తిరువణ్ణామలైలో నేను తిరగని వీధంటూ లేదు. నేను ఎప్పుడు భిక్షకు వస్తానా అని కొందరు నా కోసం ఎదురు చూసేవారు. కొందరు ఏమన్నా మిగిలితే పెట్టే వారు. కొందరు "నీ కేరా, బలిసి దుక్కలా వున్నావు. ఛో! కూలి పని చేసుకో!" అని కసిరేవారు. నేను నవ్వుకుంటూ వెళ్ళిపోయే వాడిని.

**1898** - సెప్టెంబరులో స్వామి "పవళకున్రు" మీదకు మకాం మార్చారు. దానినే "ప్రవాళపర్వతం" అంటారు. అది అరుణాచలానికి తూర్పు దిశను, దిగువ భాగాన వున్న ఓ ఎత్తైన దిబ్బ. దానిపై ఒక శివాలయం వుంది. ఆ ఆలయాన్ని ఆనుకుని ఒక కొలను, ఒకగుహ వున్నాయి. భిక్షాటనకు తప్ప, స్వామి కిందికి దిగి వచ్చేవారుకాదు. ఎక్కువ కాలం సమాధి స్థితిలో వుండేవారు. మృత్యు అనుభవంతో పూర్ణస్థితిని అందుకున్న స్వామి, కేవలం ప్రశాంత ప్రదేశాల్ని ఎన్నుకుంటూ మకాములు మార్చారే కాని, తపస్సు నిమిత్తం కాదనిపిస్తుంది. తపస్సంటూ ఒకటి ఆయన చేయవలసిన అవసరం లేదు. ప్రాణి కోటి వికాసం కోసం పడే తపనే, ఆయన తపస్సు. అదే మహాత్ములందరి లక్ష్యం. తనను తాను తెలుసుకున్న తర్వాత, ఏం చేయడానికి వారికి విడిగా ఏమీ వుండదు. గోల, రద్దీనుంచి తప్పించుకునే నిమిత్తం అరుణాచలేశ్వరాలయం నుంచి, గురుమూర్తం వెళ్ళారు. దేహస్పురణ లేని వారికి, పిల్లలు రాళ్ళు రువ్వడం, చీమలు - చెదలు కుట్టడం, తిండి లేకపోవడం, శీతోష్ణాలు- ఏవీ ముఖ్యం కాదు. ఆయన ఎప్పుడూ దేనికీ, చలించలేదు.

**1898** - క్రిస్మస్ శలవలకు నాగస్వామిని తీసుకుని అలఘమ్మ తిరువణ్ణామలై వచ్చింది. మరది, వెంకట్రామన్ గురించి చెప్పినప్పటి నుంచీ, ఆమె, - క్షణం ఒక యుగంగా గడిపింది. స్వామి దర్శనార్థం ఆమె పవళకున్రు మెట్లన్నీ ఎక్కింది. ప్రతి అడుగులో ఆమెలో ఆనందం, ఆహం. స్వామి కౌపీనధారియై, ఒక రాతి బండమీద తూర్పు ముఖంగా కూర్చున్నారు. ఆయన ముఖం సూర్యుని ప్రతిబింబం మాదిరిగా గొప్ప కాంతితో వెలిగిపోతోంది. అలఘమ్మ ఆయన్ని దూరంనుంచే చూసింది. స్వామి దర్శనం చేసుకుని, సంతోషంతో తిరిగి వస్తున్న భక్తుల్ని తప్పించుకుంటూ ఒక్కొక్క మెట్టు ఎక్కింది.

చుక్కల మధ్య చంద్రునివలె ప్రశాంత, శీతల వీక్షణాలతో స్వామి వెలిగిపోవడం మరొకసారి జనం మధ్య నుంచి చూసింది, అలఘమ్మ. తన గర్భంలోంచి కన్న కొడుకును సమీపించడానికీ, తనను గోముగా తాకే ముద్దులకొడుకును తాకడానికీ, కనీసం ఆయన దగ్గరగా కూర్చుని నోరారా ప్రేమగా పలకరించడానికీ, ఆమె క్షణంసేపు సంకోచించింది. కాని, ఎంతోసేపు దూరంగా నిలవలేక, ఒక్కదూకున వెళ్ళి, స్వామిని కావిలించుకుని బావురుమని ఏడ్చింది. స్వామి మౌనంపూని, తిండి తినక, బక్కచిక్కి, శల్యమై, దుమ్ము కొట్టి, జడలు కట్టి, గోచిపెట్టి, గోళ్ళుపెరిగిన స్థితిని చూసి అలఘమ్మ మనసు గిల గిల లాడింది. కాని, ఎందరో భక్తులు అందమైన, అపురూపమైన సూర్యోదయాన్ని చూస్తున్నట్లు స్వామిని చూస్తూ కూర్చుని వున్నారు, ఆయన చుట్టూ - మౌనంగా.

అలఘమ్మ నెమ్మదిగా "బాబూ, వెంకట్రామన్!" అని ప్రేమగా పిలిచింది. ఆ పిలుపు, గాలిలోనే కలిసిపోయింది. ఆమె మళ్ళా పిలిచింది. స్వామి కన్ను తిప్పి చూడలేదు. అంతలో మరో పెద్ద గుంపు వచ్చింది. "అలఘమ్మ, స్వామి తల్లి" అని వారికేం తెలుసు! దూరం నుంచి - గుంపు వెనక నుంచి, "బాబూ, వెంకట్రామన్!" అని మళ్ళా పిలిచింది. స్వామి ఆమె మాట విన్నట్లే లేదు. ఆమె పిలుపు, రొదలో కలిసిపోయింది. అందరితోపాటు ఆమె కూడా గుంపు వెనక నిలిచిపోయింది. స్వామి దేన్నీ, ఎవరినీ లక్ష్య పెట్టక ప్రతిమమల్లే కూర్చున్నారు.

అలఘమ్మ అహం దెబ్బతిన్నది. ఆమె ఆశ, నిరాశ అయింది. ఎంతో ఏడ్చింది. స్థిరంగా ఒక చోట నిలవలేక మళ్ళా స్వామి దగ్గరకు వెళ్ళి, "బాబూ, వెంకట్రామన్ ఒక్కసారి నావైపు చూడరా! ఒక్కమాట నాతో మాట్లాడరా! నన్ను దయతలచరా. నేను నీ తల్లినిరా. ఎంత మారిపోయావురా. ఎంత చిక్కిపోయావో! అన్నయ్య

కూడా వచ్చాడురా," అని ఒకటే బ్రతిమాలింది. అప్పుడు అక్కడ వున్న వారందరి దృష్టి, ఆమెపై నిలిచింది; ఒక్క స్వామి చూపు తప్ప.

"నేనేం పాపం చేశానురా? నీకేం అన్యాయం చేశాను? నాతో ఒక్క మాట మాట్లాడవు. తల్లినని దయ లేదురా? అందరి ముందు నన్ను కొరగాకుండా తీసేశావు. కన్నకొడుకే గుర్తించకపోతే, నేను ఇంక ఎవరికోసం బ్రతకాలి!" అని అలఘమ్మ ఏడుస్తోవుంటే, "అమ్మా! తమ్ముడు చూడనంత మాత్రాన, మాట్లాడనంతమాత్రాన మనని మరచిపోయాడనుకోకు. అతడు ఎంత తేజస్సుతో వెలిగిపోతున్నాడో చూడు! ఎంతకీ నీ స్వార్థమే కాని, అతన్ని అర్థం చేసుకోవడం లేదు నువ్వు;" అన్నాడు నాగస్వామి.

అలఘమ్మ దీనావస్థ చూసి కొందరు జాలిపడి, "స్వామీ, మీ అమ్మ వచ్చారు" అన్నారు. స్వామి మౌనంగానే వున్నారు. వెంకట్రామన్ మౌనంగా వుండటం భరించలేక, "నాయనా, వెంకట్రామన్! నన్ను మరచిపోయావుటరా? నాకెందుకీ కఠిన శిక్ష బాబూ! నిన్ను చూడక, నీ జాడ తెలియక, ఇన్నాళ్లూ నేను ఏమైపోయానో ఆ భగవంతునికే తెలియాలి. నిన్ను చూసిన వారంతా నువ్వు మహర్షివి, మహాత్ముడివి అంటున్నారు. నువ్వు అగస్త్యుడివా? గౌతముడివా? ఆదిశంకరుడివా? ఏమహర్షివో చెప్పు నాయనా? నేనూ విని, తెలుసుకుని అందరితోపాటు ఆనందిస్తాను" అని ఆమె ఒకటే వేడుకుంది. తనతో ఇంటికి రమ్మని బ్రతిమాలింది. ఆయన చలించలేదు. ఆమెతో ఒక్క మాట మాట్లాడలేదు. ఆమె వంక చూడలేదు. ఆమెకు జవాబు చెప్పలేదు. అసలు ఆమెను తల్లిగా గుర్తించినట్లే లేదు.

అంతలో సమయమైనది గావును, స్వామి లేచి, గుహ్యోకి వెళ్ళారు. అందరూ లేచారు. తల్లిగా, చనువుగా లోపలకు వెళ్ళ

టానికి ఆమెకు ధైర్యం చాలలేదు. తల్లి - కొడుకుల మధ్య అంత దూరం ఏర్పడింది. అందరితోపాటు అలఘమ్మ కూడా గుడిబైట నిలిచిపోయింది.

అందరి మాదిరిగా అలఘమ్మ కూడా రోజూ స్వామి దర్శనానికి పవళకున్రను వెళ్లేది. ఆయనకు ఇష్టమైనవి, రుచైనవి వండి తీసుకువెళ్లేది. స్వామి స్థిరంగా కూర్చొని, మధురమూర్తిగా దర్శనమిచ్చేవారు. నమ్రతతో కూడిన ఆయన కదలికలు, అందర్నీ ఆకర్షించేవి.

ఒక రోజున అలఘమ్మ కొడుకును సమీపించి, "బాబూ, నువ్వు నా వెంకట్రామన్‌వికదూ? నేను నీ తల్లిని కదూ? నన్ను గుర్తుపట్టి "అమ్మా!" అని పిలు, బాబూ! నా మీద దయ చూపరా!" అంటూ ప్రాధేయపడుతూ అడిగింది.

అలఘమ్మ అభ్యర్థన, రోదన, ప్రాధేయపడటం చూసి, కొందరు జాలిపడి, "స్వామీ, మీ తల్లి ఏడుస్తోంది. ఆమెకు ఓదార్పుగానైనా, కనీసం ఒక్క మాటైనా ఆమెతో మాట్లాడండి, స్వామీ ఆమెను దయ తలచండి. పోనీ, "అవును - కాదు" అని అయినా అనండి," అని వినయపూర్వకంగా విన్నవించారు, స్వామి సమాధానం చెప్పకపోయేటప్పటికి. "ఆమె తృప్తికోసం ఏదో ఒకటి కాగితం మీద రాయండి" అని పచ్చయప్ప పిళ్లై స్వామిని అడిగారు.

స్వామి కాగితం, పెన్సిల్ తీసుకుని, "వారి, వారి ప్రారబ్ధ కర్మానుసారం, విధాత వారి విధి నిర్ణయిస్తాడు. జరుగవలసింది, ఎవరెంత అడ్డు పెట్టినా, జరిగే తీరుతుంది- జరగనిది, ఎవరెంత ప్రయత్నించినా జరగదు. ఇది సత్యం. కనుక, వూరికే వుండటం మంచిది," అని రాశారు.

అదే స్వామి ప్రపంచానికి ఇచ్చిన ప్రథమోపదేశం. ప్రారబ్ధి కర్మానుసారం, కర్మ ఫలితాన్ని అనుభవించవలసిన బాధ్యత, కర్తది కాని, భగవంతుడిది కాదు." అన్నారు ఒకసారి స్వామి, శివప్రకాశం పిళ్లై ప్రశ్నకు సమాధానంగా.

"ప్రారబ్ధమే జీవితాన్ని పాలించేదైతే, మోక్షం పొందాలనే తపన, దానికి అవసరమైన సాధన - అది సక్రమంగా సాగకుండా అడ్డుపడే అభ్యంతరాలూ, అవరోధాలూ, అడ్డంకులూ ఎన్నో వున్నాయి. వాటి సంగతి ఏమిటి?" అని ఒకరు స్వామిని అడిగారు.

"ధ్యానాన్ని కాని, మరి దేనిని కాని నిరోధించే విధి' బాహ్యమైనది కాని, అంతర్గతమైనది కాదు. అంతర్ముఖులైన వారు, బాహ్యాంతరాలకు భయపడరు. అసలు "అవరోధం" అనే ఆలోచనే పెద్ద ఆటంకం," అన్నారు స్వామి.

భూమి మీద తనువు ఏర్పడినప్పుడే, అది ఏ ఏ ఖర్మలు ఆచరించవలయునో, ముందుగా నిర్ణయించబడి వుంటుంది. ప్రతి వారూ కర్మ ఫలితం అనుభవించవలసిందే! కాని, "నేను ఈ దేహం కాదు. నేను మృత్యురహిత ఆత్మను. నా సంబంధం ఆత్మతో," అనే పరమసత్యాన్ని తెలుసుకుని, ఎప్పుడో రాయబడ్డ నాటకంలోని పాత్రధారివలె, తనకు ఇవ్వబడిన పాత్రను, అభినయించు వానికి, ఎటువంటి భయమూ, ఆత్రుత, ఆరాటమూ, ఆశ, విచారం ఏమీ వుండవు. అంటే, వారు దేహస్ఫురణలేని జ్ఞానులు, జీవన్ముక్తులు. వారి, వారి కర్మాచరణ వల్ల కలిగే ఫలితాలు, అటువంటి జ్ఞానులను అంటవు. వారంతా ఒకే విధంగా వుండకపోవచ్చు. వారిలోని చైతన్యశక్తి, ఏ విధంగా నైనా పనిచేయవచ్చు. కర్మ ఫలితం వారిని బంధించదు.

"ఏనాడో నా విధి నిర్ణయమైతే, అసలు నా నిజస్థితి ఏమిటి?" అనే ప్రశ్న ప్రతి ఒక్కరికీ సహజంగా కలుగుతుంది. అదే నిజమైన

ఆర్తి. అదే "నే నెవడను!" అను విచార మార్గం. ఆ ఆర్తి, ఒక యుద్ధం వంటిది. ఆ యుద్ధంలో జయం పొందాలంటే, బలమైన ఆయుధాల్ని ఉపయోగించవలసిందే! అంటే, "ప్రయత్నం మాన కండి," అని అర్థం.

"ముళ్ళను తన్నడం మంచిది కాదు," అంటే విధి నిర్ణ యాన్ని వ్యతిరేకించబూనడం, మంచిది కాదని అర్థం. అంటే, విధి నిర్ణయాన్ని తప్పించలేమని. అలా అని, ప్రయత్నం పనికిరాదని కాదు. కాని, మనిషి స్వభావమే అతన్ని ప్రయత్నించమని ప్రేరే పిస్తుంది.

"మీరు ఇల్లు వదలి ఎందుకు వచ్చారు?" అని ఒకరు భగవాన్ని అడిగితే, "ప్రారబ్దం వల్ల" అన్నారు.

గీతాచార్యుడు నిష్కామ కర్మ ప్రబోధకుడు - కృష్ణుడు, కురు - పాండవ యుద్ధంలో భీష్ముని సవాలుకు కోపం తెచ్చు కున్నట్లూ; ప్రజల దైన్య స్థితీ, దుఃఖం చూసి బుద్ధుడు బాధపడి నట్లూ; అప్పులు ఇచ్చేవాళ్ళనూ, ఆలయంలో అంగళ్ళు పెట్టి అమ్మే వాళ్ళను చూసి ఏసు ప్రభువు కోప్పడినట్లూ చదివి నప్పుడు-ఎంతటి మహాత్ములైనా ప్రపంచంతో సంబంధం పెట్టుకుని, ప్రజల మధ్య మసలడం వల్ల, కొంత కర్మ తప్పదనిపిస్తుంది. భగవాన్ దాన్నే "ప్రారబ్దం" అంటారు గావును.

కొన్ని రోజుల తర్వాత అలఘుమ్మ మళ్ళా స్వామిని సమీ పించి, "పోనీ, అందర్నీ క్షమించి, అనుగ్రహించినట్లు, నన్నూ అనుగ్రహించరా, నాయనా! నేను నీ దగ్గర వుండి, సేవచేసు కుంటాను. నేను జీవితంలో చాలా బాధలు పడ్డాను. నా శక్తి అంతా నశించిపోయింది. నిస్సహాయురాలనై నిన్ను అర్థిస్తున్నాను. ఇంక ప్రపంచంలో తిరగలేను. అందరి ముందూ బాధతో దుఃఖంతో తిరగాలనీ లేదు" అన్నది. దానికి స్వామి, "అదే నీ సంకల్పమైతే,

అట్లానే కానియ్యి" అన్నారు నెమ్మదిగా. ఆ మాట విని, "ఎప్పుడైనా ఇట్లా మాట్లాడావుటరా? అంతా మరచిపోయినావా, అసలు ఒక్క మాట చెప్పు - నువ్వు నన్ను ఎరగవా?" అని అడిగింది.

చాలాదయ కల చూపుతో, "ఇప్పటికి నువ్వు చాలా మారావు. ఇప్పుడెంతో బావున్నావు. ఇదంతా కేవలం ఉద్రేకం కాకపోతే, తత్తరపాటు; అందుకే అడుగుతున్నావు "నేనుతెలుసా?" అని, అన్నారు స్వామి.

స్వామి అందరి ప్రశ్నలకూ సమాధానాలిస్తూ, కొందర్ని ఓదార్చుతూ వుండటమూ; సమస్త ప్రాణికోటిని ప్రేమగా చూడ్డం - చాలా అందమైన దృశ్యాలుగా, అదృష్టం పొందిన సంగతులుగా అలఘుమ్మకు ఎంతో ఆనందాన్నిచ్చాయి. తన కొడుకు కదా అంతటి మహాత్ముడని ఆమె గర్వపడింది. అందుకేనేమో, స్వామి ఆమెను తల్లిగా చేరనివ్వకపోవడం. స్వామి ఆమెతోనే అనైక్యత. ఆమె యెడల నిరుత్సాహంగా, సంబంధ శూన్యంగా వుండేవారు. అందుచేత ఆమె భరించరాని వ్యథ పడింది. "నా కొడుకు నన్నెరగడు. నన్ను తల్లిగా గుర్తించలేదు. నన్ను పరిహాసం చేశాడు. నన్ను నలుగురిలో నవ్వులపాలు చేశాడు," అంటూ కుమిలిపోయింది, అలఘుమ్మ.

నాగస్వామికి శలవలు అయిపోయాయి. త్రోవ తప్పిన యాత్రికురాలిమల్లే, అలఘుమ్మ హృదయభారంతో దిగులుగా, నిరాశతో ఇంటికి వెళ్ళింది. స్వామి సన్నిధిలో వుండి ఏదైనా పని చేయాలంటే అక్కడ ఏ పనీ లేదు. ఉండేందుకు చోటూలేదు. దారి తప్పి, దిగంతం చేరి, అంచున నిలబడి, మహా శూన్యంలోకి దూకాలని నిర్ణయించుకోవడం వంటి, చివరి నిర్ణయంలో వుంది, అలఘుమ్మ జీవితం. అంటే, ఆమె తన జీవితాన్ని అంతమొందిం చాలనుకుంది.

కాని, ఆమె నిర్ణయం, నిరాశ, చనిపోవాలనే బలమైన కోర్కె కాలంలో కొట్టుకుపోయాయి. అలఘమ్మ ఎంతో దుఃఖాన్ని దిగమింగింది. భరించలేని బాధ పడింది. తప్పిపోయాడనుకున్న కొడుకును, వెదికి పట్టుకుంది. కాని, అతన్ని తిరిగి తన వానినిగా చేసుకోలేక పోయింది. ఆమె ఆశ, ప్రయత్నం, వ్యర్థమైనాయి.

* * *

హైస్కూల్లో చదువుకునే పదహారేళ్ళ సామాన్య బాలునికి ఒక్క అరగంట వ్యవధిలో మృత్యు అనుభవం కలగడం, విశ్వ రహస్యం గోచరం కావడం, అరుణాచలమనే మాట మొదటిసారి వినగానే ఆపాదమస్తకం ఆనందంతో తొణికిస లాడటం - ఆవేశంతో నిండిపోవడం - ఎన్నడూ ఎరుగని ధ్యానం కుదరడం - సమాధి స్థితికి వెళ్ళడం - ఉదాసీన భావం - వైరాగ్యం ఏర్పడటం వంటి అద్భుత సంఘటనలన్నీ వెంకట్రామన్ విషయంలో వెంటవెంటనే, జరగడం చూస్తే, అదంతా అగోచరమైన ఒక దివ్యశక్తి ప్రేరణ అనక తప్పదు. వెంకట్రామన్ విషయంలో అసలు ఏం జరిగిందో తెలుసుకోవడం సామాన్యులకు సాధ్యం కాదేమో! ఏం జరిగిందో ఆయనా చెప్పరు. అది కేవలం వారి స్వానుభవం. దాన్ని మాటల్లో వర్ణించడం బహు కష్టం. వారు వర్ణించి, వివరించి చెప్పినా, అర్థం చేసుకోవడం, నిజ జీవితానికి అన్వయించు కోవడం మరీ కష్టం.

స్వామి అరుణాచలం వచ్చిన మొదట్లో, దేహాన్ని, ప్రపంచాన్ని పూర్తిగా ఉపేక్ష చేశారు. తన వరకూ వచ్చిన పదార్థాన్నే - అదీ ఒక పిడికెడు మాత్రమే తినేవారు. ఎప్పుడూ కళ్ళు మూసుకుని కూర్చునే వారు. స్వామి ఆ రోజుల్ని వర్ణిస్తూ, ''నేను పరమానందంలో మునిగివున్న సమయంలో ఒక్కోసారి కళ్ళు తెరిచేవాడిని. అది ఉదయమో, సాయంత్రమో తెలిసేది కాదు. క్రమంగా ఆ స్థితి

పోయి, మామూలు స్థితికివచ్చాను," అన్నారు. కాని,ఆస్థితినే కొందరు తపస్సు అన్నారు. ఆయన మాట్లాడకపోతే, మౌనవ్రతమన్నారు. ఆయన తినకపోతే, ఉపవాసమన్నారు. నిజంగా మేల్కొన్న వారికి, అసలు సత్యం తెలుసుకున్న వారికి, ఇంక ప్రత్యేకంగా చేయ వలసిన సాధన లంటూ ఏముంటాయి? మాట్లాడవలసిన అవసరం లేక, మాట్లాడలేదు. అంతే! అదీ కాక, ఏకాంతవాసంలో, మౌనం విధిగా వుంటుంది. కదా? "మౌనం, కలతల నుంచి మంచి కవచం," అన్నారు భగవాన్, ఒకసారి.

స్వామి అన్నింటికీ పూర్తి ఎరుకలో వున్నా, "స్వామి ఎరుకలోలేరు" అనేవారు కొందరు. స్వామి స్థితి - "జాగ్రత్-సుషుప్తి." దానికి నిదర్శనం, నిరంతరం ఆనందం పొంగిపొరలడం, అనుభవం తేటగా వుండటం. అది నిద్రావస్థకు భిన్నమైనస్థితి - అదే అసలైన స్థితి. ఆ స్థితిలో ప్రాణ మనో క్రియలు నష్టమై, ఇంకెప్పటికీ తలెత్తవు. ఎవరైనా సహజ సమాధి స్థితిలో వున్నారంటే, వారు తమతో తాము సమాధానపడినవారని అర్థం. వారు ఏం చేస్తున్నా, ఏం చూస్తున్నా, ఏం వింటున్నా నిశ్చలంగా, శాంతంగా, నెమ్మదిగా వుంటారు. వారికి ఆరాటాలు, కలతలు, కలవరాలు, కలకలాలు, ఆత్రుతలు, చింతలు, విచారాలు, వ్యసనాలు ఏమీ వుండవు. ఎందు కంటే, ఆ స్థితిలో తమకు వేరుగా, బైట ఏమీ లేదనీ, తామూవాస్తవ మైన ఆంతరంగికమైన "అసలు నేను"తో కదలాడుతున్నామనే గమనికలో వుంటారు. ప్రతిదీ, ఏదో ఒక అతీతశక్తి చేత నడపబడు తోందనుకుంటారు. ఆశక్తికి సదా ఎరుకలో వుండి, అన్నింటితో కలిసి వారూ కదులుతారు. అదీ వెంకట్రామన్ వంటి వారి జీవితం ద్వారా గ్రహించవలసిన సంగతి. విషయాలను గ్రహించేప్పుడుకూడా, స్థిరమైన ఏకాకారబుద్ధే సహజ స్థితి. విషయాల్ని గ్రహించనప్పుడు,

నిర్వికల్ప సమాధి స్థితి కలుగుతుంది. కేవలం నిర్వికల్ప సమాధి స్థితిలోకి మనసు జారినప్పుడు, హృదయం తెరచుకుంటుంది. హృదయమంటే, ఇక్కడ జ్ఞాననేత్రం. అదే ఆత్మ. అది పదార్థం కాదు. దాని అవతరణ, మేధస్సులో. అది సూది రంధ్రం కన్నా, సూక్ష్మం. అదెప్పుడూ మూసేవుంటుంది.

పరిమితమైన బిందువు, అపరిమితమైన అనంత సాగరగర్భంలో కలిసినట్లు, మనసు హృదయంలో కలవడాన్ని "నిర్వికల్ప సమాధి" అంటారు. ఆ స్థితిలో ఇంద్రియ ప్రవృత్తులు నిశ్చేతనాలై వుంటాయి. ఎటువంటి విషయాల్ని గ్రహించని స్థితి అది. విజృంభించే మనసును బలవంతంగా అణచి, సమాధినిష్ఠులై వుండటమే, "నిర్వికల్ప సమాధి." ఆ స్థితిలో మనసు తాత్కాలికంగా ఆత్మలోతుల్లో - నీళ్ళతో నిండిన బకెట్, వెనుతిరిగి ఆ నూతి నీళ్ళలో మునిగినట్లు; మునుగుతుంది. నీళ్లు, నీళ్ళలో కలుస్తాయి. బకెట్‌లోని నీరు, మనసు. ఆ నీరు కూడా నూతి నీరే. నుయ్యి, ఆత్మ. మనసు వెనుదిరిగి ఆత్మలో కలసిపోవడం. కాని, తాడు బకెట్ కలిసినది. మాత్రం, "అహం." అది ఎప్పటికి సిద్ధంగానే వుంటుంది - ఏ క్షణంలో అయినా బకెట్‌ను నూతి నీళ్ళలోంచి బైటికి లాగడానికి. మనోవిజృంభణ, లేక మానసిక ప్రవృత్తులు" అనే తాడు, బకెట్‌ను గట్టిగా పట్టుకొని వేళ్ళాడుతూ వుంటుంది.

అన్నింటికంటే ఉన్నతమైనది, సహజ సమాధి. అది అంతిమ స్థితి. అది పవిత్రమైనది. అది ఎడతెగని చైతన్య స్రవంతి. అది మనో, దేహ పరిధుల్ని దాటి, ప్రవహిస్తుంది. ప్రపంచాన్ని, మనసునీ, దేహాన్ని పూర్తిగా ఏకకాలంలో ఉపయోగించుకుంటో సాగుతుంది. అదే సమస్థితి. అదే సమగ్రమైన, ఐకమత్యంతో కూడిన స్థితి. అది ఆనందానుభవానికి కూడా అందని స్థితి. ఆస్థితిని నదీజలం - సాగర గర్భం చేరడంవలె వుంటుందని వర్ణించారు స్వామి. ఆ స్థితిలో అహం

తనసమస్త హద్దుల్నీ, ఒకేసారి అతిక్రమించి, ఆత్మలో కలిసిపోతుంది. అది తిరుగులేని స్వేచ్ఛ; స్వచ్ఛమైన చైతన్యం. ఆ స్థితి ఏమిటో, ఎవరికీతెలియదు, ఆ స్థితిని అందుకున్నవారికి తప్ప. కాని, ఆ స్థితిని చేరినవారు చెప్పినదాన్ని బట్టి, ఇతరులు కొంతవరకే గ్రహించగలుగుతారు. సహజస్థితే, నిరహంకార స్థితి. అది ఉత్తమ స్థితి జీవిత సమస్యలన్నింటినీ అధిగమించిన స్థితి. అది చేరిన వారి జీవనయాత్ర, అంతమైనట్లే. ఆ తర్వాత వారు చేయవలసిన సాధనలు కాని, అందుకోవలసిన, చేరుకోవలసిన స్థితులు కాని ఏమీ వుండవు. స్వామి అటువంటి స్థితిని అందుకున్నారు.

మృత్యు అనుభవంతో వెంకట్రామన్‌కి పూర్తిగా దేహాత్మబుద్ధి తొలగిపోయింది. అప్పటినుంచి ఆయనకు మనను, దేహం, ప్రపంచం ఏదీ పట్టలేదు. అంటే, అవి అన్నీ వుండి, వాటి ద్వారా జరిగే పనులు ఆయన్ని కలవరపరచలేదు. ఆయన తిరువణ్ణామలై వచ్చి, అయ్యంగులం కొలనులో చివరిమెట్టు మీద నిలబడి, తనకంటూ ఏమీ మిగుల్చుకోకుండా అన్నీ ఆ నీళ్ళలో వదిలినదే ఆయన జీవన యాత్రలో మొదటి మెట్టు. అసలు వున్నదీ "ఆ మెట్టు" ఒక్కటే,

అటువంటి సహజ స్థితిని పొందేందుకు, మనం ఎక్కడికీ వెళ్ళనవసరం లేదు. అహం పోయిన క్షణంలో, వుండేదే ఆ స్థితి. ఆ స్థితిలో వున్నవారు నిశ్చలంగా వుంటారు. ఏపని చేస్తున్నా శాంతంగా, ప్రశాంతంగా వుంటారు. వారికి ఏ తొందరలూ, ఆరాటాలు, ఆందోళనలు, జాగ్రత్తలు వుండవు. అటువంటి పరమోన్నత స్థితిని ఏ ఆశా, ప్రయత్నం లేకుండా అందుకున్నవారు, స్వామి. అటువంటి స్వామి తిరిగి బాహ్యప్రపంచంలో కలిసి పోతున్నారన్నది, కేవలం బాహ్యంగా కనుపించినా, అది వాస్తవం కాదు.

స్వామి తిరిగి బాహ్య ప్రపంచంలో కలిసిపోతున్నారనే సందేహం కలగడానికి అవకాశం లేకపోలేదు. ఆయన పూర్వం మాదిరిగా కాక, రోజూ ఒకే వేళకు భోజనం చేయడం, ఎవరిమీదా ఆధారపడకుండా వుండటం, కొన్ని సార్లు మాట్లాడటం, భక్తులకు సమాధానాలు ఇవ్వడం, తరచు మకాంలు మార్చడం, భక్తులు - సేవకులు ఏర్పడ్డం, భిక్షాటన చేయడం, గ్రంథాలు చదివి, ఇతరులకు చెప్పడం, వంటి సంగతుల్ని ఆధారంగా తీసుకుని, స్వామి లోక వ్యవహారాల్లోకి దిగుతున్నారనడంలో అన్యాయం లేదు. కాని, ఆత్మ సాక్షాత్కారం పొందిన వారికి ఈ ప్రపంచం, ప్రపంచపరంగా అసత్యం; ఆత్మపరంగా, సత్యం. ఎందుకంటే, అటువంటివారికి అంతా ఆత్మే! మనసు అంతర్ముఖం కావడమే "ఆత్మ" అది బాహ్యముఖమైతే, "అహం" అవుతుంది. కాని, ఆ మనసుకు ఆత్మ నుంచి విడిగా ఉనికి లేదు. మనసు లేకుండా ఆత్మకు స్వతంత్ర ప్రతిపత్తి వుంది. ఆత్మ లేనిది, మనసుకు తావు లేదు. కాని, విచారణ చేసేది, అహం మాత్రమే. విచారణ ఫలితంగా, ఆ అహం ఉనికి పోయి, ఆత్మే మిగులుతుంది. ఏదైనా మనసు - అహం - ప్రపంచం - అన్నీ ఆత్మకు పర్యాయపదాలు. అందుచేత స్వామి ఎప్పుడూ ఏకత్వాన్నే బోధించారు. ఆ ఏకత్వంలో ఏమీ వుండదు, ఏమీ మిగలదు. అదే అందరికీ జీవిత లక్ష్యం కావాలంటారు భగవాన్.

ఒకసారి స్వామి "జ్ఞాని విషయంలో అహం వున్నా, అది పైకి లేచినా, అది కేవలం బాహ్యంగానే, అదీ నామమాత్రంగానే. వారు సదా మూలం మీదనే దృష్టి వుంచుతారు. వారిలోని అహం, ఎవరికీ ఎప్పుడూ ఎటువంటి హానీ చేయదు. కాలి, బూడిద అయిన తాడు మాదిరిగా, అది దేన్నీ బంధించజాలదు," అన్నారు.

ఇవన్నీ చూస్తే, స్వామి తన ప్రారబ్ధకర్మను పరిపూర్తి చేసుకోవడం కోసం తిరిగి మామూలు లోకంలో ప్రవేశించారనిపిస్తుంది. అదీ, ప్రజలపైన, సమస్త జీవకోటి మీద ప్రేమ వల్ల నే! అంతకన్నా వారికి మరో ఉద్దేశ్యం వుండదు. అసలు ఉద్దేశించడానికి వారికి మనసు వుంటేగా? అందుచేత ఆయన చేసింది తపస్సూ, కర్మా కాదేమో!

వెంకట్రామన్ తిరువణ్ణామలై వచ్చిన రెండున్నర సంవత్సరాలకు అంటే, 1899 - ఫిబ్రవరి ప్రాంతంలో - అరుణగిరిని అధిష్టించారు. అరుణగిరి అనాదిగా యోగులకు, మునులకు, సాధకులకు, సాధువులకు, సన్యాసులకు, మహాత్ములకు నిలయం. స్వామికి ఈ భూమి మీద ఏదైనా ఆసక్తి, అనురాగం మమకారం, బంధం వున్నాయంటే, అది అరుణాచలం. ఆయన అరుణాచలాన్ని ప్రేమించారు. దాన్ని చేరుకోవాలని ఆరాటపడ్డారు. అది సాక్షాత్తూ ఆయనకు ఈశ్వరుడు - ఆత్మ-గురువు. ఆయన దాన్ని ఆరాధించి, స్తుతించారు. దాన్ని వర్ణిస్తూ రాశారు. "అరుణాచలం మొదటినుంచీ నాలో ప్రకాశిస్తూ, ప్రతిధ్వనిస్తూనే వుంది. ఆ నామస్మరణ నాలో నిరంతరం వుండనేవుంది," అన్నారు భగవాన్ ఒకసారి.

అరుణాచల అవతరణకు ఒక పురాణగాథ వుంది: బ్రహ్మ, విష్ణువులు నేను గొప్పవాడినంటే, నేను గొప్పవాడినంటూ తగాదా పడి, పరిష్కారం కాక, పరమశివుని నిర్ణయించమనగా, ఆయన గొప్ప జ్యోతిర్లింగ రూపంలో భూమ్యాకాశాల్ని ఆక్రమించి, "మీలో ఎవరైతే ముందుగా అటు శిఖరాన్ని గాని, ఇటు మూలాన్నిగాని చేరుకుంటారో, వారు నిశ్చయంగా గొప్పవారు," అనగా - మహావిష్ణువు వరాహరూపంలో పాతాళానికి, బ్రహ్మ హంసరూపం ధరించి ఆకాశంలోకి వెళ్ళారు. విష్ణువు ఎప్పటికీ మూలం చేరుకోలేక పోయారు. ఆకాశంలోకి వెళ్ళిన బ్రహ్మ, పైనుంచి ఒక పూల మొక్క కిందికి రావడం చూసి, దాన్ని తీసుకుని, "నేను దీన్ని శిఖరం నుంచి తీసుకొచ్చాను. కాబట్టి నేను గొప్ప వాడిని," అన్నాడు. విష్ణువు తన ఓటమి అంగీకరించి, శివుని స్తుతించాడు, "ఓ పరమశివా, నువ్వే ఆత్మజ్ఞానివి. నువ్వే "ఓం" కారానివి. నువ్వు ఆది, మధ్యాంత స్వరూపుడవు. నువ్వే సమస్తం. సమస్తాన్ని ప్రకాశింపజేసేది నువ్వు," అని కీర్తించాడు. అది విని, బ్రహ్మ తన తప్పు ఒప్పుకున్నాడు.

ఇరుసువంటిదన్నారు కొందరు. అదే భూహృదయమనీ, ప్రపంచానికి ఆధ్యాత్మిక కేంద్రమనీ చెపుతారు మహాత్ములు. ఈనాటికి అరుణా చలంలో సిద్ధపురుషులు వున్నారంటారు, కొందరు విజ్ఞులు. అరుణా చలాన్నే ఆదిశంకరులు మేరువుపర్వతమన్నారు.

శ్లో॥ దర్శనా దభ్ర సదసి - జననాత్ కమలాలయే
కాశ్యాంతు మరణాన్ముక్తిః - స్మరణా దరుణాచలే.

స్థల పురాణంలో పై శ్లోకం వుంది. దాని తాత్పర్య మేమి టంటే, "చిదంబరంలో నటరాజస్వామిని దర్శించడం, తిరు వయ్యారులో పుట్టడం, కాశీలో మరణించడం, అరుణాచలాన్ని స్మరించడం వలన సులభంగా ముక్తి లభిస్తుంది."

అరుణాచల పర్వత తూర్పు భాగాన బ్రహ్మాండమైన అరుణా చలేశ్వరాలయం వుంది. దానికి నాలుగు దిక్కులా నాలుగు ఎత్తైన గోపురాలున్నాయి. ఇరవై ఐదు ఎకరాల విస్తీర్ణంలో, ఆ దేవాలయం విస్తరించి వుంది. కోట వంటి పెద్ద ప్రహరీగోడ లోపల, ఐదు ప్రాకా రాలున్నాయి. అమ్మవారైన అపీతకుచాంబకు ప్రత్యేక ఆలయం వుంది; ఆ ఆవరణలోనే. అరుణా చలేశ్వరాలయం క్రీస్తుశకం తొమ్మిదవ శతాబ్దం నుంచి వున్నట్లు చరిత్ర ద్వారా తెలుస్తోంది. పల్లవరాజులు, చోళరాజులు, హోయసాలరాజులు, కృష్ణదేవరాయలు ఆ ఆలయ పురోభివృద్ధికి తోడ్పడ్డారు. చరిత్రకు అందినంతవరకు అరుణాచలేశ్వరుని సేవించి, తరించిన మహాత్ములలో "గుహానమశ్శి వాయ - గురునమశ్శివాయ," అనే ఇద్దరూ ప్రముఖులు, ప్రథములు.

"నమశ్శివాయార్" అనే ఆయన, కన్నడ దేశస్థులు. ఆయన వీరశైవ సాంప్రదాయానికి చెందినవారు. వారు అరుణాచలంపై, ఒక గుహలో తపస్సు చేశారు. అందుచేత ఆయన్ని "గుహానమశ్శివా యార్" అని పిలిచేవారు. ఆయనకు "నమశ్శివాయ" అనే శిష్యు లున్నారు. ఆయన గురువాజ్ఞానుసారం చిదంబరం నటరాజస్వామి

సన్నిధిలో కొన్నేళ్లు తపస్సు చేశారు. అనేక మహిమలు సంపాదించారు. గురువే ఆయన్ని "గురునమశ్శివాయ" అన్నారు. ఆ గురు - శిష్యులిద్దరూ అరుణాచలేశ్వరుని సేవించి, కీర్తించారు. పాటలు కట్టి పాడారు. వారి జ్ఞాపక చిహ్నంగా తిరువణ్ణామలైలో ఒక వీరశైవ మఠం వుంది. గురువైన గుహనమశ్శివాయార్‌ను ఆయన తపస్సు చేసిన గుహలోనే ఆయన మరణానంతరం సమాధి చేశారు.

ఆ తర్వాతవారిలో "విరూపాక్షదేవర" ఒకరు. ఆయన తపస్సు చేసిన గుహే, విరూపాక్ష గుహ. ఆ కోవకు చెందినవారే "ఈశాన్య జ్ఞానదీక్షితార్". ఆయన మహా తపస్వి. ఎన్నో మహిమలు కలవారు. ఆయనకు ఎందరో శిష్యులు వున్నారు, ఆయన 1828 లో సమాధి అయ్యారు. ఆయన తపస్సు చేసిన మర్రిచెట్టుకింద ఒక ఆలయం కట్టి, ఆయన పేరుమీద ఒక మఠం స్థాపించారు. అదే ఈశాన్య మఠం. అది ఈనాటికీ గొప్పగా నిలిచిన మఠాల్లో ఒకటి.

పదిహేనవ శతాబ్దంలో అవతరించిన మహాత్ములు "అరుణగిరి నాథర్." ఆయన తల్లి వేశ్య. ఆమె, అతని చిన్నప్పుడే చనిపోయింది. అతన్ని, అక్క పెంచింది. కాని, అతనికి అలవడని వ్యసనం లేదు - ముఖ్యంగా, స్త్రీలోలుడు. ఒకరోజున అతడు తన ప్రియురాలి కొరకు అక్కమెడలో వున్న ఆభరణాన్ని ఇవ్వమని అడిగాడు. ఆమె ఇవ్వక పోతే, బ్రతిమాలాడు. ఆమె ఎంత చెప్పినా అతడు వినక, ఆమెను విసుగెత్తించాడు. ఆమె భరించలేక "నువ్వు అంత నిగ్రహించుకోలేని కామాతురుడవైతే, నువ్వు నాతోనె సుఖించు," అంది. ఆ మాట అతని హృదయాల్నివాడి బాణంలాగా గుచ్చుకుంది. అతని మనసు పూర్తిగా మారిపోయింది. అతని కామం అణగింది. తన కాళ్ళ కింది భూమి కదిలి, కంపించి, కృంగి

పోతున్నట్లు అనిపించి, ఒక్క పరుగున అరుణాచలేశ్వరాలయానికి వెళ్ళి, గోపురం పైనుంచి దూకి, ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడు. గోపురం ఎక్కి, కిందికి దూకాడు.

ఏం జరిగిందో, ఏమో! బహు చిత్రంగా అతడు పువ్వుల్లో వాలినట్లు నేలమీద హాయిగా వున్నాడు. అతనిని సుబ్రహ్మణ్య స్వామి కాపాడాడని అంటారు. ఆ క్షణంనుంచి అతనిలోంచి ఆశువుగా కవిత్వం వెలువడింది. స్వామిని స్తుతిస్తో ఎన్నో పాటలు రాశారాయన. ఆయనకు ఎన్నో సిద్ధులు లభించాయి. ఎన్నో మహిమలు చేశారు. నేటికీ ఆగస్ట్ పదిహేనవ తేదీన అరుణాచలేశ్వరాలయంలో అరుణ గిరినాథర్ ఉత్సవాలు జరుగుతాయి.

అటువంటి మహత్తరమైన అరుణాచలం, వెంకట్రామన్ జీవిత పరిత్యాగ కేంద్రమైంది. ఆయన జీవితం, ఆలోచన, భావన, సమస్తం - అరుణాచలం. అందుకే ఆయన అరుణాచలంలో స్థిర పడ్డారు. ఆయన ఆధ్యాత్మిక జీవితంలో పెట్టిన మొదటి అడుగు, అరుణా చలేశ్వరాలయంలో. ఆయన రచనలు చేసింది, అరుణా చలంపై. అరుణాచల అక్షర మణిమాల చదువుతూ, ఆయన ఆనంద భాష్పాలు రాల్చారు. నిర్యాణం చెందేముందు "అరుణాచలశివ" అని నామం వింటూ మరొకసారి కళ్ళు తెరిచారు. వెలుగురవ్వ, మహా జ్వాలలో కలిసినట్లు, ఆయన విదేహ ముక్తులైన క్షణాన, ఒక అద్భుత తార ఆకాశంలోంచి అరుణాచలం మీద వాలింది.

స్వామి తరచు అరుణాచలం చుట్టూ ప్రదక్షిణం చేసేవారు. ఆసక్తి వున్నవారిని గిరి ప్రదక్షిణం చేయమనే వారు. మౌనంగా గిరి ప్రదక్షిణం చేయలేని పక్షంలో, భక్తి, జ్ఞానాదులతో, శంఖారావాలతో ప్రదక్షిణం చేయమనేవారు. ముఖ్యంగా, పర్వ దినాలలో - కార్తీక మాసంలో - మహాశివరాత్రినాడు తప్పనిసరిగా గిరి ప్రదక్షిణం చేయమనేవారు, స్వామి. ఆయన ఒకసారి అరుణాచలం గురించి

చెపుతూ, "ప్రతి ఒక్కరూ చివరికి అరుణాచలం చేరుకోవలసిందే!" అన్నారు. అంటే, వారి దృష్టిలో అరుణాచలం ఏకత్వానికీ, అద్వైతానికీ సూచన మాత్రమే.

* * *

అరుణాచల పర్వతంమీద అనేకమంది వీరశైవ భక్తులైన వారు తపస్సు చేసి, సిద్ధి పొందుటచే, ఆయా గుహలకు వారివారి, పేర్లు పెట్టబడ్డాయి. స్వామి మొదట "సద్గురుస్వామి" గుహలో వున్నారు. అక్కడ నుంచి "గుహనమశ్శివాయ"కు వెళ్ళారు. అక్కడ నుంచి "విరూపాక్ష గుహ"కు మారారు. అది నమశ్శివాలయానికి ఎగువన వుంది. అక్కడ స్వామి 1900 నుంచి 1916 వరకు ఉన్నారు.

విరూపాక్ష గుహను తిరువణ్ణామలైలో, ఒక మఠాధిపతులు స్వాధీనం చేసుకున్నారు. ఆ మఠాధిపతుల్లో ముఠాలు ఏర్పడ్డాయి. వారు కోర్టుకు వెళ్ళారు. ఆ గొడవల్లో గుహను ఉపేక్ష చేశారు. స్వామి విరూపాక్షిగుహ ప్రవేశించిన కొన్నేళ్ళకు, కోర్టు తీర్పు ప్రకారం ఆ మఠాధిపతులు గుహ నిర్వహణకు ఒక ఏజెంటును నియమించారు. ఆ ఏజెంట్ గుహపై వచ్చే అద్దెమీదా, భక్తులు - యాత్రికులు ఇచ్చే డబ్బుమీదా జీవించవలసివుంది. అందుచేత ఆ ఏజెంట్ స్వామిని కూడా, గుహలో వుంటున్నందుకు అద్దె ఇవ్వమన్నాడు. ఆ సంగతి స్వామికి సమ్మతం కాక, విరూపాక్ష గుహ వదలి, మరో చోటుకు వెళ్ళారు.

విరూపాక్ష గుహకు వేసవిలో గాలి రాదు. నీళ్లు దొరకవు. వేడి ఎక్కువ, దానికి ఎదురుగా "మలైపాలై తీర్థం" వుంది. దాంట్లోనీరు తేటగా, తెల్లగా, మధురంగా వుంటుంది. దాని గట్టున "మామిడిచెట్టు గుహ" వుంది. స్వామి ఆ గుహలో ఉన్నారు. స్వామి లేకపోవడంతో విరూపాక్ష గుహ ప్రాంతానికి

ఎవరూ వెళ్ళేవారు కాదు. దానితో ఏజెంట్ జీవనోపాధి దుర్భర మైంది. అతడు స్వామి దగ్గరకు వెళ్ళి, "ఇక నుంచి నేను ఏ భక్తుల దగ్గరా బలవంతంగా డబ్బు తీసుకోను. అసలు ఎవరినీ డబ్బు అడగను. ఎవరైనా ఇస్తే తీసుకుంటాను. మీరూ గుహకు అద్దె ఇవ్వన వసరం లేదు. నా యందు దయవుంచి మీరు తిరిగి విరూపాక్ష గుహకు రావలసినదిగా కోరుతున్నాను," అని బ్రతిమాలి స్వామిని ఒప్పించాడు.

స్వామి తిరిగి విరూపాక్ష గుహకు వెళ్లారు. అది క్రమంగా చిన్న ఆశ్రమరూపం తాల్చింది. స్వామి ఉనికి, చూపు, మనుష్యుల్లో, పశు - పక్ష్యాదుల్లో పరివర్తనం కలగడంవల్ల భక్తులు యాత్రికులే కాక, ఊళ్లోంచి పిల్లలు, పెద్దలు వచ్చి స్వామి దర్శనం చేసుకునే వారు. మధ్యాహ్నాలు పశువులు, వాటి కాపరులు, స్వామి చుట్టూ చేరేవారు. అలాగే కట్టెలకు. పచ్చగడ్డికి కొండపైకి వెళ్లిన వారు స్వామి చెంతే, విశ్రమించేవారు. ఆ రోజుల్లో స్వామే వంట చేసే వారు. ఒక రోజున ఎసరు ఎక్కువ పెట్టారు. గంజి ఎక్కువ వచ్చింది. ఆ గంజిలో ఉప్పు, శొంఠిపొడి వేసి బీదలకు పోశారు. మరొక రోజున ఒక గొర్రెపిల్ల కాలు జారి కొండ రాళ్ళలో పడిపోతే. ఆ గొర్రెల కాపరి - ముసలమ్మ ఏం చెయ్యలేక పెద్దగా గోల పెడుతూవుంటే, స్వామి పరుగు, పరుగున వెళ్ళి, గొర్రెపిల్లను రాళ్ళలోంచి తీసి, భుజాన వేసుకుని వచ్చి, ఆ ముసలమ్మకు ఇచ్చారు. ఆ రోజుల్లోనే కుంభకోణంనుంచి "నల్ల పిళ్లై" అనే ఆయన వచ్చి, స్వామిని ఫొటో తీశారు. అరుణాచలం వచ్చాక, స్వామికి తీసిన మొదటి ఫొటో అది.

ఊళ్లోంచి పిల్లలు కొండమీదకు వెళ్ళి, స్వామి చుట్టూ చేరే వారు. వాళ్లు అక్కడే ఆడుకునేవారు. వారితో కలిసి స్వామి గోళీలు ఆడేవారు. ఒక్కొకసారి మరీ చిన్న పిల్లలు కూడా వెళ్ళే వారు.

వాళ్లు గుజ్జనగూళ్ళు వండి, బొమ్మల పెళ్ళిళ్లు చేసి, స్వామికి ఫలహారాలు పెట్టేవారు. కొందరు స్వామి దగ్గరకు వెడుతూ మిఠాయీలు తీసుకువెళ్ళేవారు. దీపావళి వస్తే, పిల్లలు స్వామి దగ్గర టపాకాయలు కాల్చేవారు. స్వామి అంటే పిల్లలకు అంత ఇష్టం. ఒక రోజున స్వామి గుహ ముందు ఒంటరిగా కూర్చున్నారు. ఎనిమిదేళ్ళ కుర్రాడొకడు స్వామి దగ్గరకు వెళ్లి, చాలా సీరియస్‌గా "ఎందుకు ఇక్కడ ఒంటరిగాకూర్చున్నావు?" అనిఅడిగాడు. దానికిస్వామి, "ఇంటిదగ్గర కష్టాలు వచ్చి, వచ్చేశాను," అన్నారు. "అలాగా? అయితే నీకు తిండి ఎలాగ?" అని మళ్ళా అడిగాడు, చాలా జాలిగా.

"ఎవరైనాపెడితే తింటాను," అన్నారు స్వామి. "మా యజమాని చాలా మంచివాడు. నిన్ను, నేను ఆయన దగ్గరకు తీసుకువెడతాను. మొదట్లో నువ్వు ఆయనకు ఊరికే పనిచేసి పెట్టు. ఆయన నీకు తిండిపెడతాడు. నీ పని చూసి, ఇష్టపడితే, రోజుకో అర్థణా (మూడుపైసలు) ఇస్తాడు. క్రమంగా నీ జీతం పెంచుతాడు. మంచివాడు." అన్నాడు. "సరే, అలాగే చూసి పెట్టు," అన్నారు స్వామి, అంత సీరియస్‌గానూ.

విరూపాక్ష గుహకు కర్ర తలుపులు ఉండేవి. గుహలో ఒకే ఒక కుండ ఉండేది. స్వామి అరుణాచలంపై వారం, పదిరోజులు అటూ-ఇటూ తిరిగి, తిరిగి గుహకు చేరుకునేవారు. స్వామివెంట పళని స్వామి ఉండేవారు. ఆయన దగ్గర ఎప్పుడూ ఒక నోట్‌బుక్ ఉండేది. స్వామి అనుచరులు ఆకాగితం, ఆకాగితం చేర్చి, ఒక పుస్తకంగా కుట్టి పళనిస్వామికి ఇచ్చేవారు. ఆపుస్తకాలే పళని స్వామి ఆస్తి. తక్కిన కార్యక్రమాలు వాసుదేవశాస్త్రి చూసేవారు. గుహనమశ్శివాయ వద్ద ఉండే ఒక ముదుసలి అరుణాచలం మీద ఆకు కూరలు ఏరుకుని, వండుకుని తాను తిని, కొంత భగవాన్‌కి పెట్టేది. ఒక్కొసారి స్వామి ఆమె దగ్గరకు వెళ్ళి, సహాయం చేసేవారు.

భక్తులు భిక్షచేసి తీసుకొచ్చిన అన్నాన్ని విరూపాక్ష గుహలో వుండేవారంతా తినేవారు. ఆ సమయానికి ఎక్కువమంది వుంటే, ఆ అన్నాన్ని బాగా కలిపి, పిసికి వేడినీళ్ళు పోసి, ఆ జావ తలొక గ్లాసూ తాగేవారు. ఒక్కోసారి ఉప్పుకూడా వుండేది కాదు. కొనేందుకు ఎవరి దగ్గరా కాసు వుండేదికాదు.ఎవరైనా,"ఉప్పువుంటే" అని అంటే,"ఇప్పుడు ఉప్పుకోరితే, తర్వాత పప్పు,పాయసం వరకూ పోతుంది కోర్కె," అని భగవాన్ అనగానే, అందరూ కిక్కురు మనకుండా ఆ జావ తాగేవారు. కేవలం కోర్కెల్ని పెంచకుండా వుండేందుకే కదా, సాధన?

1900 - ప్రాంతంలో తనను ఆధ్యాత్మిక మార్గాన నడిపే గురువును వెతుక్కుంటూ, గంభీరం శేషయ్యగారు స్వామిసన్నిధి చేరారు. ఆయన మున్సిపల్ ఓవర్‌సీయర్‌గా పనిచేసేవారు. ఆయన ప్రతిరోజూ ఊళ్ళోంచి స్వామి దర్శనానికి విరూపాక్ష గుహకు వచ్చేవారు. స్వామికి వంట, ఇతర పనుల్లో సహాయం చేసేవారు. తాను స్వామి దాసుడనని చెప్పుకునేవారు. ఆయనకు యోగ మార్గం తెలుసుకోవాలనే కుతూహలం వుండేది. ఆయన వివేకా నందుని చదివి, ఆధ్యాత్మిక జీవనానికి ఉత్తేజితులైనారు. ఆయన వద్ద ఎన్నో గొప్ప గ్రంథాలున్నాయి. వాటిని స్వామికి ఇచ్చేవారు. స్వామి వాటిని చదివి సారాంశాల్ని చిన్న, చిన్న కాగితాల మీద రాసి, శేషయ్యగారికి ఇచ్చేవారు. ఆయన ఆ కాగితా లన్నింటినీ కట్టలు కట్టి, దాచేవారు. శేషయ్యగారి మరణానంతరం ఆ కాగితపు కట్టలన్నీ శ్రీరమణాశ్రమానికి అందజేయబడ్డాయి. వాటిల్లో కొన్ని స్వామి చెప్పగా శేషయ్యగారు రాసుకున్న సంగతులూ వున్నాయి. వాటినన్నింటినీ నటనానందస్వామి ఏరి, కూర్చి "విచార సంగ్రహ-ప్రశ్నోత్తరము" అనే పుస్తకంగా తయారు చేశారు. దాన్నే

"SELF - ENQUIRY"గా ఇంగ్లీషులోకి అనువదించారు. 1931లో ప్రణవానందులు దాన్ని తెలుగులోకి తర్జుమా చేసి, "విచార సంగ్రహం"గా ముద్రించారు.

* * *

స్వామి విరూపాక్ష గుహలో వుంటే, శేషాద్రి స్వామి వారికి కొంచెం దూరంలో, కొండ దిగువ భాగంలో వుండేవారు. ఆయన తరచు స్వామి దర్శనానికి వెళ్ళేవారు. శేషాద్రి స్వామి అన్నం తినేప్పుడు సహజంగా చిన్నపిల్లలకన్నా అన్యాయంగా విస్తరి చుట్టూ అన్నం మెతుకులు ఉండేవి. ఎవరు పిలిచినా భోజనానికి వెళ్ళని శేషాద్రిస్వామి, అప్పుడప్పుడూ విరూపాక్ష గుహకు వెళ్ళేవారు. ఆ రోజుల్లో స్వామీ, వారి శిష్యులూ భిక్షాన్నం తినేవారు. భిక్షాన్నం పారేయకూడదని వారి నియమం. ఆ సంగతి తెలిసి ఒకరోజున శేషాద్రిస్వామి భోజనానంతరం స్వామితో, "ఈ రోజు నా విస్తరి చూడండి, ఎంత శుభ్రంగా వుందో? ఒక్క మెతుకైనా వృథాకాలేదు" అన్నారు ఎంతో అమాయకంగా. స్వామి చిరునవ్వారు.

శేషాద్రిస్వామికి ఇతరుల ఆలోచనలు తెలుసుకోగల శక్తి వుంది. ఆయన ఒకసారి స్వామి ఆలోచనలు గమనించాలన్నట్లు, స్వామి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ కూర్చున్నారు. స్వామికి ఏం ఆలోచనలుంటాయి? ఆయన ఏనాడో విశ్వాత్మలో ఐక్యమైనారు. శేషాద్రిస్వామి, స్వామిని ఉద్దేశించి, "ఇది ఏం ఆలోచిస్తోందో ఏమీ తెలియకుండా వుందే!" అన్నారు. దానికి స్వామి సమాధానం చెప్పలేదు.

శేషాద్రిస్వామి మళ్ళా అన్నారు, "అరుణాచలాన్ని ఆరాధిస్తే, అది తప్పక అనుగ్రహిస్తుంది. ముక్తీ లభిస్తుంది,"

అని. దానికి స్వామి, "ఆరాధించేదెవరు? ఆరాధించేది ఎవరిని?" అని ఎదురు ప్రశ్న వేశారు. ఆ మాటకు శేషాద్రిస్వామి విరగబడి నవ్వి, "అదేస్పష్టంగా తెలియడం లేదు" అన్నారు. ఆ సందర్భంలో స్వామి ఏకత్వం గురించి ఎంతో మాట్లాడారు. ఆ మాట్లాడిన దాంట్లో ఎక్కడా, దేంట్లోనూ భిన్నత్వం, వ్యత్యాసం, ప్రత్యేకం అంటూ ఏమీ లేదు. "ఉన్నదంతా ఎప్పుడూ ఒకటిగా, శాశ్వతంగా వుంది. ఆరాధన, ఆరాధించేవారు, ఆరాధింపబడేది అంతా భ్రాంతి. అది తొలగిపోవాలి. సకలేశ్వరుడైన ఈశ్వరుడు, ఈ విశ్వమంతా వ్యాపించి వున్నాడు. అయినా నిరాకారంగా, నిర్గుణంగా వున్నాడు. మళ్ళా ఆయనే అనేక రూపాలు ధరించి, లోకమంతా విస్తరించి, ఏ మార్పూ లేకుండా వున్నాడు. ఆయనే అసలు పరమాత్మ. అంతా ఆత్మే అయినప్పుడు, ఇంక ఆయన్ని ఆరాధించే ఆత్మ ఏది?" అన్నారు స్వామి.

ఆ మాటలు విని శేషాద్రిస్వామి యోచించి, యోచించి, "నేను ఏమీ అనలేను. ఇదంతా అయోమయంగా వుంది. ఏమైనా నేను అరుణాచలేశ్వరుని ఆరాధిస్తాను," అని అరుణాచలం వైపు తిరిగి, ముమ్మారు నమస్కారాలు పెట్టి, వెళ్ళిపోయారు.

శేషాద్రిస్వామి ఏమీ తెలియనివారు కాదు. సమస్త చరాచరాన్ని ఈశ్వరరూపంగా దర్శించిన మహాత్ములు. కాని, ఒక్కొక్కసారి అట్లా అమాయకంగా, ఏమీ తెలియనట్లు మాట్లాడేవారు. ఒకసారి నారాయణస్వామి అనే ఆయన శేషాద్రి స్వామిని అడిగారు, "స్వామీ ఏమిటి అట్లా తీక్షణంగా చూస్తు న్నారు?" అని. దానికి శేషాద్రిస్వామి "నేను దీన్ని చూస్తున్నాను," అన్నారు. ఆయన ఎదురుగా ఒక దున్నపోతు వుంది. శేషాద్రి స్వామి చూస్తున్నది, ఆ దున్నపోతునే ననుకుని, ఆశ్చర్యంతో "స్వామీ, ఈ దున్నపోతునా, మీరు చూస్తున్నది" అని అడిగాడు.

"ఇది ఏమిటో చెప్పు?" అన్నారు శేషాద్రిస్వామి; దాన్ని వేలుతో చూపుతూ.

"అది దున్నపోతు" అన్నారు నారాయణస్వామి. శేషాద్రి స్వామి నవ్వుతూ, "అది దున్నపోతా? దున్నపోతా? నువ్వు దున్నపోతు. దాన్ని "బ్రహ్మ" అను" అంటూ వెళ్ళిపోయారు. శేషాద్రిస్వామిది భక్తి తత్వం. అప్పుడప్పుడూ ద్వంద్వాన్ని అతిక్రమించేవారు. స్వామి సూర్యుడైతే, శేషాద్రి స్వామి చంద్రుడై అరుణాచలంలో కొన్నాళ్లు ప్రకాశించారు.

"శివప్రకాశం పిళ్ళై" అనే ఆయన దక్షిణ ఆర్కాట్ జిల్లా కలక్టరేట్ లో పనిచేస్తూ. జమాబందికి 1902లో తిరువణ్ణామలై వచ్చి, స్వామిని దర్శించారు. ఆయన యూనివర్శిటీలో - తత్వశాస్త్రంలో పట్టభద్రులైనారు. చదువుకునే రోజులనుంచీ ఆయన్ని "నే నెవరు?" అనే ప్రశ్న వేధిస్తోంది. ప్రథమ దర్శనంతోనే, ఆయన స్వామి భక్తులైనారు. మేధావంతులైన రమణ భక్తులలో ఆయన ఒకరు.

స్వామి మౌనంగా వున్న రోజులవి. కాని, స్వామి శివప్రకాశం పిల్లై ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చారు. ఒక ప్రశ్నకు మాత్రం పలకమీద రాసి, చూపారు. ఆ ప్రశ్నోత్తరాలు 1923లో "నే నెవడను?" అని తెలుగులోనూ, "Who am I" అని ఇంగ్లీషులోనూ పుస్తక రూపంలో వెలువడ్డాయి.

శివప్రకాశం పిళ్ళై :- స్వామీ, నే నెవరిని? నేను ముక్తిపొందేది ఎట్లు ?

స్వామి :- "నే నెవడను?" అని నిరంతరం, లోదృష్టితో విచారణ చేస్తే, నిన్ను నువ్వు తెలుసుకోగలవు. తద్వారా ముక్తి లభిస్తుంది.

శివ :- అసలు నే నెవరిని స్వామీ?

స్వామి :- నిజమైన "నేనే" ఆత్మ. అది దేహం కాదు. పంచేంద్రియాలు - పంచ భూతాలు - పంచ జ్ఞానేంద్రియాలు - పంచ కర్మేంద్రియాలు - ప్రాణాదివాయు పంచకం- మనసు - గాఢ నిద్రావస్థ ఏ ఒక్కటీ "నేను" కాదు.

శివ :- ఇవన్నీ "నేను" కాకపోతే, ఇంక ఆ "నేను" ఏమిటి?

స్వామి :- అవును, అవన్నీ "నేను" కాదు. "ఏదీ" "నేను కాదు:" అని అన్నింటిని నిరాకరించాలి. అంటే, "ఇది నేను కాదు - అది నేను కాదు - ఇదీ నేను కాదు" అంటూ వెళ్ళగా, వెళ్ళగా చివరికి "అసలు నేను" మిగులుతుంది. అదే "ఎరుక". దాన్నే "సచ్చిదానందం" అంటారు. ఆ స్థితిలో ఏ కొంచెం కూడా "నేను" అనే ప్రత్యేక తలుపు ఉండదు. దాన్నే "ఆత్మ" అంటారు. ఉన్నదీ అది ఒకటే. "ప్రపంచం - అహంకారం - దైవం" అనే త్రిమూర్తిత్వాన్ని విడి విడి అనుకున్నట్లయితే, అది కేవలం భ్రాంతే అవుతుంది. ఆ మూడూ నిజంగా శివస్వరూపం. అదే ఆత్మస్వరూపం.

శివ :- ఆ సత్యాన్ని గుర్తించేది ఎట్లు ?

స్వామి:- దృశ్యప్రపంచం అదృశ్యమైతే, సాధకుని నిజస్వభావం బైటపడుతుంది.

శివ :- బాహ్యప్రపంచాన్ని గుర్తించినంతకాలం అది సాధ్యం కాదా?

స్వామి:- సాధ్యం కాదు. వెతికేవాడు - వెతకబడేది - అది కేవలం రజ్జు - సర్ప భ్రాంతే! తాడును చూసి, సర్పం అనుకునే భ్రాంతి తొలగేవరకు సాధ్యం కాదు. అసలు వున్నదేదో, అది సర్పం కాదు. బాహ్య ప్రపంచంతో సంబంధం వున్నంతకాలం అది "తాడు" అని స్పష్టంగా చూడము.

* రజ్జు - సర్ప భ్రాంతి కేవలం మసక వెలుతురులోనే కాని, కటిక చీకటిలో కాదు, పూర్తి వెలుగులోనూ కాదు.

శివ :- బాహ్య వస్తువులు, విషయాలు, ఎప్పుడు అదృశ్య మౌతాయి?

స్వామి :- అన్ని ఆలోచనలకూ, సర్వ కర్మలకూ కారణభూత మైన మనసు అదృశ్యమైనప్పుడు విషయాలు, బాహ్య వస్తువులు అదృశ్యమౌతాయి.

శివ :- మనసు స్వభావం ఏమిటి ?

స్వామి :- మనస్సంటే, ఆలోచనలు. అదొకరకమైన శక్తి. ఆ శక్తి, సూక్ష్మరూపంలో మనసుగా, స్థూలరూపంలో మేధస్సుగా వుంటుంది. దానికి వ్యాప్తి చెందే గుణం వుంది. అది ప్రపంచంగా రూపొందుతుంది. మనసు ప్రపంచాన్ని సృష్టించుకున్నంత కాలం, ఆత్మదర్శనం అసాధ్యం.

శివ :- మనసు ఏవిధంగా అదృశ్యమౌతుంది.

స్వామి :- "నేనెవడను?" అను విచారణ ద్వారా మనసు అదృశ్యమౌతుంది. ఆ విచారణ కూడా మనో కల్పి తమే. అయినా అది అన్ని మనోవ్యాపారాల్ని నాశనం చేస్తుంది. ఎట్లానంటే, చితికి నిప్పు పెట్టే కొరివి, అన్ని కట్టెలతో పాటు కాలిపోయినట్లు. అలాగే "నేను" అనే ఆ ప్రత్యేక వ్యక్తిత్వ తలంపు నాశనమౌతుంది. నువ్వు ఏమైనా చెయ్యి. ఆ చేసేదాంట్లో అహంకారం వుండకూడదు. అంటే, "నేను" అనే భావం. ఆ స్థితిని అందుకున్నవానికి నిజమైన భక్తి కుదురుతుంది. అప్పుడు ఆ అహం వెళ్లి, ఆత్మ చెంత శరణాగతి పొందుతుంది.

శివ :- నా మనసు నాశనం కావడానికి మరి ఇంకే మార్గాలూ లేవా?

స్వామి :- మరో సరైన మార్గంలేదు. "నేనెవడను?" అన్న విచార మార్గంతప్ప. మరొక సాధనైతే అది మనసుకు జోలపాడి, నిద్రపుచ్చుతుంది. కాని, ఆమనసు మళ్ళా మేల్కొని, పైకిలేచి, పూర్వం మాదిరిగా పని చేస్తుంది.

శివ :- ఎంతకాలం ఆ సాధన చేయాలి?

స్వామి :- ఆలోచనలు సాగేంతవరకు.ఆలోచనలుతలెత్తినప్పుడు ప్రతి ఆలోచనను— మూలంలోనే అంటే మరో ఆలోచన కలగక ముందు దాన్ని పైకి లేవనీయకుండా అణచేస్తే, అంటే, దాన్నే "వైరాగ్య" మంటారు. ఆత్మ సాక్షాత్కారం కలిగేవరకు "నేనెవడను?" అనే సాధన చేయవలసిందే. నిరంతరం ఆత్మవిషయమై ఎడతెగని ఎరుక స్ఫురణ — ప్రజ్ఞ—తెలివి— దృష్టి వుండవలె.

శివ :— ఈశ్వర నిర్ణయ ఫలితంగా ఏర్పడ్డది ఏది?ఈ ప్రపంచం కాదా? అలాగైతే, భగవంతుడు ఆ విధంగా ఎందుకు చేశాడు?

స్వామి :- భగవంతునికి ఒక ఉద్దేశ్యమంటూ లేదు. ఏ కర్మా ఆయన్ని బంధించదు. ప్రపంచంలో జరిగే యావత్ కర్మకలాపం ఆయన్ని ఏమీ చేయలేదు. ఏ వాంఛా, ఏ ఉద్దేశ్యం లేకుండా సూర్యుడు ఉదయిస్తాడు. ఉదయించడానికి ప్రయత్నం చేయడు. కానీ, సూర్యోదయం కాగానే, అనంతమైన కార్యకలాపం ఆరంభమౌతుంది. సూర్యకిరణ ప్రసారమార్గంలో ఒక గాజు ముక్క అడ్డుపెడితే, కేంద్రీకృత సూర్యశక్తి ప్రభావం వల్ల అగ్ని పుడుతుంది, తామరమొగ్గలు

విచ్చుకుంటాయి. ఎంత కర్మ జరిపినా, అవి నేలకు ఒరుగుతాయి చివరకు. వాటి కర్మ సూర్యుణ్ణి తాకదు, అంటదు. ఏ కర్మా సూర్యుణ్ణీ ఏమీ చేయలేదు. సూర్యుడు తన స్వభావానుసారం పనిచేస్తాడు. అంతే! ఒక నిర్ణీతమైన, స్థిరమైన, న్యాయబద్ధమైన, ధర్మ బద్ధమైన - ధర్మం ప్రకారం పనిచేస్తాడు; ఉద్దేశ్య రహితంగా. తక్కిన కార్యకలాపానికి అంతకూ సాక్షిగా వుంటాడు. అటువంటిదే, ఈశ్వర తత్వం. అదేవిధంగా పంచ భూతాల్లోని ఆకాశాన్ని తీసుకోండి. ఆకాశంలో అగ్ని, వాయువు, భూమి, నీరు వున్నాయి. అవి ఆకాశంలో మార్పు చెందుతో, సరిదిద్దుకుంటో వుంటాయి. అయినా అవి ఏవీ ఆకాశాన్ని ఏమీ చేయలేవు. వాటివల్ల ఆకాశమూ ఏమీ కాదు. అలాగే, భగవంతుడు కూడా దేనివల్లా ఏమీ కాడు. ఆయన తన స్వంత సృష్టి విషయంలో కూడా ఉద్దేశ్య రహితంగా వుంటాడు. సృష్టి - స్థితి - లయ విషయాల్లో కూడా ఉద్దేశ్య రహితంగా వుంటాడు, ఏ కర్మ చేత ఆయన బంధించబడడు.

* * *

"నే నెవడను?" అను విచారమార్గం క్లిష్టంగా కనుపించడం చేత, చాలామంది పదే, పదే అదే ప్రశ్న అడగడం చేత స్వామి చాలాసార్లు ఆ సాధనా మార్గానికి వివరణ ఇచ్చి విశదపరిచారు. అందుచేత "నే నెవడను?" అను విచారమార్గం, ఈ గ్రంథంలో అనేక సందర్భాల్లో, అనేక చోట్ల అనేక కోణాలనుంచి చూపబడింది.

మనలో నిరంతరం 'నేను-నేను' అంటో అవిచ్ఛన్నంగావున్న దేదో, అదే 'ఆత్మ'. అది అనంతం- అపారం- అఖండం- అవినాశి. దాంట్లోంచి "నేను" అనే ప్రత్యేక తలంపు-అదే వ్యక్తిగతమైన "నేను" (జీవుడు) పుడుతుంది. అదే "అహం". అది జడమూ కాదు, చైతన్యమూకాదు. కాని, అది చైతన్యవంతమైన ఆత్మనూ, జడ దేహాన్నీ కలుపుతుంది. అందుచేత ఆ అహంలో అటు చైతన్యం ఇటు జడం రెండూ ప్రతిఫలిస్తాయి. నీటి బుడగగా వున్నంతసేపూ, అది ప్రత్యేకంగా నిలుస్తుంది. బ్రద్దలై, నామ - రూపంలేకుండా నీటిలో కలుస్తుంది. బుడగలు అనంతం. నీరు ఒక్కటే! అవి ఒక దానికొకటి సంబంధం వుండవు. కాని, నీరు - బుడగ ఒకే నీరు.

జీవుడు లేక అహంకరణ లేక, వ్యక్తి-నిద్రావస్థలో హృదయంలో వుంటాడు. మేల్కొగానే మేధస్సులో ప్రవేశిస్తాడు. దాని విచిత్ర శక్తే, మనస్సు ఆమనను ఆలోచనామయం. అంటే. తలపుల, భావాల, సంకల్పాల మయం. మనసుకు అవే ఆధారం. అవి లేక పోతే, మనసు లేదు. కాని, గాఢనిద్రలో సంకల్పాలు, భావాలు, తలపులుఏమీవుండవు. ప్రపంచమూవుండదు. మేల్కొగానే "నేను"అనే తలంపు పుడుతుంది. దానితో దేహ స్ఫురణకలుగుతుంది. ఆ వెంటనే మనసు క్రీడ ఆరంభమౌతుంది. తత్ఫలితంగా సర్వేంద్రియాలు పనిచేయనారంభిస్తాయి. ప్రపంచమూ గోచరమౌతుంది. సంబంధాలు ఏర్పడతాయి. మనసు- దేహేంద్రియాలు కలిసి పనిచేయడంతో, మనం మేల్కొన్నాం అనుకుంటాం.

నిద్రలో లోకంలేదు. మేల్కొగానే ఆలోచనలు ఆరంభమౌతాయి. ప్రపంచం ఎదురౌతుంది. నిద్రలో దేహం, ప్రపంచం లేకపోయినా, మనం వుంటాం. అంటే, మెలకువలో వున్నట్లుగానే 'నేను' వుంటుంది. తేడా ఏమిటంటే, మెలకువలో దేహస్ఫురణ వుంటుంది. అందుచేత దేహమే, 'నేను' అనుకుంటాం. అదే దేహాత్మ బుద్ధి. అది దుఃఖ కారణం.

ఆ 'నేను' ఎక్కడ పుడుతోందో తెలుసుకోవాలి. మనసు- "నేను" అనే ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సృష్టించుకుని, దేహంతో తాదాత్మ్యం చెంది, అసలు వున్నదానికి భిన్నంగా ప్రవర్తిస్తుంది. బైటు చెడ తిరిగి 'నేను అజ్ఞానిని, పాపిని, అవివేకిని, పనికి మాలిన దానిని' అని మనసు అనుకుంటో అశాంతిగా కొట్టుకుంటుంది. అసలు మనసు స్వభావమే అది.

మనసు తాను కల్పించుకున్న దాన్ని వాస్తవంగా తీసుకుని, దాని వెనకనున్న అసలు సత్యాన్ని ఒదిలేస్తుంది. పేపరు మీద అచ్చయిన అక్షరాల్ని చదివి, అసలు పేపర్ని ఉపేక్ష చేసినట్లు.

బైట ఏదైనా ఒకటి కొత్తగా కనుపించిందంటే, అది తప్పక అదృశ్యమౌతుంది. ఏదైనా ఒకటి నిర్మాణం అయిందంటే, అది తప్పక నాశనమౌతుంది. బైట కనుపించేవన్నీ, వాటి అంతాన్ని మోసుకుంటో వుంటాయి.

ఉన్నది మనం. మనమే అంతా. మనమే ఆత్మ. దాన్ని ఏ పేరుతో అయినా పిలవవచ్చు. అదే అసలు సత్యం. దాన్ని తెలుసు కోవడమే, అంతిమ జ్ఞానాన్ని తెలుసుకోవడం.

'నువ్వు' అంటే, దేహం ఒక్కటే కాదు. నీ దేహం, ప్రపంచం, దాని మార్గాలు-అన్నీ నీలో వున్నాయి. నువ్వు వాటిల్లో లేవు. కాని, నువ్వు వాటిల్లో ఒకటి. నువ్వు దేహాత్మ బుద్ధివదలితే, దేహం-దాని కదలికలూ నిన్ను ఏమాత్రం చలింపచేయవు, చేయలేవు.

"నువ్వు" అంటే, దేహమంతా నువ్వు కాదు. నువ్వు దేహమంతా వ్యాపించినా, ఒక కేంద్రం నుంచే ఆలోచనలు పుడతాయి. అవి తిరిగి అక్కడే అణగుతాయి. ఆ కేంద్రమే, హృదయం. అది కేవలం దేహమధ్యభాగమని కాదు. కాని, అదే ఆత్మ. దానికి మరో పేరే, హృదయం.

"నువ్వు" నీరు మాదిరిగా వున్నావు. ఈ సమస్త చరాచరం నీపై తేలియాడే నీటి బుడగలు. నీరు లేకుండా అవి నిలవలేవు. నీరు లేకపోతే, వాటికి ఉనికే వుండదు. అంటే, నువ్వు లేకపోతే, ఏమీ లేదు. అవి నీరువంటివి కావు. ఆ రహస్యం తెలుసుకుంటే, సందేహాలే వుండవు.

జడమూ, పరిమితమూ, అశాశ్వతమూ అయిన దేహం. "నేను" అనదు. అపారం - అనంతం - శాశ్వతం - చైతన్యవంతం అయిన ఆత్మ "నేను" అనదు. అయితే "నేను" అనేది ఎవరు? చేతనానికీ; అచేతనానికీ మధ్య ఈ "నేను", ఒక ముడిగా వుంటుంది అంటారు. కొందరు. అజ్ఞానంవల్ల అబద్ధపు భ్రాంతులూ; తరతరాలనుంచి వచ్చే విషతుల్యమైన వాసనలూ, అలవాట్లూ కలసి మనలో ఒక ముడిగా ఏర్పడతాయి. ఆ ముడి, బైట లేదు. బైట వుంటే, దాన్ని ఏదోవిధంగా విప్పవచ్చు. లోపల వుంది గనుకనే, దాన్ని ఎవరికి వారు తెంచుకోవాలి.

ఆ ముడి భ్రూమధ్యలో వుంటుందంటారు మరికొందరు. ఇంకొందరు ఇంకోచోట అంటారు. వాళ్ళంతా దేహాన్ని దృష్టిలో పెట్టుకుని చెపుతారు. గట్టిగా యోచిస్తే, ఈ దేహంకూడ "నేను" అనే ప్రథమ తలంపు ద్వారా ఏర్పడినదే కదా? ఆ సంగతి మరుస్తారు. ఆ ముడే హృదయ గ్రంథి. ఆత్మ సాక్షాత్కారానంతరం ఆ గ్రంథి తెగిపోతుంది అంటారు.

నువ్వు ఏ రకం సాధన చేసినా ధ్యానం - ఆరాధన ఏదైనా కాని, అది అహంతో కూడినదే! సాధనతో అహం పోగొట్టు కోవడమే ముఖ్యం. "నేను కర్తను" అనే భావం పోవాలి: చేసేది వైరాగ్య భావంతో చేయాలి. వైరాగ్యమంటే, అనాసక్తత సమత్వం - వాంఛా రహితం - నిర్మలం - నిశ్చింత - నిశ్చయమైన మనసు. వాంఛా, మమకారం మనసుకు చెందినవి. మనసు అదుపులో వుంటే, అవి అణగిపోతాయి. అదే వైరాగ్యం. "విచారణే, వైరాగ్యానికి దగ్గర దారి" అన్నారు స్వామి.

స్వామి ఎప్పుడూ ఏదో ఒక గ్రంథం చదవడమో, లేక ఏదో వెతుక్కుంటున్నట్లు అరుణాచలంపై అటూ, ఇటూ తిరగడమో చేసేవారు. తన చుట్టూ వున్న వారికి. తాను చదివినవి వివరించి చెప్పేవారు. అప్పుడప్పుడూ కొన్ని సంగతులకు వ్యాఖ్యలు రాసే వారు. ఆ రోజుల్లో చిదంబరం నుంచి ఒక శాస్త్రిగారు వచ్చి, "వివేక చూడామణి" పుస్తకం ఇచ్చి వెళ్ళారు.

విరూపాక్ష గుహకు దగ్గరలో పులులు, చిరుతలు తిరిగేవి. వాటిని చూసి, ఆశ్రమవాసులు భయపడి పారిపోయేవారు. లేదా, గుహలో దూరి తలుపులు వేసుకుని, స్వామిని కూడా లోపలకు రమ్మని పిలిచేవారు. స్వామికి భయమేమిటి? అన్నింటిని చూస్తున్నట్లే వాటినీ చూస్తూ, స్థిరంగా కూర్చునేవారు. అంతటా ఒకే చిద్వస్తువును దర్శించు మహాత్ములకు భయమేమిటి? మనకు విడిగా, భిన్నంగా, అన్యంగా వేరొకటి లేదు. స్వామి దృష్టిలో పులీ, తానూ, అన్నీ, అంతా ఒకటే - సమానమే. ఏదీ ఆయనన్నించి భిన్నంగా లేదు. "పులి అంటే భయం కాదా?" అని స్వామిని అడిగితే, "ఎవరైనా తనను తాను చూసి భయపడతారా? భయపడితే, అది అవివేకం. ఆత్మతప్ప, అన్యంలేదు." అన్నారు.

స్వామి అరుణాచలం వచ్చిన రోజున జల్లువానలో తడచినదే స్నానం. మళ్ళా నాలుగు మాసాలవరకు ఆయన స్నానం చేయలేదు. ఆ తర్వాత ఒకామె దయతలచి తలంటుస్నానం చేయించింది. ఓ సంవత్సరానికి గురుమూర్తంలో భక్తులు స్వామిని స్నానం చేయించారు. కాని స్వామి విరూపాక్ష గుహ చేరినప్పటి నుంచీ రోజూ స్నానం చేసేవారు. ఒక రోజున స్వామి పచ్చయమ్మన్ గుడి దగ్గర కొలనులో తలంటుస్నానం చేయడానికి బయలుదేరారు. ఆయన వెంట పలనిస్వామి, వాసుదేవశాస్త్రి, ఇంకా కొందరు భక్తులు ఉన్నారు. స్వామి స్నానం చేసి, తిరిగి తాబేలు బండ దగ్గరకు వచ్చేప్పటికి,

స్వామికి అకస్మాత్తుగా నీరసంగా అనిపించింది. ఆ తర్వాత ఏం జరిగిందో స్వామే చెప్పారు.

"నా కళ్ళముందున్న మైదానం, అకస్మాత్తుగా అదృశ్యమైంది. తెల్లని తెర కప్పినట్లు వుంది. పడిపోతానేమోనని వెంటనే ఆగిపోయాను. కొంతసేపటికి ఆ తెర తొలగింది. మళ్ళా నడక ఆరంభించాను. ఒక చీకటి తెర అడ్డం వచ్చింది. స్పృహతప్పింది. మళ్ళా స్పృహ వచ్చేటప్పటికి నేను ఒక రాతిని ఆనుకుని నిలబడ్డాను. తర్వాత నడవబోయాను. మళ్ళా నల్లని తెర అడ్డం వచ్చింది. ఇంక లాభం లేదని కింద కూర్చున్నాను. తల గట్టిగా ఊగింది. శ్వాస ఆగింది. శరీర ఛాయ కమిలినట్లుగా నీలంగా మారింది. అది మృత్యుఛాయ. ఆ ఛాయ క్రమంగా నల్లగా మారింది. వాసుదేవశాస్త్రి నన్ను చూసి, "స్వామి చనిపోతున్నారు" అని అనుకుని ఏడ్వ ఆరంభించారు. ఆయన ఏడ్పూ, రోదనా, మాటలూ నాకు వినిపించాయి. ఆయన వొణకడం కూడా నాకు కనుపించింది. ఆయన అన్న మాటలు, వాటి అర్థాలు అర్థమయ్యాయి. నా దేహఛాయ మారిన విధం గమనించాను. రక్తప్రసరణ ఆగిపోయింది. శ్వాస నిలిచిపోయింది. ఆపాదమస్తకం తట్టుకోలేని చలితో ఒణికాను. నా సహజచైతన్య స్రవంతి - పూర్తి ఎరుక - ఆ స్థితిలో కూడా స్థిరంగా సహజంగా వుంది. నా దేహస్థితి చూసి నేను భయపడలేదు. విచారించలేదు. ఆలోచించలేదు. మామూలుగా కూర్చున్నట్లే ఓ రాయి దగ్గర కూర్చున్నాను. కళ్ళు మూశాను. రాతిని ఆనుకోలేదు. రక్తప్రసరణ, శ్వాస అట్లానే వున్నాయి. ఆ స్థితిలో పది - పదిహేను నిమిషాలు వున్నాను. అంతలో దేహమంతా దెబ్బవంటి అదురు బయలు దేరింది. దానితో రక్తప్రసరణ తిరిగి ఆరంభమై ఉధృతమైంది. శ్వాస మామూలు స్థితికి వచ్చింది. దేహంలోని ప్రతి స్వేదరంధ్రంలోంచీ చెమట పోసింది. ఒంటికి మామూలు

రంగు వచ్చేసింది. కళ్లు తెరిచాను. పైకిలేచాను. "వెడదామా?" అన్నాను. బయలుదేరి ఏ ఇబ్బందీ లేకుండా విరూపాక్ష గుహ చేరుకున్నాం.

"నాకు వచ్చిన మూర్ఛవంటిది, అది ఒక్కటే. దాంట్లో శ్వాస, రక్తప్రసరణ ఆగిపోయాయి. పూర్వం అటువంటి శరీరోద్రేకాలు చాలా వచ్చాయి. కాని, ఇది చాలా ప్రమాదకరమైనది," అన్నారు.

స్వామికి చిన్నప్పటి మృత్యుఅనుభవం వంటిదే మళ్లాకలిగింది. అప్పుడూ, ఇప్పుడూ, రెండుసార్లూ విడవకుండా, ఆగకుండా, రాగం వెనుక శృతివలె, సంపూర్ణ ఎరుక" వుండనే వుంది. అదే విశేషం. కాని, రెండవసారి కలిగిన అనుభవ సమయంలో రక్తప్రసరణ, శ్వాస కొద్దికాలం వాటంతట అవి ఆగాయి.

ఆ అనుభవాన్ని ఆధారంగా తీసుకుని, "ఆది - మధ్యాంతం లేని బహుళ విస్తరణ జరిగినప్పుడు, ఏకత్వానందం కలుగుతుంది," అన్నారు స్వామి.

ప్రతి ఒక్కరికీ మృత్యుభీతి వుండటం సహజమే. అది అన్ని భయాల్లోకీ పెద్ద భయం. "తాను మృత్యురహిత ఆత్మను" అన్న సంగతి స్వామి ప్రథమ మృత్యు అనుభవంతోనే తెలుసుకున్నారు. మనిషిని భీతి చెందించేది, దేహం కాదు, దేహ స్ఫురణ. అదే స్మృతి. దానికి కారణం, మనిషిలో ప్రపంచాసక్తి అధికం కావడం.

స్వామి ఎప్పుడూ, ఎవరినీ, దేనినీ, దేనికి ఖండించేవారు కాదు, విమర్శించేవారు కాదు, నివారించేవారు కాదు, నిరోధించేవారు కాదు, నిందించేవారు కాదు. ఎవరినీ, ఏమీ అనకుండా ఊరికే జరిగి పోతున్న వాటిని చూస్తూ వుండేవారు. "జీవితాన్ని బంధించకు. తలుపులు పూర్తిగా తెరిచెయ్యి. నీలో అందరికీ, అన్నింటికీ, అన్ని వేళలా చోటియ్యి," అనేదే స్వామి తత్వం. అదే ఆయన మార్గం. అదే ఆయన శక్తి. ఆయన్ని సమీపించిన వారు ఏ వర్గానికి, ఏ మతానికి, ఏ సిద్ధాంతానికి, సాంప్రదాయానికి, ఏ పద్ధతికి - చివరికి దేనికి చెందినవారైనప్పటికీ ఆయన ఎప్పుడూ ఎవరినీ, దేనినీ, దేనికీ ఖండించలేదు, విమర్శించలేదు. చివరికి జీవితంలో ఎదురైన దుర్మార్గుల్ని, దొంగల్ని, దుష్టుల్ని, శత్రువుల్ని తిరుగుబాటుదారుల్ని - ఎవరినీ ఎప్పుడూ ఆయన ఏమీ అనలేదు, ప్రశ్నించలేదు, కనీసం సందేహించలేదు. ఏమీ చేయలేదు. అందుచేత ఆయన్ని ఎవరూ ఏ కారణానికి సమీపించినా, వారి అహం అణగిపోయేది. ఆయన్ని ఏం చేయడానికి వారికి తోచేదికాదు, అది మౌనాన్ని మించిన గొప్ప ఆయుధం.

చెడు, దుర్మార్గం, అన్యాయం, అపకారం, అక్రమం మొదలైన వాటిని అడ్డగించక, ప్రతిఘటించక, మిమర్శించక ఖండిం చక, నిరోధించక, కాదనక - అసలు ఏమీ అనక జరిగిపోతున్న వాటి అన్నింటికీ సాక్షిగా వుండటం అనేది స్వామివంటివారి తత్వమై వుంటుంది. అటువంటి మహాత్ములు తమకే గాక, తమను అనుసరించిన వారికీ ఆ తత్వమే బోధిస్తారు. అదొక విదమైన జీవన విధానం. జీవితాన్ని ఈశ్వరార్పితం చేసిన వారికే అది సాధ్యం. అటువంటి వారికి జీవితంలో ఎటువంటి పరిస్థితి ఎదురైనా, వారు వాటిని ప్రేమతో స్వీకరిస్తారు-చివరికి అవి ఎంత దారుణంగా, ఘోరంగా పరిణమించినా సరే! తమకు తటస్థపడ్డ ప్రతి సంగతినీ

ఒకే విధంగా, సమదృష్టితో, ప్రేమభావంతో సరైనదిగా, అత్యంత అవసరమైనదిగా, సీరియస్‌గా తీసుకుంటారు. మహాత్ముల జీవితాలు పరికిస్తే, అటువంటి సంగతులే మనకు పరమ సత్యాలుగా, ప్రస్ఫుటంగా గోచరమౌతాయి. "మంచి జరిగితే భగవంతుడికి కృతజ్ఞత చెప్పుకుంటాం. చెడు జరిగితే, కృతజ్ఞత చెప్పము. మనిషి అక్కడే పొరబడేది," అన్నారు స్వామి. అంటే మంచీ - చెడూ అన్నీ, అంతా ఒకటేనని స్వామి భావన. ద్వంద్వాతీతులుగా జీవించమని స్వామి సూచన. అంటే, "మంచీ. చెడూ" అనడానికి ఒకటి వుండాలి. ఆ ఒకటీ అహం. అది ఆత్మలో లీనమైతే, ఇంక మంచీ చెడూ; పాపం - పుణ్యం ఏమీ వుండవు. అటువంటివారే ద్వంద్వాతీతులు.

"అసలు ఉన్నది ఒకటే సత్యం. ఒకటే ఆత్మ," అనే స్థిరభావం కలవారికి, బాహ్య ప్రపంచ క్రియాకలాప మంతా ఒక కలలాగ, చిత్తేజో పటంమీద కదలాడే బొమ్మలాట మాదిరిగా వుంటుంది. అటువంటి వారు సమస్తానికీ సదా సంపూర్ణ ఎరుకలో సాక్షీభూతులుగా వుంటారు. అదే స్వామి పద్ధతి. చెడు, దుర్మార్గం, అపకారం, అన్యాయం మొదలైనవి జీవితంలో ఎదురైనప్పుడు, అవి మరింత ఉపద్రవమై భయపెడుతున్నప్పుడు - అప్పుడు సైతం స్వామి వాటికి పూర్తి ఎరుకలో వుండి, కేవలం సాక్షిగా వుండే వారే కాని, వాటిని నిరోధించలేదు, అడ్డగించలేదు, ఖండించలేదు, నిరాకరించలేదు, నిందించలేదు, విమర్శించలేదు. ఏమీ చేయక వూరికే వుండేవారు.

అరుణాచలంపై మహాత్ములు, మహర్షులు, సాధువులు సాధకులతో పాటు దొంగ సాధువులు, కపట సన్యాసులు కూడా వుండేవారు. వారు భక్తులనుంచి, యాత్రికుల నుంచి పళ్ళు, ఫలహారాలు, డబ్బు తీసుకుని హాయిగా బ్రతికేవారు. స్వామి అరుణాచలంపై స్థిరనివాసం ఏర్పరచుకున్నప్పటి నుంచీ అటువంటి

కపట సన్యాసుల, దొంగ సాధువుల బ్రతుకులు బైట పడ్డాయి. దానితోవారు స్వామిపై ద్వేషం పూనారు. కాని, వాళ్ళంతా త్వరలో సూర్యుని ముందు దివిటీలై, క్రమంగా చెల్లా చెదురై నారు. కాని, ఆ దొంగ సాధువులు అరుణాచలం కొండ గుహల్లో సాధన చేసుకోవడానికి వచ్చే నిజమైన కొత్త సాధకుల్ని, నానా బాధలూ పెట్టేవారు. కొందర్ని భయపెట్టి తరిమేవారు. కొందరికి ప్రమాదాలు కలిగించేవారు.

స్వామి గురుమూర్తంలో ఉన్నప్పటి నుంచీ తెలిసిన ఒక సాధువు, అరుణాచలంపై ఒక గుహలో వుండేవారు. ఆయన జుట్టు బాగా పెరిగి, జడలు కట్టడం వల్ల అందరూ ఆయన్ని 'జటాస్వామి' అని పిలిచేవారు. కొండపైన ఆయనకో ఆశ్రమం వుంది. ఆయన బాగా చదువుకున్నవారు. ఆయన ఎన్నో గ్రంథాలు సేకరించి పెట్టుకున్నారు. అవి చాలావరకు సంస్కృత గ్రంథాలు. వాటిల్లో ఆయుర్వేద గ్రంథం కూడా వుంది. ఆయన వయసు మళ్ళినవారు. స్వామి అప్పుడప్పుడూ ఆయన ఆశ్రమానికి వెళ్ళి, ఆ గ్రంథాల్ని చదివేవారు. లేదా, కొంతసేపు ఆయన ఆశ్రమంలో వుండి ఆయనకు పూజలో సహాయం చేసేవారు-గంట వాయిస్తోనో, పువ్వులు దండలు కడుతోనో, పాత్రలు తోమి పెడుతోనో- ఏదో ఒక పని చేసేవారు. కాని, స్వామి చాలావరకు మౌనంగా వుండేవారు. వైద్య గ్రంథాలన్నీ చదివి, తోటి సాధువులకు, అవసరమైన వారికీ వైద్య రహస్యాలు చెప్పేవారు. ఒకసారి చదివితే చాలు ఏ విషయాన్నీ, ఎప్పటికీ మరచిపోయేవారు కాదు. ఆయన గ్రహించిన ప్రతి సంగతీ స్మృతిపథంలో శాశ్వత ముద్రపడిపోయేది. అందుచేత ఎప్పుడు ఏ గ్రంథ ప్రసక్తి వచ్చినా, "వాటికి బ్రాహ్మణస్వామి ప్రమాణం," అనే వారు జటాస్వామి.

స్వామి పవలకున్రిలో వున్నప్పుడు ఒక రోజున కొండపైన సెలయేరులో స్నానం చేయాలనుకున్నారు. ఆ సంగతి పలని స్వామితో చెప్పారు. ఆయన వెళ్ళి ఆ సంగతి జటాస్వామికి

చెప్పారు. తన కుటీరం దగ్గర వున్న సెలయేటిలో స్వామి స్నానానికి ఏర్పాటుచేశారు; జటాస్వామి. స్వామికి తెలియకుండా పలనిస్వామి వారిని ఆ సెలయేరు దగ్గరకు తీసుకువెళ్ళారు. అక్కడ జటాస్వామి వారికి బ్రహ్మాండమైన స్వాగతం ఏర్పాటుచేశారు. ఓ ఆసనం సిద్ధం చేశారు. పాలు, పళ్లు వుంచారు. జటాస్వామి భక్తి. శ్రద్ధలతో స్వామికి ఎదురేగి, స్వాగతం చెప్పారు. అటువంటి జటాస్వామి తర్వాత కాలంలో స్వామి యెడల దుర్మార్గంగా ప్రవర్తించారు.

ఒకసారి జటాస్వామి, స్వామి వుంటున్న గుహ మీదకు ఒక పెద్ద బండరాయి దొర్లించారు. భూకంపం వచ్చినట్లు కొండంతా దద్దరిల్లుతూ, ఆ రాయి స్వామి మీదకు దొర్లుకుంటూ వచ్చింది. స్వామి దాన్నించి తప్పించుకుని, పక్క దారిని జటాస్వామి దగ్గరకు వెళ్ళారు. ఆయన స్వామిని చూసి, సిగ్గుపడి, "ఏదో పరిహాసానికి చేశాను" అన్నారు. కాని, ఆయనకు స్వామి అంటే నిజమైన భక్తి, గౌరవం, ప్రేమ వున్నాయి. కాని, ధనం పోగుచేసుకోవాలనే బలీయమైన బలహీనత, ప్రబలంగా వుండటంచేత, ఆయన అప్పుడప్పుడూ అటువంటిపాడుపనులు చేసేవారు. జటాస్వామి చేసిన అపచారాలు, కుచేష్టలు ఎన్ని వున్నా, "అవన్నీ పరిహాసంకోసం చేసిన కొంటెపనులే కాని, స్వామి యెడల అసూయతో, ద్వేషంతో చేసినవి మాత్రం కావు. అంతకు మినహా ఆయనలో ఇంకే దోషమూ లేదు," అన్నారు స్వామి.

* * *

జటాస్వామి స్నేహితులు "బాలానంద" అనే ఒక సాధు వుండేవారు. ఆయనకు ఇంగ్లీషు, ఫ్రెంచి, మరాఠి, సంస్కృతం, మలయాళం భాషలలో మంచి ప్రవేశముంది. ఆయన చాలా

అందమైనవారు. మంచి మాటకారి. తన యెడల సదభిప్రాయం కలిగేటట్టు మాట్లాడగల నేర్పరి. ఎటువంటివారినీ మాటలతో ఆకట్టుకునేవారు. చాలాసార్లు అతి వినయం చూపేవారు. ఆయన మాటలు సమ్మోహనకరంగా వుండటం చేత, ఆయనలో వశీకరణ శక్తి వుందనుకునేవారు. మనిషిని చూడగానే గొప్ప వ్యక్తి అనిపించేవారు. అందర్నీ ఎప్పుడూ తానే ముందుగా నవ్వుతూ పలుకరించేవారు. స్వామి అరుణాచలం మీద స్థిరనివాసం ఏర్పరచుకున్నప్పటినుంచీ, బాలానంద ఆటలు తగ్గాయి. ఆయనలో పైపై మెరుగులు తొలగాయి. చివరికి గతిలేక స్వామి తన శిష్యుడని ఊళ్ళో చెప్పి, డబ్బూ, సరుకులూ అడిగి తీసుకొనేవారు. ఆ సంగతి స్వామికి తెలిసిందని తెలుసుకుని, "నేను నీ గురువునని చెప్పి, యాత్రికుల దగ్గర, భక్తుల దగ్గర డబ్బు తీసుకుంటున్నాను. నీకేం నష్టం లేదు కాబట్టి నన్ను ఖండించకు," అన్నారు.

ఒక రోజున పలనిస్వామి గుహ కడుగుతూ, బాలానందగారి పట్టుబట్టలు అక్కడ పడివుంటే, పక్కన పెట్టారు. అది చూసి బాలానందగారు స్వామితో, "వాడిని (పలనిస్వామి) ఇక్కడ నుంచి పంపించెయ్యండి," అన్నారు. దానికిస్వామి సమాధానం చెప్పలేదని, రోషం వచ్చి, స్వామి ముఖం మీద ఉమ్మేశారు. అయినా స్వామి చలించలేదు. చుట్టూ వున్న భక్తులూ, శిష్యులూ కూడా ఏమీ అనలేదు. కాని గుహలోంచి ఒకాయనవచ్చి "ఎంత దుర్మార్గం ఎంత ధైర్యం. స్వామి ముఖంమీద ఉమ్మేశావా? చూడు నిన్నేం చేస్తానో!" అంటూ వెంటబడ్డారు. బాలానంద అక్కడనుంచి ఒక్క పరుగున పారిపోతూ "అరుణగిరి వాసయోగ్యమైనది కాదు,' అని వెళ్ళి, టిక్కెట్టు కొనకుండా రైల్లో ఫస్ట్‌క్లాస్‌లో కూర్చున్నారు ఆ పెట్టెలో ఒక యువక దంపతులు వున్నారు. బాలానందస్వామి

వారికేదో చెప్పబోతే, వారు వినిపించుకోలేదు. వారు వ్యామోహం లోపడి, తనను ఉపేక్ష చేశారని ఆవేశపడి, వారిని తిట్టారు. వారికి కోపం వచ్చి, ఆయన్ని చెప్పుతీసుకుని కొట్టారు.

బాలానందస్వామి అక్కడక్కడా కొన్నాళ్ళు తిరిగి, మళ్ళా తిరువణ్ణామలై చేరుకున్నారు. స్వామి దగ్గర చేరి, మళ్ళా అసభ్యంగా ప్రవర్తించారు. ఒక రోజున స్వామి కళ్ళల్లోకి సూటిగాచూసి, "నీకు నిర్వికల్ప సమాధి స్థితి నేర్పుతాను," అని స్వామిని దూరంగా తీసుకుపోయి, ఏవేమో చెప్పి చేయించారు. కాని, చివరికి బాలానంద స్వామినే నిద్ర కమ్మింది. ఆయన అక్కడే పడి నిద్రపోతూవుండగా, స్వామి తిరిగి విరూపాక్షగుహకు వచ్చేశారు. తనను వదిలి వచ్చేశారని స్వామి మీద కోపం వచ్చి, అరుణాచలం వదలి వెళ్ళిపోయారు.

వెళ్ళినట్లే వెళ్ళి, బాలానందస్వామి మళ్ళా వచ్చారు. వచ్చి, అందరి మీదా అధికారం చెలాయించడం మొదలు పెట్టారు. మళ్ళా అందరూ కలసి వెళ్ళగొట్టారు. ఆయన స్వామిని శపిస్తూ ఊళ్ళోకి వెళ్ళి, ఒక దుకాణంలో కూర్చుని స్వామి మీద ఫిర్యాదుగా ఏదో చెప్పబోతే, స్వామి భక్తుడైన ఆ దుకాణం యజమాని, ఆగ్రహించి, ఆయన్ని తన్ని, తరిమేశారు. ఆ దెబ్బతో బాలానందస్వామి అరుణాచలం వదలి వెళ్ళిపోయారు. కాని, మళ్ళా త్వరలో తిరిగి వచ్చి, స్వామి ముందు నగ్నంగా కూర్చునేప్పటికి చుట్టూ వున్న భక్తులు భరించలేక, ఆయన్ని తరిమేశారు. ఆయన మళ్ళారాలేదు.

* * *

ఒకసారి ఒక సాధువు వచ్చి, "నేను నీ గురువును. కాళహస్తి నుంచి వచ్చాను. భగవంతుడు నాకు కలలో కనపడి, నీకు దత్తాత్రేయుని మంత్రోపదేశం చేయమన్నారు," అని స్వామితో చెప్పారు.

దానికి స్వామి "ఆ భగవంతుడు నాకు కూడా కనుపించి, మీ దగ్గర మంత్రదీక్ష తీసుకోమంటే, తప్పక తీసుకుంటాను," అన్నారు.

"వ్యవధి లేదు. చిన్న మంత్రమే! త్వరగా తీసుకో?" అని స్వామిని ఒకటే తొందర పెట్టాడు ఆ సాధువు.

"జపం చేయని నాకు మంత్రదీక్ష ఇవ్వడం ఏం లాభం? మరొకరిని చూసుకోండి. నేను తగినవాడను కాను," అన్నారు.

అయినా ఆ సాధువు తాను స్వామి గురువునంటూ పోస్టు ద్వారా స్వామికి వచ్చే ఉత్తరాలూ, అవీ కాజేసేవారు.

కొన్నాళ్లు గడిచాక, ఆ సాధువు ధ్యానంలో వున్నప్పుడు స్వామి కనపడి, "నిన్ను నీవు మోసగించుకోకు." అన్నారని వచ్చి, స్వామితో చెప్పి, కాళ్ళమీద పడితే "ఇతరులపై ప్రయోగించడానికి నా వద్ద అటువంటి ప్రయోగశక్తులు ఏమీలేవు," అనగా, ఆయన శాంతంగా వెళ్ళిపోయారు.

*　　*　　*

స్వామి విరూపాక్ష గుహలో వున్నప్పుడు కొంతమంది తప్ప తాగి, "మేము "పొదిగై" కొండప్రాంతం నుంచి వచ్చాము. ఆ పవిత్ర పర్వతం మీద, అగస్త్యమహర్షి. ఇంకా తపస్సు చేస్తున్నారు. ఆయనే మాకు చెప్పి పంపించారు, మిమ్మల్ని శ్రీరంగం తీసుకురమ్మని. అక్కడ సిద్ధపురుషుల సమావేశం జరుగుతోంది. అక్కడ నుంచి మిమ్మల్ని పొదిగై కొండమీదకు తీసుకువెడతాం. అక్కడ మీకు దీక్ష ఇవ్వబడుతుంది. ఎందుకంటే మీ దేహంలో ఇంకా కొన్ని ధాతువుల్ని, లవణాల్ని తీసేసి, శుద్ధి చేసేందుకూ, తద్వారా మీకు దివ్యశక్తులు లభింపజేసేందుకూ," అంటూ ఏవేవో చెప్పుకుపోయారు.

అటువంటి సంఘటనలు, సంగతులు స్వామి జీవితంలో ఎన్నో తటస్థపడ్డాయి. స్వామి వాటికి ఏనాడూ చలించలేదు. కాని, పెరుమాళ్ళ స్వామి, ఆ తప్పతాగివచ్చిన వారితో, "ఇంతకుముందే అక్కడ నుంచి మాకు ఒక సమాచారం వచ్చింది- మీరు ఇక్కడకు వస్తున్నట్లు - మిమ్మల్ని మూసలో పెట్టి, నిప్పులో కరగ బెట్టమని," అని, "మస్తాన్" అనే భక్తుని చూసి, "నువ్వు వెళ్ళి, వీళ్ళకోసం గొయ్యి తవ్వు. కట్టెలు వెలిగించు," అన్నారు. అదివిని, వాళ్ళు అక్కడ నుంచి పరుగుతీశారు.

* * *

ఒక రోజున కొందరు భక్తులు స్వామి దర్శనానికి విరూపాక్ష గుహకు వెళ్ళారు. అది శీతాకాలం. ఆ రోజున మరీ చలిగా వుంది. స్వామి కళ్ళు మూసుకుని, ముడుచుకుని కూర్చున్నారు. ఆ వచ్చిన భక్తులు అటూ, ఇటూ చూసి ఓ కొబ్బరికాయ కొట్టి, ఆ నీళ్ళతో స్వామిని అభిషేకించారు; ఆయనన్ని విగ్రహంగా భావించి. అయినా స్వామి కదలలేదు.

**1878** - నవంబరు - **17** వ తేదీన బొబ్బిలి దగ్గర "కలువరాయి" అనే గ్రామంలో గణపతిశాస్త్రిగారు జన్మించారు. ఆయనకు ఐదో ఏట వరకు, మాటలు రాలేదు. దానికి తోడు ఆయనకు మూర్ఛ వంటి జబ్బు వుండేది. అది ఇనుము కాల్చి చురక వేయడంతో పోయింది. రోగం నయం కావడమే కాదు. కంఠం ముడి వీడింది. అప్పటినుంచి ఆయనలో అనూహ్యమైన మార్పు వచ్చింది. తండ్రి, పినతండ్రి దగ్గర మంత్ర శాస్త్రం ఆయుర్వేదం, జ్యోతిషం, శ్రీవిద్య, పంచకావ్యాలు, ప్రబంధాలు, ఛందస్సు, ఇతిహాసాలు, ఇంకా ఎన్నో బృహద్గ్రంథాలు చదివి, మధించి, వాటి సారాంశాల్ని గ్రహించారు. రామాయణం, మహాభారత పురాణాల్ని, ఉపనిషత్తుల్ని, వేదాల్ని అధ్యయనం చేశారు. మంత్ర, తంత్రాల్ని నేర్చారు. యోగశాస్త్రాన్ని అభ్యసించారు. ఆయన జ్ఞాపకశక్తి అమోఘం, అపారం, అద్భుతం, అనూహ్యం. ఆయన మహామేధావి, పండితుడు, కవి. సర్వవిద్యలు, సమస్త శాస్త్రాలు ఇరవైఏళ్లు నిండకముందే ఆయన చేతిలో మెరుగులుదిద్దుకున్నాయి. ఆయన ఆశుకవిత్వం చెప్పేవారు. అష్టావధానం చేసేవారు. కంఠం ముడి వీడటంతో ఆయన జీవితంలో వాగ్దేవతానృత్యం ఆరంభమైంది.

గణపతిశాస్త్రిగారికి పన్నెండవఏటనే "విశాలాక్షమ్మ" గారితో వివాహం జరిగింది. భార్య కాపురానికి వస్తుందనగా ఆయనకు తపస్సుమీదికి మనసు మళ్ళింది. భార్యనీ, తండ్రినీ అనుమతి అడిగారు. ఇద్దరు పిల్లలు కలిగిన తర్వాత, తనకూ అటువంటి అవకాశం ఇవ్వమని విశాలాక్షమ్మ కోరింది. ప్రాచీన ఋషుల గాథలు ఆయన్ని ఆకర్షించడం వల్ల, పెళ్ళయిన తర్వాత భార్యాసమేతంగా తీర్థయాత్రలకు బయలుదేరారు. పుణ్య క్షేత్రాలన్నీ దర్శించారు. అంతిమజ్ఞానాన్ని పొందాలనే కోర్కెతో, ఎన్నో మంత్రాల్ని జపించారు. నిష్ఠగా ఎంతో సాధన చేశారు.

దేశం తిరిగారు. ఎందరో దేవతల్ని ఆరాధించారు. ఎన్నో క్రమశిక్షణల్ని నియమ-నిష్ఠల్ని, నిబంధనల్ని శ్రద్ధగా పాటించారు. 1900 లో - బెంగాల్లో, నవద్వీపమందు జరిగిన సంస్కృత మహా సభలకు హాజరై, మహాపండితుల, మేధావుల, శాస్త్రవేత్తల, పెద్దల మెప్పు పొంది, "కావ్యకంఠ" అనే బిరుదు పొందారు.

1904 ప్రాంతంలో గణపతిశాస్త్రిగారు జీవనోపాధికై తప్పనిసరిగా ఏదో ఒక పని చేయవలసిరావడంతో నార్త్ ఆర్కాట్ జిల్లా ముఖ్యపట్టణమైన "వేలూరు" పాఠశాలలో తెలుగు ఉపాధ్యాయులుగా చేరారు. ఆయనకు అక్కడ ఎందరో శిష్యులు చేరారు. అనేక మంత్రాల్ని ఎందరికో ఉపదేశించారు. వాటిల్లో "శివ పంచాక్షరి" ఒకటి. మంత్రజపం సరిగ్గా జపించుటకుగాను, ఆగమశాస్త్రం అభ్యసించారు. వేద, వేదాంత, దర్శన వాఙ్మయ మంతా అభ్యసించారు. హిందూమతోద్ధరణకూ, భారతదేశ పురోభి వృద్ధికీ, దేశస్వాతంత్ర్యానికీ తీవ్రంగా పూనుకుని దైవశక్తిని ఆవిర్భవింపజేసి, ఒక సంఘాన్ని స్థాపించి, దానికి ఆయనే అధ్యక్ష పదవిని అలంకరించారు. అప్పటికి ఆయన వయసు ముప్పై సంవత్సరాలు.

గణపతిశాస్త్రిగారు తనకు ఆధ్యాత్మిక పురోభివృద్ధి కలగడం లేదని గ్రహించి, సంశయ నివృత్తికై తిరువణ్ణామలైలో వున్న బ్రాహ్మణస్వామిని దర్శించాలనే కోర్కె కలిగి, విశ్వనాథ అయ్యర్‌తో అరుణాచలం వచ్చారు. కాని, అంతకుముందు ఆయన ఒకసారి స్వామిని "అడి ముడి గుడి" దగ్గర దర్శించారు - రెండవసారి వచ్చినప్పుడు స్వామిని చూడగానే ఆయన సిద్ధపురుషులని నిర్ణయించుకున్నారు. అవి కార్తీకమాసపు పుణ్య దినాలు. శాస్త్రిగారు వచ్చేటప్పటికి, స్వామి గుహ ముందు ఒంటరిగా కూర్చున్నారు. స్వామిని చూసి, సాష్టాంగపడి, రెండు కాళ్లూ పట్టుకుని గద్గదస్వరంతో "స్వామీ చదవవలసినదంతా

వేదాంతశాస్త్రాలతో సహా, చదివారు. అన్నీ అవగాహన చేసుకు న్నాను. నా హృదయ తృప్తికోసం కడు నిష్ఠగా మంత్ర జపం చేశాను. అయినా నాకు ఇప్పటివరకు అవగాహన కాలేదు. మీ శరణు వేడుకుంటున్నాను. కటాక్షించండి," అన్నారు.

స్వామి పదిహేను నిమిషాలు శాస్త్రిగారివంక తీక్షణంగా చూసి "నేను" అనే భావం ఎక్కడనుంచి పుడుతోందో గమనిస్తే, మనసు ఆ చోట లయమౌతుంది. అదే తపస్సు. మంత్రజపం చేసేప్పుడు, నాదం ఏ చోటనుంచి వెలువడుతుందో, ఆ మూలం గమనిస్తే, మనసు అందులో లయమౌతుంది. అదే తపస్సు," అన్నారు.

స్వామి సమాధానం గణపతిశాస్త్రిగారికి నూతన ఉత్సాహాన్ని, సంతోషాన్ని, సంతృప్తిని, శక్తిని ఇచ్చింది. తనకు ఉపదేశం అయిందన్న సంతోషంతో స్వామిని స్తుతిస్తో అప్పటి కప్పుడు ఆశువుగా కొన్ని సంస్కృత శ్లోకాలు చెప్పారు. పలని స్వామి ద్వారా, స్వామి నిజనామం తెలుసుకుని వెంకట్రామన్ కు "రమణ" అనీ, బ్రాహ్మణస్వామికి "మహర్షి" అనీ వారి పేరు మార్చి, మర్నాడు ఒక మిత్రునికి ఉత్తరం రాస్తో "నేను నిన్న భగవాన్ రమణమహర్షిని దర్శించాను," అన్నారు. అప్పటి నుంచి స్వామిని "భగవాన్ - రమణ - మహర్షి" అని తమకు ఇష్టమైన పేరుతో పిలవనారంభించారు, భక్తులు. పూర్తిగా విచ్చుకున్న పువ్వు పరిమళం నలు దిక్కులకూ వ్యాపించినట్లు, భగవాన్ కీర్తి దేశమంతా వ్యాపించింది. ఆయన దర్శనార్థం దేశ - దేశాల నుంచి భక్తులు రావడం ఆరంభమైంది.

తనకు ఉపదేశమైన సందర్భంలో గణపతిశాస్త్రిగారు ఆశువుగా, "శ్రీరమణ పంచకం" చెప్పారు. అలాగే తనకు ఉపదేశమైన సంగతి తన శిష్యులకు చెపుతూ, "స్వామే నా గురువు" అన్నారు. ఆనాటినుండి శాస్త్రిగారి శిష్యులు కూడా,

భగవాన్ శ్రీరమణమహర్షి శిష్యులైనారు. భగవాన్ సూచించిన "ఆత్మ విచారణ-నే నెవడను?" అను ఉపదేశమార్గం, మోక్షానికి విశిష్టమైనదని తన శిష్యులందరకూ నొక్కి-చెప్పి, "ఇకనుంచి మీకూ, నాకూ రమణులే గురుదేవులు. అంతటి వారు మరొకరు లేరు," అన్నారు శాస్త్రిగారు.

గణపతిశాస్త్రిగారు తన కంటే పెద్దవారనీ, మేధావులనీ, పండితులనీ, తపశ్శాలురనీ భగవాన్ మొదట్లో, "శాస్త్రిగారూ!" అని పిలిచేవారు. దానికి ఆయన అభ్యంతరం తెలిపారు. గణపతి శాస్త్రిగారిని అందరూ ప్రేమగా "నాయనా" అని పిలవడంచేత, భగవాన్ కూడా "నాయనా" అని పిలవనారంభించారు. "నాయన" అనే పేరుమీద గుంటూరు లక్ష్మీకాంతంగారు, గణపతిశాస్త్రిగారి జీవిత చరిత్ర రాశారు. నాయనగారంటే, భగవాన్‌కి ఎంతో ప్రేమ, గౌరవం. అందరివలె భగవాన్ కూడా వారిని "నాయనా!" అని ప్రేమగా పిలిచేవారు.

నాయనగారు భగవాన్ని "సుబ్రహ్మణ్యస్వామి అవతారం," అని అన్నారని ఒకరు భగవాన్నే అడిగారు, "స్వామీ, మీరు సుబ్రహ్మణ్యస్వామివారి అవతారమని మా కెందుకు చెప్పలేదు?" అని. దానికి భగవాన్, "అవతారమంటే ఏమిటి? భగవంతునిలోని ఒక అంశం, రూపం ధరించడం. జ్ఞానే, దైవ స్వరూపం," అన్నారు. ఆ విధంగా తానెవరో వ్యక్తపరిచారు భగవాన్.

1905లో భగవాన్ "పచ్చయమ్మన్" గుడిలో ఆరు మాసాలున్నారు. ఆ రోజుల్లో జరిగిన ఒక సంగతిని భగవాన్ మాటల సందర్భంలో చెప్పారు. నాకు ఒకటే కౌపీనం వుండేది. అది చిరిగి పోయింది. రక్కి-సముల్లు చీల్చి, చిరిగిన గుడ్డలోంచి ఒక నూలుపోగు తీసి, ఆ ముల్లు బెజ్జంలో దూర్చి, కౌపీనం కుట్టుకున్నాను. ఎవరూలేని సమయం చూసి, దాన్ని ఉతుక్కు-నే వాణ్ణి. నా అవస్థ చూసి, ఒక గొల్ల పిల్లవాడు హేళన చేశాడు. కాని, ఓ భక్తుడు

జాలిపడి రెండు కౌపీనాలు, రెండు అంగవస్త్రాలు కొని ఇచ్చాడు. "నీ సంగతి నువ్వు నిజంగా పట్టించుకోకపోతే, అవసరమైన వన్నీ ఖలవంతంగా నైనా ఇచ్చిపోతారు. ఏమీ అక్కరలేని వానికి, అవసరమైనవన్నీ వాటంతట అవే వస్తాయి," అన్నారు భగవాన్.

భగవాన్ ఉపదేశానుసారం నాయనగారు సాధన చేయ సంకల్పించి 'మూతగుహ' చేరారు. ఉమాదేవే తనకు శ్రీరమణుని చూపించి, జ్ఞానబోధ చేయించిందనే సంతోషంలో ఒక నెలలో 'ఉమాసహస్రం' రచించారు. ఆగ్రంథాన్ని ఉమాదేవికే అంకిత మిచ్చారు. ఆఖరు రోజు రాత్రి మూత గుహలో, స్వామి సమక్షంలో మిగిలిపోయిన మూడు వందల శ్లోకాల్ని నలుగురు పండితులకు ఆవేశంతో, ఆశువుగా చెప్పి ఉమాసహస్రాన్ని పూర్తి చేశారు, ధణపతిశాస్త్రిగారు. ఉమాసహస్రం అవతరణ నాయనగారి జీవిత చరిత్రలో గొప్పగా వర్ణించబడింది.

1908లో భగవాన్, నాయన, మరి కొంతమంది కలసి జనవరి నుంచి, మార్చి వరకు పచ్చయమ్మన్ గుడిలో వున్నారు. ఖర్చు, రంగస్వామి అయ్యర్ భరించారు. గంభీరం శేషయ్యగారు వంట చేసేవారు. గణపతిశాస్త్రిగారు ఉమాసహస్రానికి మెరుగులు పెట్టి, అమ్మవారి ముందు చదివేవారు.

ఆదిశంకరులువలె నాయన భారతదేశమంతా తిరిగి యాత్రలు చేసి, అనుకూలమైన చోట తపస్సు కూడా చేశారు, 1912లో, గోకర్ణంలో వున్నారు. ఆ క్షేత్రం ఆధ్యాత్మికంగా ప్రసిద్ధిగాంచినది. అక్కడ "గణేశభట్" అనే ఆయన శాస్త్రిగారి శిష్యులైనారు. ఆ తర్వాత ఆయన బ్రహ్మర్షి దైవరాతులై, సుప్రసిద్ధ మంత్ర వేత్తలైనారు.

నాయనగారి దృష్టి నుంచి తప్పించుకున్న విజ్ఞాన శాస్త్రం ఏదీ లేదు. జ్యోతిషం-ఛందస్సు-కామశాస్త్రం రాశారు. శిష్యు లకూ, మిత్రులకూ గొప్ప ఉత్తరాలు రాశారు. తమకు ప్రియ

మైన భారతీయ తత్వశాస్త్రాన్ని ప్రచారం చేస్తో; ప్రబోధిస్తో, దేశం తిరిగారు. స్త్రీలు సహితం వేదపఠనకు, మంత్ర దీక్షకు అర్హులని చాటారు. ఎందుకంటే, స్త్రీ-తల్లి, గృహిణి. ఆమె ఆధ్యాత్మికంగా ఉన్నతురాలు. అయితే, పిల్లలు, కుటుంబం, పరిసరం అభివృద్ధి చెందుతుందని శాస్త్రిగారి భావన. ఆయన వేద సాంప్రదాయాన్ని చివరి వరకు నిష్ఠగా పాటించారు.

తన తపః ఫలితాన్ని భగవాన్ అనుగ్రహించాలనే స్థిర నిశ్చయంతో నాయనగారు భార్యాసమేతంగా అరుణాచలం వచ్చి, భగవాన్ ఆదేశానుసారం మామిడితోపులో తపస్సు ఆరంభించారు. ఒళ్లు మరచి రాత్రింబవళ్లు ధ్యానంలో వుండేవారు. ఒకసారి దేహం వశం తప్పుతోందని గ్రహించి, భగవాన్‌కి ఒక చీటీరాసి పంపారు; గణపతిశాస్త్రిగారు. అప్పుడు భగవాన్ స్కందాశ్రమంలో వున్నారు. ఆ మర్నాడు నాయనగారు భగవాన్ దగ్గరకు వచ్చారు. నాయనగారు చెప్పినదంతా విని, "స్నానం చేసేముందు శిరోపరిభాగం ఆముదముతో మర్దన చేయండి" అన్నారు. కాని, ఆ తర్వాత ఒక రాత్రి నాయనగారికి శిరోభాగాన బాధ అధికమైంది. దాన్నే కపాలబేధమన్నారు కొందరు.

* * *

1908లో డి. పి. డబ్ల్యు-సూపర్‌వైజర్ రామస్వామి అయ్యర్ స్వామి దర్శనార్థం వచ్చారు. అప్పటినుంచి ఆయన తరచు స్వామి దర్శనం చేసేవారు. ఒకసారి "స్వామీ, జీసస్ మొదలైన వారు పాపులను ఉద్ధరించుటకు ఈ లోకాన అవతరించారు. అటువంటి అవకాశం నాకేమైనా వుందా?" అని అడిగారు. దానికి భగవాన్ "There is hope, There is hope" అని రెండు సార్లు ఇంగ్లీషులో అన్నారు.

రామస్వామి అయ్యర్ గొప్ప గాయకులు, సంగీత విద్వాంసులు, పండితులు, వారి హృదయమే, సంగీత నిలయం. ఆయన కొన్ని కీర్తనలు కట్టారు. వాటిల్లో "శరణాగతి" గొప్ప కీర్తన. ఆ కీర్తనను "యమునాకళ్యాణి" లో సౌరిస్‌గారు పాడితేవిని, కృతిదర్త పరవశులైనారు.

శరణాగతీ - నీ ఎడనే ॥శర॥
స్మరణాత్ - గతిఫలా
అరుణాచలా -నిండు రమణా
కరుణా, వరుణా రమణ ॥శర॥
తరుణ మిదే కాదా
కరుణ చూచుటకై
కాలహరణమైతే
హా, ఆ - ఆ - ఏమిసేతు
కష్టముల్ దీర్చి వేగ కాపాడుమా తండ్రి
ఇంత పరాన్ముఖము నేను తాళలేను ఓ రమణా ॥శర॥

రామస్వామిఅయ్యర్ గారిని అజీర్ణరోగం పీడించేది. నిద్ర పట్టేది కాదు. ఒక రోజున భగవాన్ ఆయన్ని విందుభోజనం తినమన్నారు. గంజి తాగితే జీర్ణంకాని ఆయన, భగవాన్ తినమన్నారని నిర్భయంగా, నిస్సంశయంగా విందు పదార్థాలన్ని పూర్తిగా తిని, ఆ రాత్రి హాయిగా నిద్రపోయారు. "ఎన్నడూ నిన్ను నువ్వు మరవవద్దు. మరచావా, సర్వానర్థం" అనేదే భగవాన్ ఉపదేశంగా భావించారు రామస్వామిఅయ్యర్.

**1911** లో వేలూరులో "యఫ్. హెచ్. హంఫ్రీస్" అనే ఆయన ఇండియా పోలీసు డిపార్ట్‌మెంటులో ఎ. డి. యస్. పిగా నియమితులైనారు. ఆయన వయసు ఇరవై ఒక్క సంవత్సరాలు. ఆయనకు అప్పటికే తంత్రశాస్త్రంలో ప్రవేశముంది. ఆయన బొంబాయి చేరుకోగానే జ్వరంపడి, హాస్పిటల్‌లో చేరారు. నెమ్మదిగా కోలుకున్నారు.

హంఫ్రీస్‌గారికి యోగశాస్త్రంలో కూడా ప్రవేశముంది. సూక్ష్మ శరీరంతో సంకల్పిత స్థానాలకు వెళ్ళగల సామర్థ్యం కలవారు. ఆయన భారతీయ భాషలలో ఏదో ఒకటి నేర్చుకోవాలనుకొన్నారు. ఆ సందర్భంలో గురువును వెతుక్కోవడంకోసం, తాను ఉద్యోగం చేయవలసిన "వేలూరు" సూక్ష్మ శరీరంలో వెళ్ళి, అనేక మందిని పరిశీలించి, చివరికి సర్వేపల్లి నరసింహయ్య (ప్రణవానందులు) గారిని గురువుగా ఎన్నుకున్నారు.

హంఫ్రీస్ వేలూరులో ఉద్యోగంలో చేరారు. జనవరి పద్దెనిమిదో తేదీన నరసింహయ్యగారి దగ్గరకు వెళ్ళి, తన సంగతి చెప్పి, వారి వద్ద శిష్యరికం ఆరంభించారు. ఆనాడు మాటల్లో "ఈ ప్రాంతంలో మీకు తెలిసిన మహాత్ములు ఎవరైనా ఉన్నారా?" అని అడిగారు. దానికి నరసింహయ్యగారు, "నాకు ఏ మహాత్ములూ తెలియదు," అన్నారు.

ఆ మర్నాడు హంఫ్రీస్ నరసింహయ్యగారి ఇంటికి వెళ్ళినప్పుడు "ఈ ఉదయం నేను నిద్ర లేచేముందు కలలో మీ గురువుగారిని చూశాను. ఆయన నా ప్రక్కన కూర్చుని నాకేదో చెప్పారు. కాని, ఆయన భాష నాకు అర్థం కాలేదు." అన్నారు. హంఫ్రీస్ మాటలకు నరసింహయ్యగారు, తికమకపడ్డారు. ఆయన గొడవపడటం చూసి, "నేను బొంబాయిలో వుండగా, మొదట కలుసుకున్నది మిమ్మల్నే" అన్నారు. ఆ మాటతో ఆయన మరింత తికమకపడి, "నేను ఎప్పుడూ బొంబాయిలో లేనే" అన్నారు.

"మీరు బొంబాయిలో వుండటం కాదు. నేను బొంబాయిలో దిగగానే, జబ్బుపడ్డాను. హాస్పిటల్‌లో చేరాను. బాధా నివారణ కంటే, ముందు నా మనసును వేలూరును పంపించాను. ఎందుకంటే, నేనుఅక్కడ[ట్రె]యినింగు పొందవలసివుంది. యోగాభ్యాసంవల్ల నాకు సూక్ష్మశరీరం ధరించే శక్తి వుంది. ఆ శక్తిసహాయంతో వేలూరు వచ్చి, మిమ్మల్ని దర్శించాను," అన్నారు హంఫ్రీస్.

"సూక్ష్మ శరీరమంటే నాకేం తెలియదు. అసలు ఏ శరీరమూ తెలియదు, ఈ దేహం తప్ప" అన్నారు నరసింహయ్యగారు. కాని హంఫ్రీస్‌కు వచ్చిన కలను పరీక్షించాలని నరసింహయ్యగారుకొన్ని ఫోటోలు తెచ్చి ఆయనముందు వుంచారు. వాటిల్లోంచి గణపతి శాస్త్రిగారి ఫోటో బయటికి తీసి, "ఈయనే మీ గురువు. నేను కలలో చూసింది ఈయన్నే. ఈయనేనా, మీ గురువుగారు?" అని అడిగారు.

"అవును, ఆయనే నాగురువుగారు," అన్నారు ఆయన.

కొన్నాళ్ళ తర్వాత హంఫ్రీస్‌కు మళ్ళా జబ్బు చేసింది. విశ్రాంతికై ఆయన ఉదకమండలం వెళ్ళి కొన్ని నెలలు వున్నారు. అక్కడనుంచి నరసింహయ్యగారికి తరచు ఉత్తరాలు రాసేవారు. ఒక ఉత్తరంలో తనకు కలలో కనపడిన ఓ కొండ, దానిపై ఒక గుహ, ఆ గుహముందు ఓ చిరు ప్రవాహం అక్కడ ఒక మహర్షి; ఆనందపారవశ్యంలో నిలబడి వుండటం-అంతా వర్ణించి, దాన్నంతా అందమైన చిత్రంగా చిత్రించి నరసింహయ్యగారికి పంపించారు. ఆ చిత్రాన్ని చూడగానే అది అరుణాచలమనీ, గుహ విరూపాక్ష గుహ అనీ, నిలబడ్డ మహర్షి బ్రాహ్మణస్వామనీ గుర్తించి, సమాధానంలో స్వామి గురించి వివరంగా రాశారు.

హంఫ్రీస్ ఆరోగ్యం బాగై, వేలూరువచ్చారు. వారికి గణపతి శాస్త్రిగారిని పరిచయం చేశారు; నరసింహయ్యగారు. ఆ ముగ్గురూ

1911- నవంబరులో మహర్షి దర్శనానికి తిరువణ్ణామలై వచ్చారు. తన అరుణాచల అనుభవాన్ని హంఫ్రీస్ ఇట్లా వర్ణించారు.

"ఒక శలవు రోజున నేనూ - నరసింహయ్యగారు - గణపతి శాస్త్రిగారూ తిరువణ్ణామలై వెళ్ళాం. మధ్యాహ్నం రెండు గంటలవేళ విరూపాక్ష గుహలో స్వామిని దర్శించాం. మేము ముగ్గురం - ఆయన పాదాలముందు మౌనంగా కూర్చున్నాం. స్వామీ మౌనంగా వున్నారు. స్వామి గంభీరత, మౌనం, స్థిర దృష్టి - అసలు ఆయన ఉనికి - అన్నీ నన్నెంతో ఆకర్షించాయి. శాస్త్రిగారు నన్ను మహర్షి కళ్ళల్లోకి సూటిగా చూడమన్నారు. ఒక అరగంటసేపు అట్లా స్థిరంగా, ఏకాగ్రంగా స్వామి వైపు చూశాను. ఆయన చూపులో భావచలనం లేదు. అసలు ఏ భావమూ లేదు. స్వామి నిర్గుణస్వరూపంగా కనుపించారు. ఆయన దేహమే, ఈశ్వరాలయంగా తోచింది నాకు. అది మానవదేహం కాదనిపించింది. ఆయన దేహం, దేవుని చేతిలో ఒక పనిముట్టు మాత్రమే. ఆ దేహం కదలిక, శవం మాదిరిగా వున్నా, దాంట్లోంచి ఈశ్వరుడు బ్రహ్మాండంగా వ్యక్తమౌతూ ప్రకాశిస్తున్నారు. ఆయన వర్ణనాతీతులు. గణపతిశాస్త్రిగారు నన్ను స్వామితో మాట్లాడమన్నారు. నేను "ఆత్మసాక్షాత్కారం" సంగతి అడిగాను. స్వామి కొన్ని మాటలు ఇంగ్లీషులో, కొన్ని మాటలు తెలుగులో మాట్లాడారు. ఆ తర్వాత నేను స్వామిని కొన్ని ప్రశ్నలు అడిగాను.

హంఫ్రీస్ :- గురూ, నేను ప్రపంచ పురోభివృద్ధికి సాయపడగలనా?

స్వామి :- ముందు మీకు మీరు సహాయం చేసుకోండి. తర్వాత ప్రపంచానికి సహాయపడుదురుగాని.

హంఫ్రీస్ :- నేను ప్రపంచానికి సహాయపడాలనుకుంటున్నాను. సాయపడగలనా ?

స్వామి :- సాయపడగలరు. మీకు మీరుసహాయం చేసుకుంటూ, ప్రపంచానికి సాయపడండి. మీరు ప్రపంచంలో ఒకరు. అసలు మీరే ప్రపంచం. మీరు ప్రపంచం నుంచి విడిగా, భిన్నంగా లేరు. మీ నుంచి ప్రపంచమూ వేరుగా లేదు.

హంఫ్రీస్ :- పూర్వం జీసస్, శ్రీకృష్ణుడు చేసినట్లు నేనూ మహాత్మ్యాలు చేయగలనా?

స్వామి :- వారు మహాత్మ్యాలు చేసేప్పుడు తాము చేస్తున్నా మనుకున్నారా?

హంఫ్రీస్ :- లేదు.

స్వామి :- పొందవలసింది, ఆత్మను. అసలు వున్నదీ అదొక్కటే! దాన్ని పొందడానికి సర్వశక్తులూ ఉపయోగించాలి. అదే జీవిత లక్ష్యం''

అని స్వామి గంభీరంగా వుండిపోయారు.

ఆ తర్వాత ఎంతోమంది చిన్నపిల్లలు వచ్చి స్వామి చుట్టూ కూర్చున్నారు. వారు తరచు స్వామి సన్నిధికి వచ్చేవారే!

* * *

"నేను రెండవసారి స్వామి దర్శనానికి తిరువణ్ణామలై వెళ్ళాను. స్వామి నన్ను చూడగానే గుర్తుపట్టి, పలకరించి, కుశల ప్రశ్నలు వేశారు. ఆయన కంటపడినవారి జీవితం తెరచుకున్న గ్రంథం మాదిరిగా వుంటుంది. ఒక్క చూపుతో ఆ గ్రంథ సారా న్నంతా గ్రహించగల శక్తివంతులు, స్వామి.

నాకు భోజనం వడ్డించారు. నేను తింటున్నంతసేపూ స్వామి నా దగ్గరే కూర్చుని కబుర్లు చెప్పారు. నన్ను ఇతరులకు పరిచయం చేశారు. నాకు ఇంకా, ఇంకా వడ్డించమని చెప్పి, వడ్డించారు

నేను మరోసారి మహర్షి దర్శనానికి మండుటెండలో వెళ్లాను. చెప్పులు లేకుండా కొండ ఎక్కాను. ఏం మాట్లాడకుండా స్వామి పాదాల ముందు కూర్చున్నాను. ఇద్దరం మౌనంగా ఎంతోసేపు కూర్చున్నాం. ఆయన దృష్టి స్థిరంగా నిలిచివుంది. ఆ చూపులో ఏ భేదమూ, చలనమూ లేదు. ఆయన నిశ్చల సమాధిలో వున్నారు. నాలోంచి, నన్ను పైకి లేపినట్లనిపించింది. స్వామి కళ్ళల్లోకి తీక్షణంగా అరగంటసేపు చూశాను. ఆయన కళ్ళు కదలలేదు. రెప్పలార్చలేదు. ఆయన మౌనమహిమ, చెప్పక చెప్పారు. ఆయన గంభీరత, సాధుత్వం, శాంతం, ఆత్మ నిగ్రహం, నిగూఢమైన ఆయన శక్తి అపారమనిపించాయి. ఆయన చిరునవ్వుకన్నా అందమైన దాన్ని నేను ఊహించుకోలేను. ఆయన ఎదుటపడితే, ఎటువంటి వారిలోనూ మార్పు వస్తుందనిపించింది.

ఆయన దృష్టి ప్రత్యేకించి ఎవరిమీదనైనా నిలిచిందంటే, అది వారికి సహాయం జరగడం కోసం, వారిని నడిపించడం కోసం జరిగివుంటుంది. అంతేకాని, ఆయన ఏ శక్తుల్నీ ఉపయోగించేవారు కాదు. ఆయన ఎవరినైనా ఒకసారి చూస్తే, ఎన్నేళ్ళకూ గుర్తు పట్టగలరు. వాళ్ళే కాదు, వాళ్ళ జీవితాలూ ఆయనకు జ్ఞాపకం వుంటాయి.

కొంతసేపైన తర్వాత "మీరు భోజనం చేసినట్లు లేదు. భోజనానికి లేవండి," అన్నారు స్వామి. అని, ఒకరిని పిలిచి, నాకు భోజనం వడ్డించమన్నారు. అన్నం - నెయ్యి - పళ్లు - కూరలు వడ్డించారు. నేను చేత్తో తిన్నాను. నేను తింటున్నంతసేపూ, ఆయన చూపు నా మీదే నిలిచింది. చిరునవ్వుతో కబుర్లు చెపుతూ, మధ్య మధ్య ఏం కావాలి? అని అడుగుతూనే వున్నారు.

ఆ తర్వాత కొబ్బరి నీళ్ళలో పంచదార కలిపి నాకు ఇప్పించారు. నాకు ఇంకా ఆకలీ, దాహం తీరని సంగతి గమనించి

ఏదో ఒక పదార్థం లోపల్నించి తెప్పించి, వడ్డించమనేవారు. ఆ సంతోషంలో నేనూ కడుపునిండా తిన్న సంగతి గమనించి, "ఇక వడ్డించవద్దు" అన్నాను. నాకు చేత్తో తినడం బొత్తిగా రాదు. గ్లాసులోంచి నీళ్లుగాని, ఏంగాని ఎత్తి, నోట్లో పోసుకోవడం అసలే చేతకాదు. నోటితో గ్లాసు కరచి నీళ్లు తాగినందుకు క్షమాపణ చెప్పుకుంటే, "ఏం ఫరవాలేదు" అన్నారు స్వామి; ఎంతో ప్రేమగా. అంతలో ఎవరో వస్తే, వారికి నా గురించి చెప్పారు. నా గురించి ఏం చెప్పాలో. సరిగ్గా అదే చెప్పారు. ఆయన జ్ఞాపకశక్తి అమోఘం.

నాకు ఇంకా దప్పిక తీరలేదు. ఆ సంగతి ఆయన గమనించి, నిమ్మరసం తెప్పించి ఇచ్చారు. నాకే కాదు, ఎవరికైనా సరే, తృప్తి అయ్యేవరకు శ్రద్ధగా భోజనం వడ్డించేవారు. నేను వెళ్ళిపోవడానికి లేస్తే, ఆయనా లేచి, గుహ బైటికి వచ్చారు. "మిమ్మల్ని చూడ్డానికి మళ్ళా వస్తాను. శలవు," అన్నాను.

దయకల చూపుతో నన్ను సాగనంపుతూ "తాంత్రిక శక్తుల్లో తగుల్కోవద్దు," అని హెచ్చరించారు.

స్వామి అనుగ్రహంవల్ల నాకు క్రమంగా వాటిల్లో ఆసక్తి పోయింది. ఆ కోర్కెను నాలో స్వామే అణచేశారని అనిపించింది.

స్వామి బోధామృతాన్ని చవిచూసిన హంఫ్రీస్ ఉద్యోగానికి రాజీనామా చేసి, రోమన్ క్యాథలిక్ మతసన్యాసి అయ్యారు.

"నేను హంఫ్రీస్‌కి చెప్పిన సంగతులు ఓ గురువు తన శిష్యునికి ఇచ్చే సూచనలు వంటివే, నేనూ ఆయనకు ఇచ్చాను," అన్నారు స్వామి, ఒకసారి మాటల్లో.

* * *

1912-లో శేషయ్యగారు, వాసుదేవశాస్త్రి మొదలైనవారు భగవాన్ జయంతి జరపటానికి యత్నించగా, భగవాన్ అంగీకరించక, "నువ్వు పుట్టినరోజు పండగ చేసుకోదలిస్తే, నువ్వు ఎప్పుడు పుట్టావో, ముందు ఆ సంగతి స్పష్టంగా తెలుసుకో! నిజమైన పుట్టినరోజు, పరమాత్మలో ఐక్యమైన రోజు. అదే శాశ్వతత్వం.

"కనీసం పుట్టినరోజునాడైనా, ఈ మాయా ప్రపంచంలోకి. సంసారకూపంలోకి వచ్చి పడ్డందుకు విచారించాలి, దుఃఖించాలి, దాంట్లో విజయం పొందటం, పుట్టినరోజు పండగ చేసుకోవడం ఎట్లా వుంటుందంటే, శవాన్ని అలంకరించి, ఆనందించినట్లు వుంటుంది," అన్నారు భగవాన్.

* * *

తిరువణ్ణామలైలో వున్న దుర్గాలయంలో శ్రీచక్రం పాడైపోతే, దాన్ని బాగుచేసి, సరిచేయమని కొందరు స్వామిని కోరారు. స్వామి దాన్ని సరిచేసి ఇచ్చారు. ఆ తర్వాత ఆ ఆలయంలో కుంభాభిషేకం జరిగింది.

అశాంతితో కొట్టుకునే మేధావంతుల మనసులకే కాదు, దుఃఖంతో బాధపడే భగ్న హృదయాలకు స్వామి సన్నిధి శాంతి లభించేది. అటువంటి వారిలో ఎచ్చమ్మాళ్ ఒకరు. తిరువణ్ణామలైకి ఇరవై మైళ్ళ దూరంలో "మండకొలుత్తూరు" అనే గ్రామం వుంది. ఆ వూళ్లో "లక్ష్మీ అమ్మాళ్" అనే ఆమె వుంది. ఆమెనే అందరూ "ఎచ్చమ్మాళ్" అని పిలిచేవారు. ఆమె ఇరవైఐదో ఏట భర్త చనిపోయాడు. కొన్నాళ్ళ తర్వాత ఏకైక కుమారుడు మరణించాడు. చివరికి మిగిలిన ఒక్క కూతురూ మరికొన్నాళ్ళకు చనిపోయింది. అంత దారుణాన్ని, దుఃఖాన్ని భరించలేక సాధుసేవ చేసి, తరించాలని యాత్రలకు బయలుదేరింది. ఆ యాత్రలో ఉత్తర హిందూస్తాన్ గురువు దగ్గర ఏకాగ్రత కోసం యోగవిద్య నేర్చుకుంది. ఏకాగ్రత అంటే, దేహానికీ, మనసుకీ అతీతంగా ఆత్మను ఉన్నత స్థితికి ఎత్తడం. అదే సమాధి స్థితి. ఆ స్థితి నుంచే అత్యున్నతమైనవన్నీ ఉత్పత్తి అవుతాయి. అటువంటి ఏకాగ్రతవల్ల క్రమంగా సర్వసంగ పరిత్యాగానికి వీలు వుంటుందని ఎచ్చమ్మాళ్ భావన. కొన్నాళ్ళు చాలా తీవ్రంగా, స్థిరంగా ముక్కు చివర దృష్టి నిలిపే సాధన చేసింది. ఒకే యోగముద్రలో గంటల తరబడి కూర్చునేది.

ఎచ్చమ్మాళ్ గోకర్ణం యాత్ర చేసి వచ్చిన తర్వాత ఆమెకు ఎవరో చెప్పారు, "తిరువణ్ణామలైలో బ్రాహ్మణ స్వామి వున్నారు. ఆయన్ని దర్శించినవారికి శాంతి లభిస్తుంది," అని. ఆమె వెంటనే బయలుదేరి అరుణాచలం వచ్చింది. ఆమెకు తిరువణ్ణామలైలో బంధువులు వున్నారు. కాని, ఆమె స్నేహితులతో కలసి స్వామి దర్శనం చేసుకుంది. మౌనంగా ఆయన ముందు నిలబడింది. కాని, ఆయనతో తన బాధ చెప్పుకోలేదు. చెప్పవలసిన అవసరం ఆమెకు కనుపించలేదు. "స్వామి కళ్ళల్లో మెరిసే దయే చాలు తనను ఓదార్చడానికి" అని అనుకుంది. సాయంత్రానికి ఆమె

హృదయభారం తగ్గి, దుఃఖం తొలగి, కొండదిగి ఊళ్ళోకి వెళ్ళింది.

ఆనాటినుంచి ఆమె ప్రతిరోజూ కొండఎక్కి, స్వామి దర్శనం చేసుకునేది. ఆయన ఆదిత్యుడై ఆమెను ఆవరించిన విషాద ఛాయల్ని తరిమేశారు. ఆమె ఊళ్ళో ఒక ఇల్లు అద్దెకు తీసుకుంది. తండ్రి ఇచ్చిన ఆస్తి, సోదరుడు చేసే సహాయంతో కాలక్షేపం చేసేది. యాత్రికులనూ, భక్తులనూ ఆదరించేది. ఆమె ఆతిథ్యాన్ని, ఆప్యాయతనూ అనుభవించినవారు ఆమెను గొప్పగా కొనియాడే వారు. రోజూ స్వామికోసం ఏదో ఒక వంటకం చేసి, కొండమీదకు తీసుకువెళ్ళి, స్వామికి స్వయంగా వడ్డించేది. స్వామి ప్రతిరోజూ భోజనంలో మొదటి ముద్దగా ఎచ్చమ్మాళ్ తెచ్చినది ప్రేమగా తినేవారు. మిగిలిన పదార్థాన్ని అందరికీ స్వామి ప్రసాదంగా ఆమే వడ్డించేది.

శేషాద్రిస్వామికి ఎచ్చమ్మాళ్ అంటే గౌరవం. ఆమెకు శేషాద్రిస్వామి అంటే పూజ్యభావం. ఆమె ప్రతిరోజూ భగవాన్‌కి ఏదో ఒక వంటకం చేసి కొండమీదకు తీసుకువెళ్ళేది. సాయంత్రం తిరిగి ఇంటికి వచ్చేది. ఒక్కోసారి బాగా చీకటిపడి ఆమె కొండదిగి వస్తోవుంటే, శేషాద్రిస్వామి వెంటవుండి ఆమె ఇంటి వరకు వెళ్ళే వారు. ఒకరోజున ఎచ్చమ్మాళ్ ఇంటిదగ్గిర ఒక శాస్త్రిలవారు పురాణం చదువుతున్నారు. ఆయన శేషాద్రిస్వామిని చూసి, నిష్కారణంగా "ఇటువంటి వారికి వెయ్యి జన్మలకైనా జ్ఞానం లభించునా?" అని అన్నారు. ఆ మాట విని ఎచ్చమ్మాళ్ చిన్నబోయింది. ఆమె నోట మాట రాలేదు. కాని, ఎన్నడూ, దేనికీ ఏమీ మాట్లాడని శేషాద్రిస్వామి కల్పించుకుని ఓ గంటసేపు అనర్గళంగా గొప్ప ఆధ్యాత్మిక సత్యాల్ని మాట్లాడారు. అక్కడ వున్నవారందరూ విస్మయులైనారు. శాస్త్రిలవారు పశ్చాత్తాపపడి, శేషాద్రిస్వామి కాళ్ళమీద పడ్డారు.

వయసు పెరిగినా, ఆరోగ్యం చెడినా, ఏది ఏమైనా ఆనాటి నుంచి ఎచ్చమ్మాళ్ తన జీవితాంతం ఏదో ఒక వంటకం చేసి

స్వామికి పెట్టేది. ఆమె వంటకం వచ్చేవరకు స్వామి భోజనం చేసేవారు కాదు. ఆమె ఏ రోజూ స్వామి సన్నిధికి ఆలస్యంగా వెళ్ళలేదు. ఆమె ఆలస్యాన్ని స్వామి అంగీకారంతో తీసుకునేవారు. కాని, ఏనాడూ ఆమెను నిరాకరించలేదు, నిరాశపరచలేదు. ఆలస్యమైతే స్వామి ఆమె కోసం ఎదురుచూసేవారు. జనం ఎక్కువయ్యే కొద్దీ ఆమె తీసుకువెళ్ళే పదార్థం, అందరికీ బహు కొంచెంగా వచ్చేది.

పుణ్యదినాల్లో ఎచ్చమ్మాళ్ ఉపవాసముండేది. అది గమనించి, "చల్లని గాలి వీస్తోంటే, ఫేన్ వేసుకునేది ఎవరు?" అన్నారు స్వామి. అంటే, "స్వామి సన్నిధిలో ఉపవాసాలేమిటి?" అని అర్థం. ఆమె స్వామి మాట అర్థం చేసుకుని, ఆనాటి నుంచి ఉపవాసాలు మానేసింది.

ఒకరోజున ఎచ్చమ్మాళ్ నిశ్చలంగా చాలాసేపు కూర్చుండిపోయింది. ఇంట్లోవాళ్ళు కంగారుపడి స్వామి దగ్గరకు వెళ్ళి చెప్పారు. ఆయనేమీ మాట్లాడలేదు. ఇంకోసారి ఆమె తన యోగాభ్యాసమైన అష్టాంగయోగం గురించీ, నాసికాగ్రమున దృష్టి నిలిపి, గంటల తరబడి కూర్చోవడం గురించీ, ఆయా సమయాల్లో తనకు కలిగే అనుభవాల గురించీ, కనుపించే దివ్య దృశ్యాల గురించీ, వినిపించే దివ్య నాదాల గురించీ స్వామికి చెప్పగా, "నువ్వు ఆ విధంగా చూసే కాంతి నిజమైనది కాదు. నీ లక్ష్యం, ఆత్మోపలబ్ధి. ఆత్మ సాక్షాత్కారం కోసం సాధన చెయ్యి. అల్ప విషయాలు ఎందుకు?" అని స్వామి ఆమె సాధనా విధానాన్ని నిరుత్సాహ పరిచారు. అప్పటినుంచి ఆమె స్వామి సూచించిన విచారణ మార్గాన సాధనచేయనారంభించింది. ఆమె తన భారాన్నంతా స్వామి మీద వుంచింది.

క్రమంగా ఆమెకు స్వామి విషయంలో కూడా కొన్ని అనుభవాలు కలగడం, దివ్యదృశ్యాలు గోచరం కావడం గురించి

మళ్ళీ స్వామితో చెప్పగా, "అవన్నీ స్వామిపై దృష్టి నిలిపి, ఏకాగ్రం చేయడంవల్ల కలుగుచున్నవే కాని, మరేం కాదు. ఇప్పుడు మనకు బయట ఒకటి కనబడుతోందంటే, అది మరొకప్పుడు కనపడకుండా పోతుంది. అందుచేత ఏ దివ్య దృశ్యాలూ శాశ్వతం కాదు," అని ఆమెను ఆనాటినుంచి అటువంటి అనుభవాలనుంచి తప్పించి, ఆత్మవిచారణపైపు దృష్టి మరల్చారు.

అటువంటి సంఘటనే మరొకటి జరిగింది. ఒకసారి ఒక పాశ్చాత్య యాత్రికుడు శ్రీరమణాశ్రమానికి వచ్చి, అరుణాచలాన్ని పరిశోధిస్తానని బయలుదేరి, కొంతదూరం కొండ మీదకు వెళ్ళాక, ఎటూ దారి కనపడక, ఎండలో తిరిగి, తిరిగి అలిసి, నిస్సహాయస్థితిలో వుండగా, భగవాన్ కనుపించి, అతనికి దారి చూపగా, అతను ఎట్లానో అతి ప్రయాసమీద సాయంత్రానికి ఆశ్రమం చేరుకున్నాడు. అప్పటివరకు అతనికోసం ఆశ్రమంలో ఆతృతతో ఎదురుచూసి, అతను రాగానే, ఏం జరిగిందో చెప్పమని అడిగారు. అతను చెప్పిందంతా విని, "భగవాన్ ఇక్కడే హాల్లోనే వున్నారు కదా?" అని ఆశ్చర్యపోయారు. భక్తులుతమ అనుభవాలు ఎన్నెన్నో చెపుతారు. దానికి కారణం - తమకు దివ్యదృశ్యాలు కనుపించాలి, దివ్యనాదాలు వినుపించాలి, దివ్యానుభవాలు కలగాలి" అనే కాంక్షతో వుంటారు. వాటిల్లో వారికి గల ఆసక్తిని స్వామి ఎప్పుడూ ఒప్పుకునేవారు కాదు.

కాలం గడిచేకొద్దీ ఎచ్చమ్మాళ్ దుఃఖం మాయమైంది. ఆమెకు శాంతి లభించింది. కాని, స్వామికి చెప్పకుండా ఆమె ఒక అమ్మాయిని పెంచింది. ఆ అమ్మాయికి వయసు వచ్చాక పెళ్ళి చేసింది. త్వరలో ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. వాడికి "రమణ" అని పేరు పెట్టింది.

ఒకరోజున ఎచ్చమ్మాళ్‌కు టెలిగ్రాం వచ్చింది. "పెంపుడు కూతురు చనిపోయింది," అని. ఆమె టెలిగ్రాం తీసుకుని భగవాన్ దగ్గరకు వెళ్ళింది. స్వామి ఎంత ఓదార్చినా ఆమె దుఃఖం తీరలేదు. అంత్యక్రియలకు ఎచ్చమ్మాళ్, కూతురు అత్తవారింటికి వెళ్ళింది. తిరిగి మనుమడితో వచ్చి, పిల్లవానిని స్వామికి చూపింది. పిల్లవానిని చూసి స్వామి కన్నీరు పెట్టుకున్నారు. ఏమైనా ఆయన అనుగ్రహం ఆమెకు శాంతిని ఇచ్చింది.

**1915** - చాతుర్మాసంలో ఒక రోజున భగవాన్ చుట్టూ ఎందరో కూర్చుని ఉన్నారు. జగదీశశాస్త్రిలు కలం, కాగితం తీసుకుని దీర్ఘాలోచనలో పడ్డారు. వారిని చూసి "ఏమిటి ఆలోచిస్తు న్నారు?" అని భగవాన్ అడిగితే, "ఒక శ్లోకం రాయాలను కుంటున్నాను. మొదటి పాదం మాత్రమే స్ఫురించి ఆగిపోయింది. దాన్ని పూరించలేకుండా వున్నాను," అంటూ ఆ కాగితాన్ని భగవాన్ చేతికి ఇచ్చారు. ఆ పాదం "హృదయ కుహర మధ్యే కేవలం బ్రహ్మ మాత్రం ...". దాన్ని భగవాన్

శ్లో॥ హృదయ కుహర మధ్యే, కేవలం బ్రహ్మమాత్రం
హ్యహ మహ మితి, సాక్షాదాత్మరూపేణభాతి -
హృది విశమనసాస్వమ్ చిన్వతా, మజ్జతావా
పవన చలన రోధా దాత్మ నిష్ఠోభవత్వం"

అని పూరించారు.

దాని తాత్పర్యం :- హృదయమను గుహ యొక్క మధ్యమున కేవలము బ్రహ్మము "నేను - నేను" అని ప్రత్యక్షముగ, ఆత్మ రూపముగ ప్రకాశించుచున్నది. ఆత్మ గురించి వెదకుట చేతనో, తనయందు మునుగుట చేతనో లేక ప్రాణవృత్తి నిరోధం వల్లనో మనస్సుచే హృదయమున ప్రవేశించిన, నీవు, ఆత్మ యందు నిలకడ కలవాడవు అగుదువు.

భగవాన్ రాసిన ఈ శ్లోకంలో అన్ని కాలాల్లో మహర్షు లందరి దివ్యబోధలూ ఓ మూసలో కరిగించి పోసినట్లు ఇమిడి వున్నాయి. దాని అర్థం,హృదయ కుహర మధ్య గుహలో పరబ్రహ్మ ప్రకాశిస్తోవుంటారు. అదే ఆత్మ. అంటే, ఆధ్యాత్మిక హృదయమే "ఆత్మ" అని తెలుసుకోవడమే ఆత్మ స్థితి.

నిరంతరం ఆత్మ స్ఫురణతో వుండి, దాని స్వభావాన్ని పరిశీలించడమే, భగవాన్ సూచించిన సాధనామార్గం. ద్వంద్వా

శీతమైన ఆత్మయే ఆయన లక్ష్యం. అందుకే భగవాన్ తరచు అనేవారు, "ఆత్మను విస్మరించి అన్నీ తెలుసుకోవడం అజ్ఞానం, "నేను" అనేది తెలుసుకుంటే, తక్కినవన్నీ పోతాయి." అని.

"ఆత్మను తెలుసుకునే విధం, ఆత్మగా వుండటం. అదే జ్ఞాని స్థితి. అంటే, బంధహేతువైన దేహాత్మబుద్ధిని వీడి, మనసు ఆత్మను గుర్తించడం. ఆ బంధం, "నేనెవడను?" అను విచారణవల్ల, తొలగి పోతుంది," అన్నారు.

1917 జూలైలో ఒకరోజున నాయనా, ఇంకా కొంతమంది భక్తులు భగవాన్ దగ్గర కూర్చున్నారు. మాటల్లో నాయన తనకు తెలిసిన సమాచారం చెప్పారు. "నేను "మందసాయం" లో వున్నప్పుడు రామనాథ బ్రహ్మచారి వచ్చి, "హృదయ కుహర మధ్యే..." అను శ్లోక అవతరణ గురించి, జరిగిన సంగతంతా వివరంగా చెప్పారు," అని.

ఆ తర్వాత నాయన ఆ శ్లోకాన్ని ఆధారంగా తీసుకుని, గొప్ప వ్యాఖ్య రాశారు. అదే "రమణగీత". భగవాన్ భక్తులకూ, అనుచరులకూ ఇచ్చిన సమాధానాలసారమే రమణ గీత. అది హృదయ విద్య. మనోనిగ్రహం, భక్తి, విచారణ మొదలైన అంశాలతో కూడిని గ్రంథమది. అది ఒకవిధమైన యోగశాస్త్రం. సాధకునికి సంశయ నివృత్తి కలిగిస్తుంది. భక్తునికి ఉపశమనం కలిగిస్తుంది. రమణగీతలో నాయన భగవాన్ తత్వాన్ని గొప్పగా వర్ణించారు.

మనిషంటే "దేహం, మనసు, ఆత్మ" అనే మూడింటి కలయిక. అందు ఆత్మే శక్తి. ఆ శక్తికి దేహం, మనసు ఉపాధులు. చైతన్య వంతమైన, అక్షయమైన, శాశ్వతమైన మార్పుచెందని ఆ శక్తిని తెలుసుకునేందుకు అనేక సాధనా మార్గాలు చెప్పారు. శుద్ధచైతన్యం,

మొదట కాంతిని ప్రసరింప జేసి, ఆపైన అహమింగా రూపొంది, దేహంగా, ప్రపంచంగా విస్తరిల్లుతుంది. అంటే, శుద్ధ చైతన్యవంతమైన ఆత్మనుంచి, చుట్టూ పరిధులు ఏర్పరచుకున్న మరో చైతన్య క్షేత్రం-మనసు, పుడుతోంది. అందుచేత మనసుకి ఆత్మకి భేదం లేదు. మనసు అంతర్ముఖమైతే, ఆత్మ బహిర్ముఖమైతే, అహం, అవుతుంది. కాని, ఆత్మ లేకుండా మనసు నిలవలేదు.

ఏమీలేని చిదాకాశమైన మూలంనుంచి లేచిన మనసు మొదట కాంతివలె వుంటుంది. కాని, అది జడమైన దేహంతో కూడి, "ఇది నేను, అది నేను", అంటుంది. అదే దేహాత్మబుద్ధి. అంటే, మనలోని సహజమైన, విచిత్రమైన, శక్తే, మనసు. దాన్నే జీవుడు లేక సూక్ష్మశరీరం లేక అహం అంటారు. ఆ మనసు "ప్రాణ" సహాయంతో దేహానికి కదలికను ఇస్తుంది. తాను చక్రవర్తివలె దేహేంద్రియాలచేత ఇష్టంవచ్చినట్లు పనులు చేయించుకుంటుంది.

మనసు తన సహజమైన, స్వతసిద్ధమైన చాంచల్యం, చాపల్యం, దురాశవల్ల సదా బైట చెడతిరిగి, దేహేంద్రియాల ద్వారా నిరంతరం ఏదో ఒక విషయాన్ని పోగుజేస్తూనే వుంటుంది. ఏదో ఒక సంగతిని గ్రహిస్తూనే వుంటుంది. తత్ఫలితంగా సుఖ- దుఃఖాల్ని అనుభవిస్తుంది. అది దాని నిరంతర కర్మ. మనసు లేకపోతే, ఇంద్రియాలు స్వతంత్రంగా పనిచేయలేవు.

మనసు విషయాల్ని గ్రహించే సమయంలో "ఆశ" ప్రవేశిస్తుంది. ఆ ఆశ, బలే తిండిపోతు. దాని తిండికి అంతులేదు. అది తిని, తిని, తెగ బలుస్తుంది. అవిద్య, కల్పన, మూఢత్వం వల్ల ఆ ఆశ, బాగా పెరుగుతుంది. ఆ ఆశను క్రోధం, లోభం అనుసరిస్తాయి. ఎంతకీ తృప్తి, సుఖం, శాంతి లేక జీవితాన్ని దుఃఖమయం చేస్తుంది. క్రమంగా మనసు దుష్ట స్వభావం కలదిగా తయారౌతుంది.

మనసు విషయాల్లో తగుల్కొన్నప్పుడు కలుషితం అవుతుంది. అది అవిషయిగా వున్నప్పుడు నిర్మలంగా వుంటుంది. మనసు తాను గ్రహించే విషయాలు తనకే కొన్ని హితంగా, కొన్ని అహితంగా వుంటాయి. కొన్ని విషయాల్ని చిత్తంలో దాచుకుంటుంది. ఆ విషయాలే సంస్కారాలు. ఆసంస్కారాలు, క్రమంగా జ్ఞాపకాలుగా బైటికి వస్తాయి. ఆ జ్ఞాపకాలతో సుఖం అనుభవించే వీలు ఒక్క స్వప్నావస్థకే వుంది.

మనసు తన మనుగడకోసం మేధస్సును ప్రభావితం చేసి, ఆలోచనల్ని పుట్టిస్తుంది. ప్రతి ఆలోచన వెనకా, ఒక సామాన్యమైన ఆలోచన వుంటుంది. అది "నేను" అనే మొదటి ఆలోచన. అన్ని ఆలోచనలకు "నేను" అనే మొదటి ఆలోచనే, మాతృక. అంటే, తక్కిన ఆలోచనల్ని ఆ "నేనే" ఉత్పత్తి చేస్తుంది.

మెదడు పనిచేయడం వల్ల మెలకువలో, స్వప్నంలో ఆలోచనలు కలుగుతాయి. ఆ రెండు అవస్థల్లోనూ ప్రపంచం వుంది. అంటే, ప్రపంచం ఆలోచనాజనితమన్నమాట! గాఢ నిద్రలో ఆలోచనలు లేవు. ఆలోచనలు లేకపోతే, ప్రపంచమూ లేదు. కనుక నిద్రకీ, మెలకువకీ భేదం, తలపు మాత్రమే. అందుచేత ఆలోచనలు సహజమైనవి కావు. సహజమైనవి అయితే, అవి ఒక అవస్థలో వుండి, వేరొక అవస్థలో లేకుండా పోవడానికి వీల్లేదు. అవి అన్ని అవస్థల్లోనూ వుండితీరవలె.

ఇంద్రియ ప్రవృత్తులు తమస్సులో అణగితే, అది గాఢనిద్ర. వెలుగులో అణగితే, అది సమాధి. సుషుప్తి, అనిచ్ఛాపూర్వకం. కావున అది, విజ్ఞానరహితం. సమాధి ఇచ్ఛాపూర్వక విజ్ఞాన సహిత యోగం.

అనుభవజ్ఞులు మనసును మూడు భాగాలుగా విభజించారు 'మనసు, అహంకారం, బుద్ధి' అని. అందు మనసు ఆలోచనామయం,

అహంకారం, సర్వాధికారియై ఆలోచనల్ని అదుపులో పెట్టి, తన ఇష్టం వచ్చినట్లు దేహాన్ని ఉపయోగించుకుంటుంది. బుద్ధికి ఒక గొప్ప గుణం వుంది. అది వివేకంతో చూడ్డం, అహంకారాన్ని అణచి, శాంతపరచడం.

మొదటి ఆలోచన అయిన "నేను"కి, ఒక కేంద్రం వుంది, అది హృదయం. అది రొమ్ముకు మధ్యనున్న "అనాహత చక్రం" కాదు. రక్త ప్రసరణ చేసే గుండెకాదు. అది అసలు భౌతికమే కాదు. అది ఆధ్యాత్మిక హృదయం.

సకల వృత్తులకూ మూలం "నేను" అను వృత్తి. ఆ "నేను" ఎందుండి బయలుదేరునో, ఆ చోటే హృదయస్థానం. అది చాలా ముఖ్యమైన కేంద్రం- అదే ఆత్మ. దాన్నించి శక్తి, కాంతి ప్రసారమై, మెదడుపై పడి, ప్రకాశించి, అద్భుతంగా పని చేస్తుంది. ఆ హృదయంలో- సూక్ష్మ రూపంలో వున్న వాసనలు మెదడులోకి వెళ్ళగా, ప్రతి దశలోనూ మెదడు వాటిని విస్తృతపరుస్తుంది. అంచేత హృదయాన్ని దేహమంతటిగానూ, విశ్వమంతటిగానూ చెప్పవచ్చు. కాని, సాధకునికి సహాయం చేసే నిమిత్తం, హృదయానికో నిర్ణీతమైన చోటు చూపుతారు.

మన సందేహమంతా హృదయం భౌతికమని. హృదయమంటే, నాలుగు అరలతో కూడిన రక్తప్రసరణ జరిగే మాంసకోశం కాదు. "నేను" అను స్ఫురణ ఎందుండి వెడలునో, అదే హృదయస్థానమనీ, వేదాలు చెపుతున్నాయి. ఆ స్ఫురణ మాంసపేటిక నుంచి వస్తుందా?

హృదయం, దేహం కాదు. దేహం జడం. ఆత్మ, స్వయం ప్రకాశం, చైతన్యవంతం. అది చైతన్య స్థానమే కాదు, సాక్షాత్తూ చైతన్యం. అది శరీరమంతటా వ్యాపించి వుండటంచేత, అనుభవాలు కలుగుతున్నాయి. ఆ ఆత్మ చైతన్యంతో, జడదేహం కూడా కదులు

తుంది. ఆ ఆత్మజ్యోతి వుండేచోటు, హృదయస్థానం. పంచభూతాలతో నిర్మితమైన దేహాన్ని ఆశ్రయించిన ఆత్మస్థానం. హృదయ కుహరమధ్యం. ఆత్మ రూపమే, హృదయం.

మనలోనే ఎక్కడో హృదయస్థానం వుంది. కాని, అది రొమ్ముకు ఎడమవైపునవుండే రక్తప్రసరణ గుండె కాదని గుర్తించాలి. యోగశాస్త్రంలో చెప్పబడే చక్రాల్లో ఒకటి కాదు, హృదయం. కాని, ఆ హృదయమే కేంద్రం. అదే అన్నింటికీ మూలం. ఉపనిషత్తులు దాన్నే "బ్రహ్మం" అంటాయి. హృదయంకంటే, ఈశ్వరుడు వేరు కాదు. మన అవగాహనకు వీలుగా, హృత్పద్మంలో దైవం వుంటాడంటారు. అంటే, అర్థం "లోన చూడు" అని. ఆ హృదయంలో దేహం - లోకం - సమస్త విశ్వం వుంది. దాన్నించి ఏదీ భిన్నంగా లేదు. అందుచేత అదే కేంద్రం. అక్కడ నుంచే అన్నీ వెలువడతాయి.

సకల వృత్తులూ, వ్యాపారాలు ఎచ్చట నుండి బయలుదేరునో, అదే హృదయం. దానికి ఆకార వర్ణన, కేవలం భావన. సకల వృత్తులకూ మూలం "నేను". ఆ "నేను" ఎక్కడ నుండి బయలు దేరుతుందో, అదే హృదయం.

చంద్రునికి తేజస్సును, సూర్యుడు ఇచ్చునట్లు, మనసుకు హృదయం వెలుతురు ఇస్తుంది. అందుచేత హృదయం యొక్క పరోక్షంలో మనసును మాత్రం చూస్తున్నాడు మనిషి.

వేదాల్లో హృదయాన్ని "అధోముఖ పద్మకోశ ప్రకాశం" అని వర్ణించారు. అంటే, క్రింది ముఖమైన తామర మొగ్గవలె వుంటుందని అర్థం. అలాగే "కదళీ ముకుళం" అని కూడా అంటారు. అంటే; అరటి పువ్వువలె క్రింది ముఖమై వుంటుందని అర్థం.

ఒకసారి భగవాన్ ఒక భక్తునితో, "హృదయం, ఆది మునుల, యోగుల, ఋషుల అనుభవసారం. అది రొమ్ముకు కుడివైపున రెండు అంగుళాల దూరంలో వుంది. ఆ సంగతి మలయాళ ఆయుర్వేద గ్రంథంలో చూశాను. అక్కడే అహం కలిసేది. ఆ హృదయాన్నే "ఆత్మ" అని కూడా అంటారు. రక్తప్రసరణ గుండెకీ, దానికీ ఏమీ సంబంధం లేదు. అది వ్యక్తిత్వపుసారం. దానివల్లే మనిషి నిద్రపోతున్నాడో, మేల్కొన్నాడో, సమాధి స్థితిలో వున్నాడో తెలుస్తుంది. ఈ సంగతి అంతరజ్ఞానం కలవారందరికీ తెలుస్తుంది. దాన్ని అందరూ తెలుసుకోవచ్చు. తెలుసుకోగలరు. దాని స్థానం తెలుస్తుందిగాని, దాని గురించి తెలిసేది జ్ఞాని ఒక్కరికే. ఆ హృదయ స్పందనమే, వారి చైతన్యం" అన్నారు.

అలఘుమ్మ జీవితమంతా దుఃఖాన్నే అనుభవించింది. భర్త చనిపోయిన కొన్నాళ్ళకు, రెండో కొడుకు వెంకట్రామన్ ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత కొన్నేళ్ళకు పెద్దకొడుకు నాగస్వామి చనిపోయాడు. మూడో కొడుకు నాగసుందరం, పధ్నాల్గేళ్ళవాడు "తిరువేంగాడు" దేవాలయంలో గుమాస్తాగా చేరాడు.

అలఘుమ్మ కాశీయాత్రకు వెళ్ళి, తిరుగు ప్రయాణంలో తిరువణ్ణామలైలో ఆగి, కొడుకును చూసి వెళ్ళింది. కొన్నాళ్ళ తర్వాత చిన్నమరిది నెల్లియప్పయ్యర్ చనిపోయాడు. ఆ దిగులుతో అలఘుమ్మ 1914లో తిరుపతి యాత్రకు వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు తిరువణ్ణామలైలో మళ్ళా ఆగింది. కొడుకు దగ్గరకు వచ్చి, జబ్బు పడింది. అది టైఫాయిడ్ అన్నారు. ఆమె కదలడానికి వీలులేక, భగవాన్ దగ్గర వుండిపోయింది. ఆ వుండటం వుండటం మూడు వారాలు వుంది. అన్ని రోజులూ భగవాన్ ఆమెకు రాత్రింబవళ్ళు శ్రద్ధగా సేవచేశారు. ఆ సందర్భంలో స్వామి అరుణాచలాన్ని ప్రార్థిస్తో పద్యాలు రాశారు :

1. ఓ ప్రభో, జన్మజన్మల దోషాల్ని హరించే తండ్రీ!
   నా తల్లి జ్వరాన్ని నయం చెయ్యి.
   ఓ ఈశ్వరా, మృత్యు వినాశనమూర్తీ!
   నీ పాద పద్మాలచెంత పడివున్న నా కన్నతల్లి
   హృదయ కమలంలో నీ పవిత్ర పాదాల్ని వుంచు.
   ఆమెను మృత్యుముఖం నుంచి తప్పించు.
   విచారిస్తే, మృత్యువెవరు?

2. ఓ అరుణాచలా, జ్యోతిర్మయా
   నీ జ్ఞాన తేజస్సు నా తల్లిని ఆవరించనియ్యి.
   నీ జ్ఞానాగ్నితో ఆమెకు స్వస్థతనిచ్చి,
   నీలో లయం చేసుకో తండ్రీ!

ఇంక ఆమెకు దహన సంస్కారాలతో పనివుండదు.
భ్రాంతుల్ని పారద్రోలేవాడా, అరుణాచలా
నా తల్లిని ఈ సంధిస్థితినుంచి విముక్తి
పరచడానికి నువ్వెందుకు వెనుకాడుతున్నావు?

నీ దివ్య పాదపద్మములే దిక్కని నమ్మిన నాతల్లికి, ఆరోగ్యం ప్రసాదించుట నీధర్మం. ఆమెను విషయ వాసనలనుంచి తప్పించి, ఆత్మదర్శనాన్ని అనుగ్రహించు," అని అరుణాచలేశ్వరునికి విన్నవించుకున్నారు, స్వామి.

భగవాన్ ఎప్పుడూ అద్వైత తత్వాన్నే బోధించినా, ఆ పద్ధతిలో జీవించినా, తన గురించి చెప్పుకోవలసి వస్తే, "నేను" అనేవారుకాని; "ఇది-అది" అనేవారు కాదు. అలా అనడం భేదమత కలిగిస్తుందని వారి భావన అయివుండాలి. అందుచేతే సూటిగా "నా తల్లికి" అని స్పష్టంగా అరుణాచలేశ్వరునికి నివేదించుకున్నారు. అంతటి సమదృష్టితోనే, కుంటి కోతిపిల్లనీ, రాళ్ళలోపడిన గొర్రె పిల్లనీ, గూట్లోంచి జారిపడ్డ ఉడతపిల్లనీ, తీసుకుని ఆదరించి సేవ చేశారు. వాటి ఆకలి, దప్పికలను గుర్తెరిగి, సరైన ఆహారం పెట్టించేవారు. వారి దృష్టిలో పిట్ట, ఉడత, కోతి, తల్లి అన్నీ, అంతా ఒకటే, సమానమే. అలఘమ్మ విషయంలో ఆ క్షణాన ఆయన్నించి అటువంటి విన్నపం వెలువడింది అంతే!

అరుణాచలేశ్వరుడు స్వామి ప్రార్థన విని, అనుగ్రహించినట్లుగా, అలఘమ్మ ఆరోగ్యం బాగైంది. ఆ తర్వాత ఆమె మానామధుర వెళ్ళింది. వెళ్ళిందే కాని, ఆమె మనసంతా అరుణాచలం మీద, కొడుకు మీద వుంది. అంతలో మూడో కొడుకు భార్య చనిపోయింది. అతని కొడుకు వెంకట్రామన్ని మేనత్త "అలిమేలు" పెంచింది.

అలఘమ్మ తిరిగి అరుణాచలం వచ్చేసింది, **1916**లో. మొదట కొన్నాళ్లు ఎచ్చమ్మాళ్ ఇంట్లో వుంది. కాని, చివరికి కొడుకుతో ఉండటానికి నిశ్చయించుకుంది. స్వామికి భక్తులు, అనుచరులు ఇచ్చే పదార్థాలతో వంట చేసి అందరికీ పెట్టేది, అలఘమ్మ.

అలఘమ్మ రావడం, అందరికీ వంట చేసి పెట్టడం చూసి, స్వామి మళ్ళా అన్నీ వదిలేసి ఎక్కడికైనా వెళ్ళిపోతారేమో ననుకున్నారు కొందరు. చివరికి ఆ అనుమానం అంటువ్యాధిలాగ అందరికీ సోకింది. స్వామి మాత్రం అలఘమ్మను అందరితోపాటు తీసుకున్నారే కాని, తల్లిగా ఏ ప్రత్యేకతా చూపలేదు.

క్రమంగా స్వామికి భక్తులు, అనుచరులు, యాత్రికులు, ఆరాధకులు ఎక్కువయ్యారు. వారందరికీ నివాసస్థలం చాలలేదు. వేరే చోటుకోసం వెదికారు. "స్కందస్వామి" అనే ఆయన విరూపాక్ష గుహకు కొంచెం దూరంలో, ఎగువ భాగాన వున్న ఒక గుహను బాగుచేశారు. అది చాలా విశాలమైన ప్రదేశం. అక్కడ నిరంతరం ప్రవహించే ఒక చిరు ప్రవాహం కూడా వుంది.

* * *

**1916** చివరలో, స్వామి స్కందాశ్రమానికి మకాం మార్చారు. అందరితోపాటు అలఘమ్మ కూడా అక్కడకు చేరింది. స్వామితో స్థిరపడింది. అక్కడ ఆమె వంట చేసేది. ఓ స్థిరనివాసం, వంటా అన్నీ ఏర్పాటుకావడంతో, కొత్తవారు వచ్చి స్వామితో స్థిరపడ్డారు. వారూ తలొక పనీ చేసేవారు. స్వామి కూడా వంటలో సహాయం చేసేవారు. కొందరు గోడలు, అరుగులు కట్టారు. ఆ అరుగుల్ని గుర్తుచేసుకుంటూ, "ఈ సోఫాల కన్నా ఆ అరుగులు ఎంతో సుఖంగా వుండేవి," అన్నారు భగవాన్, ఒకసారి శ్రీరమణాశ్రమంలో. ఆ అరుగులపై గడ్డిచాపలు

పరమకుని పూర్చునేవారు. స్కందాశ్రమం ఋష్యాశ్రమాల్ని గుర్తు చేసేది. నిరంతరం ప్రవహించే ఆ సెలయేరు ఆశ్రమవాసుల అవసరాలు తీర్చడమేకాక, తోటలో మొక్కలకు కూడా నీటిని ఇచ్చేది. అక్కడ కొత్త జీవితం ఆరంభమైంది.

స్కందాశ్రమం ఏర్పడిన ఆరు మాసాలకు అలఘమ్మ "నారాయణరెడ్డి" అనే అతన్ని పంపించి మూడో కొడుకు నాగసుందరాన్ని అరుణాచలం రప్పించింది. మొదట్లో అతడు గంభీరం శేషయ్యగారి ఇంట్లో వుండేవాడు. తర్వాత ఓ సత్రంలో తింటూ, తిరిగేవాడు. క్రమంగా అతనిలో మార్పు వచ్చింది. 1918లో అతడు కాషాయంకట్టి, "నిరంజనానంద స్వామి," అని పేరు మార్చుకున్నాడు. భిక్షాన్నంతో జీవించేవాడు. అది చూసి, "ఇక్కడ అలఘమ్మ వంటచేసి పెడితే ఇంతమంది తినగా లేనిది, కన్నకొడుకు భిక్షాటన చేసుకుని తినడం ఎందుకు?" అని కొందరు అతన్ని స్కందాశ్రమానికి తీసుకొచ్చారు. అప్పటి నుంచి అతన్ని అందరూ "చిన్నస్వామి" అని పిలిచేవారు.

స్థిరనివాసం, వంటా, వచ్చి-పోయే భక్తులు, యాత్రికులు, వాళ్ళు తెచ్చే సరుకులు, బంధు-మిత్రులు శాశ్వత సభ్యులు - అందరితో స్కందాశ్రమం క్రమంగా ఒక పెద్ద సంసారంగా తయారైంది. చూస్తూ, చూస్తూండగా అంత మార్పు వచ్చింది. అదంతా చూసి, "ఇదంతా నా కుటుంబం," అన్నారు స్వామి.

ఒక రోజున ఒకాయన స్వామి దర్శనానికి వచ్చి, శేషాద్రి స్వామిని అడిగారు, "రమణస్వామి ఎక్కడ వున్నారు?" అని. దానికి ఆయన "ఆయనా?" అని, "ఆ కొండమీదకు వెళ్ళు. అక్కడ ఒక గృహస్థు వున్నాడు. నీకు మంచి భోజనం పెడతాడు" అన్నారు. అలా అని, "స్వామి దర్శనం మనస్సును శుద్ధి చేస్తుంది. వెళ్ళండి," అంటూ వారికి స్కందాశ్రమం దారి చూపించారు.

1918లో "అయ్యాస్వామి" అనే అయన స్వామి సేవకు పరిచర్యకు పూనుకున్నారు. ఆయన కేరళీయుడు. దక్షిణాఫ్రికాలో ఒక యూరోపియన్ దగ్గర పనిచేశారు. ఆయన ఎప్పుడూ శుచిగా, శుభ్రంగా వుండేవారు. ప్రతి పనినీ చురుకుగా, తెలివిగా, సమర్థ వంతంగా నిర్వహించేవారు. ఆయనకు దేనికోసమూ ఆశ, ప్రయత్నమూ లేదు. ఎటువంటి బంధమూ లేనివారుఆయన. ఆయనకు పళనిస్వామి అంటే భక్తి, గౌరవం, మర్యాద. చాలామంది కంటే అయ్యాస్వామి ఎంతో సమర్థులు. ఎంత సమర్థులంటే, "ఒకేసారి పది ఆశ్రమాల్ని అవలీలగా, సక్రమంగా నడపగల సమర్థులు," అని ఒకసారి స్వామే అన్నారు; ఆయన గురించి వచ్చిన మాటల్లో. ఆయనకోసం స్వామి శంకర విజయం నుంచి కొన్ని భాగాల్ని రాసి ఇచ్చారు.

ఆ సంగతి తెలిసి పెరుమాళ్ళ స్వామి, "స్వామీ, నాకో?" అని అడిగారు. అతని కోర్కెపై "గురుస్తుతి" రాశారు. ఆ తర్వాత భిక్షాటనకు వెళ్ళేప్పుడు పాడుకునేందుకు పాట రాయమన్న భక్తుల కోర్కె ప్రకారం, "అక్షర మణమాల" రాశారు. అది స్వామి రచన లన్నింటిలోకి అగ్రగణ్యమైనది. అందు దైవప్రార్థన ధారావాహినిగా వెలువడింది. దాని అర్థం; "అక్షరునికి అంటే, అరుణాచలేశ్వరునికి పెండ్లినాటి పూదండ" అని. అందులో ప్రతి పాదం అకా రాద్యక్షరంతో ప్రారంభించబడటం చేత, దానికి "అక్షరమణమాల" అని పేరు పెట్టారంటారు కొందరు. అది రసబంధురం-మనోహరం-భక్తి - శృంగార భరితం, జ్ఞాన మధుర భావపూరితం, లలితపద సమ్మిళితం, విలాప మధురం.

అసలు అది ఎలా అవతరించిందంటే, పెరుమాళ్ళస్వామి, స్వామి సేవ చేసుకుంటో ఊళ్ళో ఓ సత్రంలో భోజనం చేసేవారు. కొన్నాళ్ళకు ఆ సత్రంవారికి ఆయన పద్ధతి నచ్చక, "మీరు చేసేపని ఏదో అది మాకే చేయండి," అన్నారు. ఆయన అందుకు అంగీకరించ లేదు. "భిక్షుక వృత్తి స్వీకరించి, భిక్ష ఎత్తుకుంటూ ఊరంతా తిరుగు తాను. ఆ సమయంలో పాడుకునేందుకు నాకో పాట రాసి

ఇవ్వండి" అని స్వామిని అర్థించారు. తత్ఫలితంగా "అరుణాచల శివ, అరుణాచలశివ, అరుణాచలశివ, అరుణాచలా!" అనే పల్లవితో స్వామి పాట కట్టారు. అదే "అక్షర మణమాల".

* * *

రోజూ తెల్లవారుజామున వళ్లీమురుగర్, చిదంబరం, సుబ్రహ్మణ్యఅయ్యర్ మొదలైనవారు స్వామి సన్నిధిలో అరుణగిరినాథర్ పాటలు పాడేవారు. ఆ పాటలకు స్వామి తాళం వేసేవారు. ఒకరోజున వారు "రమణ సద్గురు, రమణ సద్గురు, రాయనే," అని పాడుతూ వుంటే, వారితో స్వామి కూడా కలిసి పాడారు. స్వామి పాడటం చూసి, ఆశ్చర్యంతో, "మీరు కూడా పాడుతున్నారే!" అని అడిగారు. దానికి స్వామి, "ఆశ్చర్యపడటానికి ఇందులో ఏముంది? అనంతమైన రమణ, ఆరు అడుగుల ఆకారంలో ఎందుకు కూరుకుపోవాలి? మీరు కీర్తించేది సర్వాంతర్యామిని కదా? నేను కూడా ఎందుకు మీతో కలిసి పాడకూడదు?" అన్నారు.

* * *

ఒకరోజున అలఘమ్మ అప్పడాలు చేస్తూ, స్వామి సహాయం కోరింది. ఆయన అప్పడాలు చేస్తూ,ఆధ్యాత్మికోన్నతి రూపకల్పనగా, ఆశువుగా ఒక పాట కట్టారు. అదే "అప్పడపు పాట". దాన్ని ప్రణవానందులు తెలుగు చేశారు.

పల్లవి :- అప్పడమొత్తి చూడు, అది తినినప్పుడే
నీ యాశ వీడు

అనుపల్లవి :- ఇప్పుడమియందున నే మరి తిరుగన్
సద్బోధానందుడే సద్గురునాథుడు
చెప్పక చెప్పెడు తత్త్వమగు సమము
గొప్పది లేనట్టి యొకమాట చొప్పున ॥అప్ప॥

చరణములు:- తానుగాని పంచకోశ క్షేత్రమునందు
దానుగా పెరుగభిమాన మినుములను
నేనెవ్వడనెడు విచార తిరగలిలో
"నేను"గానని పగలగొట్టి పిండియుచేసి ॥అప్ప॥

సత్సంగమనియెడు నల్లేరు రసముతో
శమ, దమములను జీలకర్ర, మిరియములు
ఉపరతి యనునట్టి యుప్పును గలిపి
సద్వాసన యనియెడి యింగువను జేర్చి ॥అప్ప॥

రాతి చిత్తము నేను నేనని భ్రమయన్
లోదృష్టి రోకటితోను మానకదంచి
శాంతమౌ కొడుపు సమమగు పీటపై
సంతతమలయన్ సంతసంబుతోడ ॥అప్ప॥

మౌనముద్రయనెడి మూగియని పాత్రమున
జ్ఞానాగ్నిచే గాగు సద్బ్రహ్మ ఘృతమున
నేనది యగునని నిత్యమును వేల్చి
తను, దానె భుజియింప దన్మయమగునట్టి ॥అప్ప॥

* * *

భగవాన్ సన్నిధి చేరినవారంతా స్వామి మౌనోపదేశాన్ని అర్థం చేసుకోలేకపోయారు. స్వామి తత్వం అర్థం చేసుకొనేందుకు నటేశమొదలియార్‌కు చాలాకాలం పట్టింది. ఆయన ఎలిమెంటరీ స్కూలు టీచర్. ఆయన వివేకానందుని చదివి, సర్వసంగ పరిత్యాగం చేయదలచి, గురు అన్వేషణలో 1918లో స్వామి దర్శనం చేసుకుని ఆయన మాట్లాడకపోతే, నిరాశచెంది, ఇంకా అనేక చోట్లకు తిరిగి, మహాత్ములన్ని దర్శించి, ఎక్కడా తృప్తి కలగక, స్థిరత్వం ఏర్పడక, గురువు లభించక రెండేళ్ళ తర్వాతళ్ళిస్వామికి

ఒక ఉత్తరంలో, "మీరే నా గురువు. మీరు నాకు ఉపదేశం ఇవ్వండి" అని రాశారు. ఆ తర్వాత ఒకరోజు రాత్రి స్వామి ఆయన కలలో కనపడి "నిరంతరం నా కోసం ఆలోచించకు. ఈశ్వరుని దయ పొందు. ఆయన్నే ధ్యానించు. ఆయన అనుగ్రహాన్ని సంపాదించు. నా సహాయం దాని వెంబడి వుంటుంది" అన్నారు.

స్వామి సూచించినట్లే, నటేశమొదలియార్ నడుచుకున్నారు. కొద్దిరోజుల తర్వాత, "స్వామి ఎవరి ఉత్తరాలకు సమాధానం రాయరు. మీరు స్వయంగా ఇక్కడకు వచ్చి, స్వామితో సంప్రదించండి." అని రమణాశ్రమం నుంచి సమాధానం వచ్చింది.

ఆ సమాధానం ప్రకారం నటేశమొదలియార్ అరుణాచలం వచ్చి, మొదట అరుణాచలేశ్వరుని దర్శించి, తర్వాత స్వామి దర్శనార్థం వెడుతుండగా దారిలో ఒకాయన కనపడి, విషయం తెలుసుకుని, "నాయనా, నా మాట విను. నేను రమణ మహర్షి సన్నిధిలో పదహారేళ్ళు వున్నాను. ఆయన అనుగ్రహం లభించలేదు. ఆయన ప్రతిదానికీ ఖిన్నం. ఆయన సన్నిధిలో నువ్వు తల బద్దలు కొట్టుకున్నా, "ఎందుకు తల బద్దలు కొట్టుకుంటున్నావు?" అని కూడా అడగరు, ఆయన. ఆయన అనుగ్రహం సంపాదించడం అసాధ్యం. మీరు అరుణాచలం రావడంలో అర్థంలేదు. అంతకన్నా శేషాద్రిస్వామి అనుగ్రహం సంపాదించుకోండి. ఆయన మామూలు మనుష్యులతో కలిసి తిరుగుతారు. ఆయనవల్ల మీకు మేలు జరుగుతుంది" అన్నారు.

స్వామి దర్శనార్థం నటేశమొదలియార్ స్కంధాశ్రమం వచ్చారు. స్వామి ముందు మౌనంగా కూర్చున్నారు. రాత్రి భోజన సమయం వరకు వారిమధ్య మాటలు లేవు. స్వామి భోజనానికి లేచారు. అప్పుడు సుబ్రహ్మణ్యఅయ్యర్ స్వామితో, "ఈయనే మీకు ఉత్తరం రాసిన నటేశమొదలియార్" అనగా, స్వామి నిలబడి,

మొదలియార్ వంక నిదానంగా ఓ క్షణం చూసి, లోపలకు వెళ్ళారు. అప్పటినుంచి నటేశ మొదలియార్ ప్రతినెలా స్వామి దర్శనం చేసు కున్నారు. స్వామి ముందు మౌనంగా కూర్చునేవారు. ప్రతిసారి అంతే! ఆ విధంగా ఒక సంవత్సరం గడిచింది. మొదలియార్ భరించ లేక "నేను మీ అనుగ్రహాన్ని అనుభవించి తెలుసుకోవాలనుకుంటు న్నాను" అన్నారు ధైర్యంతో.

"నే నెప్పుడూ నా అనుగ్రహాన్ని అందిస్తూనే వున్నాను. మీరు తెలుసుకోలేకపోతే, అందుకోలేకపోతే, అనుభవించలేకపోతే నేనేం చెయ్యను?" అన్నారు. మొదలియార్ మానసికంగా చాలా అలసిపోయారు. ఒకరోజున స్వామి ఆయన కలలో కనపడి, "నీకు కనుపించిన దివ్యదృశ్యానుసారం, బాహ్యాంతర విషయాల్ని ఒది లెయ్యి. భిన్నత్వం తొలగడమే, పురోభివృద్ధి" అన్నారు.

అప్పటినుంచి మొదలియార్ స్వామి మార్గాన్ని అనుసరిం చారు. మరో కలలో మొదలియార్ రొమ్ము కుడివైపున స్వామి వేలుతో గట్టిగా నొక్కారు. ఆనాటినుంచి ఆయన సాధన తీవ్రమైంది. ఆయన స్వామిమీద పద్యాలు రాశారు. స్వామి అనుగ్రహాన్ని పొందారు. ఆయన తృప్తికోసం స్వామి ఆయన్ని కలలో తాకారు.

ఒకసారి స్వామి "ఇక్కడ వున్నన్ని రోజులూ ఇల్లూ, సంసారం, లోకం మరచి ఎట్లా హాయిగా వుంటారో, ఇంటికి వెళ్ళి కూడా అట్లా ఏదీ పట్టకుండా వుండటానికి ప్రయత్నించండి. అదే సాధన. అప్పుడు మిమ్మల్ని ఏదీ బంధించదు" అన్నారు మొదలియార్‌తో.

1939లో మొదలియార్ సన్యాసియై, కాషాయం కట్టి, "నటనానందస్వామి"గా పేరు మార్చుకున్నారు. స్వామిపై కొన్ని పుస్తకాలు రాశారు. కాని, కొన్నాళ్ళ తర్వాత తిరిగి గృహస్థు లైనారు.

ఒక రోజున ఒక ఉద్యోగస్తుడు స్వామి దర్శనం చేసుకుని, "స్వామీ, నేను ఉద్యోగం మానేసి ఎప్పటికీ స్వామి సన్నిధిలో వుండిపోదలచాను" అన్నాడు.

దానికి స్వామి, "స్వామి ఎప్పుడూ మీతోనే వున్నారు. మీలో వున్న "నేనే" ఆ స్వామి. ఆ నేను "అందరిలోనూ వుంది. నువ్వు తెలుసుకోవలసింది ఆ "నేను"ని, అన్నారు.

ఉద్యోగి :- సన్యాసం స్వీకరించాలనే తీవ్ర కాంక్ష, సమస్త బంధాల్ని తెంచుకోవాలనే గట్టి వాంఛ, ప్రపంచాన్ని పూర్తిగా త్యజించాలనే ప్రబలమైన కోర్కె నన్ను వదలడం లేదు.

స్వామి :- సన్యాసమంటే, పరిశుద్ధ జ్ఞానమే కాని, బట్టలు మార్చడం, ఇల్లు వదలిపోవడం కాదు. సర్వసంగ పరిత్యాగమంటే, బంధాల్ని తెంచుకోవడం, మమకారాల్ని, వాంఛల్ని, కోర్కెల్ని తీసేసుకోవడం. సన్యాసమంటే, ముండనం, కాషాయం కాదు. వ్యక్తిత్వ విసర్జన. గృహస్థుననుకొనంతకాలం, సన్యాసే. సన్యాసమంటే, అహంకార త్యాగం.

ఉద్యోగి :- ప్రపంచాన్ని వదలకుండా ఏకాగ్ర చిత్తంతో భగవంతుణ్ణి సేవించడం సాధ్యం కాదా?

స్వామి :- సాధ్యమే. ఎవరైతే నిజంగా సమస్తాన్ని పరిత్యజిస్తారో, వారు ప్రపంచంలో లీనమై వుంటారు. వారు తమ ప్రేమను విశ్వ ప్రేమగా విస్తృతపరచి, సమస్త ప్రపంచాన్ని ప్రేమతో హృదయానికి హత్తుకుంటారు. ఇల్లు, సంసారం వదలి కాషాయం కట్టడంకన్నా, ప్రేమతో ప్రపంచాన్ని తనలోకి తీసుకోవడం భక్తుని, సాధకుని దృష్టిగా మారడం ఎంతైనా ఉత్తమం.

ఉద్యోగి :- ఇంట్లో మమకార బంధాలు గట్టిగా వుంటాయి.

స్వామి :- పరిపక్వం కాకుండా పరిత్యజిస్తే, మరిన్ని కొత్త బంధాలు చుట్టుకుంటాయి.

ఉద్యోగి :- భవబంధాల్ని తెంచుకోవడానికి పరిత్యాగం సరైనది కాదా? అది ఉత్తమ మార్గం కాదా?

స్వామి :- భవబంధాల నుంచి నిజంగా ఎవరి మనసు విముక్తి పొందుతుందో, అది వారికి సరైనది, ఉత్తమమైనది. కాని, మీరు సర్వసంగపరిత్యాగ మనేదాని అంతరార్థాన్ని గ్రహించడంలేదు.

ఉద్యోగి :- ఒకనాడు ఏలాగూ ఈ సంసార బంధాలన్నీ విచ్ఛిన్నమౌతాయి. కాబట్టి నేనెందుకు ఇప్పుడే దీక్ష తీసుకోకూడదు? దానితో బంధాల్ని ఛేదిస్తాను. అందర్నీ సమంగా ప్రేమిస్తాను.

స్వామి :- మీకు అందరిమీదా నిజంగా ప్రేమా, సమదృష్టి వున్నప్పుడు, సమస్త సృష్టినీ, మీ హృదయానికి గాఢంగా హత్తుకున్నప్పుడు "ఈ విధంగా పరిత్యజించాలి. ఆ విధంగా సన్యసించాలి" అని అనుకోరు. చాలా సహజంగా సంసార జీవితం నుంచి నిష్క్రమిస్తారు. మీ నుంచి సంసార బంధం దానికదే ఎండు రాలినట్లు, వదలిపోతుంది; మీరు ఎటువంటి ప్రయత్నం చేయకుండానే. అప్పుడు "విశ్వమే నా కుటుంబం" అనే భావం మీకు ఏర్పడుతుంది.

ఎవరైనా వచ్చి "నేను సన్యాసం తీసుకుంటాను" అంటే, స్వామి నిరుత్సాహపరిచేవారు. సన్యాసమంటే, ప్రపంచం నుంచీ, మరి దేనినుంచీ వెనక్కి తగ్గి, సర్వం వదలివేయడం కాదు.

నమస్తాన్ని ప్రేమతో హృదయానికి హత్తుకోవడం. ఆ ఆలింగనంలో సంసారం - అన్నీ వుంటాయి. వ్యక్తిత్వాన్ని పరిత్యజించడమే నిజమైన సన్యాసం. కనుక స్వామి సర్వసంగ పరిత్యాగాన్ని ఒప్పుకోలేదు. మనము ఒక పద్ధతికి, సిద్ధాంతానికి కట్టుబడితే, ఇతర సిద్ధాంతాన్ని ఖండించక తప్పదు. ఆ కోవకు చెందినవారే మతాధిపతులు, మఠాధిపతులు.

స్వామికి మతం లేదు. ఆయన సూచించినది విచార మార్గం. దాన్ని కర్మ-జ్ఞాన మార్గమని కూడా చెప్పవచ్చు. అందుకే స్వామి తరచు "నేను కర్తను" అనే భావాన్ని వదలమనేవారు. "నేను - నాది అని ఎప్పుడూ ప్రకటించుకోవద్దు" అనేవారు. కనీసం ఆ విధంగా అనుకోనిచ్చేవారూ కాదు. "నువ్వు ఏదీ కాకుండా, నువ్వు - నువ్వుగా వుండు" అనేవారు ప్రతి ఒక్కరినీ. ఎందుకంటే, ఉన్నదంతా ఒక్కటే. అది ఆత్మ. తెలుసుకోవలసింది, దాన్ని. దాన్ని తెలపడానికి ఎన్ని మతాలు! ఎన్ని సిద్ధాంతాలు! ఎన్ని విధానాలు! ఎన్ని పద్ధతులు! ఎన్ని వాద వివాదాలు! అదంతా సిగ్గుచేటు సంగతి. ప్రజలు కోరేవి సందిగ్ధాలు, విపులాలు, ఆకర్షణీయాలు. అందుకే అన్ని మతాలు, సిద్ధాంతాలు పుట్టుకొచ్చాయి; కాలం పొడవునా. అవన్నీ క్లిష్టమైనవి. అన్ని కాలాల్లో ప్రతి మతానికి అనుకూలురూ, ప్రతికూలురూ వుండనే వుంటారు. "స్వర్గరాజ్యం నీలోనే వుంది. నేనూ, నా తండ్రీ ఒక్కటే" అన్న ఏసుక్రీస్తు ప్రవచనాల్ని విస్మరించి, ఆ మతస్థులు ఏవేవో బోధలు చేస్తారు" అన్నారు స్వామి.

స్వామి ఇచ్చే సమాధానాలు, వివరణలు విని, ఎంతటి మేధావులూ ఆశ్చర్యపోయేవారు. ఒక్కోసారి కొందరు తమను తాము చక్కదిద్దుకునేవారు. సాంప్రదాయ పద్ధతిని ఆలోచించి, ఆచరించి; అనుసరించే విధానాలకు, స్వామి విధానం విరుద్ధమైనది. "నిజమైన పరిత్యాగం మనసులోనే" అనేవారు స్వామి. బాహ్య

విషయాల్ని పరిత్యజించడం ద్వారా మనం కోరే స్వేచ్ఛ రాదు. ఎక్కడ, ఎట్లా వున్నా మనల్ని సదా వెంటాడేది, మన మనసు. అన్ని ఆలోచనలకూ అదే మూలం. ఆ ఆలోచనే, మన దేహాన్ని, మనసునీ సృష్టిస్తుంది. "నేను గృహస్థును - నేను సన్యాసిని" అని ఆలోచింపజేస్తుంది.

మనం ఒంటరిగా వున్నప్పుడూ, మనం ఏమీ కాకుండా వున్నప్పుడూ "నేను సన్యాసిని" అనే ఆలోచన మనల్ని వెంటాడుతూనే వుంటుంది. తప్పదు, మనం ఎక్కడ ఎట్లావున్నా, ఆలోచన వదలదు. అదంతా మన మనసులోని మర్మం. ఇల్లు వదిలి, అడవికి వెళ్ళినా, అక్కడ - ఆ అరణ్యవాతావరణం - అక్కడి పరిస్థితులు మనల్ని ఎట్లానూ చుట్టుకుంటాయి. ఇంటి దగ్గర చుట్టుకున్నట్లు. అవి తప్పవు. బహుశా కొత్త ప్రదేశాల్లోని పరిస్థితులు, పరిసరాలు మరింత విజృంభించవచ్చు; అలవాటు లేక. మనం పరిసరాల్ని మార్చలేము. కనుక మనం ఇంట్లో వున్నా, అడవిలో వున్నా మొదట జయించవలసింది మనసును. మనసును అడవిలో జయించగలిగేవాడు, ఇంట్లో ఎందుకు జయించలేడు?

కాబట్టి మనం ఎప్పుడూ పరిస్థితులను, పరిసరాలను మార్చాలని చూడకూడదు. సర్వ కర్మలు ఆచరిస్తో, నిష్కామంగా వుంటో, స్వస్థితి చెడగొట్టుకోకుండా వున్నవారే నిజమైన మానవులు. వారు "మేము సన్యాసులం" అని అనుకునేవారికన్నా, గొప్పవారు. "నేను గృహస్థును" అని అనుకోనివాడు, సన్యాసులమనుకునే వారికన్నా గొప్ప సన్యాసి. నిజమైన సంసారం మనస్సంసారం. దాన్ని వదలాలి గాని, ఇల్లునీ - ఇల్లాలినీ కాదు. బాహ్య పరిసరాలు మారిస్తే, ఏం ప్రయోజనం?

"సన్యసిద్దామా? వద్దా?" అనే ప్రశ్న కలిగిందంటే, ఇంకా పరిపక్వం కాలేదని అర్థం. ప్రశ్న, సంశయం, సందేహం, ఆలోచన లేకుండా సన్యసించాలి. అది ఎండుటాకు రాలినంత

సహజంగా జరగాలి. నిజమైన సన్యాసం, ఈ ప్రపంచంనుంచి, మరో ప్రపంచానికి ఎగిరివెళ్ళడం. పరిశుద్ధ జ్ఞానమే సన్యాసంకాని, కాషాయం, గుండు చేయించుకోవడం, ఇల్లు వదలడం సన్యాసం కాదు.

పరిత్యాగమంటే, జీవితంలో ప్రతిదాన్ని పావనంచేయ చూడ్డం. స్వార్థాన్ని, అహంకారాన్ని వదలడం. సర్వసంగ పరిత్యాగం చేయడమే, అసలు సత్యాన్ని తెలుసుకోవడానికి అర్హత కలిగి వుండటం. అసలు సత్యంకోసం అన్నీ త్యాగం చెయడానికి సిద్ధంగా వుండటం. దానికోసం నిరంతరం కృషి చేయడం. ఫలాపేక్షలేని నిష్కామ కర్మాచరణే, స్వామి ప్రబోధం.

వైరాగ్యభావంతో, అనాసక్తంగా పనిచేయమనేప్పటికి సహజంగా చాలామందికి లోపల్నించి కలవరం బయలుదేరుతుంది. దృష్టి ఫలితంమీద వున్నంతకాలం, చేసే పనులను సక్రమంగా, సమర్థవంతంగా, ఫలవంతంగా, నిజంగా, శ్రద్ధగా చేయగలుగుతామా? లేదా అనే ఆలోచన కలుగుతుంది. తప్పదు. కాని, స్వామివంటి వారు ఏంచేసినా అది ఖచ్చితంగా, పరిపూర్ణంగా వుంటుంది. మనం చేసే పనిలో, అహం చొరబడితే, ఆ పనికాస్తా వ్యర్థం, నిష్ప్రయోజనమై, సంఘర్షణకు దారితీస్తుంది.

"నేను చూస్తున్నాను. నేను చేస్తున్నాను. నేను ఇది. నేను అది" అనే కర్తృత్వభావమే అభ్యంతరం; తనని తాను తెలుసుకోవడానికి. ఆ భావం మనిషికి సుఖ - శాంతులు వుంచదు. అది క్రమంగా అంధత్వంలోకి లాగుతుంది. "అసలు పనిచేసేది ఎవరు? చూసేదెవరు? ఆలోచించేదెవరు?" అని తమని తాము ప్రశ్నించుకుంటే, మనం చేసే పనికి, మనకూ మనం ఎరుకలో వున్నట్లే. అప్పుడు మనల్ని ఏదీ బంధించదు, బాధించదు. ప్రతిదీ దానికి అదే ఎట్లానో జరిగిపోతుంది. ఆ విషయాన్నే స్వామి మరింత వివరంగా చెప్పారు. "నేను ఆలోచిస్తున్నాను" అని అనుకున్నప్పుడు, నువ్వు దేన్ని సరిగ్గా, పూర్తిగా చేయలేవు.

వేషధారి మాదిరిగా వేషం ధరించి, నీ పాత్రను నువ్వు సక్రమంగా అభినయించు. అవసరమైతే ఆ వేషానికి తగిన హావ, భావాలు ప్రదర్శించు. అభినయించే ప్రతివానికి తెలుసు, తాను ఆ పాత్రధారి కాదనీ, తాను మరొక వ్యక్తిననీ. అదేవిధంగా నిత్యజీవిత కార్యకలాపాలను అనాసక్తంగా, వైరాగ్యభావంతో చేసుకుపోవాలి. అప్పుడు దేహస్పురణకు తావుండదు. దేహాత్మబుద్ధే, కలతలకు కారణం.

నటనకు, నిత్యజీవితానికి ఎంతో భేదంవున్న సంగతి నటుడికి పూర్తిగా తెలుసు. నటిస్తున్నా, అతడు తన వాస్తవత్వానికి సదా ఎరుకతో వుండనే వుంటాడు. అలాగే నిన్ను నువ్వు తెలుసుకుంటే, ఏ చెడూ నిన్ను చేరదు. అహమూ నిన్నొ అంటక అదృశ్య మౌతుంది.

వచ్చి, పోయేవి ఆలోచలనీ: నువ్వు సద్వస్తువనీ తెలుసుకో. అలా తెలుసుకోవడానికి గ్రంథాలు, పాండిత్యం అవసరంలేదు. నీమీద నీకు నమ్మకం, విశ్వాసం, పట్టుదల, శ్రద్ధ లేక, ఇతరులను సహాయం చేయమని అడుగుతావు.

"నేను మూర్ఖుణ్ణి. నేను అజ్ఞానిని, నేను పాపిని, దోషిని, తగనివాడిని, అనర్హుణ్ణి" అని ఎవరినీ, ఎప్పుడూ అనుకోనిచ్చేవారు కాదు, స్వామి. అట్టివారిలోని నిజమైన శక్తిని మేల్కొల్పి, వారు దిగజారిపోకుండా, ఉత్సాహపరచి, ప్రోత్సహించేవారు. వారికి జ్ఞానం ఇవ్వడానికీ, శాశ్వత సత్యసందర్శనం పొందడానికీ, నిర్భయంగా నిశ్చలంగా జీవించడానికీ స్వామి సహాయపడేవారు.

* * *

వైరాగ్యభావంతో పనిచేయడం ఎట్లానో, అది ఎట్లా సాధ్యమో, ఎట్లా సఫలమౌతుందో తనను నిజంగా అనుసరించిన

వారిచేత, స్వామి చేయించి చూపించారు. అట్టివారిలో అలఘమ్మ ఒకరు. ఆమె ఎప్పుడూ స్వామి సన్నిధి విడిచేది కాదు. ఆయన చెప్పే మాటలు శ్రద్ధగా వినేది. తాను చేసే ప్రతి పనిమీదా దృష్టి పెట్టేది. క్రమంగా ఆమెలో వైరాగ్యభావం అంకురించింది. భక్తి భావం వికసించింది. త్వరలోనే కాషాయం కట్టింది. ఆమె జీవన విధానంలో ఎంతో మార్పు వచ్చింది. అందుచేత ఆమె అందరికీ "అమ్మ" అయింది. ఆమెలో "తన-పర" భేదం పోయింది. అందర్నీ సమంగా, ప్రేమగా చూసేది. కాని, స్వామి ఆమెకు చాలా కఠిన శిక్షణ ఇచ్చారనిపిస్తుంది- కొన్ని సంగతులు, సంఘటనలు చూస్తే. ఆమెను ఏమాత్రం ఎరగనట్లు, ఆమెతో తనకు ఏమీ సంబంధంలేనట్లు చూసేవారు. ఆమె ఆయన్ని తన కొడుకుగా భావించి మాట్లాడితే, ఆ భావం ఆమెలోంచి పూర్తిగా పోయేందుకు ఆమెవైపు కనీసం కన్నెత్తి చూసేవారు కాదు. పైగా పక్కకు తిరిగి ఇతరులతో ప్రేమగా మాట్లాడేవారు. ఇతరులకు ఏవేవో సంగతులు చెప్పేవారు. ఆ విధంగా ప్రవర్తించాలని కాదు, ఆయన ఉద్దేశ్యం. చివరికి కొత్తవారిని సైతం ప్రేమగా, దయగా దగ్గరకు తీసుకుని పలకరించేవారు. ఎప్పటికైనా ఆయన తన మాటకు బదులు చెపుతారని అలఘమ్మ ఆశతో ఎదురు చూసేది. కాని, చాలాసార్లు ఆయన్నించి ఏ సమాధానం, ఎటువంటి సౌంజ్ఞా వచ్చేది కాదు. అటువంటప్పుడు ఆమె చాలా బాధపడుతూ, "ఏమిట్రా, ఈ అన్యాయం? నేను నీ తల్లిని రా! ఎందుకు నాకీ కఠిన శిక్ష?" అనేది.

"నువ్వు ఒక్కదానివే కాదు, ఆడవాళ్ళందరూ నాకు తల్లులే" అనేవారు స్వామి. అలఘమ్మ మొదట్లో కొడుకు నిర్లక్ష్యం, ఉపేక్ష చూసి భరించలేక ఏడ్చేది. క్రమంగా ఆయన తత్వం తెలుసుకుని, ఓర్చుకోవడం నేర్చుకుంది. త్వరలోనే తాను స్వామి తల్లిననే భావం ఆమెలోంచి పోయింది. ఆమె అహం అణగింది. భక్తుల సేవలో మునిగింది.

అలఘమ్మ మొదట్లో తన గర్భాన దివ్యపురుషుడు పుట్టాడనే అహంభావంతో వుండేది. ఆమె ఒక రోజున స్వామి ఎదురుగా కూర్చుంది. కొంతసేపటికి ఆమె దృష్టికి అక్కడ స్వామి లేరు. ఆయన స్థానంలో ఒక శివలింగం కనుపించింది. మళ్ళా అంతలో స్వామి కనుపించారు. "నువ్వెప్పుడూ మామూలు మనిషి రూపం లోనే కనిపించు నాయనా" అని వేడుకుంది.

ఆశ్రమ భోజనం పూర్తిగా శాకాహారం. ఆశ్రమంలో కొందరు ఛాదస్తులు, ఛాందసులు వుండేవారు, మూర్ఖమైన నియమాలు పాటిస్తో. వారిలో అలఘమ్మ ఒకరు. ఎవరైనా ఆమె మడిబట్ట పొరపాటున తాకితే, స్వామి అది చూసి, "నీ మడీ, మతం మట్టికలిసిపోయాయి" అని హేళన చేసేవారు. వంటలో ఉల్లిపాయలు లేకపోవడం గమనించి, "గుర్తుంచుకోండి, ఉల్లిపాయ మోక్షానికి పెద్ద అడ్డు అన్న సంగతి" అన్నారు. స్వామి మూఢనమ్మకాల్ని ఒప్పుకునేవారు కాదు. మడి, ముట్టు ఏవీ పట్టింపుకావు. ముట్టున్నవాళ్ళను సైతం భోజన హాల్లోకి అందరితో పాటు ప్రవేశ పెట్టేవారు. అది ఆయన కావలసి చేసిన పనికాదు. అలా చేయాలని చేసిందీ కాదు. ఆ సమయాన అది జరగవలసిన పని. ఆయన పని కేవలం విత్తనాలు చల్లడం. వాటిని సహజంగా మొలకెత్తించడం. అవి ఎలా పెరుగుతాయో చూడ్డం.

అన్నీ వదలి, కొడుకు సేవలో జీవితాన్ని సార్థకం చేసుకోవాలనే సంకల్పంతో అలఘమ్మ అరుణాచలం వచ్చింది. మొదటిసారి ఆమె వచ్చినప్పుడు, "వచ్చావా?" అని సంతోషంతో పలకరించిన స్వామి, ఆమెను కఠిన శిక్షణకు గురిచేశారు. ఆమెకు మతం, కులం, సాంప్రదాయం అన్నీ పట్టింపు. కాని, స్వామి సమక్షంలో వాటికి తావులేదు. ఆయన సన్నిధిలో అందరికీ, అన్నింటికీ చోటువుంది. అందుచేత అలఘమ్మ తన పట్టింపులన్నీ వదలుకోవలసి వచ్చింది. అహం తిరగబడినప్పుడు, పెద్ద పెద్ద దెబ్బలు తినవలసి వచ్చింది.

అనుక్షణం, అడుగడుగునా నిలువుకోతలు పడవలసి వచ్చింది. క్రమంగా ఆమెలో "నేను" అనే ప్రత్యేక వ్యక్తిత్వభావం నశించింది. ఎన్ని కష్టాలు ఎదురైనా, ఎన్ని బాధలు పడవలసి వచ్చినా ఆమె తన విశ్వాసాన్ని చలించనీయకుండా అన్నింటినీ ఓపికతో భరించింది. సహృదయంతో స్వామిని అనుసరించింది. కానీ, ఆయన ఏదీ చెప్పరు. దేనికీ బలవంతం చేయరు. అప్పుడప్పుడు ఏదో ఒకటి సూచించేవారు. అంతే! ఆ విధంగా ఆమెను లోకస్ఫురణలేని స్థితికి తీసుకుపోయారు. అదే ఆత్మ స్థితి.

**1920**లో అలఘమ్మ ఆరోగ్యం బాగాలేదు. డాక్టర్లు ఆమెకు విశ్రాంతి అవసరమన్నారు. పనిచేయడం తగ్గించింది. స్వామి, ఆమెచెంత చాలాసేపు మౌనంగా కూర్చునేవారు. క్రమంగా ఆమెలో అవగాహన ఎక్కువైంది. **1922** మే **19** వ తేదీన ఆమె పరిస్థితి విషమించింది. ఆ రోజంతా స్వామి ఏమీ తినలేదు. ఆమె చెంతనే కూర్చున్నారు. స్వామి ఏమీ తినలేదని, ఎవరూ ఏమీ తినలేదు. ఆ సంగతి తెలిసి, "మీరు భోజనం చేయండి" అన్నారు స్వామి. అయినా ఎవరూ భోజనం చేయలేదు. కొందరు ఆమెచుట్టూ చేరి భజనలు చేశారు. కొందరు వేదం చదివారు.

ఎగశ్వాస ఆరంభమైంది. స్వామి తన కుడిచెయ్యి ఆమె హృదయస్థానంమీద వుంచి, ఎడంచెయ్యి ఆమె శిరస్సుపై వుంచి పక్కన కూర్చున్నారు. రాత్రి ఎనిమిది గంటలకు ఆమె విదేహ ముక్తి పొందింది. వెంటనే స్వామి పైకి లేచి, సంతోషంగా, "ఇంక మనం భోజనం చేయవచ్చు, రండి. ఏ మైలా లేదు" అన్నారు.

"అలఘమ్మ మృతదేహాన్ని ఏం చెయ్యాలి? దహనమా? సమాధా?" అనే ప్రశ్న వచ్చింది, అక్కడ చేరినవారిలో. అది-

గమనించి, "దీన్ని (అలఘమ్మ దేహాన్ని) ఏ సందడి చేయకుండా చీకట్లో తీసుకుపోయి, ఎవరికీ తెలియకుండా, ఎవరిదీ కాని నేలచూసి, గుంట తీసి, అందులో పారేసి, పూడ్చి, తెల్లవారకముందే వచ్చెయ్యండి" అన్నారు స్వామి.

"చచ్చేది దేహం మాత్రమే. దేహస్ఫురణ- "నేను దేహం" అనే భ్రాంతే, మృత్యువును విషాదం చేస్తుంది" అన్నారు స్వామి.

ఆమె చనిపోలేదు. ఆమె అనంత ఆత్మలో (దివ్యాత్మలో) లీనమైంది. ఆమె ఆత్మ అనేక అనుభవాల్లోంచి, యాతనల్లోంచి నడచి, చివరికి విశ్వాత్మలో లీనమైంది. "చచ్చేది దేహం" అన్నారు మళ్ళా.

ముక్తి, జ్ఞానం లింగబేధంతో బేధించవు. మహాత్మురాలైన ఒకామె దేహాన్ని, దహనసంస్కారం చేయనవసరం లేదు. సమాధి చేయవచ్చు. ఆమె దేహమే, "ఈశ్వర నిలయం" అన్నారు స్వామి మరికొంతసేపటికి.

అలఘమ్మ మృతదేహాన్ని అరుణాచల దక్షిణ పార్శ్వాన- పాలితీర్థం ఒడ్డు, స్వామి సమక్షంలో సమాధి చేశారు.

అలఘమ్మ సమాధి పక్కన నిరంజనానందస్వామి ఒక పాక వేశారు; ఆ మర్నాడు. స్వామి రోజూ స్కందాశ్రమంనుంచి కిందికి దిగి, అలఘమ్మ సమాధి దగ్గరకువచ్చి, కొంతసేపు కూర్చుని వెళ్ళేవారు.

"స్వామి, తన తల్లికి ముక్తి ఇచ్చారు" అనే విషయం ప్రజల్లో, భక్తుల్లో, సాధకుల్లో – ముఖ్యంగా ఆశ్రమవాసుల్లో సందేహాలుగా, సంశయాలుగా, సమస్యలుగా, ప్రశ్నలుగా, ఆలోచనలుగా రేగాయి. కొందరు ఆ విషయమై స్వామినే సూటిగా అడిగారు. "ముక్తి" విషయమై స్వామి చాలా సందర్భాల్లో

ఎంతో విపులంగా మాట్లాడారు : "మానవుని నిజ నామమే, ముక్తి. నీ స్వరూపమే, ముక్తి. నీ స్వభావమే, నీ స్థితే, ముక్తి. ముక్తి నీకు భిన్నంగా లేదు. ఆశ, ప్రయత్నం లేకపోతే, వుండేది ముక్తే. అదే జ్ఞానం. అదే జ్ఞాని స్థితి. "ఇంక ఏమీ వద్దు" అని నిజంగా అన్నీ వదిలేస్తే, మిగిలేది మోక్షమే! ఆ సర్వసంగ పరిత్యాగమే, మోక్షం. ఇంక నేను వేరుగా ముక్తి ఇచ్చేది ఏముంది?" అన్నారు ఒకసారి భగవాన్.

మోక్షమంటే, పరబ్రహ్మలో ఐక్యం కావడం కాదు. ప్రకృతితో విడిపడటమూకాదు. మోక్షమంటే, అహంకారాన్ని, దాని వాసనలన్నింటితో, పూర్తిగా తుడిచెయ్యడం. మోక్షమంటే, ఎప్పుడూ లేకుండా పోవడం. తనను తాను తెలుసుకుని, స్వస్థితిలో నిలవడం. అదే ఆత్మ నిష్ఠ. ఏ వాసనలకూ చలించక, సదా ఆత్మనిష్ఠలో నిలవడమే జీవన్ముక్తి.

మోక్షప్రాప్తి- ఆత్మసాక్షాత్కారం- ఈశ్వర దర్శనం- బంధ విమోచనం మొదలైనవి అర్థంలేని సంగతులు. ఆత్మ ఎప్పుడూ స్వేచ్ఛగా, నిర్మలంగా పవిత్రంగా వుంటుంది. ఆత్మ బందీ కావడమనేదే మౌఢ్యం. ఆత్మకు ఎటువంటి బంధమూ లేదు, వుండదు. కనుక దానికి విముక్తీ లేదు. అన్ని బంధాలు, బాధలు, విముక్తీ అహంకారానికే.

"ఎప్పుడూ లేనిది బంధం. నిత్య సత్యం, ముక్తి. కాని, సామాన్యుల అనుభవం, తద్భిన్నం.

"జీవుడు-దైవం-ప్రపంచం- మనసు- కోర్కె- ఆత్మవిచారణ- అన్నీ, అంతా భావనే. ఆ భావనపోతే మిగిలేది బ్రహ్మమే. అదే మోక్షం. అంటే, సహజ స్వభావం, స్వస్థితి. అదే సహజ స్థితి. అదే సత్యం, శివం, సుందరం.

"ప్రత్యేకంగా పొందేందుకు ముక్తి ఒక స్థితి కాదు; ఒక సంగతీ కాదు. అది మీ నిజ స్థితి. మనం ఎప్పుడూ ఆ స్థితిలోనే

వుంటాం. బంధాల్లో వున్నామనుకుని, భ్రమపడి కొందరు ఎప్పటికో బయటపడతారు. అంతే! అసలు ఆ స్థితికి బంధమూ లేదు, ముక్తీ లేదు.

"కావాలని నీడలోంచి ఎండలోకి వెళ్ళి, దాని తీక్షణతకు తాళలేక, మళ్ళీ నీడకోసం వ్యర్థంగా వెతుక్కుని తిరిగి, తిరిగి ఆ నీడలోకి వచ్చి, ఆనందించడంవలె వుంటుంది, ముక్తి కోరుకోవడం.

"ముక్తి అనేది ఎక్కడ, ఎంత దూరాన వుంది? అది ఎక్కడో దూరాన వుందని, దానికో మార్గం వుందనుకోవడం- దాన్ని చేరుకోవడానికి కొంతకాలం పడుతుందని యోచించి, ఆ విధంగా కాల - దూరాలు ఏర్పరచుకుంటారు. మీరు ఎక్కడ వున్నారో ముందు ఆ సంగతి తెలుసుకోండి. ఆ తర్వాత ముక్తి మీకు ఎంత దూరాన వుందో, దానికి మార్గమేమిటో తెలుసుకో వచ్చు.

"ముక్తి నీలోనే వుంది. నీతోనే వుంది. అటువంటి దాన్ని పొందడం, కనుక్కోవడం, వెతకడం, జయించడం, సాధించడం. సంపాదించడం, అన్వేషించడం అంటూ ఏమీ లేదు. దానిని ఇక్కడా ? అక్కడా ? ఇప్పుడా ? అప్పుడా ? అనడం, అనుకోవడం అవివేకం.

"మోక్షం పొందాలని జడం, అశాశ్వతం అయిన దేహాన్ని దృష్టిలో పెట్టుకుని, కాయకల్ప వ్రతాలూ అవీ చేయడం మూర్ఖం. నిజంగా ముక్తి పొందాలనే కాంక్ష వుంటే, విషయాలను విషమురీతి దూరంగా వుంచాలి. ఎందుకంటే, మోహమే ముముక్షువునకు గొప్ప మృత్యువు. దాన్ని జయించనివాడు, మోక్షార్హుడు కాడు.

"జీసస్ క్రైస్ట్ చెప్పలేదా ఈశ్వరరాజ్యం నీలోనే వుందని. అంటే, ఇప్పుడే, ఇక్కడే, ఈ క్షణంలోనే - అదీ నీలోనే వుందని

అర్థం. అంచేత "నేను" అనే దానికి మృత్యువు లేదు, ముక్తీలేదు, ఏమీ లేదు.

"మోక్షం ఒక మూటా? దాన్ని నా దగ్గర దాచుకున్నానా? ప్రతి ఒక్కరూ నన్ను మోక్షం ఇవ్వమని అడుగుతారు.

తాను పరబ్రహ్మనని మరచి, తాను జీవుడనని అనుకోగానే, ఈ జీవన్మరణ పరంపరలలో పడతారు. "నేనెవరిని?" అనే ప్రశ్నతో, అసలు సత్యాన్ని తెలుసుకుంటే, తాను జీవుడననే అజ్ఞానం తొలగి, స్వరూపం తెలుసుకుంటారు. అప్పుడు తాను పరబ్రహ్మ కాక వేరు కాదనీ, స్పష్టమౌతుంది. అదే మోక్షం" అన్నారు స్వామి.

స్వామి అన్నేళ్ళు అంత గట్టిగా ముక్తి విషయమై వివరంగా చెప్పినా, ఆయన్ని అనుసరించినవాళ్ళు కూడా చివరి వరకూ ముక్తికై ఆశా, ప్రయత్నం మానలేదు. స్వామి, అలఘమ్మకు ముక్తి ఇవ్వాలనే ఉద్దేశ్యంతో ఆమె శిరస్సుపై, రొమ్ముపై చేతులు వుంచినట్లు తోచదు. ఆత్మ సృజించేదికాదు. అది సృజింపబడేదీ కాదు. అందుచేత స్వర్శాప్రభావం అంటూ వుండదు. "ముక్తి" స్వామి అనుగ్రహంకాదు. అది వారి సృష్టి కాదు. అలఘమ్మ భగవాన్ సన్నిధిలో క్రమ క్రమంగా వున్నతురాలు అయింది. ఆమె దృష్టి మారడంతో, పరిణతురాలై, చివరికి శాంతిని పొందింది. దానికి యోగ్యత ప్రధానం. జ్ఞానికి "బంధం-విమోచన" అనే యోచన వుండదు. అవన్నీ అజ్ఞానికి. వున్నది ముక్తి ఒక్కటే! ఇంకేంలేదు. స్వామి ప్రేమతో, కరుణతో కాకిపై, గోవుపై, ఉడతపై, కోతిపై గొఱ్ఱెపిల్లపై-ఇంకా అనేక సమయాల్లో అనేక ప్రాణికోటిపై తమ అమృతహస్తం వుంచినట్లే, అవసానదశలో అలఘమ్మమీద అంతటి ప్రేమతోనూ తమ చేతుల్ని వుంచారనిపిస్తుంది. జరిగిందీ అంతే! ఆ ప్రేమ ప్రసాదమే, మోక్షం.

అరుణాచల దక్షిణ పాదభాగాన, పాలితీర్థం గట్టున అలఘుమ్మ సమాధిపై ఇటుకలతో అతి సామాన్యమైన ఒక పూరి పాక వేశారు. దాన్నే నాయనగారు, "మాతృభూతేశ్వరాలయం" అన్నారు. నిరంజనానందస్వామి రోజూ తల్లి సమాధికి పూజలు చేస్తూ, ఆ పరిసర ప్రాంతాన్ని సమతలం చేసి, పరిశుభ్రంగా వుంచేవారు. ఆయనకు దండపాణి తోడుగా వుండేవారు. ఆయన దృఢకాయులు, ఉత్సాహవంతులు కావడంచేత, చాలా శ్రమపడి ఆ ప్రదేశాన్నంతా బాగుచేశారు. ఆ రోజుల్లో భగవాన్ దాదాపు ప్రతిరోజూ స్కందాశ్రమం నుంచి కిందికి దిగివచ్చి, అలఘుమ్మ సమాధి దగ్గర కొంతసేపు కూర్చుని వెళ్ళేవారు.

ఆ సంవత్సరం భగవాన్ జయంతి ఉత్సవాన్ని మాతృభూతేశ్వరాలయం దగ్గర జరిపించాలని దండపాణి ఆశ. జయంతి వారంరోజులు వుండనగా భగవాన్ మామూలుగా స్కందాశ్రమం నుంచి అలఘుమ్మ సమాధి దగ్గరకు వచ్చి, మళ్ళా తిరిగి స్కందాశ్రమం వెళ్ళలేదు. ఎంతకీ తిరిగి రాని భగవాన్ కోసం స్కందాశ్రమవాసులందరూ వచ్చి, స్థిరంగా కూర్చునివున్న భగవాన్ని చూసి, ఆశ్చర్యపోయారు. తాను అక్కడ స్థిరపడి పోవడాన్ని "ఇది నా సంకల్పం కాదు. నా ఇచ్ఛా శక్తి కాదు. ఏదో దివ్యశక్తి నన్ను ఇక్కడకు లాక్కొచ్చింది. నేను దాని ఆజ్ఞానుసారం నడచుకున్నాను. ఇది నా నిర్ణయం కాదు. దైవాజ్ఞ" అన్నారు భగవాన్. భగవాన్ స్థిరపడిందే, అది "శ్రీరమణాశ్రమం అయింది. 1923 - జనవరి మూడో తేదీన భగవాన్ జయంతి శ్రీరమణాశ్రమంలో జరిపారు. భగవాన్ శత జయంతి ఉత్సవం కూడా శ్రీరమణాశ్రమంలో జనవరి మూడో తేదీనే జరిగింది.

అలఘుమ్మ సమాధిపై వేసిన చిన్న పాకలో, ఓ మూల నులకమంచంమీద భగవాన్ కూర్చునేవారు. రోజూ ఊళ్ళోంచి మధ్యాహ్నం వేళకు ఎచ్చమ్మాళ్ ఏదో ఒక వంటకాన్ని ఆశ్రమానికి

తీసుకొచ్చి, భగవాన్‌కి కొంత వడ్డించి, తక్కిందింది భక్తులందరకూ ప్రసాదంగా పెట్టేది. గోపాలరావు అనే ఆయన ఊళ్ళోకి వెళ్ళి, భోజన పదార్థాలు పోగుచేసి తెస్తే, చిన్నస్వామి వంట చేసేవారు. కూరలో చాలావరకు నూనె వుండేది కాదు. ఒక్కొరోజు వట్టి చారు, అన్నం మాత్రమే వుండేది. ఆ చారు కూడా లేక, ఉత్తపూరగాయ ముక్కతో తిన్నరోజులూ వున్నాయి.

ఆ రోజుల్లో స్వామిరామదాసు భగవాన్ని దర్శించారు. ఆయనకు తండ్రే గురువై "ఓం శ్రీరాం జయరాం జయ జయరాం" అనే మంత్రోపదేశం చేశారు. స్వామి రామదాస్ ఆ మంత్రాన్ని నిష్ఠగా రాత్రిం - బవళ్ళు జపించారు. ఆ సందర్భంలో ఆయన సాధువులతో కలసి అరుణాచలం వచ్చి, భగవాన్ని దర్శించి, వారి దయకై అర్థించారు. భగవాన్ ఆయన కళ్ళల్లోకి రెండు నిమిషాలు సూటిగా చూశారు. రామదాసుగారి దేహం, ఆపాదమస్తకం ఆనందంతో ఉప్పొంగింది. "ఆ క్షణాన మాటల్లో వర్ణించలేని ఆనందాన్ని అనుభవించాను" అన్నారు స్వామి రామదాస్.

స్వామి రామదాస్ అరుణాచలం మీద ఒక గుహలో దీక్షగా రామ మంత్రాన్ని జపిస్తో ఇరవైరోజులు వున్నారు. దీక్షానంతరం, ఆయన గుహ బైటికి వచ్చేప్పటికి ఆయన కళ్ళు జ్యోతుల్లాగా వెలిగిపోతున్నాయి. ఆయన హృదయం శాంతితో నిండింది. అంతటా ఒకే పరబ్రహ్మను దర్శిస్తో, పరిపూర్ణ ఆనంద తన్మయత్వంతో నిండిపోయారు. జీవితాంతం రామ మంత్రాన్ని జపిస్తూనే వున్నారాయన.

అలఘమ్మ సమాధి ముందు మరో చిన్న పాక వేశారు. ఆశ్రమవాసులు పాలితీర్థంలో స్నానాలు చేసేవారు. కాని, నిత్య పూజకు నీరు కరువైంది. భగవాన్ ఆ సంగతి గమనించి మాతృభూతేశ్వరాలయానికి కొంచెం దూరంలో ఈశాన్య దిక్కున ఒక చోటు చూపి, "ఇక్కడ బావి తవ్వండి!" అన్నారు. ఆ ప్రకారం

తవ్వగా శుభ్రమైన జల పడింది. దాన్ని "రమణతీర్థం" అన్నారు. ఆ నీరు పూజకే కాదు, వంటకీ, అన్నింటికీ అందరికీ సరిపోయేది. భక్తులు తెచ్చి ఇచ్చే పదార్థాలతో వంట చేసుకుని తినేవారు. ఆ తర్వాత మరొక చిన్న పాక వేశారు. రమణ భక్తులు అక్కడక్కడా పుస్తకాలు అమ్మి, ఆ సొమ్ము ఆశ్రమానికి పంపేవారు.

1923 లో ప్రణవానందులు అనువదించిన "Who am I" "నే నెవడను"? అను పుస్తకం అచ్చయింది. క్రమంగా ఆశ్రమవాసుల సంఖ్య పెరిగింది. నిత్యం సాధువులు, సాధకులు, తత్వవేత్తలు, శాస్త్రవేత్తలు, జిజ్ఞాసువులు, భక్తులు, యాత్రికులు - ఇంకా అనేక రకాలవారు ఆశ్రమానికి వచ్చి, భగవాన్నిదర్శించి తమ సంశయాలు నివృత్తి చేసుకుని వెళ్ళేవారు.

1924 - జూన్ ఆరవ తేదీ రాత్రి పదకొండు గంటలకు శ్రీరమణాశ్రమం తలుపులు, కిటికీలు బద్దలుకొట్టి కొందరు దొంగలు లోపల ప్రవేశించారు. ఆ చప్పుడికి కుక్కలు మొరిగాయి. వాటి అరుపులకు కుంజుస్వామి, మస్తాన్ మేల్కొన్నారు. ఆ తర్వాత భగవాన్, మరికొంతమంది లేచారు. దొంగలు కుక్కల్ని కొట్టి బెదిరించారు. ఏవో పేల్చారు, అరిచారు, అడానిడి చేశారు, భయపెట్టారు. గోల చేస్తే, ఆశ్రమానికి నిప్పు పెడతామన్నారు. కదిలితే చంపేస్తామన్నారు. రామకృష్ణతో, "కుక్కల్ని దూరంగా తీసుకుపోండి" అని తక్కినవాళ్ళతో "వారి ధర్మం వారిది. మన ధర్మం మనది. మనం భరించాలి, క్షమించాలి, వాళ్ళతో ఘర్షణకు దిగవద్దు" అని; దొంగలవేపు తిరిగి "లోపలకు వెళ్ళి మీకు కావలసినవి తీసుకుపోండి" అన్నారు భగవాన్. ఆ మాటతో దొంగలు ఆశ్రమవాసులందర్నీ ఒకచోట కూర్చోబెట్టి కదిలితే కొట్టి చంపేస్తామని బెదిరించారు. భగవాన్ కాలు మీద కొట్టారు. దానికి స్వామి, "మీకు తృప్తి కలగకపోతే, రెండో కాలు మీద కూడా కొట్టండి" అని రెండో కాలు ఇచ్చారు.

దొంగలు లాంతర్లు కావాలన్నారు. భగవాన్ వారికి లాంతర్లు ఇప్పించారు. వాళ్ళు అలమారు బ్రద్దలు కొడుతూవుంటే, "అంతా మీ యిష్టానికి వదిలేస్తున్నాం" అన్నారు భగవాన్. దొంగలు ఆశ్రమమంతా వెదికారు. ఆరురూపాయలు, చిల్లర సామాను దొరికాయి. వాళ్ళు నిరాశపడి "డబ్బు ఎక్కడ దాచారు?" అని హుంకరించారు. "మేము బీదవాళ్ళం - సాధువులం. దయా, ధర్మంమీద ఆధారపడి బతికేవాళ్ళం. మా దగ్గర డబ్బు లేదు" అన్నారు భగవాన్.

స్వామి కాలుపై దెబ్బ చూసి, రామకృష్ణ ఒక ఇనుప ఊచ తెచ్చి, "స్వామి ఆజ్ఞ!" అన్నాడు, దూకుడుగా. దానికి స్వామి "మనం సాధువులం - మనం, మన ధర్మాన్ని విస్మరించరాదు. నువ్వు వాళ్ళను ఇనుప ఊచతో కొడితే, వాళ్ళల్లో ఎవరైనా చనిపోతే, ప్రపంచం సాధులోకాన్నే నిందిస్తుంది. వారు అజ్ఞానులు. ఏది ఉత్తమమో వారికి తెలియదు. ఏ పొరపాటు చేతనో అకస్మాత్తుగా నీ పళ్ళు, నీ నాలుకను కొరికితే, వాటిని పీకేస్తావా?" అన్నారు.

దొంగలకు ఆశ్రమంలో ఏమీ దొరక్క వెళ్ళిపోయారు. దొంగలు స్వామిని కొడుతున్నారని కుంజుస్వామి ఊళ్ళోకి వెళ్ళి, కొందర్ని తీసుకొచ్చారు. ఆ తర్వాత పోలీసులు వచ్చి అడిగితే, "బుద్ధిలేనివాళ్ళు కొందరు వచ్చి, ఏమీ దొరక్క నిరాశతో వెళ్ళారు" అన్నారు భగవాన్. తెల్లవారిన తర్వాత పోలీసు పెద్ద అధికారి వచ్చి అడిగితే, భగవాన్ ఫిర్యాదుగా ఏమీ చెప్పలేదు.

ఆశ్రమంలో దొంగలుపడి, దోచుకుని, స్వామిని కొట్టారని తెలిసి, ఎచ్చమ్మాళ్ ఏడుస్తూ పరుగు పరుగున ఆశ్రమానికి వచ్చింది. ఆమెను చూసి, "ఎందుకు ఏడుస్తావు? విశేషం ఏమీ జరగలేదు.

క్షివంటి భక్తులు తినుబండారాలు పెట్టి స్వామిని సేవిస్తే, అటువంటి భక్తులు దెబ్బలతో సేవించారు. వాళ్ళూ నా భక్తులే" అన్నారు స్వామి.

కొన్ని రోజులకు ఆశ్రమంలో పోయిన సామాను దొరికింది. దొంగలకు జైలుశిక్ష పడింది. ఆ సంఘటన తర్వాత కాలంలో భగవాన్ సమక్షాన ప్రస్తావనకు వచ్చినప్పుడు "దొంగలు స్వామినీ, సాధువుల్నీ కొట్టి బాధిస్తోవుంటే, వారి బారినుంచి తమ్మేల రక్షించుకోరాదు?"అని ఒకరు భగవాన్ని అడిగితే, "విశ్వామిత్రాదులు తలచుకుంటే మరో విశ్వాన్నే సృష్టించగల సమర్థులు. వారు వున్న సమయాల్లో రావణాసురుడూ వున్నాడు. ఇతరులకేగాక, సీతారాములకు కూడా వ్యథ కలిగించాడు. ఆ మహర్షులు తమ శాప శక్తితో ఆ రావణాసురుని సర్వనాశనం చేయలేకపోయినారా? శక్తివుండీ, వారు పెట్టే బాధలు సహించారు. ఎందుకు ? ఈ సంఘటనలన్నీ వారికి ఎరుకే! కాని, అవన్నీ గడచిపోయేవే! ప్రళయం కూడా వారికి అలతిగానే తోస్తుంది. వారు దేనినీ లక్ష్యపెట్టరు" అన్నారు.

**1929** నాటికి చిన్న ధ్యానమందిరం నిర్మాణమైంది. దాంట్లో ఒకమూల నులకమంచంమీద భగవాన్ కూర్చునేవారు. దండపాణి మొదలైన భక్తులు ఏమైనా పుస్తకాలు చదివితే, భగవాన్ వివరించి చెప్పేవారు. ఆ సందర్భంలో ఒకరు, "భగవాన్! సత్యం తెలిపే గ్రంథం ఏది?" అని అడిగారు. దానికి భగవాన్, "అసలు సత్యం నీలోనే వుందని అన్ని గ్రంథాలూ చెప్తున్నాయి. అంటే నువ్వే ఆ సత్యం. అటువంటప్పుడు నిన్ను నీవు విస్మరించి గ్రంథాల్లో సత్యాన్ని వెదకడం ఏమిటి? సత్యాన్ని గ్రంథాల్లో వెదకడం ఎట్లా వుంటుందంటే, కాంతి-తనను నీడలో వెతుక్కొన్నట్లు వుంటుంది. నీకు ఇష్టమైన గ్రంథాన్ని చదువు. కాని, నిజమైన గ్రంథం-ఆత్మ. అదెప్పుడూ నీ చేతిలో, నీ చెంత సిద్ధంగా వుంటుంది. ఆ గ్రంథంలో

అన్నీ వుంటాయి. ఇష్టమైనప్పుడల్లా ఆ గ్రంధాన్ని చదువు. నీ నుంచి దాన్ని ఎవరూ తీసుకుపోలేరు. విరామ కాలమంతా ఆ గ్రంథపఠనకే వినియోగించు. ఆ తర్వాత ఏ గ్రంథమైనా చదవ వచ్చు" అన్నారు.

మొదట్లో ఆశ్రమ నిర్వహణాధికారం, పెరుమాళ్ళస్వామి నిర్వహించేవారు. ఆయన ఆధిక్యత భరించలేమంటూ కొందరు ఆశ్రమవాసులు గొడవపెట్టగా, దండపాణి నిర్వహణకు వచ్చారు. కొన్నాళ్ళకు ఆయన్నీ భరించలేకపోయారు. ఈలోగా పెరుమాళ్ళ స్వామి ఏవేవో ఫిర్యాదులు మోపి, ఆశ్రమంమీద దావా వేశాడు. చివరికి ఆ విషయంలో భగవాన్ కలగజేసుకుని "పెరుమాళ్ళూ, నువ్వు చేస్తున్న పని బాగాలేదు. ఇట్లాంటి పనులు చేస్తే, నువ్వు నరకానికి పోతావు" అన్నారు. దానికి అతను, "నేను నరకానికి పోయినా ఫరవాలేదు. నేను సేవించుకోవడానికి, మీ పాద పద్మాలు లేనిచోటు ఏముంది" అన్నాడు గొప్ప విశ్వాసంతో. దానికి కరుణా మయులైన భగవాన్, "అవును, నువ్వు ఎక్కడ వున్నా, నిన్ను కాపాడ్డం నాకు తప్పదు" అని ఎంతో హామీగా అన్నారు.

క్రమంగా ఆశ్రమ అధికార వ్యవహారం వ్యక్తిగత నిందా రోపణలకు, కలతలకు దారి తీసింది. 1930 లో భగవాన్ జయంతి ఉత్సవం ఎవరూ పట్టించుకోలేదు; తమ పట్టింపులవల్ల. అందుచేత భగవాన్ యందు భక్తి విశ్వాసాలు కల కొందరు పెద్దలు నిరంజనా నందస్వామిని ఆశ్రమ సర్వాధికారిగా ఎన్నిక చేశారు. ఆ ఏర్పాటూ, ఆయన ఆధిపత్యంతమకు సమ్మతం కాదంటూ కొందరుసివిల్ వ్యాజ్యం వేశారు. ముందుకాలంలో ఇటువంటి గొడవలు తలెత్తకుండా వుండేం దుకుగాను నిరంజనానందస్వామి పేరున "Power of attorney - పవర్ ఆఫ్ ఎటార్నీ" మరియు, తన అనంతరం ఆశ్రమ పరిపాలనా విధానం నిర్దేశించు వీలునామా ఒకటి తయారుచేసి, దానిమీద

భగవాన్ని సంతకం చేయమన్నారు కొందరు పెద్దలు. భగవాన్ సంతకానికి బదులు, దానిమీద పెన్నుతో కొన్ని చుక్కలు పెట్టారు, సంతకం పెట్టవలసినచోట. అది తమ సమక్షంలో జరిగిందని ఆ పెద్దలు ఆ వీలునామాపై సాక్షి సంతకాలు చేశారు. దాని ప్రకారం ఆశ్రమాధికారం శాశ్వతంగా నిరంజనానందస్వామికీ, ఆయన అనంతరం ఆయన వారసులకూ సంక్రమిస్తుంది. దానితో డబ్బు వ్యవహారం, ఆశ్రమ నిర్వహణ, బాధ్యత అంతా సర్వాధికారి నిరంజనానందస్వామి చేతికి వచ్చింది. త్వరలో ఆయన కొన్ని గట్టి నిర్ణయాలు తీసుకొని, ఆశ్రమాభివృద్ధికి కొన్ని నియమ నిబంధనలు ఏర్పాటు చేశారు.

క్రమంగా ఆశ్రమవాసుల సంఖ్య పెరిగింది. సర్వాధికారి కడు చాకచక్యంతో ఎంతో ధనం పోగుచేసి, ఆశ్రమ ఆవరణలో ఎన్నో కట్టడాలు కట్టించారు. ఆఫీసు - పుస్తక విక్రయశాల - భోజనశాల- గోశాల- వంటిల్లు- సామానులకు ఒక గది- పోష్టాఫీసు- ఆసుపత్రి- మగవాళ్ళకు, ఆడవాళ్ళకు ప్రత్యేకంగా వసతిగృహాలు- ధ్యానమందిరం - గ్రంథాలయం- వేద పాఠశాల- రమణతీర్థమునకు ఒక పంపుసెట్టు- వాటర్‌టాంక్ మొదలైనవి. ఆశ్రమంలో ఎక్కువ కాలం వుండదలచుకున్న వారికోసం రెండు బిల్డింగులు కట్టించారు. ఆశ్రమం ఎదురుగా మోర్వీరాజు ఆశ్రమ అతిథులకోసం ఒక పెద్ద బిల్డింగు కట్టించారు. ఆ బిల్డింగు మొదట్లో రాజ కుటుంబాలవారికీ, జమీందారులకు, ఉన్నతోద్యోగులకు పరిమితమైంది. ఆశ్రమ పరిసర ప్రాంతాల్లో తమ తమ నివాసాలకు కొందరు రమణ భక్తులు కుటీరాలు కట్టించుకున్నారు. ఆ విధంగా ఆశ్రమం చుట్టూ పెద్ద నగరం ఏర్పడింది. అది చూసి, "అలఘమ్మ శవాన్ని రహస్యంగా పాతిపెట్టి రమ్మన్నానా? కాని, ఎట్లా జరగాలో, అట్లా జరుగుతుంది. ఎన్ని కట్టడాలు లేచాయో చూడండి" అన్నారు భగవాన్.

ఆ తర్వాత అరవిందబోసు తల్లి కోర్కెపై రమణ స
పల్లాకుత్తు కెదురుగా పెద్ద ఆవరణలో ఎన్నో కుటీరాలు నిర్మి
దాని పేరు "మహాస్థాన్". ఆ కుటీరాలు విదేశీయులకోస
బడ్డాయి. ఆ తర్వాత "మాక్ ఇవర్" అనే పాశ్చాత్యుడు
ఆవరణలో కొన్ని కుటీరాలు నిర్మించారు. ఆ విధంగా అనే
అనేక బిల్డింగులు కట్టించారు.

నిత్యం ఆశ్రమానికి వచ్చే భక్తులూ, ఆశ్రమ నిర్వా
ఏర్పడ్డ జీతగాండ్రు, భగవాన్ అనుచరులు, సాధువులు సాధ
అందరికీ ఆశ్రమంలో భోజన, వసతి సౌకర్యాలు ఏర్పాటు
బడ్డాయి. అందుచేత ఆశ్రమంలో కొన్ని నియమాలు ఏర్పరి
కాని, ఆశ్రమ స్థాపన విషయంలోగాని, దాని నిర్మాణ—నిర్వ
విషయంలోగాని, కట్టడాలతోగాని, నియమ — నిబంధనలతో
భగవాన్‌కి ఎప్పుడూ ఎటువంటి సంబంధమూ లేదు. తిరువణ్ణా
వచ్చిన రోజున అయ్యంగులంలో చివరి పైసలు విసరిపా
తర్వాత, భగవాన్ మళ్ళా డబ్బు ముట్టలేదు. కొన్నాళ్ళు భి
చేశారు. ఆశ్రమానికి ఆయన పేరువుందిగాని, ఆశ్రమంతో ఆయ
ఏమాత్రం సంబంధంలేదు.

భగవాన్‌కు తెలిసిన భాషలు - తమిళం, మళయాళం, తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతం. కాని ఆయన అభిమతం, మౌనం. అపారమైన ఆ మౌనశక్తితో ఆయన బోధించేదే అధికం. ఆయన రచనలు బహు స్వల్పం. అవి కూడా అప్పుడప్పుడూ- మొదట్లో తనచుట్టూ చేరిన పలనిస్వామి, అయ్యాస్వామి, పెరుమాళ్ళస్వామి, శేషయ్య వంటివారు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు. అలాగే కొందరు భక్తుల, జిజ్ఞాసువుల, అన్వేషకుల, సాధకుల, సాధువుల, ఆర్తి, అవసరాలకు అనుగుణంగా చెప్పిన సంగతులూ, తాను స్వయంగా రాసిన విషయాలూ మాత్రమే. కాని, కొన్ని విషయాలు ముఖ్యమనిపించి వాటి సంగతులు రాయాలనిపించినప్పుడు రాసినవి కొన్ని. ఆ రచనల్లో చాలావరకు పరిచారకుల నిర్లక్ష్యంవల్ల, అశ్రద్ధవల్ల పోయాయి.

బుద్ధుడూ, యేసు ఇంకా చాలామంది మహాత్ములు ఏమీ రాయలేదు. కాని, భగవాన్ రాసినవి బహు స్వల్పమైనా, అవి చాలా గొప్ప సంగతులే కాదు, పరమ సత్యాలు. వాటిల్లో ఒక చిన్న వాక్యం సహితం మనుష్యుల జీవితాల్లో పరివర్తనం, పరిణామం తీసుకురాగలవు అనడంలో అతిశయోక్తి లేదు.

మౌనం భగవాన్ మొదటి ఉపదేశమైతే, రెండోది ఆయన రచన. ఆయన తన చదువు గురించి ఒకసారి ఇట్లా చెప్పారు: "నేను ఏమీ చదవలేదు. నా పాండిత్యమంతా నా పధ్నాల్గో ఏటకి పూర్వం నేను ఏం చదివానో అంతవరకే పరిమితం. ఆ తర్వాత ఏమీ చదవాలనీ, నేర్చుకోవాలనీ అనిపించలేదు. భగవద్గీతాదుల విషయంలో నేను ఆ శ్లోకాల్ని ఎట్లా భాషిస్తున్నానా? అని కొందరు ఆశ్చర్యపడతారు. అది నాకు వినికిడివల్ల వచ్చినదే! నేను భగవద్గీత చదవలేదు. దాని అర్థానికై, భాషా సముద్రాల్లో పడి ఈదులాడలేదు. అందులో ఒక శ్లోకం వింటే, దాని అర్థం

నాకు స్పష్టంగా తోచి, ఆ శ్లోకాన్ని తిరిగి వల్లిస్తాను. అంతే! అంతకన్నా మరేం లేదు. అప్పుడప్పుడూ నేను ఉదహరించే వాటి సంగతీ అంతే! అవేవో అవి, వాటంతట అవి వచ్చాయి, వస్తాయి.

"సత్యవాక్కు స్మృతికి అందదని నాకు తెలుసు. అటువంటప్పుడు చదివి, అర్థం చేసుకుని వల్లించడానికై మనసును వినియోగించడ మెందుకు? దాని ప్రయోజనం, యథార్థం ఎరుగుటే, ముఖ్యం. ఆ ప్రయోజనం సిద్ధించాక, ఆ చదువులతో పనేముంది?" అన్నారు.

"ఎంతో చదివి శాంతి లేనివారికన్నా, ఏమీ చదవనివారే బ్రతికినవారు" అన్నారు భగవాన్ ఒకసారి.

స్వామి తన దగ్గరకు వచ్చిన సంస్కృత, ఆంధ్ర, తమిళ భాషాభిజ్ఞులతో భాషించినదే, ఆయన భాషా పరిజ్ఞానం.

అసలు సత్యాన్ని, వర్ణింప శక్యంకానిదాన్ని, సూటిగా, సులభంగా తెలియజేయడానికై వాటిని ప్రపంచ వాస్తవ విషయాలతో పోల్చి చెప్పారు భగవాన్. అందుకై కొన్ని మాటల్ని వాడారు. అంతే! భగవాన్ చేసిన వివరణలు స్పష్టం, సంక్షిప్తం. అవి సరైనవి, సూటైనవి, సులభమైనవి, సహజమైనవి, సామాన్యమైనవి. ఆ మాటలూ, సంగతులూ, చాలా శక్తివంత మైనవి. కాని అన్నింటి లోకీ శక్తివంతమైనది ఆయన మౌనం.

భగవాన్ రచనలు సరాసరి వారి హృదయంలోంచి వచ్చాయి. భగవాన్ గొప్ప పండితుడు కాదు, విజ్ఞానవంతుడూ కాదు, మొదట్లో. మృత్యు అనుభవానంతరం, ఆయనకు అంతిమ జ్ఞానం అవగాహన అయింది. అటువంటి మహత్తర జ్ఞానాన్ని పొందాలంటే, ఎంతో సాధన చేయవలసి వుంటుంది. కాని, అది మేధాసంపత్తితో సాధ్య

మయ్యే సంగతి కాదు. అది సహజమైన, స్థిరమైన జ్ఞానం. తత్ఫలితంగా ప్రేమ, దయ, నమ్రత, పవిత్రత, శక్తి, ధైర్యం, గౌరవం, మర్యాద, సత్ప్రవర్తన కలిగాయి.

"రచన" అనేదాని గురించి భగవాన్ అభిప్రాయమేమిటంటే "రచనా విధానమంతా, మనోవిజృంభణ. మనసుచేత ఎక్కువ శ్రమ పెట్టించి, పనిచేయిస్తే, ఎక్కువ రచనలు చేయవచ్చు. కాని, దానివల్ల తక్కువ శాంతి కలుగుతుంది. శాంతి లేనప్పుడు రచనలెందుకు? రాసేవాళ్ళకు ఆ సంగతి చెపితే వినరు. ఆ సలహా వారికి నచ్చదు, ఆమోదయోగ్యంగా తోచదు. వారు సలహా వినరు. రాయడమూ మానరు. ఊరికే వుండమంటే వుండరు. కాని నాకు అటువంటి పరిస్థితి ఎప్పుడూ కలగలేదు. నా రచనలన్నీ, ఎవరో వచ్చి, రాయమని అడిగినవే! అవీ-ఓ సంఘటన, ఓ సందర్భం, సంగతి, విషయం ఆధారంగా తీసుకుని రాసినవేకాని, "అరుణాచలస్తుతి పంచకం - అరుణాచలాష్టకం" మొదలైనవి నాకు రాయాలనిపించి, రాసినవి" అన్నారు.

1900 ప్రాంతంలో భగవాన్ గంభీరం శేషయ్యగారి ప్రశ్నలకు సమాధానాలు అరవంలో కాగితాలపై రాసి ఇచ్చారు. చివరికి అవి "విచార సంగ్రహం" అనే పుస్తకంగా అచ్చయింది.

"విచార సంగ్రహం" వచన రచన. అది ముఖ్యంగా "నేనెవడను?" అని ప్రశ్నించుకునే ఆత్మవిచారణ మార్గమూ; మనసూ-దాని స్వభావమూ; మనసూ - దాని ఉనికీ, దాని స్థితి - గతులూ; ప్రపంచానికి ఓ వాస్తవత్వమంటూ లేదనీ, అది ఆత్మకు భిన్నంగా, విడిగా లేదని; జీవుడూ - దాని స్వభావం, స్థితిగతులూ; అహం స్ఫురణా, విశ్వపురుషుడు అన్ని రూపాల్లో "నేను-నేను" అంటూ వుంటాడనీ; ఆత్మస్వరూపమే పరబ్రహ్మ స్వరూపమనీ ఆత్మకు సదా ఎరుకలో వుండటమే తపస్సనీ; శివోహం - అహం బ్రహ్మోస్మి అంటే నిరంతరం లోదృష్టితో ధ్యానించిన

ఆత్మసాక్షాత్కారంకలుగుననీ; జీవన్ముక్తి-విదేహముక్తీ అనేసంగతుల గురించీ; ప్రాణాయామంద్వారా, యోగ అష్టాంగ మార్గాన్ని... ఇంకా అనేక సాధనా మార్గాలూ అందు చర్చించబడ్డాయి. అదే "విచార సంగ్రహం".

*　　　*　　　*

**1900-1902** మధ్యకాలంలో శివప్రకాశం పిళ్ళై ప్రశ్నలకు స్వామి ఇచ్చిన సమాధానాలే "నే నెవడను?" అను గ్రంథం. అది అద్వైత సిద్ధాంత వివరణ.

మనస్సంటే, ఆలోచనామయం. అందు "నేను" అనేది మొదటి ఆలోచన. "ఆ నేను ఎవరు?" అనే విచారణ విడవకుండా చేస్తే, తక్కిన ఆలోచనలన్నీ నాశనమై చివరికి మొదటి ఆలోచన అయిన "నేను" మిగులుతుంది. విచారణ చేస్తే, అది కూడా ("నేను") అదృశ్యమౌతుంది. ఇంక మిగిలేది "ఆత్మ" ఒక్కటే. అటువంటి విషయాల చర్చతో కూడిన గ్రంథం— "నే నెవడను?"

"ఈ ఆలోచనలు ఎవరికి కలుగుతున్నాయి?" అని ప్రశ్నించుకుని, ప్రతి సమాధానానికి నిరంతరం ఎరుకలో వుండటం వలన, మనసు అణగుతుంది.

దేహానికీ, దాని సహవాసంతో పనిచేసే మనసుకి "అసలు నేను" పరిమితం కావడంవల్ల, దాన్ని మితమైనదిగా, ఆద్యంతాలు కలదానిగా భావించి "అసలు నేను"ను కూడా "నేను" అనే అంటాం. ఆ "నేను" నే "మిథ్యానేను" అంటారు. ఆ మిథ్యానేను కాల-దూరాలకు, ప్రకృతి ధర్మాలకు బందీయై వుంటుంది. అదే అహంకారం. అహమంటే, మనోవృత్తులన్నీ ఏకమై, ఒకటై.

అదే జీవిత లక్ష్యమైనప్పుడు, అదే కడపటిమెట్టు అవుతుంది. అంతే, అది అనన్య చింతన అయినప్పుడు, దాన్ని "అహం" అంటారు అని భగవాన్ గొప్ప నిర్వచనం ఇచ్చారు అహం గురించి.

ఆ అహమే మెలకువలో, స్వప్నంలో లేస్తూ - అణగుతూ వుంటుంది. మనలో వుండేది ఆ అహం స్ఫురణేకాని, మరో వ్యక్తిగత ఆత్మ లేదు. కాని, మనం ఆ అహం స్ఫురణనే, ఆత్మగా భావిస్తాం. అజ్ఞానంవల్ల, ఆ అహం మెలకువలో, స్వప్నావస్థలో దేహాన్ని తన దిగా తీసుకుని "నేను ఈ దేహం" అంటుంది. నిద్రావస్థలో దేహంతోపాటు ఆ అహం కూడా అదృశ్యమౌతుంది.

ఏ రూపమూ లేని అహం, మనిషిలో ప్రవేశించి, ఓ రూపం తీసుకుంటుంది. ఆ రూప ఆధారంతో ఇంద్రియ భోగాలు అనుభ వించి, తెగ బలుస్తుంది. అంతే, అహం - అనుభవాల మూలం. కాని, ఆ అహం అటు ఆత్మకుగాని, ఇటు దేహానికిగాని చెందినదికాదు. అయినా అది అసలు సత్యంగా, ఆత్మగా, "నేను"గా చెలామణి అవుతూ, అన్నీ అనుభవిస్తుంది.

ఏ పక్షానికీ చెందని ఒక వ్యక్తి, ఒక పెళ్ళికి హాజరై ఇరుపక్షాల వారి గౌరవ మర్యాదలు పొంది, చివరకు ఇరుపక్షాలవారి అనుమానా నికి గురై, "ఎవరీ వ్యక్తి?" అనే ప్రశ్న రాగా, అది గమనించి తన రహస్యం బైటపడుతుందని తెలుసుకుని, చల్లగా జారుకున్నట్లు- అహం అటు దేహానికి, ఇటు ఆత్మకూ దేనికీ చెందకపోవడంవల్ల వాటి విచారణకు గురై "ఎవరీ అహం?" అనే ప్రశ్నరాగా, అది అదృశ్యమౌతుంది; ఏ జాడా లేకుండా.

ఆ అహమే ప్రథమ అజ్ఞానం. అన్నింటినీ ఆ అజ్ఞానపు తెర కప్పుతుంది. ఆ అజ్ఞానానికి ప్రత్యేకించి ఒక వాస్తవత్వం లేదు. ఒక దాన్ని సృష్టించడానికి గాని, ఒకదాన్ని నాశనం చేయడానికిగాని,

అది కేవలం ఆత్మ చేతిలో పరికరం. ఆ అజ్ఞానాన్ని గుర్తించడమే, ఆత్మ విచారణకు ఆరంభం. సాధన ఉద్దేశ్యంకూడా అజ్ఞానాన్ని తొలగించడమే కాని, విచారణలో అహం తలెత్తి, తాను దేహంగా, ప్రపంచంగా, వాస్తవంగా రూపొంది, మనల్ని తికమక పెడుతుంది, విషయాల్ని విడదీస్తుంది.

ఒకడు రాజుగారి భవనానికి బయలుదేరాడు. దూరంనుంచి రాజభవనం చూసి, సింహద్వారం వద్ద రెండు కుక్కలున్నాయని ఆగిపోయాడు. అంతలో మరొకడు వచ్చి, "నేను నిన్ను రాజభవనానికి తీసుకువెడతాను" అని చెప్పి తీసుకువెళ్ళాడు. అక్కడకు వెళ్ళి చూస్తే, అవి రాతి కుక్కలు. అలాగే ఈ జగత్తును చూస్తే, ఆత్మ కనుపించదు. ఆత్మను చూస్తే జగత్తు గోచరించదు. జగద్బుద్ధే మన సహజమైన ఆత్మస్థితిని కప్పేస్తుంది. కనుక దాన్ని తోసెయ్యాలి. కుక్క - రాయి - అతడు – అన్నీ – అంతా ఆత్మే. కాని, ఆ నిరాకార ఆత్మ మనల్ని నడిపేందుకు గురువుగానో మార్గదర్శకుడుగానో దర్శనమిస్తుంది.

*　　　*　　　*

**1912** ప్రాంతంలో భగవాన్ విరూపాక్ష గుహలో వున్నప్పుడు ఊళ్ళో ఒక కుమ్మరి వినాయకుడి బొమ్మ కొత్త అచ్చు ఒకటి తయారు చేసి, వినాయక చవితినాడు వేసిన మొదటి అచ్చుబొమ్మను స్వామికి సమర్పించుకున్నాడు. స్వామి దాన్ని గుహ బైట గూట్లో పెట్టారు. ఆ సమయాన స్వామితో వున్నవారు విఘ్నేశ్వరునిపై కవిత్వాలు కట్టి పాడారు. వారితోబాటు స్వామి కూడా ఒక పద్యం చెప్పారు; దాని అర్థం "బిడ్డగా గన్నవానిని బిచ్చగాని చేసి, ఎక్క

డను బిడ్డడవై పెద్ద పొట్టను పెంచుకుంటివి. నేను కూడా బిడ్డనే! ఓ, గూటిలోని వినాయకుడా, వెనుక వచ్చినవానిని బొందియు నీది రాతి గుండెయా? కంటజూడుము."

*          *          *

1912 లో, వాసుదేవశాస్త్రి మొదలైనవారు స్వామి జయంతి ఉత్సవం జరపాలనుకుంటే, దానికి అభ్యంతరం తెలుపుతూ రెండు పద్యాలు రాశారు స్వామి.

1. పుట్టు నా డెద్దియో పూనెదరు యుత్సవము
   పుట్ట మన కెద్ది యను బుద్ధిగొని — పుట్టుక
   గిట్టుక లేదై వెలుగు కేవల వస్తువులో
   పుట్టినదే పుట్టుదినంబు.

2. పుట్టునాడైనను పుట్టుక కేడ్వన్
   పుట్టునాడుత్సవము బూనుట—గిట్టిన
   పీనుగ నలంకరించి పెట్టుటని తన్నెఱిగి
   యేనణగుటే, జ్ఞానము.

*          *          *

ఒక శివరాత్రి రోజున స్వామి శివరాత్రి గురించి ఒక పద్యం రాశారు :

తొలి యరుణాచల లింగము
కలిగెను ధనువు నెలనార్ద్ర ఘనలింగమునన్
వెలువడు శివుని హరిసురలు
గొలిచిన దినమె, శివరాత్రి కుంభపునెలనో.

*          *          *

అరుణాచల ఉత్తరభాగాన తనను కందిరీగలు కుట్టిన సందర్భంలో ఒక పద్యం రాశారు స్వామి. తనను వెతుక్కుంటూ అలఘమ్మ మొదటిసారి వచ్చినప్పుడు స్వామి ఒక పద్యం రాశారు.

ఒక భక్తుని కోర్కెపై "ఆత్మవిద్య" రాశారు. "ఆత్మవిద్య అత్యంత సులభం" అనే అంశంపై ఆత్మ విద్యాకీర్తన రాశారు. సమస్త చరాచరం అంతా ఆత్మే. ఆత్మకు భిన్నంగా ఏదీ లేదు. "అంతా ఆత్మలోనే వుంది" అనేది దాని సారాంశం.

* * *

**1914** ప్రాంతంలో అమృతనాథ యతీంద్రులు ఒక పాట రాశారు. "అరుణాచల గుహయందు కరుణకు పేరుబడిన ఈ రమణుడెవరు? వరరుచియా? శివగురువా? హరియా? యతీంద్రుడా? గురు మహిమ నెరుక గోరికగా వుంది" అని.

ఆ పద్యం రాసిన ఆ కాగితాన్ని, ఆయన విరూపాక్ష గుహయందే వదలి వెళ్ళిపోతే, స్వామి దాన్ని తీసి చదివి

"హరి మొదలు ఎల్లజీవులు హృద్గుహలో<br>
యెరుకయై క్రీడించు పరమాత్మయే<br>
అరుణాచల రమణుడు<br>
భక్తిచే కరగు, మనసుతో హృదిచేరి<br>
జ్ఞాన నేత్రమును తెరచి<br>
నిజము జూచిన అది నీకు బట్టబయలు అగును" అని

పూరించారు స్వామి.

* * *

ఒకాయన స్వామి దర్శనం చేసుకుని సంస్కృతంలో వున్న శంకరాచార్యులవారి "వివేక చూడామణి" పుస్తకం అక్కడ వదలి వెళ్ళిపోయారు. స్వామి దాన్ని చూసి గంభీరం శేషయ్య గారిని చదవమంటే, "నాకు సంస్కృతం రాదు" అని, "వివేక చూడామణి నాకు తమిళంలో కావాలి" అన్నారు.

పలనిస్వామి ఊళ్ళోంచి వస్తో తమిళంలో వున్న "వివేక చూడామణి" ని తెచ్చారు. దాన్ని చదువుకుంటూ అటువంటి కాపీ కోసం పబ్లిషర్‌కి రాస్తే, కాపీలు లేవని సమాధానం వచ్చింది. అయినా శేషయ్యగారు స్వామిని ప్రార్థించారు. "వివేక చూడామణి"ని, తమిళంలోకి తర్జుమా చేయమని. స్వామి కొంత వరకు అనువదించేప్పటికి, పబ్లిషర్‌నుంచే కాపీ వచ్చింది. అది చూసి, స్వామి అనువాదం ఆపేశారు. కాని, కొన్నాళ్ళ తర్వాత ఒక భక్తుడు కోరగా, స్వామి మిగిలిన భాగాన్ని అనువదించారు.

ఉద్దండి నాయనార్ ఇంటికివెళ్ళి, పది సంవత్సరాలకు తిరిగి స్వామి దర్శనార్థం వచ్చి, గురుదక్షిణగా వందరూపాయలు ఇచ్చారు. ఆ ధన సహాయంతో "వివేక చూడామణి"ని అచ్చు వేయించారు. దాన్ని ప్రణవానందులు తెలుగులోకి అనువదించారు. అదీ అచ్చయింది. వివేక చూడామణికి స్వామి పీఠికరాస్తే, ఆ పీఠికను ఇంగ్లీషులోకి అనువదించారు.

* * *

నటనానందులు స్వామినుంచి వెళ్ళే బోధలు పోగుచేశారు. అవన్ని ప్రశ్నలు - వాటికి సమాధానాలు. అవి ప్రయోగాత్మక సాధనలతో కూడినవి. వాటిని "ఉపదేశ మంజరి"గా కూర్చారు.

* * *

1914 ప్రాంతంలో స్వామి శిష్యులు భిక్షాటనకు వెడుతూ పాడుకునేందుకుగాను పాట రాయమని స్వామిని కోరితే, ఆయన ఏ రకం పాట రాయడానికీ నిరాకరించారు. ఎందుకంటే, "ఎందరో మహాత్ములు, కవులు, మహర్షులు, యోగులు, పండితులు రాసిన పాటలు ఎన్నో వుండగా, మళ్ళా నేను రాయవలసిన అవసరమేముంది?" అన్నారు. అయినా వారు స్వామిని వదలలేదు. వారి కోసం "అరుణాచలస్తుతి పంచకం" అనే గీతాలు రాశారు.

* * *

అరుణాచల మహాత్మ్యం వెల్లడయ్యేందుకు అరుణాచలక్షేత్ర మహాత్మ్య ఘట్టమును స్వామి తమిళంలోకి అనువదించారు. అదే "అరుణాచల మహాత్మ్యం".

* * *

స్వామి విరూపాక్ష గుహలో వున్నప్పుడు "కరుణైయాల్" అనే పదం పదే, పదే స్ఫురణకు రావడంతో దాన్ని ప్రథమ పదంగా తీసుకుని స్వామి ఒక శ్లోకం రాశారు. ఆ మర్నాడు ఆ శ్లోకంయొక్క చివరి పదం పూర్వం మాదిరిగా పదే, పదే జ్ఞప్తికి రావడంవల్ల, దాన్ని ఆధారంగా తీసుకుని మరో శ్లోకం రాశారు. ఆ విధంగా ప్రతి శ్లోకంయొక్క చివరి పదం మరో శ్లోకానికి మొదటి పదంగా తీసుకుని పది శ్లోకాలు రాశారు. అవి భక్తిమయం. "సంపూర్ణమైన స్వానుభవమే, నిజమైన భక్తి" అని చెప్పే ఆ శ్లోకాలకు "అరుణాచల పదికము" అని పేరు పెట్టారు.

* * *

సంస్కృతంలో రచనలు చేయమని గణపతిశాస్త్రిగారు స్వామిని కోరగా, "నాకు సంస్కృతం రాదు. ఛందస్సు తెలియదు. ఇంకెట్లా కవిత్వం రాయగలను?" అన్నారు. దానికి గణపతిశాస్త్రిగారు సంస్కృతంలో కొన్ని మెలుకువలు, సూత్రాలు చెప్పారు, స్వామికి. వాటి ఆధారంగా స్వామి సంస్కృతంలో కవిత్వం రాశారు.

శ్లో॥ కరుణా పూర్ణ సుధాబ్దే
కబళిత ఘన విశ్వరూప కిరణా వల్యా!
అరుణాచల పరమాత్మన్
అరుణోభవ చిత్తకంజ సువికాసాయ.॥ అని - ఒక శ్లోకం రాశారు. కాని రమణగీత రచనాకాలంలో గణపతి ముని ప్రార్థించగా, ఆ శ్లోకానికి మరో నాలుగు శ్లోకాలు చేర్చి, "అరుణాచల పంచ రత్నమాల" అని పేరు పెట్టారు. అందు ఆత్మస్థితి, భక్తి, యోగ, విచారణ, విషయాసక్తి కలదు. అది సకల ఉపనిషత్తుల సారం, అంటే అతిశయోక్తి కాదు.

* * *

ఆగమ శైవ సూత్రాల నుంచి స్వామి కొన్ని భాగాల్ని ఎత్తి రాసుకున్నారు. అవి ఎట్లానో పోయాయి. మళ్ళా ఆ భాగాల్ని జ్ఞప్తికి తెచ్చుకుని రాశారు. అదే "దేవీకాలోత్తరం". ఆగమ శాస్త్రాల నుంచి కూడా స్వామి అనువాదాలు చేశారు. పూర్వీకులు ఇరవై ఎనిమిది ఆగమాల్ని ప్రమాణాలుగా తీసుకున్నారు. స్వామి వాటి నుంచి రెండు ఆగమాల్ని తీసుకున్నారు- "1. సర్వజ్ఞానోత్తర 2. దేవీకాలోత్తర" అని. అవి పూర్తి అద్వైత్వం. సర్వజ్ఞానోత్తరంలో ఆత్మసాక్షాత్కారం సంగతి ముఖ్యమైనది. ఆ రెండు ఆగమాల్ని స్వామే తమిళంలోకి అనువదించారు.

* * *

"1916 ప్రాంతంలో ఒకరోజు ఉదయం అప్రయత్నంగా నాలోంచి మాటలు తోసుకురావడం గమనించి, మొదట వాటిని తోసెయ్యాలని చూసి, అవి ఎంతవరకూ ఆగక, అణగక పోయేసరికి, వాటిని పాటగా కూర్చాను. మొదటి పాట రాసిన మర్నాడు గిరి ప్రదక్షిణం వెళ్ళాం. నా వెనక పళనిస్వామి, ఇంకా కొంతమంది వున్నారు. కొంతదూరం వెళ్ళాక, అయ్యాస్వామి పళనిస్వామి చేతికి ఒక కాగితం, పెన్సిల్ ఇచ్చి, "రోజూ ఈ వేళకు స్వామి ఏదో ఒకటి రాస్తున్నారుకదా? ఈరోజు కూడా ఈ కాగితం, పెన్సిల్ ఇచ్చి చూడండి" అని అంటే, పళనిస్వామి వాటిని తీసుకుని నా చేతికి ఇచ్చారు. అవి తీసుకుని నేను రాశాను. ఆ విధంగా రోజు కొకటి రాశాను" అన్నారు భగవాన్. అవి అరుణాచలాన్ని సగుణ బ్రహ్మగా భావించి రాసిన తొమ్మిది కీర్తనలు. వాటిని నారాయణ రెడ్డి "నవమణిమాల" అనే పేరుతో అచ్చువేయించారు. అది స్వామి ఉపదేశసార సర్వస్వం.



భగవాన్ అప్పుడప్పుడూ కొన్ని ప్రత్యేక, ప్రఖ్యాత, పరిశుద్ధ గ్రంథాలనుంచి ముఖ్యమైన భాగాల్ని ఏరి, తీసుకుని వాటిని తమిళంలోకి అనువదించేవారు. భక్తుల, అనుచరుల అభ్యర్థనపై భగవద్గీత, యోగవాసిష్టం, వివేక చూడామణి, దక్షిణామూర్తి గురుస్తుతి మొదలైన గ్రంథాల్లోని కొన్ని భాగాలు అనువదించారు. ఒకసారి భగవాన్ దగ్గరకు ఒక పండితుడు వచ్చాడు. అతనితో భగవద్గీత గొప్పతనం, అది చదవడంవల్ల కలిగే లాభం చెప్పారు భగవాన్. అంతలో మరో భక్తుడు, "స్వామీ, భగవద్గీతలోని ఏడువందల శ్లోకాలూ జ్ఞాపకం పెట్టుకోవడం బహు కష్టం. కొన్ని ముఖ్యమైనవి ఏరి చూపండి" అని కోరాడు. దానికి భగవాన్ ఓ నలభై శ్లోకాలు ఏరి కూర్చారు. అదే "భగవద్గీతాసారం".



పూర్వం కొందరు మునులు, ఋషులు, యోగులు కలసి తమ భార్యా-పిల్లలతో దారుకావనంలో భక్తి - జ్ఞాన - కర్మ యాగాదులు ఆచరించారు, అమానుష శక్తుల సంపాదన ద్వారా మోక్షం పొందాలని. వారి సాధనా విధానంలో ఏదో పొరపాటు జరిగింది. వారి తప్పు వారికి తెలియజెప్పి, వారిని ఒప్పించి, సన్మార్గంలో పెట్టడానికి పరమేశ్వరుడు భిక్షకుడుగా, మహావిష్ణువు మోహినిగా రూపాలు ధరించి దారుకావనం వచ్చారు. ఆ ఋషి పుంగవులంతా మోహిని మోహంలో పడితే, వారి వారి భార్యలు భిక్షకుని వశమైనారు. తత్ఫలితంగా వారి శాంతి, నిశ్చలత, సమచిత్తం సమస్తం సర్వనాశనమయ్యాయి. వారిశక్తులన్నీ ఉడిగిపోయాయి. తమ పతనానికి పరమశివుడే కారణమని గ్రహించి, ఆయన్ని తమ శత్రువుగా భావించి, పాముల్ని - పులిని - ఏనుగును సృష్టించి, మంత్రశక్తితో వాటిని పురిగొలిపి, ఆయన మీదకు పంపారు. ఆ పాముల్ని పరమేశ్వరుడు హారాలుగా ధరించి, పులిని- ఏనుగును చంపి, వాటి చర్మాల్ని ఒంటికి చుట్టుకున్నారు. పరమశివుని అద్భుత శక్తికి ఆశ్చర్యపడి, ఆ రుషులంతా ఆయన పాదాలమీద పడ్డారు. తమకు ఏదైనా ఉపదేశం చేయమని కోరారు. పరమేశ్వరుడు ప్రసన్నుడై, వారి తప్పు వారికి తెలియజెప్పి, కర్మాచరణ ద్వారా కర్మ నుంచి విముక్తులు కాలేరని చెప్పారు. చిత్తంలో జపం కన్నా, ధ్యానం గొప్పదన్నారు.

కవి, పండితుడు అయిన మురుగనార్‌పై కథాభాగం రాసి, ఆ మునులకు పరమేశ్వరుడు ఏం ఉపదేశించారో ఆ భాగం తాను రాయలేక, భగవాన్ని రాయమని అర్థించారు. స్వామి ఆ ఉపదేశాన్ని రాశారు. అదే "ఉపదేశసారం". అది ముప్ఫై పద్యాల్లో వుంది.

ఉపదేశసార సారంశం :

"ఒకరు చేస్తేనేగాని, ఏ పనీ జరగదు కనుక, "కర్మ" (పని) "జడం". ఆ కర్మకు స్వతంత్రంగా చైతన్యం లేదు. "కర్త" ఫలదాత అంటూ రచన సాగింది. అది భక్తి, జ్ఞాన, కర్మ, యోగ మార్గాలను మధించి రాసిన మహద్గ్రంథం.

"కర్మకు అనుకూల ఫలం లభించినా అది శాశ్వతంకాదు. కర్తృత్వభావం లేకుండా పనిచేస్తేనే, ముక్తి. ఆ విధంగా చేసే పనులు దేహంతోకన్నా, వాక్కుతో; వాక్కుకన్నా జపం; జపం కన్నా, మనసులో సదా స్మరణ; ధ్యానం గొప్పది. అదే ఉత్తమం" అన్నారు భగవాన్.

సృష్టిలో పంచభూతాలూ, సూర్యుడు, చంద్రుడు, జీవుడు- ఈ ఎనిమిదీ అష్టమూర్తులుగావున్న ఈశ్వరుడే "నేను". ఆ "నేను" గురించిన ధ్యానమే, ఉత్తమమైనది. ఆ ధ్యానం ఆజ్యధారవలె నిరంతరం ఎడతెగక సాగవలెనంటారు భగవాన్.

సత్యస్వరూపంగా మిగిలివుండుటే, ఉత్తమ భక్తి. "నేనూ, నా తండ్రీ ఒక్కటే" అనే భావంతో పనిచేయాలి. ఆ భావం దృఢంగా వుంటే, ఏ తలపులూ రావు. అప్పుడు స్వస్వరూపంగా మిగులుతారు. అదే ఉన్నత భక్తి.

మనసు మూలంపై నిలపడమే, కర్మయోగం. అంటే, తలపులు పుట్టినచోటు. అదే హృదయం. అందు లీనమగుటే, కర్మయోగం. అదే భక్తి - జ్ఞాన - రాజయోగం. ప్రాణాయామంతో తలపుల్ని నిశ్చలం చేయవచ్చు. మూలశక్తి ఒక్కటే! దానికి "చిత్తం, వాయువు" అని రెండు శాఖలున్నాయి. మనసు అణగడంకన్నా, నాశనమగుట మేలు. ప్రాణాయామం చేసినంత కాలం మనసు అణగుతుంది. మరల విజృంభిస్తుంది. ఆ మనసు నాశనమయ్యేట్లుచూడాలి. కనుక మనోనాశనమే ఉత్తమం. ఆ తర్వాత చేయవలసింది లేదు.

"మనస్సంటే ఏమిటి?" అని నిజంగా విచారిస్తే, అది ఎగిరిపోతుంది. ఆత్మ మిగులుతుంది. "నేను" అనే తలంపే, మనసు. ఆ "నేను" ఎక్కడనుంచి పుడుతోందో తెలుసుకుంటే, ఆలోచన అంతమై, "అసలు నేను" మిగులుతుంది. అదే చైతన్యం. తక్కిన వన్నీ జడములు - అసత్యం.

ఆత్మ సాక్షాత్కారమంటే, ఆత్మగా స్థిరపడటం. అదే మహా తపస్సు. రామయోగి కోరగా స్వామి, "ఉపదేశసారాన్ని" తెలుగులో ద్విపదగా రాశారు. దాన్ని మలయాళంలో కూడా భగవానే రాశారు. దాన్ని సంస్కృతంలోకి అనువదించారు. ఆ ఉపదేశసారాన్ని ప్రతిరోజూ భగవాన్ ముందు పారాయణ చేసేవారు. ఇప్పుడు సమాధిముందు చదువుతున్నారు. అద్వైత సిద్ధాంతాన్ని అమోఘంగా వివరించే కావ్యం, "ఉపదేశసారం". ఆ ఉపదేశాలు భగవాన్ మార్గాన్ని స్పష్టం చేస్తాయి. అది భగవాన్ స్వానుభవం. అది కేవలం జ్ఞానమార్గం.

* * *

మురుగనార్ తరచు స్వామిని తాత్త్విక విషయాల గురించి ప్రశ్నించేవారు. భగవాన్ ఆయనకు పద్యరూపంలో సమాధానాలు ఇచ్చేవారు. ఆ సమాధానాలు కొన్నాళ్ళకు నలభై అయ్యాయి. మురుగనార్ వాటిని నాయనగారికి చూపించారు. వారిద్దరూ కలసి, వాటిని ఓ క్రమ పద్ధతిని కూర్చారు. ఉన్న వస్తువు గురించి రాసినవి గనుక, వాటికి "ఉన్నది నలుబది" అని పేరు పెట్టారు. అదే "సద్విద్య." అంటే, సద్వస్తు లక్షణం. వాటికి అనుబంధంగా స్వామి మరో నలభై పద్యాలు రాశారు. వాటిని "సూక్తిసుధ" అన్నారు.

* * *

రామయోగికోసం స్వామి "సూక్తిసుధను" తెలుగులో వచనానువాదం చేశారు. దాని భావం గంభీరం. అది జ్ఞానదర్శిని. మొదటి నలభై శ్లోకాలకు గణపతిశాస్త్రిగారు సంస్కృతానువాదం చేశారు. దానికి "సద్దర్శనం" అని పేరు పెట్టారు. దానికి కపాలి శాస్త్రిగారు వ్యాఖ్య రాశారు. ఆయనే దాన్ని ఇంగ్లీషులోకి కూడా అనువదించారు.

* * *

ఎచ్చమ్మాళ్ తమ్ముడు కూతురు "చెల్లమ్మ" చిన్నది. తినడానికి బజారులో ఏదో కొనుక్కుంటే, ఆ పదార్థానికి చుట్టిన కాగితాన్ని ఆ అమ్మాయి పరిశీలించి చూడగా, దానిమీద ఒక పాట వుంది. ఆ అమ్మాయి ఆ పాటను కంఠస్థంచేసి, భగవాన్ ముందు పాడింది. భగవాన్ ఆ అమ్మాయి దృష్టికీ, శ్రద్ధకూ మురిసిపోయి, ఆమెకోసం మరో ఐదు శ్లోకాల్ని అరవంలోకి అనువదించి, వాటిని "ఉన్నది నలుబది"కి చేర్చారు.

* * *

బలరామరెడ్డిగారి కోర్కెపై భగవాన్ భాగవతం నుంచి సేకరించిన "సిద్ధి లక్షణ వర్ణన"ను తమిళంనుంచి తెలుగులోకి అనువదించారు.

ఒడలు నశ్వర - మదిస్థితం బుద్ధి తంచో
కర్మవశమున విడివడ గలయ గలదో
తన్నెఱింగిన సిద్ధుడు తనువు గనడు
గుడ్డును మదిరా మదమును గ్రుడ్డివలెనె.

* * *

సంస్కృతంలో "త్రిశూలపుర మహాత్మ్యం" విశ్వనాథ బ్రహ్మ
గారిచేత అరవంలో రాయించి, దాన్ని సరిచూశారు, భగవాన్.
త్రిశూలపురం" అంటే "తిరుచ్చుళి". అది భగవాన్ జన్మస్థలం.

*　　　*　　　*

శంకరులు "పరాపూజ-ఆత్మపూజ" అని రెండు శ్లోకాలు
రాస్తే, భగవాన్ వాటిని కలిపి "పరాత్మపూజ" అని రాశారు.

*　　　*　　　*

సూరి నాగమ్మగారి కోర్కెపై "ఏకాత్మ పంచకం" భగవాన్
తెలుగులో రాశారు :

తన్ను మరచి, తనువు తానై తలచి
ఎన్నియో జన్మములెత్తి, తుది-దన్ను
దెలిసి, తానౌట పలు దేశసంచార
కలన్మేల్కనుట కను.

తానుండి తానుగ దన్నైదా నే నెవ
డే నుండు స్థానమెద్దియను—వానికి
నే నెవడెక్కడ నే నేనున్నానన్న
మధుపానుని యీడు పలుకు.

తనలో దనువుండ, దాను జడమౌ
తనువందున్నట్లు తలచు—మనుజుడు
చిత్రములో నున్నది చిత్రమున కాధార
వస్త్రమని యెంచువాడు.

పొన్నుకు వేరుగ భూషణముండునే?
తన్ను విడిచి తనువేది? తన్ను
దను వను వాడజ్ఞుడు "తా" ననువాడు
తను గనిన జ్ఞాని ధరించు.

ఎప్పుడు నున్నది ఏకాత్మ వస్తువే
యప్పుడా వస్తువు నాదిగురు—చెప్పక
చెప్పి, తెలియగ జేసినారె యెవరు
చెప్పి తెలుపుదురు చెప్పు.

ఏకాత్మ తత్వము నిట్టిదని తేల్చి భక్త
దేహాత్మ భావము దీర్చెను—ఏకాత్మ
జ్ఞాన స్వరూపా, రమణ గురునాథుడు తా
నానతిచ్చు, పంచకమందు.

*   *   *

అరుణాచల పంచరత్నమాలకూ భగవాన్ తెలుగు అను
చేశారు,

ఏకమక్షరము నా హృదయ మందెపుడు

ఏకమై వెలుగునే యెటు వ్రాయగలము? ॥ అను ప
మొదట తమిళంలోనూ, తర్వాత తెలుగులోనూ రాశారు భ
అదే "ఏకమక్షరం".

*   *   *

గణపతి మునీంద్రుల అభ్యర్థనపై "దేహం - నాహం - కోఽహం, సోఽహం" అనే పదములతో సంస్కృత శ్లోకం రాశారు భగవాన్.

శ్లో॥ దేహం మృన్మయవ, జ్జడాత్మక, మహం బుద్ధి
ర్నతస్యాస్త్యతో
నాహం త, త్తద పేత సుప్తిసమయే
సిద్ధాత్మ సద్భావతః
కోఽహం భావయుతః కుతో వరధియా
దృష్ట్వాత్మ నిష్టాత్మనాం
సోఽహం - స్ఫూర్తి తయాఽరుణాచలశివః
పూర్ణో విభాతి స్వయం.

తాత్పర్యం :

దేహం, ఘటంవలె జడం. దానికి నేనను తలపులేదు. దేహస్ఫురణ లేని నిద్రలో మనం వుంటాం కనుక, దేహం నేను కాదు. అయితే, ఆ "నేను" ఎవరు? ఎక్కడ వుంది? అని సూక్ష్మబుద్ధితో విచారిస్తే, క్రమంగా మనసు నిలకడ చెందిన వారి హృదయంలో అరుణాచలశివుడు,అహం స్ఫురణరూపుడై స్వయంగా ప్రకాశించు చున్నాడు.

*   *   *

భగవాన్ అప్పుడప్పుడూ అనేకం రాశారు. వాటిల్లో కొన్ని పోయాయి.

వంద సంవత్సరాలకు పూర్వం పల్లాకుత్తును ప్రభుత్వం వీరశైవ కులస్థులకు దానం చేసింది. అది పది ఎకరాల ప్రదేశం. అందు పువ్వులు పూయించి అరుణాచలేశ్వరునికి అర్పించే షరతు మీద, ఆ భూమి దానం చేయబడింది. ఆ స్థలం మధ్య ఓ కొలను వుంది. దాన్ని "అగస్త్య తీర్థం" అంటారు. కొలను చుట్టూ సాధువుల కుటీరాలు. కొలను దక్షిణ వైపున విఘ్నేశ్వరాలయం. ఆ కుటీరాల్లో కొంత కొంతకాలం రామయోగి-పాల్ బ్రంటన్-నరసింహస్వామి-శుద్ధానంద భారతి గణపతిశాస్త్రిగారు - మురుగనార్ మొదలైనవారు వున్నారు. ఆ తర్వాత కోహెన్ ఓ కుటీరం కట్టుకుని, గృహప్రవేశానికి భగవాన్ని కూడా ఆహ్వానించారు. భగవాన్ వెళ్ళి, అందరితోపాటు చాపమీద కూర్చున్నారు.

భగవాన్ పల్లాకుత్తు మీదుగా కొండ మీదకు వెళ్ళేవారు. వెడుతూ ఓ ఐదు నిమిషాలు కోహెన్ కుటీరం వరండాలో విశ్రమించేవారు. అది చూసి, ఒకరోజున ఆ వరండాలో కోహెన్ ఒక కుర్చీ వేశారు. కుర్చీ చూసి భగవాన్ అటువేపులకు వెళ్ళలేదు. తనకు ఎటువంటి ప్రత్యేకతా చూపవద్దని భగవాన్ ఎన్నాళ్ళు ఎంత కఠినంగా చెప్పినా, ఎంతటివారూ వినేవారు కాదు.

భగవాన్ చుట్టూ వినయం, విధేయతా, నమ్రతా, నిరాడంబరం, సహజత్వం, శాంతం, స్వేచ్ఛ రూపుదిద్దుకునేవి. కాని, అక్కడ చేరినవారు భగవాన్ని చూడగానే నుంచోవడం, నమస్కరించడం, మొక్కడం ప్రత్యేకత చూపడం వంటి పనులు చేసేవారు. వాటిని పురస్కరించుకుని భగవాన్ చాలా గట్టిగా కోప్పడేవారు. "ఇవన్నీ ఎందుకు? స్వామిని చూసి నుంచునేది. చాలా భక్తి వున్నట్లు నటించేది. సాష్టాంగపడేది. వీటివల్ల ఏం లాభం? మామూలుగా వుంటే చాలదా? మనసు నిర్మలంగా వుండాలి కాని, ఈ నమస్కారాలూ-ఇవన్నీ వేషాలు

స్వామి కన్నీ తుడిచి, ఏమార్చాలని చూసేపనులు. "మేంనమస్కారం పెట్టాం. మా తప్పులకు మీరు ఏమీ అనడానికి వీల్లేదు - అని తమ ఇష్టం వచ్చినట్లు వుంటారు. స్వామి నోరు మూసుకుని వుండాలి" అన్నారు. అలాగే తనకు ఎక్కువ వడ్డించినా, ప్రత్యేకత చూపించినా అంగీకరించేవారు కాదు. ఒకసారి భగవాన్ కొండమీద నుంచి దిగి వస్తోవుంటే, ఆయన వెనక ఒక యువకుడు, స్వామి భక్తుడు గౌరవంకోసం, మర్యాదకోసం నెమ్మదిగా నడవడం చూసి, "నువ్వు యువకుడివి. వడివడిగా నడవగలవు. నువ్వు ముందు వెళ్లు" అని భగవాన్ అతనికి దారి ఇచ్చారు.

ఒక రోజున భగవాన్ కొండమీద నుంచి ఆశ్రమానికి వస్తోవుంటే, ఒకతను చేస్తున్న పనిని ఆపేసి, భగవాన్‌కి సాష్టాంగ నమస్కారం చేయగా, "ఋషులు మొదట నమస్కారాన్ని భగవదర్పణ చిహ్నంగా ఎంచారు. అది ఇప్పుడు ఆచరణప్రాయంగా వుంది. తమ నమస్కారం దైవం అంగీకరించారని యధాప్రకారం జీవితం సాగించ చూస్తారు. నమస్కరించినవాడు తన ఆచరణలతో దైవాన్ని మోసగించ చూస్తాడు. ఆ నమస్కారం చాలావరకు కపటం, మోసం. అది లెఖ్కలేనన్ని పాపాల్ని దాచేందుకైన తెర. దైవాన్ని మోసగించగలమా?

" ఈ కూచోడాలు, నుంచోడాలు, నమస్కారాలు నాకెట్టి తృప్తినీ ఇవ్వవు. మనసు నిర్మలంగా వుంచుకోవాలి. అలా చేయకుండా నా ముందు ఒంగితే లాభమేమిటి? అటువంటి వాటితో నేను మోసపోయేది లేదు. ఎవరి పనుల్ని వారు శ్రద్ధగా చేయడమే, అసలు నమస్కారం" అన్నారు భగవాన్.

సేవ పేరుమీద ఏమాత్రం అహంకారం కనపడ్డా, భగవాన్ చాలా తీవ్రంగా ఖండించేవారు. చివాట్లూ పెట్టేవారు; హెచ్చరించేవారు. "మన సేవకు, శరణాగతికి ఈశ్వరుడు ఎదురు

చూడరు. "నిన్ను సేవిస్తా - భజిస్తా - ఆరాధిస్తా" అని గొప్పలు పోయి చాటుకుంటున్నావా?" అనరా ఆ శుద్ధ చైతన్యమూర్తి అయిన ఈశ్వరుడు" అన్నారు భగవాన్.

"నిన్ను నువ్వు దగా చేసుకోకపోతే, దయాళువైన దైవం, నిన్ను దగా చేయడు. నీ ధర్మం నువ్వు సక్రమంగా నిర్వర్తించడం అన్నిటికన్నా ఉత్తమం. అదే భగవంతునికి గొప్ప సేవ" అన్నారు భగవాన్.

* * *

భగవాన్ ఎవరినీ తన దగ్గరకు రమ్మనలేదు. వచ్చిన వారిని వెళ్ళి పొమ్మనలేదు. ఉండమని ఎవరినీ బలవంతం చేయలేదు. ఆశ్రమానికి వచ్చిన ప్రతి ఒక్కరినీ తన ఏకైక పుత్రుణ్ణో, పుత్రికనో చూసుకునే దయగల తల్లి మాదిరిగా ప్రేమగా పలకరించి, తీసుకునేవారు. అందరి యెడలా ఒకే విధమైన ప్రేమ, దయ, మర్యాద, గౌరవం చూపేవారు. ఆశ్రమానికి వచ్చిన ప్రతి వారినీ ముందుగా, "భోజనం చేశారా?" అని అడిగేవారు.

భగవాన్ దివ్యత్వం ఆయన చూపుల్లో, మాటల్లో, మౌనంలో, అసలు ఆయన ఉనికిలోనే ఉన్నతంగా, ప్రస్ఫుటంగా కనుపించేది. ఆయన్ని నిజంగా, ప్రేమగా దర్శించ వచ్చినవారి హృదయాంతరాళంలో ఆయన దివ్యత్వం గట్టిగా నాటుకుపోయేది. భగవాన్ రోజూ ఒకే వేళకు హాల్లోకి వచ్చి, సోఫాలో కూర్చునే వారు. అప్పటికే ఎంతో మంది భక్తులు, యాత్రికులు ఆశ్రమ వాసులు, సాధువులు, సన్యాసులు, జిజ్ఞాసువులు, సంసారులు, వేదాంతులు, అన్ని రకాలవారు, వర్గాలవారు, జాతులవారు, సంఘాల వారు, సంస్థలవారు, మతాలకు చెందినవారు, ఆడ - మగ, చిన్న - పెద్ద, వచ్చి నిశ్శబ్దంగా, నిశ్చలంగా భగవాన్ ముందు కూర్చునేవారు. వారితో పాటు పశు, పక్ష్యాదులు చేరేవి.

భగవాన్ దర్శనం అందరికీ సులభంగా లభించేది. ఆయన ప్రపంచానికంతకూ మకుటంలేని మహారాజులాగ కూర్చునేవారు. ఆయన ప్రేమ, నమ్రత, వర్ణనాతీతం. "నేనింత దూరాన- ఇక్కడ వుండటం చేత నన్ను చూడ్డానికి చాలామంది ఎంతో శ్రమపడి వస్తున్నారు. వారికి ఎంతకష్టమో చూడండి," అనేవారు భగవాన్. ఒకసారి భగవాన్ని చూడ వచ్చిన ప్రణవానందస్వామి, వార్థక్యంవల్ల, నడవలేక, ఆశ్రమంగేటు దాటి, మాతృ భూతేశ్వరాలయం అరుగుమీద అలసి కూర్చుండి పోయారు. ఆ సంగతి భగవాన్‌కి తెలిసి, వెంటనే ఆయన దగ్గరకు వెళ్ళి, "తాతా, ఇప్పుడే వచ్చారా? కాళ్ళు నొప్పా?" అని ఆయన పాదాలు కొంతసేపు నొక్కారు. భగవాన్ దర్శనానికి వచ్చిన ప్రతివారూ శ్రీ రమణాశ్రమం తమ స్వంత ఇల్లు మాదిరిగా భావించేవారు.

భగవాన్ చుట్టూ నిర్మలమైన, నిశ్చలమైన పవిత్రమైన వాతావరణం కమ్మివుండేది. ఆయన ఉనికి అద్భుతమైంది, ఆశ్చర్యకరమైనది. ఆయన సమక్షంలో నీచత్వం- అల్పత్వం- స్వల్పత్వం- అదృశ్యమయ్యేవి. ఏ కారణానికైనా అధోగతిలో వున్నటువంటివారు సహితం, ఆయన సన్నిధిలో పైకి లేవనెత్తబడేవారు. ఆయన సంవాదంలో ఎటువంటివారు కూడా ఉత్తేజితులు, సమ్మోహితులు కావడం జరిగింది. ఆయన నేర్పదలచుకున్నది ప్రేమ, సమత్వం.

భగవాన్ దర్శనం, పరిచయం, గొప్ప అదృష్టంగా భావించేవారు. ఆయన సన్నిధిలో కూర్చోవడం, ఆయన రూపాన్ని ధ్యానించడం, ఆయన నామాన్ని జపించడం, ఆయన తేజస్సును వీక్షించడం మహద్భాగ్యం అనుకునేవారు కొందరు.

భగవాన్ సన్నిధి స్వచ్ఛమైన దర్పణం. అందు తమ రూపమే ప్రతిబింబించేది. ఒకనిపై దయకల చిరునవ్వు నవ్వి, నవ్వించడం— వేరొకనిని హావ, భావ, అభినయాలతో పలకరించడం- క్షేమగా ఒక పసిబిడ్డవైపు తిరగడం - ఎగిరే నెమలిని, దూకే ఉడతన్ని, గెంతే

కోతిని, ఆడుకునే కుక్కని, హాల్లోకి చొరబడివచ్చే గోలక్ష్మిని-
అన్నింటినీ ప్రేమగా, ప్రశాంత వదనంతో సమంగా చూసేవారు
భగవాన్. కాని, మరుక్షణంలో గంభీర మౌనంతో ఆయన ముఖం
బహు చిత్రంగా మారిపోయేది.

భగవాన్ సన్నిధిలో నిశ్శబ్దం రాజ్యమేలేది. ఆయన చుట్టూ
శారీరక, మానసిక అనారోగ్యవంతులూ; కోర్కెల - ఆశల -
ప్రయత్నాలతో కూడినవారూ, కలలలో-సాధనలో అనుభవాలు
కలిగినవారూ; దివ్యదృశ్యాలు దర్శించినవారూ, బ్రహ్మనాదాలు
విన్నవారూ, అశాంతిపరులు, సంశయార్తులు, అనుగ్రహంకోసం
ఉపదేశం కోసం, దీక్షకోసం, చేరినవారూ- వారందరికీ వారి, వారి
సంస్కార స్వభావాలను బట్టి ఏకకాలంలో ఒక్కొక్క విధంగా
ఆయన దర్శనమయ్యేది.

భగవాన్ ఎంతో సేపు శిలాప్రతిమలాగ కూర్చుండిపోయే
వారు. ఆయన కళ్ళల్లోంచి కాంతి వరదలుగా వచ్చి, పడుతున్నట్లు
వుండేది. ఆయన కళ్ళకాంతిని వర్ణించడం కష్టమంటారు. ఒకసారి
భరించరాని దుఃఖంతో వచ్చిన వాని విషాదగాథ విని, అతని వంక
ఎంతో దయగా చూశారు. అంతే! అతని హృదయం శాంతితో
నిండింది. అతను సంతోషంతో వెళ్ళిపోయాడు.

భగవాన్ ఒక్కొసారి ఏదోరాస్తో దీర్ఘాలోచనల్లో పడేవారు.
అటువంటప్పుడు ఆయన కళ్ళు పెద్దవయ్యేవి. మనసులో ఆలోచనలు
మాదిరిగా, ఆయన కళ్ళు అటూ, ఇటూ చురుకుగా కదిలేవి.
కొందరితో కలిసి నవ్వేవారు. కొందరితో కలిసి విచారించేవారు.
కొన్నిసార్లు కన్నీరు కార్చిన సందర్భాలు లేకపోలేదు. పిల్లలతో,
కోతులతో, ఆడేవారు. ఒక్కొసారి పాడేవారు. కాని, రోజులో
ఎక్కువభాగం మౌనంగా వుండేవారు.

ఒకసారి కొందరు రమణ భక్తులు భగవాన్ సన్నిధిలో "రమణ సద్గురు - రమణ సద్గురు......" అని పాడుతూవుంటే, భగవాన్ వారితో కలిసి కొంతసేపు పాడి, పాట అయిపోయిన తర్వాత తన దేహాన్ని చూపుతూ "దీన్నేనా మీరు రమణ అంటున్నారు?" అని, "విశ్వమంతా ఏ దివ్య తేజస్సుతో వెలుగుతోందో, ఆ విశ్వ చైతన్యమే, అది. అదే రమణ. అంతా అదే! రమణ—అరుణాచలం-ఆత్మ, అన్ని అదే. మీరూ అదే. దానియందు సంపూర్ణ ప్రేమ కలిగివుంటే, దాన్ని మీరు మీ అంతరాంతరాళాల్లో ప్రియతమునిగా దర్శిస్తారు. ఆ శుద్ధచైతన్యాన్ని నిర్మల, పవిత్ర జ్ఞాన నేత్రంతో దర్శించగలరు" అన్నారు భగవాన్.

భగవాన్ ఎక్కువగా తమిళంలో మాట్లాడేవారు. అప్పుడప్పుడూ తెలుగు, మళయాళం, కొంచెం కొంచెం ఇంగ్లీషులో మాట్లాడేవారు. ఎవరైనా మామూలు విషయాలు మాట్లాడినా, తాత్విక విషయాలు మాట్లాడినా, యోగం - సాధన ఏ సంగతి చర్చించినా భగవాన్ చివరివరకు శ్రద్ధగా, జాగ్రత్తగా, ఓపికగా, ఓర్పుతో, ప్రేమతో వినేవారు. వారి వారి అర్హతకూ, స్థితికి తగినట్లుగా మాట్లాడి నవ్వుతో నవ్విస్తో ఛలోక్తులతో, ఉత్సాహంతో, ఉల్లాసంతో-ప్రశాంతంగా, చురుకుగా-ఆ క్షణంలో ఎట్లా స్ఫురిస్తే అట్లా మాట్లాడేవారు. ఆయన మాట్లాడుతోవుంటే-చిన్న పిల్లల్లో, చిన్న పిల్లవాడు మాదిరిగా - సంసారులలో, సంసారిగా - వేదాంతులతో వేదాంతిగా - గురువులకు గురువుగా - పశు, పక్ష్యాదుల విషయంలో వాటివలె సమంగా వ్యవహరించేవారు. అడిగిన వారి ప్రశ్నలకూ సమస్యలకూ సమాధానాలిస్తో, వాళ్ళ మనోస్థితికి తానూ వెళ్ళి, వాళ్ళను ఆకట్టుకునేవారు. ఆయన సమాధానాలు చాలా సమంజసంగా, సహజంగా, సరళంగా వుండేవి. ఆయన నవ్వు, భాష తెలియని వారికి కూడా నవ్వు పుట్టించేది. ఆయన హ్యూమర్, జోక్స్ అందంగా, అర్థయుక్తంగా వుండేవి.

భగవాన్ తన గురించి అరుదుగా చెప్పుకునేవారు. ఆయన ఏం రాసినా, ఏం మాట్లాడినా అవి భక్తులపై ప్రేమకొద్దీ చేసినవే. భక్తుల పరిచారకుల అనుచరుల అభ్యర్థనపై జరిగిన సంగతులే. ఆయన బోధ, వేదాంతం కాదు. "అది సమస్యా పరిష్కారం కోసం యోచన కాక, అసలు ఆలోచనల్ని తోసెయ్యడం" అని సలహా ఇచ్చేవారు. ఎవరైనా, ఏదైనా చేస్తామంటే, "తప్పక చేయండి. చేసి చూడండి" అని ప్రోత్సహించేవారు.

భగవాన్ ప్రతీదీ స్వయంగా చేసి, చూసి అనుభవం పొందే తత్వం కలవారు. ఆయనకు దేంట్లోనూ హెచ్చుతగ్గులు లేవు. ఆయన అంగీకారం, అసంగీకారం, చాలా స్పష్టం. వారి నిత్య జీవితం గడియారంలో ముల్లు మాదిరిగా సక్రమంగా, ఒకే రీతిగా గడిచేది. ఆఫీసులో పని మాదిరిగా భగవాన్ జీవితం ఒక క్రమ పద్ధతిని సాగేది. ప్రతివిషయంలో భగవాన్ ఖరారుగా, ఖచ్చితంగా వుండేవారు. ప్రతిదాన్ని నిశితంగా, నిర్దిష్టంగా, సన్నిహితంగా పరిశీలించేవారు. ఆయన చేసే ప్రతి పనీ చాలా విలువైనదిగా వుండేది. ఆశ్రమంలో రోజూ కేలండర్ తిప్పాలి. రేడియో ప్రకారం గడియారాలు సరిచేయాలి. ఆశ్రమ ఆవరణ పరిశుభ్రంగా వుండాలి. ప్రతి వస్తువూ వాటి వాటి స్థానంలో అందంగా, శుభ్రంగా వుండాలి. ఏదీ వృథాకానిచ్చేవారు కాదు. ఎవరూ విస్తళ్ళలో మెతుకులు వదలకూడదు. పులిస్తరాకులు పశువులకు వేయించేవారు. ఎన్ని జరిగినా భగవాన్ స్వేచ్ఛగా, శాంతంగా, ఎప్పుడూ ఒకే విధంగా వుండేవారు.

* * *

తనచుట్టూ చేరిన యావత్ మానవేతర ప్రాణికోటిని ఉద్దేశించి, "ఆ రూపాల్లో, ఆ దేహాల్లో వున్న ఆత్మలు ఎటువంటివో, అవి మన సాన్నిహిత్యాన్ని ఎందుకు కోరతాయో మనకు తెలియదు.

పరిపూర్తి కాని కర్మను, పూర్తిచేసుకోవడానికి ఈ పశు, పక్ష్యాదులు మనని చేరుతున్నాయేమో! మనకు తెలియదు" అన్నారు భగవాన్.

భగవాన్ గురుమూర్తంలో ఉన్నప్పుడు పక్షులు, ఉడతలు ఆయన చుట్టూ తిరిగి, ఆడుకునేవి. కొన్ని ఆయనకు దగ్గరలో గూళ్లు కట్టుకుని, పిల్లల్ని పెట్టేవి. అవి ఏ ఏ దశల్లో, ఎన్నెన్ని రోజులకు ఎటువంటి పరిణామాలు చెందుతున్నవీ కనిపెట్టి చూసేవారు; భగవాన్. అలా చూడ్డం వినోదంకోసం కాదు. వాటిని జాగ్రత్తగా, శ్రద్ధగా, ప్రేమగా పరిశీలించేవారు. ఆయన ఎప్పుడూ, ఏ జంతువునూ, ఏ పక్షిని "ఇదీ - అదీ" అనలేదు. "లక్ష్మి" కి అన్నం పెట్టండి. "పిల్లలకు తిండి పెట్టారా?" అని పేర్లు పెట్టే అడిగేవారు.

ఒకసారి ఒక ఉడుతపిల్ల గూట్లోంచి కింద పడింది. దాన్ని తీసి గూట్లో పెట్టారు, భగవాన్. కాస్సేపటికి అది మళ్ళా కింద పడింది. దాన్ని తీసి మళ్ళా గూట్లో పెట్టారు. అది మళ్లా కింద పడింది. భగవాన్ మళ్ళా దాన్ని గూట్లో పెట్టారు. అది కింద పడటం, భగవాన్ దాన్ని తీసి గూట్లో పెట్టడం అదంతా చూసి, "మనసు విషయ వాసనల వైపు పోతూ వుంటే, దాన్ని స్వస్థానం చేర్చాలి. మనసూ ఉడత పిల్లంత చంచలం" అన్నారు భగవాన్. పిపీలికాది బ్రహ్మపర్యంతం ఒకటిగా చూసే భగవాన్‌కి, గూట్లోంచి ఉడుతపిల్ల కింద పడిందని గొడవపడ్డారంటే, అది మనం గొడవ పడినట్లు కాదు. ఆయన సహజ, సంపూర్ణ ఎరుకలోంచే గొడవ పడతారు. అదంతా వారి ప్రేమ.

భగవాన్ విరూపాక్ష గుహలో వుండే రోజుల్లో ఒక పెద్ద కోతి మరో కోతిపిల్లను బాగా కరిచింది. ఆ పిల్ల మూర్ఛపోతే చనిపోయిందనుకుని, తక్కిన కోతులన్నీ దాన్ని వదలి వెళ్ళి పోయాయి. కాని, ఆ కోతిపిల్ల కాస్సేపటికి కోలుకుని, మెమ్మదిగా

భగవాన్ దగ్గరకు చేరింది. అది బ్రతికి బైటపడింది కాని, దాని కాలు కుంటుపడింది. అందుచేత అందరూ దాన్ని "నొండి" అంటే "కుంటి" అని పిలిచేవారు. భగవాన్ దాన్ని శ్రద్ధగా చూసి కాపాడారు. ఒక రోజున నొండి కోసం భగవాన్ వేడి పాలు చల్లారుస్తోవుంటే, తన వాటా పాలు భగవాన్ తాగేస్తున్నారనుకుని, నొండి ఆయన్ని చెంపమీద కొట్టింది. అయినా భగవాన్ దాన్ని ప్రేమగా తీసుకున్నారు.

నొండి క్రమంగా కోలుకుంది. అది చనువుగా భగవాన్ తొడమీద కూర్చునేది. ఆయన పక్కన చక్కగా కూర్చుని భోజనం చేసేది. ఒకరోజున అది అన్నం వెదజల్లుతూ తింటూ వుంటే, "శుభ్రంగా తిను" అన్నారు భగవాన్. ఆ మాటకు దానికి రోషం వచ్చి, భగవాన్ని చెంప మీద కొట్టింది. ఆ తర్వాత భగవాన్ దాన్ని కొన్నాళ్ళు తన తొడ మీద కూర్చోనివ్వలేదు. అది పశ్చాత్తాపపడి, భగవాన్ని బ్రతిమాలింది, ప్రార్థించింది. అది ఆయన దగ్గరకు వెళ్ళి, మనుష్యులు మాదిరిగా గెడ్డం పట్టుకుని బ్రతిమాలింది, ప్రాధేయ పడింది. చివరికి అది ఆయన అనుగ్రహం పొంది, మళ్ళా ఆయన తొడపై కూర్చోవడం ఆరంభించింది. నొండి అంటే భగవాన్‌కి ఎంతో ప్రేమ.

* * *

భగవాన్ స్కందాశ్రమంలో వున్నప్పుడు ఒక రోజున కొందరు భక్తులు ఆయన చుట్టూ కూర్చుని వున్నారు. అంతలో ఒక ముంగిస వచ్చి, భగవాన్ తొడమీద నిర్భయంగా కూర్చున్నది. దాన్ని చూస్తో, "వీరు ఎందుకు వచ్చారో, ఎవరికి తెలుసు? ఇది సామాన్యమైనది కాదు" అన్నారు.

భగవాన్ పాముల్ని చంపనిచ్చేవారు కాదు. "మనం వాటి స్థానంలోకి వచ్చాం. వాటిని బాధించడానికీ, చంపడానికీ, కనీసం వాటిని కదల్చడానికీ, ఏం చెయ్యడానికీ మనకు హక్కులేదు. అవి మనల్ని తొందర పెట్టవు" అన్నారు.

* * *

1924 ప్రాంతంలో శ్రీరమణాశ్రమంలో నాలుగు కుక్కలు వుండేవి. భగవాన్ చేత్తో తిండి పెడితేనేగాని, అవి తినేవిగావు. వాటిల్లో ఒక దాని పేరు "కమల". "కమలా, ఈ కొత్తవారిని గిరి ప్రదక్షిణం తీసుకువెళ్ళు" అని భగవాన్ చెపితే, అది వారి వెంట తొమ్మిది మైళ్ళూ గిరి ప్రదక్షిణం వెళ్ళి గిరి చుట్టూ వున్న ఆలయాల్ని, గోపురాల్ని, కొలనుల్ని, మండపాల్ని, తీర్థాల్ని విగ్రహాల్ని చూపించి తీసుకొచ్చేది. అది అన్నింటికంటే పెద్ద కుక్క. దాని సంతతే ఆశ్రమంలో వుండేవి. అది స్కందాశ్రమానికి చిన్న పిల్లగా వచ్చింది. అప్పటి ఆశ్రమవాసులు దాన్ని తరిమెయ్యాలని చూశారు. "ఎందుకంటే, అది ఆడకుక్క. ప్రతి సంవత్సరం పిల్లల్ని పెడుతుంది. చికాకు కలిగిస్తుంది" అనే నెపంతో. కాని, అది భగవాన్ని వదిలి పోలేదు. అది అక్కడే స్థిరపడింది. ఆశ్రమంలో దాని సంతతే నిలిచింది.

"చిరుకరప్పన్" అనే ఓ నల్ల కుక్క వుండేది. అది అందరితో స్నేహంగా, ప్రేమగా వున్నట్లే, ఆశ్రమానికి వచ్చే ప్రతి కొత్తవారితోనూ అంత ప్రేమగా, స్నేహంగా, చనువుగా వుండేది. అది ఒకసారి ఆశ్రమానికి కొత్తగా వచ్చిన ఒక చాదస్తపు బ్రాహ్మణుని దగ్గరకు వెళ్ళింది. అప్పుడు ఆయన జపం చేసుకుంటున్నారు, మడి కట్టుకుని. ఆయన దాన్ని భరించలేక

కర్రతో కొట్టారు. ఆ కుక్క అభిమానంతో వెళ్ళి, మళ్ళా ఆశ్రమానికి తిరిగి రాలేదు. దాని మనసు అంత సున్నితం. ఇంకో సారి పలనిస్వామి ఓ కుక్కను కొడితే, అది వెళ్ళి కొలనులో పడి ఆత్మహత్య చేసుకుంది.

శ్రీరమణాశ్రమం ఏర్పడ్డాక భగవాన్ భోజన సమయంలో మొదట కుక్కలకు అన్నంపెట్టమనేవారు.తర్వాత ఎవరైనా భిక్షకులు వస్తే, వారికి భోజనం పెట్టాలి. చివరకు మిగిలింది ఆశ్రమవాసులు తినాలి.

* * *

బరోడా మహారాణిగారు శ్రీ రమణాశ్రమానికి రెండు తెల్ల నెమళ్ళు పంపించారు. వాటికి పెట్టే మామిడి పళ్ళు సరిగ్గా పండాయో, లేదో భగవాన్ స్వయంగా రుచి చూసి, వాటికి పెట్టించేవారు. ఒక్క ఆ నెమళ్ళ మీదనే కాదు, ఆయనకు అన్నింటిపైనా అంత శ్రద్ధే, ప్రేమే! ఆయన ఆ నెమళ్ళ అరుపుల్ని అనుకరించి వాటిని పిలిచేవారు.

* * *

భగవాన్ రోజూ ఉదయం, సాయంత్రం కొండ మీదకు వెళ్ళేవారు. దారిలో కన్పించిన జంతువుల్ని, పక్షుల్ని శ్రద్ధగా పరిశీలించేవారు. ఆయన అమృతహస్తం కింద ఎన్నో కుక్కలు, కోతులు, ఉడతలు, రక్షణ తీసుకుని, శాంతి పొందాయి. ఒక రోజున భగవాన్ కొండదిగి ఆశ్రమానికి వస్తోవుంటే, ఓ కుక్క ఉడతను తరుముతోంది. ఆయన ఆ కుక్కను ఆపబోయి బోర్లాపడ్డారు. చేతి ఎముక విరిగింది. కుక్క పారిపోయింది. ఉడత రక్షింపబడింది. జంతువులు ఆయన అనుగ్రహాన్ని చాలా సులభంగా సంపాదించేవి. ఆయన ప్రేమను చవి చూసేవి. ఆయన అమృత హస్తం కింద సురక్షితంగా వుండేవి.

* * *

ఆశ్రమం హాలులో భగవాన్ సోఫామీద కూర్చుంటే, కిటికీలోంచి ఉడతలు సోఫామీదికి దూకేవి. ఆయన వాటికి వేరుశనగ గింజలు, పప్పులూ మొరమొరాలు పెట్టేవారు. ఒక్కోసారి అవి ఆయన చేతుల్లోంచి పప్పులూ అవీ తీసుకుని, తినేవి. భగవాన్ వాటికోసం పప్పులు, గింజలు డబ్బాల్లో పోసి దగ్గర పెట్టుకునేవారు.

భగవాన్ పశు - పక్ష్యాదులయందే కాదు, చెట్లయందూ అంత ప్రేమ, దయ చూపేవారు. ఒకసారి ఒక భక్తురాలు వచ్చి, గొప్పగా, "నేను లక్ష పత్రి పూజ చేశాను" అన్నది. దానికి భగవాన్ వెంటనే "అంతకన్నా నిన్ను నువ్వు లక్షసార్లు గిల్లుకోక పోయినావా?" అన్నారు.

ఒక రోజున చీకటి పడేవేళ ఒకతను మర్నాడు ఉదయం పళ్ళు తోముకునేందుకు పందుప్పుల్ల కోసం చెట్టు విరుస్తోంటే, భగవాన్ చూసి "దాన్ని హాయిగా నిద్రపోనివ్వరా" అని కోప్పడ్డారు.

ఒకసారి ఒకతను ఇనుప కొంకెతో కొబ్బరికాయలు లాగుతూ వుంటే, భగవాన్ చూసి, "నీ జుట్టు పీకితే, నీకు బాధ కాదా" అని చివాట్లువేసి, తరిమేశారు.

* * *

"కుమార మంగళం" అనే ఊళ్ళో "అరుణాచలం పిళ్ళై" అనే ఆయన వున్నారు. ఆయనకు ఒక కల వచ్చింది. "నీ ఆవుకు పుట్టబోయే దూడను శ్రీ రమణాశ్రమానికి అర్పించు" అని. అతడాప్రకారం ఆ దూడను ఆశ్రమానికి తోలుకొచ్చాడు. ఆశ్రమం వారికి తన కల చెప్పాడు. కాని, ఆశ్రమ ప్రాంతం అడవి కావడం చేత, అప్పుడప్పుడూ పులులూ, చిరుతలూ తిరుగుతూ

వుండేవి. అదీకాక ఆశ్రమం ఆవులకోసం ప్రత్యేకంగా ఒక శాల అంటూ లేదు. అందుచేత "దీన్ని చూసుకోవడం మాచేత కాదు" అన్నారు. కాని, అతను "నాకు కల వచ్చింది. దీన్ని ఇక్కడే వదిలి వెడతాను" అన్నాడు. అతడు బతిమాలగా రామనాథ దీక్షితార్ "దీన్ని నేను చూసుకుంటాను" అన్నారు. అరుణాచలం పెళ్ళి ఆ దూడను ఆశ్రమంలో వదలి వెళ్ళిపోయాడు.

మూడు నెలల తర్వాత ఆ దూడను ఊళ్ళో ఒకతనికి ఇచ్చి మేపమన్నారు; అది పెరిగి, పెద్దదై దూడల్ని పెట్టేవరకు అదే గోలక్ష్మి. ఒక సంవత్సరం దాటాకా, దాన్ని భగవాన్‌కి చూప డానికి ఆశ్రమానికి తీసుకొచ్చారు. అది ఏ సంకోచం, భయం లేకుండా చిన్నపిల్ల మాదిరిగా భగవాన్ వున్న హాల్లోకి వెళ్ళి, ఆయన్ని చూసి వచ్చింది. ఆ విధంగా అది రోజూ భగవాన్ దర్శనం చేసుకునేది. ఆయనా దానికి ఏదో ఒకటి తినడానికి పెట్టేవారు. ఆరోజుల్లో బి. వి. నరసింహస్వామి భగవాన్ జీవిత చరిత్ర రాస్తు న్నారు. లక్ష్మి నిండుచూలాలు. లక్ష్మి కన్న తర్వాత తల్లిని, బిడ్డను ఆశ్రమానికి తీసుకొచ్చారు.

అప్పటినుంచి లక్ష్మి ఆశ్రమంలో స్థిరపడింది. ఆ తర్వాత అది ఎన్నో దూడల్ని పెట్టింది. కాని, మూడు దూడలు మాత్రం సరిగ్గా భగవాన్ జయంతి రోజునే పుట్టాయి. గోశాల కట్టి దానికి గోలక్ష్మి చేత ప్రారంభోత్సవం చేయించాలనుకుంటే, ఎప్పుడూ ఆశ్రమం వదిలి వెళ్ళని లక్ష్మి, ఆరోజు ఎటో తప్పుకుని ముహూర్తం సమయం దాటాక, భగవాన్ వెనుక నెమ్మదిగా గోశాలలో ప్రవేశించింది. ఇప్పటికీ ఆశ్రమంలో లక్ష్మి సంతతి వుంది.

హంఫ్రీస్ తర్వాత భగవాన్ దర్శనానికి వచ్చిన యూరో పియన్ పాల్ బ్రంటన్. ఆయన అసలు పేరు "రాఫెల్ హర్ట్స్". ఆయన లండన్‌లో "ఘోరం" అనే పత్రికకు గ్రంథవిమర్శకుడుగా పనిచేసేవారు. ఆయనకు మొదటి నుంచీ గుప్తవిద్యను అభ్యసించా లనే అభిలాష వుండేది. ఆయన దివ్యజ్ఞాన సమాజంలో చేరి, రెండేళ్ళు వుండి, ఫలితం కనుపించక 1930 ప్రాంతంలో తూర్పు దేశాలు తిరిగి, సాధువుల్ని, మహర్షుల్ని, ఫకీర్లనీ దర్శించారు. ఆ సందర్భంలో ఇండియా వచ్చి, ఎందరో మహాత్ముల్ని, మహర్షుల్ని, యోగుల్ని, పీఠాధిపతుల్ని దర్శించారు. ఆ సంచార జీవితాను భవాన్ని " A SEARCH IN SECRET INDIA " అనే గ్రంథంగా తయారు చేశారు. ఆ గ్రంథంలో భగవాన్ రమణ మహర్షి గురించి అత్యద్భుతంగా, సాటిలేని సద్గురువుగా వర్ణించారు. ఆ గ్రంథం చదివి, ఎందరో పాశ్చాత్త్యులు భగవాన్ దర్శనం చేసుకున్నారు. ఇప్పటికీ వచ్చి, ఆశ్రమాన్ని దర్శిస్తున్నారు.

బ్రంటన్ శ్రీరమణాశ్రమానికి వచ్చిన సమయానికి మహర్షి సహజశాంత దృష్టితో మౌనంగా కూర్చున్నారు. బ్రంటన్ భగవాన్‌కి నమస్కారం చేసి, ఎదురుగా కూర్చున్నారు. భగవాన్ ముందు ఇంకా చాలామంది భక్తులు కూర్చుని వున్నారు. స్వామి మౌనం వాక్కుకన్నా శక్తివంతమైనదని బ్రింటన్ మొదట గ్రహించారు. బ్రంటన్ తన అనుభవాన్ని ఇట్లా వర్ణించారు:

"నేను భగవాన్ని చూడగానే ఆయన్నించి కళ్ళు తిప్పుకో లేకపోయాను. ఆయన చూపు గొప్ప కాంతిగా, నన్ను చుట్టేసింది. ఆయన ఉనికి ఒక జీవనదిగా నా పక్కనుంచి ప్రవహిస్తున్నట్లుంది. నన్ను సదా వేధించే నా బుద్ధి, ఆయన సమక్షంలో ఓ స్థిరమైన నిశ్చయమైన స్థితికి వచ్చింది. నా మనసు మీద భగవాన్ మౌన ముద్ర గట్టిగా పడింది. అంతకు రెండుగంటలు ముందు నేను రైల్లో తయారు చేసుకున్న ప్రశ్నల జాబితా ఆయన దర్శనంతో

నా మనసులోంచి ఎగిరిపోయింది.'' స్వామి సన్నిధిలో తన మనసు లోంచి వేదనలు క్రమంగా తొలగి, హృదయంలో శాంతి ఆవరించిన అనుభూతి తనకు కలిగినట్లే, నిత్యం మహర్షి సన్నిధిలో భక్తులు శాంతి, ఆనందం పొందుతూ వుంటారని బ్రంటన్ అనుకున్నారు.

1936లో "ప్రపంచ పరిస్థితులు ఏమీ బావుండని కారణంచేత, ప్రపంచ భవిష్యత్తు గురించి తమ అభిప్రాయం చెపుతారా" అని భగవాన్ని అడిగారు బ్రంటన్.

భగవాన్ :- భవిష్యత్తు కోసం ఎందుకు గొడవ పడతారు? వర్తమానమే మీకు సరిగ్గా తెలియదు కదా? ముందు వర్తమానం విషయంలో జాగ్రత్త తీసుకోండి.

బ్రంటన్ :- ముందు కాలంలో ప్రపంచం స్నేహ, సౌభ్రాతృత్వాలతో వుండబోతోందా? లేక, యుద్ధాలతో అయోమయ స్థితిలో పడబోతోందా?

భగవాన్ :- ప్రపంచాన్ని పాలించేవారు ఒకరు వున్నారు. అది ఆయన బాధ్యత. ప్రపంచానికి జీవితాన్ని ఇచ్చిన ఆయనకు, దాన్ని ఏ విధంగా చూసుకోవాలో తెలియదా? ఈ ప్రపంచ భారం మోసేది ఆయన కాని, మీరు కాదు కదా ?

ప్రపంచం మీ వంటిదే. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోనిది, ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నించడం, ఏం ప్రయోజనం? ప్రజలు ఈ విధంగా, నిష్కారణంగా, అనవసరంగా అర్థం లేని సమస్యలతో, ప్రశ్నలతో ముందుకాలంలోని సత్యాన్ని తెలుసుకోవాలని తమ శక్తినంతా వృధా చేసుకుంటారు.

ప్రపంచంలో నువ్వు ఒక భాగం. మన పురోభివృద్ధే, ప్రపంచ పురోభివృద్ధి. మనని మనం అవగాహన చేసుకోకుండా, ప్రపంచాన్ని అవగాహన చేసుకోవాలనుకోవడం, అర్థంలేని సంగతి. ఆత్మజ్ఞానం లేని, ప్రపంచజ్ఞానం, నిష్ప్రయోజనం. నీ లోపలికి మునుగు. దాగివున్న నిధుల్ని కనుక్కో. హృదయ కవాటాన్ని తెరు. మనోనేత్రంతో ప్రపంచాన్ని చూడు. మాయ తెరను చించెయ్యి. ఆత్మను దర్శించు.

ప్రపంచం ఒక భావన. లేదా, విశ్వతేజస్సులో కదిలి, సాగే ఒక నీడ. దాన్ని దర్శించాలంటే, కాంతి కావాలి. కాని, దాన్ని చూసి తెలుసుకునేందుకూ, దాని గురించి యోచించేందుకూ అది అంత ప్రత్యేకమైనదీ, ముఖ్యమైనదీ కాదు.

"ప్రపంచం వాస్తవమా? కాదా?" అని గొడవ పడటం వలన ఏం లాభం? ప్రపంచం, ఒక విధంగా వాస్తవం. ఇంకో విధంగా అవాస్తవం. అది రెండూనూ. ఆత్మ అంత వాస్తవంగా ప్రపంచమూ గోచరమౌతుంది. ప్రపంచం గోచరమయ్యేదే కాని, వాస్తవంగా అది లేదు. అసలు దానికో ఉనికి లేదు. ఎందుకంటే, ఆత్మ ఎప్పటికీ ప్రపంచంగా కాలేదు; తాడు ఎప్పటికీ పాము కానట్లు. అది కేవలం రజ్జు-సర్ప భ్రాంతి వంటిదే! కాని, ప్రపంచం అనే భ్రాంతి వెనుక, అసలు వాస్తవం ఒకటి వుంది. ఆ సంగతి మరచిపోకూడదు. అదే ఆత్మ.

మనని మనం తెలుసుకోకుండా, ప్రపంచం వాస్తవమని నిరూపించాలని చూస్తే, ప్రపంచం మనల్ని బాగా ఎగతాళి చేస్తుంది; "మీ సంగతి మీరు

తెలుసుకోకుండా నా సంగతి యోచిస్తున్నారా?"
అని. మనని మనం తెలుసుకోలేదని మనం తెలుసు
కుంటే, మనకు ప్రపంచం తెలుసునని ఎట్లా
నటించగలం ?

ప్రపంచమంటే పంచేంద్రియాల జ్ఞానం. ఇంద్రియాల తాలూకు వస్తుసముదాయమే ప్రపంచం. ఆ ఇంద్రియజ్ఞానానికి, పంచేంద్రియాల ద్వారా ఎరుకలో వుండేది మనసు. అందుచేత ప్రపంచం, మనసూ విడికాదు, భిన్నమూ కాదు.

ప్రపంచం వుందంటున్నాం. కాని, నిద్రలో మనం లేము. ప్రపంచమూలేదు. మేల్కొగానే మనమూ, ప్రపంచం పుట్టడం జరుగుతోంది. నిద్రపోతున్నప్పుడు మన ఎరుకలో ప్రపంచం లేకపోయినా, ప్రపంచం వుంది. ఆ సంగతి తక్కినవారు మనం మేల్కొగానే చెపుతారు. నిద్రలో ఆ తక్కినవారూ లేరు. వారూ ప్రపంచం వుందనీ చెప్పలేదు.

"ప్రపంచంలో నువ్వు వున్నావా ? లేక, ప్రపంచం నీలో వుందా?" అని అడిగితే, సర్వసాధారణంగా, "నేను ప్రపంచంలో వున్నాను" అంటారు. కాని, అది పొరపాటు. ప్రపంచం మనకు విడిగా వుండి, మనం మేల్కొగానే అది మన దగ్గరకు వచ్చి, "నేనున్నాను" అని అంటుందా? అలా అనదు. కనుక అది మన మనోకల్పితం.

ప్రపంచమంటే, దిగంతరాళంలో విరివిగా పరచుకొన్న విషయాలు. విషయమంటే, రూప - చైతన్యాల కూడిక. ప్రపంచంలోని రూపాలూ, వాటిని చూసి, తీసుకునే మన చైతన్యం కలసినదే విషయం. నూలు లేక వస్త్రం లేనట్లు, నువ్వు లేక విషయాలు లేవు. మన స్థితి చిరంతన నిద్రలోని స్వప్నం మాత్రమే! అందు ప్రపంచాన్ని, విషయాన్ని, వ్యవహారాన్ని

కలలుకంటూ అందరూ, ఎప్పుడూ ఆ నిద్రలోనే వున్నారన్న సంగతి మనకు అనుభవపూర్వకంగా అర్థమైతే, అసలు సత్యం, అర్థమౌతుంది.

పాల్ బ్రంటన్ అడిగిన మరికొన్ని ప్రశ్నలకు భగవాన్ ఇచ్చిన సమాధానాలు :

బ్రంటన్ :- స్వామీ, నేను ఎన్నో చూశాను. ఎన్నో గ్రంథాలు చదివాను. ఎన్నో సంగతులు, విషయాలు తెలుసుకున్నాను. ఎందరో మహానుభావుల్ని దర్శించాను. కొన్ని సాధనలూ చేశాను. ఈ జీవితం కాక, ఇంకా ఏదైనా వుందా?

భగవాన్ :- " నేను చూశాను, నేను చేశాను" అని అంటున్నారే, ఆ " నేను " ఎవరో ముందు చెప్పండి ?

బ్రంటన్ :- మీ ప్రశ్న నాకు అర్థం కాలేదు.

భగవాన్ :- అర్థం కాలేదా? బాగా యోచించండి.

బ్రంటన్ :- ఆలోచించి, ఆలోచించి తన పేరు చెప్పారు.

భగవాన్ :- " బ్రంటన్ " అనే ఆయన మీకు నిజంగా, బాగా తెలుసా ?

బ్రంటన్ :- ఓ, చాలా బాగా తెలుసు.

భగవాన్ :- దేహానికి సంబంధించినంతవరకే తెలుసు. కాని, అసలు మీరెవరో ఆలోచించండి.

బ్రంటన్ :- తికమకలో పడ్డారు.

భగవాన్ ;- మొదట ఆ "నేను" అనేది, ఎవరో, ఏమిటో తెలుసుకోండి. ఆ తర్వాత తత్వమంతా అర్థమౌతుంది. మిమ్మల్ని మీరు సరిగ్గా తెలుసుకుంటే, అన్ని ప్రశ్నలూ, సమస్యలూ, సందేహాలూ, సంశయాలు పరిష్కారమౌతాయి.

బ్రంటన్ :- ఏం చెయ్యాలి? ఎట్లా చెయ్యాలి?

* భగవాన్ :- లోదృష్టితో ధ్యానం చేయాలి.

బ్రంటన్ :- ధ్యానం చేశాను. అభివృద్ధి కనపడలేదు.

భగవాన్ :- అది కంటికి కనుపించేది కాదు. ఆలోచనకు సైతం అందేదీ కాదు.

బ్రంటన్ :- దానికి గురువు సహాయం కావాలా?

భగవాన్ :- గురువు వల్ల సహాయం జరుగుతుంది.

బ్రంటన్ :- ఎంత కాలానికి?

భగవాన్ :- "ఎంతకాలానికి?" అనేది సాధకుని, జిజ్ఞాసువుని పరిపక్వస్థితి మీద ఆధారపడి వుంటుంది. తుపాకి మందు అంటుకోవడానికి, క్షణకాలం పడుతుంది. ఆ మందు తయారు చేసి, తుపాకిలో కూరడానికి చాలా కాలం పడుతుంది.

బంట్రన్ :- దానివల్ల లాభం ఏమిటి?

భగవాన్ :- చేయగా,చేయగా అన్నింటి సంబంధంలో ఒక విధమైన మార్పు వస్తుంది. అప్పుడు మీరు చేసే పనులు మీరు చేసే ధ్యానాన్ని అనుసరించజూస్తాయి.

బ్రంటన్ :- ప్రపంచ సంబంధాలతో జీవితం గడుపుతూ, నిస్వార్థంగా వుండటం ఎట్లా సాధ్యం?

భగవాన్ :- పనికీ, ధ్యానానికీ మధ్య ఘర్షణ లేదు.

బ్రంటన్ :- నిత్య జీవిత కార్య కలాపాలను యదా విధి, నిర్వర్తిస్తూ అదే సమయంలో ముక్తి పొందటం సాధ్యమా?

---

* "కర్మ జీవనాన్ని పరిత్యజించవలసిన పని లేదు. రోజూ ఒకటి రెండు గంటలు ధ్యానం చేస్తూ, నిత్యజీవిత కార్యక్రమాల్ని నిర్విఘ్నంగా సాగించుకోవచ్చు" అన్నారు భగవాన్.

భగవాన్ :- ఎందుకు సాధ్యం కాదు? కాని, సాధకుడు సత్య సందర్శనం అయ్యేంతవరకు క్రమంగా పరిణామం చెందుతాడు. ఆ సత్యం, ఈ "నేను" అనే దానికి అతీతంగా వుంది. ఆ సత్యమే, చిత్. అదే ఈశ్వరుడు- జ్ఞానం - ముక్తి - ఆత్మ. అన్నీ, అంతా అదే! అదే "అసలు నేను". ఉన్నదీ అది ఒక్కటే.

బ్రంటన్ :- సత్యాత్మను వర్ణించండి.

భగవాన్ :- మీరు నన్ను సత్యాత్మను వర్ణించమని అడుగుతున్నారు. నేను ఎట్లా వర్ణించి చెప్పగలను? ఆత్మలోంచి, వ్యక్తిగతమైన "నేను" పుట్టి, తిరిగి అది అందే అదృశ్యమౌతుంది. ఆ "నేనే" "మిథ్యానేను".

అవును, ఆ మిథ్యానేను అదృశ్యమౌతుంది. అన్ని తలంపులకూ మూలం ఆ "నేనే". అదే ప్రథమ తలంపు. "నేను" అనే ఆ ప్రథమ తలంపు పుట్టిన తర్వాతే, తక్కిన ఆలోచనలు పుడతాయి. అంతే "నేను" అనే ప్రథమ పురుష పుట్టిన తర్వాత "నువ్వు" అనే ద్వితీయ పురుష, పుడుతుంది. ఆ తర్వాత "వాడు—అది" అట్లా పుడతాయి, అనంతంగా.

మీరు జాగ్రత్తగా 'నేను' అనే ఆ మొదటి ఆలోచన కొస పట్టుకుని, దాన్ని అనుసరిస్తూ, వెంబడిస్తూ, అన్వేషిస్తూ వెళ్ళారా, అది గతిలేక, వెనక్కి తిరిగి, జన్మ స్థానం చేరి, అక్కడ అదృశ్యమౌతుంది. ఆ జన్మస్థానమే చిత్ లేక ఆత్మ. అదే "అసలు నేను". దీనన్నంతా అనుభవంలో తెలుసుకోవలసిందే కాని, మాటల్లో చెప్పడం, అర్థం చేసుకోవడం కష్టం.

కానీ, ఈ సాధన ప్రతి ఒక్కరికీ సాధ్యమే. 'నేను' అనేది నశించేవరకూ ప్రతిక్షణం, ప్రతి ఒక్కరూ అంతర్ముఖులై, విడవకుండా విచారణ చేయవలసిందే! 'నేను' నాశనంకావడమంటే, వ్యక్తిత్వం నశించడం కాదు. దానివలన మనిషి చైతన్య విహీనుడూ, వివేకశూన్యుడూ కావడం కాదు. విగ్రహం మాదిరిగా మారిపోవడమూ కాదు. అతడు మహాజ్ఞానియై, శాశ్వత జ్ఞానాన్ని పొందటం. అదే సహజస్థితి.

'నేను' అనే ప్రత్యేక భావం, బుద్ధికి — దేహానికీ! సంబంధించింది. కాని, ఆ "నేను" తెలుసుకున్న తర్వాత, అతని అంతరాంతరాలాల్లోంచి అనూహ్యమైన మానవాతీతమైన, కాల — దూరాలకు మించిన ఓ నూతన శక్తి పెల్లుబికి, అతన్ని వశపరచుకుంటుంది. ఆ శక్తి, అతని ఉనికిలో కేంద్రీకృతమై వుంటుంది. ఆ శక్తి, అనంతం—అది అవినాశి, అదే దివ్యత్వం—శాశ్వతం. దాన్నే కొందరు "ఈశ్వర రాజ్యం" అన్నారు. కొందరు "ఆత్మ" అన్నారు. హిందువులు "మోక్షం" అన్నారు. మరి కొందరు నిర్వాణమన్నారు. దానికి మీరు మీ ఇష్టం వచ్చిన పేరు పెట్టుకోవచ్చు. ఆ అనుభవం కలిగినవారు, తమని తాము ఏమాత్రం పోగొట్టుకోరు. తమని తాము తెలుసుకుంటారు.

"నే నెవడను?" అను విచారణ చేయకపోతే, జీవితంతో అడుగడుగునా సంశయం, అనిశ్చయం తలెత్తుతాయి. దానితో లోకవిచారణ చోటుచేసుకుంటుంది. తమను తాము ఏమాత్రం

పాలించుకోలేమని తమ హృదయాంతరాళంలో తమకు స్పష్టంగా తెలిసినా రాజులు, రాజకీయ నాయకులు ప్రజల్ని పాలించ యత్నిస్తూనే వున్నారు. తమను తాము తెలుసుకోలేనిది, ఎన్ని చేసి, ఏం తెలుసుకునీ ప్రయోజనం లేదు. ఆత్మ విచారణ మానేస్తే ఇంక చెయ్యడానికి ఉత్కృష్టమైన కార్యం ఏముంటుంది?

* * *

భగవాన్ మితభాషే కాదు, చాలావరకు మౌనంగా వుండేవారు. ఆయన చుట్టూ చేరినవారు ప్రాధేయపడినా, పడిగాపులు పడివున్నా, ప్రార్థించినా పలికేవారు కాదు. దృష్టి నిలిపి చూసేవారూ కాదు. కాని, ఆయన ఏనాడూ మౌనవ్రతం పూనలేదు. మనిషి మాట్లాడటానికి మొదటినుంచీ బాగా అలవాటు పడి "మౌనం" అనేటప్పటికి ఆశ్చర్యంతో నిస్తబ్ధుడౌతాడు. మనిషి ఒక యంత్రం వంటివాడు. యంత్రంలో మాదిరి అతనిలో ఎన్నో విడి, విడి భాగాలుంటాయి. అవన్నీ కలిసి పనిచేస్తాయి. వాటిల్లో మాట్లాడే భాగం ఒకటి. చాలామంది ఆ భాగాన్ని ఎక్కువగా ఉపయోగించుకుంటారు. చాలామందికి దేహ అవయవ భాగాల్ని, ఆయా కేంద్రాల్ని సక్రమంగా ఉపయోగించుకోవడం చేతకాదు. అవయవాలచేత ఎక్కువగానైనా పనిచేయిస్తారు, లేదా - వాటిని సోమరిగానైనా వదిలేస్తారు. ఆ రెండు పద్ధతులూ మనకు అపకారమే చేస్తాయి. దేహ అవయవాలనన్నింటినీ సమంగా ఉపయోగించుకున్నప్పుడే, అవి చివరివరకు సక్రమంగా పనిచేస్తాయి. ఓ భాగాన్ని ఎక్కువగా ఉపయోగించుకుంటే, కొంత శక్తి వృథాగా నష్టమౌతుంది. ఆ విధంగా మనలోని శక్తిని వృథాగా పాడు చేసుకోకూడదు. అవసరమైనంతవరకే శక్తిని ఖర్చుచేసి, దేహ యంత్రాన్ని కాపాడుకోవాలి.

మౌనం ఇచ్ఛాశక్తిని పెంచుతుంది. మౌనంగా వుండటం ప్రతి మహాత్ముని అభీష్టమే. కాని కొందరు ప్రజలకు స్వరూపా నందాన్ని కలుగజేసే యత్నంలో రచనలు చేస్తారు - ఉపన్యాసాలు ఇస్తారు- బోధిస్తారు- ఉపదేశిస్తారు. దీక్షలు ఇస్తారు. ఒక్కొక్కరిది ఒక్కొక్క విధం.

భగవాన్ అవసరమైనప్పుడు మాట్లాడేవారు. తక్కిన సమయాల్లో ఆయన మౌనం ఉన్నతంగా, శక్తివంతంగా, దివ్యంగా వెలిగేది. ఆయన మౌనంగా వున్నప్పుడు క్షణాలు గడిచేకొద్దీ అందరిలో ఆ మౌనం; శక్తివంతంగా, సంతోషదాయకంగా, శాంతమయంగా, ఆనందంగా, బలీయంగా, లోతుగా నరనరాల్లోకి ఇంకేది. మరో మాట, ఆలోచన, చేతన లేక, ఆయన సమక్షంలో వున్నవారు నిశ్చలురు అయ్యేవారు. అదే ఆయన అనుగ్రహంగా భావించేవారు, కొందరు. అందుచేత ఆయన సమక్షంలో అందరూ ఆనందంతో సంతోషంతో, నవ్వుతూ కాలం గడిపేవారు. ఆయన ఎప్పుడూ మౌనంతో ముడుచుకుని కూర్చోలేదు. అడిగిన వారికి అర్హతను బట్టి, అవసరమైనప్పుడు సమాధానాలు ఇచ్చేవారు. ఒక్కొసారి ఆయనే కల్పించుకుని కబుర్లూ, కథలూ, సంగతులూ, అనుభవాలూ చెప్పేవారు.

కాని అన్నింటిలోకీ అత్యుత్తమమైనది, మౌనం. అదే ఉత్తమమైన అధ్యాత్మికోపదేశం. తక్కిన ఉపదేశాలన్నీ దాన్నించి వచ్చినవే. అదే మొదటి ఉపదేశం. మౌనమే మొదటి రూపం, ఆ మౌనోపదేశాన్ని పొందగలిగేది, పూర్ణపరిణతుడు ఒక్కడే! ఇతరులు దానివల్ల పూర్ణప్రబోధం పొందలేరు. అట్టివారికి వివరణ అవసరం. వివరణకు మాటలు కావాలి. కాని, సత్యం మాటల్లో వర్ణింప శక్యంకాదు. దానికి వివరణ అసాధ్యం. మనం చేయగలి గింది, సత్యాన్ని సూచించగలం. అంతే!

భగవాన్ చాలామందికి మౌనోపదేశం చేశారంటారు. జ్ఞానమార్గంలో మౌనబోధ సహజమే! భగవాన్ మౌనంతో బోధించారంటే, అడిగినవాళ్ళకు మాటల్లో చెప్పడం ఇష్టంలేక అని కాదు. ఆయన ఎప్పుడూ అడిగిన దానికి సమాధానం చెప్పారే కాని, ప్రత్యేకించి ఒక పద్ధతిని, ఒక సిద్ధాంతాన్ని ఇవ్వలేదు. ఎందుకంటే, మాటలతో, శాస్త్ర వచనాలతో ఓ పద్ధతి ప్రకారం వివరించి చెప్పడం, వ్యాఖ్యానించడం నిజమైన బోధ కాదు. అది కేవలం అసలు దానికి ఉపక్రమణ మాత్రమే అవుతుంది. అర్థం చేసుకోవడానికి అవి సులభంగా కనుపించినా, హృదయ కవాటాన్ని ఏ మాత్రం తెరవలేవు. గురువు మౌనంగా వుంటే, అన్వేషకుని - సాధకుని - శిష్యుని మనసు దానికదే నిశ్చలం, నిర్మలం, పవిత్రం అవుతుంది. కాని, మౌనం పరమోపదేశ మన్నది అందరికీ కాదు, కొందరికే.

అద్వైత మార్గంలో ఆది గురువు దక్షిణామూర్తి, స్థిరంగా కూర్చుని, తన్నర్థించిన వారికి మౌనంగా జ్ఞానబోధ చేశారు. ఆ తర్వాత కాలంలో చాలామందికి మౌన భాష తెలియకపోవడం వల్ల, అద్వైత సిద్ధాంతాన్ని శంకరాచార్యులవారు ప్రచారం చేసి బోధించారు. ఈ కాలానికి సరిపడే గురువు, భగవాన్ శ్రీ రమణ మహర్షులవారు. ఆయన దక్షిణామూర్తివలె స్థిరంగా కూర్చుని పూర్తి మౌనం వహించలేదు. శంకరులవలె తిరిగి బోధించనూ లేదు. ఆయనిది మధ్య మార్గం. అరుణాచలం దాటి ఎక్కడికీ వెళ్ళలేదు. ఉపన్యాసాలు, ప్రత్యేక ప్రబోధాలు, ఉపదేశాలూ, ఏమీ చేయలేదు. విస్తారంగా గ్రంథ రచనలూ చేయలేదు. చాలావరకు మౌనంగా వుండేవారు.

అద్వైత వాదం ప్రకారం, వర్తమానం కన్నా ముక్తీ - మోక్షం - నిర్వాణం అన్నీ, అంతా భ్రాంతే. అంటే, వర్తమానం కన్నా, ఏమీ లేదని అర్థం. "ఏమీ లేకపోతే, ఇదంతా ఎలా వచ్చింది?" అనే ప్రశ్న వస్తుంది. అసలు ఏమీలేని దాంట్లోంచి

ఏది మాత్రం పుడుతుంది? అంటే, "పుడుతుంది - పుట్టింది" అని అనుకోవడం కూడా భ్రాంతే! ఆ భ్రాంతే, మాయ. "మాయ" అనేది ఒక నిగూఢమైన శక్తి. అది అసలు సత్యాన్ని కప్పి, అసత్యాన్ని చూపుతుంది. "ఇదంతా ఏం లేదు; వుత్త శూన్యం - భ్రాంతి - మాయ. అసలు వున్నది ఒక్కటే. అది శాశ్వతమైనది - చావు, పుట్టుకలు లేనిది. అదే సత్యం" అనేదే అద్వైత సిద్ధాంతం.

"ఏమీ లేదు" అనే అద్వైత సిద్ధాంతం ప్రకారం, జీవుడు ఈశ్వరుడు, మాయ మొదలైన వాటికి కూడా అందు తావు లేదు. కానీ, అసాధ్యం, అసంభవం, అనూహ్యం, అపరిమితం అయిన చిద్వస్తువును ఈ మాయాశక్తి వాస్తవంగా, దృశ్య ప్రపంచంగా చూపుతుంది. ఆ ప్రపంచాన్ని వాస్తవమనుకోవడమే, మాయ. ఒకరి మాయ, మరొకరికి వాస్తవం కావచ్చు. మాయ స్వభావం అటువంటిది. మనసును జయిస్తేనే తప్ప, మాయ దాట తరంకాదు, ఆ మనసు కూడా అసలు వున్నస్థితిలోంచే పుట్టి, ఆలోచనల్ని రేపుతుంది. ఆ మనసు సృష్టే, ఈ ప్రపంచం. నిజం చెప్పాలంటే మాయే, మాయ. ఆ మాయ లేకపోతే, ప్రతీదీ వుత్త పేరు మాత్రమే అవుతుంది.

"మాయ" అంటే, ఈశ్వరశక్తి, లేదా, వాస్తవత్వం యొక్క క్రియాశక్తి. అదే విశ్వశక్తి. దాని మడతల్లోనే మనమంతా వున్నాం. అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చింది, గౌడపాదులు. అనేక వ్యాఖ్యలు రాసి, గౌడపాదులవారిని వెలుగులోకి తెచ్చింది శంకరులు. ఆ శంకరాచార్యులవారు "పరబ్రహ్మ సత్యం- ప్రపంచం మాయ- పరబ్రహ్మ, ప్రపంచం" అన్నారు. అందుచేత ఆయన్ని మాయావాది అన్నారు. కాని, ఆయన ప్రకారం మాయ- వాస్తవత్వం ఒక్కటే.

వాస్తవత్వమే, ఆత్మస్థితి. అది పవిత్రం, నిశ్చలం, నిర్మలం, అభేధం, శుద్ధ చైతన్యం. దానికి చావు, పుట్టుకలు లేవు. దానికి నాశనం లేదు, బంధం లేదు, ముక్తి లేదు, ఏమీలేదు. అది స్వయంప్రకాశం. దానికి ఉదయాస్తమయాలు లేవు. అది సాక్షి చైతన్యం. అది కాంతికి మూలం. దానికి నామరూపాలు లేవు. కాని, అది అనేక నామ రూపాలతో విలసిల్లుతోంది. ఆ నామ రూపాల్ని తీసేస్తే మిగిలేది శూన్యం.

నిర్గుణ పరబ్రహ్మ నుంచి చూస్తే, ద్వంద్వం లేదు. పరిమితం, అశాశ్వతం అనీ లేదు. కాని, ఈ భిన్నత్వం ఎలా ఏర్పడిందో తెలుసుకోవడం కష్టం. విచారణవల్ల వాటి వాస్తవత్వం వుత్త శూన్యమని తెలుసుకున్న మహాత్ములు వున్నారు.

అద్వైత సిద్ధాంతం మూడు ప్రమాణాలమీద నిలిచి వుంది. 1. లిఖిత పూర్వక గ్రంథాలు. 2. విచారణ-తర్కం. 3. అనుభవం. భగవాన్ మార్గం - అనుభవం. ఆయన స్వానుభవంతోనే చెప్పారు. అదే ఆయనకు ప్రమాణం. అది తక్కిన రెండు ప్రమాణాల్ని అంటే గ్రంథాల్ని, విచారణను ధృవపరుస్తుంది. భగవాన్‌కి కలిగింది అద్వైత భావం. శంకరాచార్యుల్ని చదివిన తర్వాత ఆ సంగతి ఆయనకు రూఢి అయింది.

"నేను దేహం", అనుకోవడం ద్వైతం. "నేను, దేహం కాదు" అనుకోవడం అద్వైతం. "నాకు ఆత్మ తెలియదు" అనే తప్పు అభిప్రాయంనుంచి తప్పుకోవడమే, ఆత్మ సాక్షాత్కారం. విశ్వరంగస్థలంపై వెలిగే జ్యోతే (జ్ఞానం) నటకునికీ, రంగస్థలానికీ, డైరెక్టరుకీ, మేనేజరుకీ, హాలుకీ, అంతకీ ఒకేసారి కాంతిని ప్రసాదించే దీపం. దాన్నే "పరబ్రహ్మ" అన్నారు భగవాన్. ఆట అయిపోయినా దీపకాంతి అట్లానే వుంటుంది- అందరిపై, అన్నింటిపై ఎప్పటి మాదిరిగా కాంతిని పడేస్తో. అందుకే భగవాన్

అనేవారు, "ప్రతి ఒక్కరూ నిశ్చయంగా ఆత్మే, ఆ చిత్తే, ఆ అనంతత్వమే", అని. ఎవరూ, ఎప్పుడూ ఆత్మనుంచి దూరంగా, విడిగా లేరు. ఎందుకంటే అసలు వున్నది ఆత్మ ఒక్కటే. అంటే, ప్రతి ఒక్కరూ ఆత్మను ఎరిగిన వారే. కాని, ఆ సంగతి వాళ్ళకు తెలియదు. అది చిత్రమైన సంగతి.

మాయతో కలిసిన ఉనికి తెలియడమే కాని, వేరే ఆత్మ సాక్షాత్కారమంటూ లేదు. ఎందుకంటే, ఆత్మే సత్యం. ఇంక దాన్ని తెలుసుకోవడమేమిటి? మనం చేయవలసింది, అవాస్తవాన్ని గుర్తించక పోవడం.

ఆత్మసాక్షాత్కారమూ ఒక భ్రాంతే. ఆ భ్రాంతి పోవడమే ఆత్మసిద్ధి. ఆత్మను పొందటం, తెలుసుకోవడం, దర్శించడం అనేది మాటల్లో ఉపమానంగానో అలంకారంతోనో చెప్పడమే అవుతుంది. మాటల్లో చెప్పబడేది, సత్యం కాదు. అయితే ఇంక ఆత్మను తెలుసుకోవడం ఎట్లా? అంటే, దానికి ఒకటే మార్గం వుంది. అది—హృదయంలో ప్రవేశించడం. హృదయమంటే, భౌతికమైన గుండె కాదు, ఆధ్యాత్మిక హృదయం. "నేను-నేను" అనే స్ఫురణ, ఆ హృదయంలోనే పుడుతుంది. ఎవరైనా తనను వ్యక్తపరచుకోడానికో, ప్రకటించుకోడానికో తన చేతినో, చూపుడు వ్రేలునో రొమ్ము కుడివైపున తనకు తెలియకుండానే వుంచి చెప్తారు, "నేను" అని. "నేను" అనేది నిరంతరం హృదయంలో ప్రకాశిస్తో వుంటుంది కనుక, అతనికి తెలిసో, తెలియకనో అతను చేతితో తన హృదయ స్థానాన్ని చూపుతాడు. "ఆత్మే, హృదయంలో "నేను" గా ప్రకాశిస్తోంది" అనే సంగతి అందరికీ అనుభవం కావడానికి, నమ్మకాలు- విశ్వాసాలు- మత గ్రంథాలు నియమ, నిష్ఠలు ఏమీ అవసరం లేదు. ప్రతి వారూ గాఢ నిద్రలో దాంట్లోనే ప్రవేశిస్తారు. మేల్కొన్న తర్వాత ద్వైత భావం కలుగుతుంది. కాని, ప్రతి వారికీ,

ప్రతి క్షణం ఆత్మ అనుభవేద్యమైనా, అజ్ఞానంవల్ల అద్వైతభావాన్ని అర్థం చేసుకోలేకపోతున్నారు. అందుకే శంకరులు అంటారు, "నువ్వు అన్నింటినీ కాదు, లేదు, అని నిరాకరించవచ్చు. కాని, నిన్ను నీవు నిరాకరించుకోలేవు. ఎందుకంటే, నువ్వే ఆత్మ స్వరూపానివి గనుక."

అంతటా ఎప్పుడూ వున్న దాన్ని కొత్తగా కనుక్కోవలసిందీ, తెలుసుకోవలసిందీ ఏమీ లేదు. కాని, మనం అహంకారంకొద్దీ, దాన్ని పొందాలని చూస్తాం. గట్టిగా యోచిస్తే, "అహంకారం" అని ఒకటి విడిగా లేదు, వుండదు; మనం అనుకుంటే తప్ప. ద్వంద్వ భావమే, భ్రాంతి. అద్వైతభావమే, సత్యం. అద్వైతం ఒక సిద్ధాంతం కాదు. అది అద్భుతమైన ఒక అనుభవం. దాని సందేశం - అది సందేశమైతే - "తర్కం వద్దు. అది పొంది, వూరికే వుండు". అదే భగవాన్ సందేశం.

ఊరికే వుండటమే, ఆత్మవిచారణ. అలా వుండటమే ఆత్మ స్థితి. అది జ్ఞాన-అజ్ఞానాలకు అతీతమైన స్థితి. అది దివ్య తేజస్సు. అది పూర్తి ఒంటరిది, స్వచ్ఛమైనది, మరక లేనిది, మకిలి లేనిది, మార్పు లేనిది. అదే చిత్ - స్ఫురణ. అందుకే "ఆత్మస్థితే, ఆనందం" అన్నారు భగవాన్.

ఎవరైనా ఆత్మ సాక్షాత్కారం పొందానన్నారంటే, ఆకాశంలో పక్షి పాద చిహ్నాల్ని చూశానన్నట్లు వుంటుంది. ద్వంద్వాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మంలో సమస్త చరాచరం ఇమిడివుంది. ఆ స్థితి, విస్తరించి శాశ్వతంగా మారకుండా నిలిచి పోయింది. ఆ పరబ్రహ్మ, జగత్తుకు కేంద్రం. అన్నింటిలో ఆ పరబ్రహ్మ "నేను" గా వుంది. కాబట్టి ఎవరైనా తమని

తాము తెలుసుకోదలిస్తే నిరంతర అన్వేషణతో ముందు ఆ "నేను" అనేది ఏమిటో తెలుసుకోవాలి. తానూ, ఆ పరబ్రహ్మ ఒకటేనని గుర్తించడం, ప్రతి ఒక్కరికీ సాధ్యమే. అదే నిజమైన, పవిత్రమైన అద్వైత సిద్ధాంతం.

* * *

ఈ సందర్భంలో భగవాన్ని కొందరు ప్రశ్నించారు:

ప్రశ్న :- "మీరు బోధించే అద్వైతం, మీకు భిన్నంగా అన్యంగా ఒకటి వుందనుకుని బోధించడం, దాన్ని ఆరాధించడం, ప్రార్థించడం, స్తుతించడం-ఇదంతా ఏమిటి?" అని ఒక ముస్లిం భక్తుడు అడిగాడు.

భగవాన్ :- భక్తుడు – ఈశ్వరుడు – స్తోత్రాలూ అన్నీ – అంతా ఆత్మే.

ప్రశ్న :- మీరు అరుణాచలాన్ని దైవం అంటున్నారు. దాన్ని ఈశ్వరుడుగా సంబోధిస్తున్నారు.

భగవాన్ :- అవును. నువ్వు దేహాన్ని ఆత్మగా భావిస్తున్నావు. భక్తుడు ఆత్మను అరుణాచలంతో పోలుస్తున్నాడు. అసలు వున్నది ఒకటే. అది అనేక రూపాల వ్యక్తమౌతుంది. అది మన మనోకల్పన. అదే అజ్ఞానం. ఆ అజ్ఞానం తొలగిందా ఇంక మనం శాశ్వత ఆత్మ స్వభావాన్ని గుర్తించలం. కాని, కొందరు విగ్రహారాధకులు మాత్రం తమ ఇష్ట దైవానికి చోటు లేకుండా పోతుందని భయపడతారు. కాని, ఆ భయపడే భక్తులూ చివరికి ఆ ఇష్టదైవంలో ఐక్యమౌతారు. ప్రార్థన - ప్రార్థించేవారూ - ప్రార్థింపబడేదీ అన్నీ అంతా ఒకటే. ఒకటే సత్యం. అవన్నీ ఆత్మ విభిన్న రూపాలు.

ప్రశ్న :- "నిరాకారుడైన ఈశ్వరుణ్ణి ఒక విగ్రహంగా చేసి పూజించడం అవివేకం కాదా?" అని ఒకరు అడిగారు.

భగవాన్ :- విగ్రహారాధన చేయనివారెవరు? తెల్లవారి లేచింది మొదలు, రాత్రి నిద్రపోయేవరకు, ఎవరి విగ్రహానికి వారు పళ్ళు తోమడం, స్నానం చేయించడం, జుట్టు దువ్వడం, మూడుపూటలూ నైవేద్యం సమర్పించడం మొదలైన ఆరాధన నుంచి తప్పించుకున్నవారెవరు?

విగ్రహారాధన, వ్యక్తిగత దైవపూజ, శరణాగతి, ప్రేమ భావం, భక్తి, విశ్వాసం, తన్మయత్వం, ఆరాధన - ఇవన్నీ అన్ని కాలాల్లో, అన్ని జాతుల్లో అనాదిగా వున్నవే. కాని, నామ రూప రహితమైన పరమాత్మే అన్నింటిలోనూ అంతర్యాతంగా వున్న ఆత్మ అని అనుభవపూర్వకంగా గుర్తించడం అన్ని సంగతుల్లోకి గొప్ప సంగతి. అదే అసలు సంగతి. అదే అసలు సత్యం. అది అన్ని మతాల, సిద్ధాంతాల, నిరూపణల్ని నిరాకరించక, మళ్లా వాటిని అధిగమించి వుంటుంది. అదే అద్వైత సిద్ధాంతం. అది ద్వంద్వ రహితం. దాన్నే ప్రాచీన ఋషులు ప్రబోధించారు. అది స్థూలమైనది, సూక్ష్మమైనది, సులభమైనది.

భగవాన్ బోధించే మార్గం మేధావులకు తప్ప సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యే సంగతికాదని చాలామంది నిశ్చితాభిప్రాయం. కాని, భగవాన్ని నమ్మి, చేరిన భక్తులు, సాధకులు చాలావరకు సామాన్యులు. అందులో కొందరు అతిసామాన్యులు. కొందరు భక్తులు భగవాన్‌తో పాటు తమ జీవితాలను వంటింటికే అర్పించారు. భగవాన్ వంటింట్లో కూరలు తరుగుతూ, వంట సామగ్రి అందిస్తూ, ఏవంట వండాలో, ఏది ఎట్లా తయారు చేయాలో చెపుతూ, చేసి చూపుతూ ఎంతో సహాయం చేసేవారు. ఆయా సమయాల్లో ఎన్నో సంగతులు కథలు-కబుర్లుగా చెప్పేవారు. నిత్య జీవిత సత్యాన్ని బోధిస్తూ, ఉపదేశిస్తూ తనని నమ్ముకున్నవారి అంతరాత్మల్ని శోధిస్తూ, వారు చేసే పనుల్ని, వారి స్వభావాల్ని ప్రేమతో సరిదిద్దుతూ; విరామ సమయంలో కర్రలు చెక్కుతూ, విస్తళ్ళు కుడుతూ, మధ్య- మధ్య వంటింట్లోకి వెడుతూ, కూర ఎంతవరకు ఉడికిందో, రుచి ఎట్లావుందో చూస్తూ అప్పుడప్పుడూ ధ్యానమందిరంలోకి వెళ్ళి, భక్తులమధ్య మంచంమీద కూర్చుని అందరికీ దర్శనమిస్తూ, పలకరిస్తూ వుండేవారు. ఆ విధంగా భగవాన్ ఉదయ కాలమంతా ఆశ్రమవాసుల్ని ఎరుకలో వుంచేవారు. అందుచేత అందరూ ఏ పొరపాటూ జరక్కుండా దృష్టి అంతా తాము చేసే పనిమీదే కేంద్రీకరించి పనిచేసేవారు. ఆ విధంగా భగవాన్ ఎందరొన్నో నడిపారు. అటువంటి సాధక భక్తులనుంచి చలంగారు అనుభవాలు సేకరించి "భగవాన్ స్మృతులు" అనే గొప్ప గ్రంథాన్ని తయారు చేశారు. అది భగవాన్ తత్వనిరూపణ చేసే గ్రంథాల్లో చాలా ముఖ్యమైనది.

"ఏదీ వృథా కాకూడదు" అనేది భగవాన్ అభిమతం. ఆ సూత్రం ప్రకారం ఆశ్రమానికి వచ్చిన ప్రతి వస్తువుకూ ఏదో ఒక ఉపయోగం చూపేవారు; భగవాన్. ప్రతి పదార్థాన్ని వంటింట్లోకి పంపి, భోజన పదార్థంగా తయారు చేయించేవారు.

మర్నాడు వంటకి ఏఏ పదార్థాలు వున్నాయో ముందుగా కనుక్కునే వారు. వాటిని ఎట్లా వండాలో, ఆ వంటలన్నీ తన చిన్నతనంలో ఎట్లా చేసేవారో, తన తల్లి ఎట్లా వండేదో, అసలు ఎట్లా వండాలో అన్నీ చాలా శ్రద్ధగా చెప్పి, చేయించేవారు. ఏది, ఎప్పుడు రుబ్బాలో, అది ఎప్పుడు ఎట్లా వంటలో వేయాలో, ఎంత ఉడికించాలో అన్నీ చెప్పేవారు. చివరికి ఆ భోజన పదార్థం సరిగా తయారైనదో, లేదోనని ప్రతి వంటా ముందు తాను రుచి చూసేవారు. భగవాన్. ఆ విధంగా ఆయన ఎక్కువకాలం వంటింట్లో గడిపేవారు. వంటింట్లో పనిచేసే వారంతా సామాను కోసం, సరకుల కోసం, స్వామి సలహాకోసం, సహాయంకోసం ఎప్పుడూ ఆయన చుట్టూ ప్రదక్షిణగా తిరుగుతూ వుండేవారు. రోజులో చాలా భాగం తిండి - వంట - పదార్థాల సంగతే మాట్లాడేవారు భగవాన్. వాటితో పాటు హెచ్చరికలూ, చివాట్లు మధ్య మధ్య నవ్వులు. వేదాంతాలు. హాస్యం, వైరాగ్యం, పురాణాల్లోంచి, వేదాంత గ్రంథాల్లోంచి, భక్తుల జీవిత చరిత్రలనుంచీ కథలూ, ఇంకా అనేక సంగతులూ చెపుతూ వుండేవారు. గురువు ఆజ్ఞ శిరసావహించడంలో వారికి శిక్షణ ఇచ్చేవారు. అదే వారి సాధన. 'తాము చేసేది భగవత్సేవ' అనే భావంలో వుండేవారు; వారంతా. అంత జాగ్రత్తగా చేయించిన వన్నీ భక్తులకు రుచిగా వుండటానికో, వారికి కర్మమార్గంలోంచి సాధన ఇవ్వడానికో, నిష్కామ కర్మతత్వనిరూపణకో-ఏమోగాని భగవాన్ చర్య అద్భుతంగా వుండేది.

ఆ సహజీవన సదవకాశాన్ని పంచుకున్నవారు ధన్యులు. కాని, ముఖ్యం వంటింట్లో భగవాన్ నిరంతర ఎరుక కొరకరాని కొయ్యమాదిరిగా తయారైనదనే గోల బయలు దేరింది. క్రమంగా. అంటే భగవాన్ విధానం క్రమంగా వంటింట్లో పనిచేసే వారి మామూలు కదలికలకు ప్రతిబంధకమైంది. భగవాన్ ఆ సంగతి గమనించి, మళ్ళా అటువేపులకు వెళ్ళలేదు.

భగవాన్ వంటింట్లోకి రాకపోవడం కొందరికి బాధాకరంగా వుంది. దానికి భగవాన్, "కొన్ని అలా జరగవలసిందే. జరుగుతాయి. వాటిని మార్చలేము, మాన్చలేము. వంటింట్లో ఇంక మనం కలిసి పనిచేయడం అనేది సమాప్తమైంది. ఇంక విశ్రాంతిగా వుందాం. అంతా మన మంచికే జరుగుతుంది. మీరు ఎల్లకాలం నన్ను పట్టుకుని వేళ్ళాడలేరు. మీ పని మీరు చేసుకుని తెలుసుకోండి. ఇంక దాని గురించి గొడవ పడవద్దు" అన్నారు. కాని, ప్రతిరోజూ ఎవరో ఒకరు వెళ్ళి, ఆ రోజు ఏం వంట చెయ్యబోతున్నారో చెప్పేవారు, భగవాన్‌తో. దానికి ఆయన "సరిసరి" అనేవారు.

భగవాన్ ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూవుండేవారు. "స్వామీ, తమకి శ్రమ" అని ఎవరైనా అంటే, "అందరూ సమానంగా పని చెయ్యాలి" అనేవారు భగవాన్. తనను నమ్మి, తన చుట్టూ చేరిన వారందరి కాలాన్ని, ఆశల్ని, ఆశయాల్ని, ఆలోచనల్ని, ఉద్దేశ్యాల్ని, ప్రయత్నాల్ని - అనేక విధాల ఆక్రమించుకుని, దివ్య జీవనం వైపు నడిపేవారు భగవాన్. ఆ విధంగా వారికి తెలియకుండా, వారి ప్రత్యేక వ్యక్తిత్వాల్ని పోగొట్టేవారు. వారి మనస్సుల్లో ఏముందో, ఏం జరుగుతుందో, వారికి తెలియకముందే భగవాన్ గుర్తెరిగి, సద్యోచికిత్స చేసేవారు. అటువంటి వారందరి అనుభవాలు వింటూవుంటే, ఒకోసారి తమకు లేని కోపాన్ని కూడా భగవాన్ వారికోసం నటించారని పిస్తుంది. వారిలో దాగివున్న ఏ కలుషాన్నో వెతికి, పైకితీసి మంట పెట్టాలనో, లేక వారిలో పెరిగిపోతున్న అహాన్ని అణచాలనో, వాళ్ళ స్వభావాల్ని తెలికి శుభ్రం చెయ్యాలనో స్వామి ఆగ్రహం చూపారనిపిస్తుంది. అదంతా తమపై సంపూర్ణ అనుగ్రహం అని, గుర్తించినవారు ధన్యులు.

కొందరు ఆశ్రమ నిర్వహణా కార్యక్రమాల్లో పాల్గొనేవారు. కొందరు భక్తుల, యాత్రికుల సేవకూ, మరికొందరు భగవాన్ పరిచర్యకూ ఏర్పాడి వుండేవారు. కాని, కొందరు మేధావులు భగవాన్ సూచించిన విచారమార్గంలో స్థిరంగా నిలిచి సాధనచేశారు. అటువంటివారిలో శ్రీ రామయోగి ఒకరు.

ఆయన నెల్లూరు జిల్లా "మోపూరు" గ్రామస్తులు. ఆయన చిన్నప్పుడే తండ్రి మరణించారు. వారిది సంపన్న కుటుంబం. ఆయన మేనమామల ఇంట-"బుచ్చి రెడ్డిపాలెం" లలో పెరిగారు. పందొమ్మిదో ఏట శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి వారి వద్ద తారక మంత్రోపదేశం పొందారు. సాత్వికాహారియై ప్రాణాయామం స్వయంగా చేయడం ఆరంభించారు. అనేక యోగాలు అభ్యసించి అనుభవాలు పొందారు. తన సంగతి తాను గమనించి, అరుణాచలం వచ్చి, భగవాన్ని దర్శించి, వారి సలహా తీసుకుని, చూతగుహలో పన్నెండేళ్లు మౌనం వహించి తపస్సు చేశారు.

ఆ తర్వాత అన్నారెడ్డిపాలెంలో ఆశ్రమం నిర్మించుకుని కొంతకాలం అక్కడ, కొంతకాలం అరుణాచలంలో గడిపేవారు ఆయన శ్రీ రమణాశ్రమానికి ఎంతో ధనసహాయం చేశార ఎందరో మేధావులు ఆయన్ని దర్శించి, గొప్ప తపశ్శాలిగా గుర్తించారు. వారిలో పాల్ బ్రంటన్ ఒకరు. వారు. "A search in Secret India" అనే తమ గ్రంథంలో రామయోగిగారిని ప్రశంసించారు. ఆయనకు సిద్ధులు కలవని చాలామంది అభిప్రాయం. అన్నారెడ్డిపాలెంలో ఈ నాటికీ ఆయన జయంతి ఉత్సవాలు జరుపు తున్నారు.

* * *

భగవాన్ జీవిత చరిత్ర మొదట ఇంగ్లీషులో రాసినవారు బి.వి. నరసింహయ్యర్. ఆయన సేలం వాస్తవ్యులు. లాయరు. రాజకీయనాయకులు. శాసన సభ్యులు. సంస్కృత, వేదాంత వాఙ్మయమునందు ప్రవీణులు. ఆయనకు ఇద్దరు కొడుకులు. వారిద్దరూ ఒకే రోజున నీట మునిగి చనిపోయారు. ఆ దుఃఖంలో ఆయన సన్యసించి 1928లో శ్రీ రమణాశ్రమం వచ్చి, మూడేళ్లు వుండి, భగవాన్ జీవితచరిత్ర రాశారు. ఆ తర్వాత 'ఉపదేశసారం' రాశారు. స్వామి భక్తపరాయణులలో నరసింహయ్యర్ ఒకరు. ఆయన రాసిన "భగవాన్ జీవిత చరిత్ర" దేశ, విదేశీయుల్ని ఆకర్షించింది.

* * *

భగవాన్ జీవిత చరిత్ర తమిళంలో రాసినవారు, శ్రీ శుద్ధానంద భారతి. ఆయన మొదటినుంచీ పత్రికా విలేఖరిగా ప్రసిద్ధికెక్కినవారు. స్వదేశాభిమాని. ఆయనకు ప్రకృతి వైద్యం బాగా తెలుసు. కొన్నాళ్లు గురుకులం నడిపారు. గొప్ప పండితులు. బహు గ్రంథకర్త. చాలా చురుకైనవారు. ఆయన మొదట భగవాన్ దర్శనానికి వచ్చినప్పుడు, భగవాన్ గణపతిశాస్త్రిగారితో, "ఆ వచ్చింది, భారతియా? భారత శక్తి గ్రంథకర్తా?" అని అన్నారు. భగవాన్ అనిన, ఆ మాటలు భారతిస్వాములవారు విని, పరమానందభరితులైనారు. ఆయన కేవలం స్వామి దర్శనానికి వచ్చి, అప్పుడే స్వామిపై కొన్ని శ్లోకాలు రాశారు. ఆరు నెలలు వుండి, "రమణ విజయం" అనే పుస్తకం రాశారు.

* * *

1923 లో భగవాన్ బంధువర్గంలోని వారైన విశ్వనాథ బ్రహ్మచారి శ్రీ రమణాశ్రమానికి వచ్చారు. అప్పటికి ఆయన వయసుపందొమ్మిదేళ్ళు. గణపతిశాస్త్రిగారిసాహిత్యంచదివి, ఉత్తేజితులై ఇంకా ఎన్నో సంస్కృత గ్రంథాలు చదివి కవిత్వం రాసేవారు. భగవాన్ ఆయన్ని చూసి, "నువ్వు తల్లి-దండ్రుల అనుమతి తీసుకు వచ్చావా?" అని అడిగారు. దానికి ఆయన "నేనూ భగవాన్ మాదిరిగా చీటీ రాసి, ఇంట్లో చెప్పకుండా వచ్చాను. కాని, నేను ఎక్కడకు వెళ్ళేదీ వారికి తెలుసు. అయినా నాకు ఇక్కడ పాత వెంకట్రామన్ కనపడటం లేదు" అన్నారు. దానికి భగవాన్, "వాడా? వాడెప్పుడో అదృశ్యమైనాడు" అని, "కనీసం నీకు సంస్కృతం అయినా వచ్చు! ఇల్లు వదలి వచ్చేప్పటికి. నాకు అదీ రాదు" అన్నారు.

*   *   *

మునగాల వెంకట్రామయ్యగారు ప్రభుత్వోద్యోగి. ఆయన తెలుగువారైనా తమిళం, ఆంగ్లం, సంస్కృత భాషల్లో మంచి ప్రావీణ్యత కలవారు. ఆయన సన్యసించి, 1925 ప్రాంతంలో శ్రీ రమణాశ్రమం చేరారు. "రమణానంద సరస్వతి"గా తన పేరు మార్చుకున్నారు.

1935-39 మధ్యకాలంలో భగవాన్‌కు భక్తుల, యాత్రికుల అనుచరులకు మధ్య జరిగిన సంవాదాల్ని, చర్చల్ని, తర్కాల్ని, ప్రశ్నోత్తరాల సమాచారాన్ని సేకరించి, "Talks with Maharshi" అనే గ్రంథంగా కూర్చారు, ఇంగ్లీషులో. భగవాన్ తత్వాన్ని తెలిపే గొప్ప గ్రంథమది. అందు ఎందరో ప్రముఖ వ్యక్తులు, పరిశుద్ధ గ్రంథాలు, అనేక శాస్త్ర విషయాలు పరిచయమౌతాయి. ఆ గ్రంథం ప్రపంచ ప్రముఖుల ప్రశంసలను

అందుకుంది. ఆ తర్వాత "త్రిపురా రహస్యం" అనే గ్రంథాన్ని ఇంగ్లీషులోకి అనువదించారు. "అద్వైత బోధదీపిక" అనే గ్రంథాన్ని కూడా రాశారు.

* * *

కవి, పండితుడు అయిన సుబ్రహ్మణ్యం 1923 - సెప్టెంబరు ఒకటవ తేదీన శ్రీ రమణా శ్రమానికి వచ్చారు. ఆయన తన పేరు "మురుగనార్" గా మార్చుకున్నారు. "రమణ సన్నిధిముఱై" అనే కావ్యం రాశారు. "ఉపదేశమంజరి - సద్విద్య" అను రెండు గ్రంథాలు భగవాన్ రాయడానికి ఆయనే కారకులు. ఆయన రాసిన పద్యాల్ని భగవాన్ చదివించుకుని, వాటిని వివరించి చెప్పేవారు. యాభై ఏళ్లు శ్రీరమణాశ్రమంలో వున్నారు.

* * *

ఓరుగంటి వెంకట కృష్ణయ్యగారు (కృష్ణభిక్షు) భగవాన్ని దర్శించి, ఆశ్రమవాసియై, భగవాన్ జీవిత చరిత్ర "శ్రీరమణ లీల" తెలుగులో రాశారు. భగవాన్‌పై కొన్ని పాటలు కట్టారు. ఆయన సోదరులు రామచంద్ర కౌండిన్య "The talks with Maharshi" తెలుగులోకి అనువదించారు.

* * *

శ్రీరామునికి నిస్వార్థంగా సేవ చేసిన లక్ష్మణుని మాదిరిగా వేరే దృష్టి, ఆలోచనా లేకుండా పద్నాల్గేళ్ళు భగవాన్‌కి సేవచేసిన వారు మౌనస్వామి. ఆయన విద్యావంతులు, న్యాయవాదులు. భార్య చనిపోయిన దుఃఖంలో జీవితం మీద విరక్తి కలిగి,

శ్రీ రమణాశ్రమం వచ్చారు. ఒక్క భగవాన్‌తో తప్ప, తక్కిన కాలమంతా మౌనంగా వుండేవారు. భగవాన్ పర్యవేక్షణలో శ్రీ రమణాశ్రమ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఆయనే చూసేవారు. ఊళ్ళో భిక్ష ఎత్తి. రోజుకో పూట తిని, ఏ ఇంటి అరుగుమీదనో, ఏ ఆలయం మెట్లమీదనో, సత్రం వరండాలోనో నిద్రిస్తూ, నిరాడంబర జీవితం గడిపారు. ఆయన్ని చూసి, "భగవాన్ తర్వాత, భగవాన్ అంతటివారు" అనుకునేవారు. ధనవంతులు ఆయన చేతికి డబ్బు ఇస్తే, దాన్ని ఆశ్రమంలో జమ కట్టించేవారు.

భగవాన్ మహాసమాధి అయిన తర్వాత ఆయనకు ఆశ్రమాధికారులతో పొత్తు కుదరక, అనేక విషయాల్లో ఏకీభవించక వ్యతిరేకించారు. ఆ రోజుల్లో భగవాన్ సమాధిపై వున్న పూరిపాక తగులబడింది. దానికి కారణం, మౌనస్వామి అని ఆశ్రమాధికారులు ఫిర్యాదు చేయడంతో, ఆయనను పోలీసులు అదుపులోకి తీసుకున్నారు.

జైలు నుంచి బైటికి వచ్చిన తర్వాత, ఆశ్రమం ఎదురుగా వున్న ఓ జీర్ణ కుటీరంలో వుండేవారు. క్రమంగా ఆయన ఆరోగ్యం క్షీణించింది. బంధు, మిత్రులు రమ్మని ఎంత బ్రతిమాలినా "భగవాన్ ఇక్కడ నాతో వున్నారు" అనేవారు మౌనస్వామి. అటువంటి అచంచల ఆత్మవిశ్వాసంతో ఒంటరిగా నిలబడిన యోధులు మౌనస్వామి. ఆయనకు గురువే సర్వస్వం. చివరకు ఆయన ఆ కుటీరంలోనే కన్నుమూశారు.

* * *

రెండవ ప్రపంచయుద్ధంలో మేజరుగా పనిచేసిన 'చాడ్విక్' అనే యూరోపియన్, యుద్ధంలో రక్తపాతం చూసి, భరించలేక, విరక్తిచెంది, తత్వాన్వేషియై, భగవాన్ గురించి విని, శ్రీ రమణా

శ్రమం వచ్చి, స్థిరపడ్డారు. తన పేరు "సాధు అరుణాచలంగా" మార్చుకున్నారు. ఆశ్రమ ఆవరణలో ఒక కుటీరం నిర్మించు కున్నారు. భగవాన్ సమాధి అయిన తర్వాత వేద పారాయణ ఆగిపోతే, వేద పాఠశాల ఏర్పాటు చేశారు. మాతృభూతేశ్వ రాలయంలో "శ్రీచక్ర పూజ" ఆరంభింపజేశారు. ఆయన, నిగర్వి. నిరాడంబరజీవి. నిర్మల స్వభావులు, స్వామి భక్తి పరాయణులు.

* * *

పూనాలో బాబాజాన్ ఆశీర్వాదం పొంది, కాశీలో హరిలాల్ బాబా అనుగ్రహం సంపాదించి, గాంధీ - అరవిందుల దయపొంది, బుద్ధగయలో ఏడేళ్ళు సాధన చేసిన శ్రీమతి తల్యార్ ఖాన్ భగవాన్ని దర్శించి, శ్రీరమణనగర్‌లో ఒక ఇల్లు కట్టుకుని స్థిరపడ్డారు. ఆశ్రమాభివృద్ధికి అనేక విధాల తోడ్పడ్డారు. ఎందరో మిత్రుల్ని భగవాన్ సూచించిన సాధన వైపు దృష్టి మరల్చారు.

* * *

"హారీ డిక్‌మన్" పాశ్చాత్యులు. ఆయన చిన్నప్పటి నుంచీ యోగాభ్యాసం చేసినవారు. వారు లట్వియాదేశానికి చెందినవారు. "తుకుమ్" పట్టణవాసి. భగవాన్ భక్తులు. లెట్టిష్ భాషలో "నే నెవడను? ఉపదేశసారం" అను రెండు పుస్తకాలు అనువదించారు. ఆయన బ్రహ్మచర్య దీక్షా పరులు. ఆర్యవేదాంతంపై అభిమానం కలవారు. లట్వియా దేశానికి, ఇండియాకూ అన్ని విధాలా సన్నిహిత సంబంధం వుండాలనేది ఆయన ఆకాంక్ష. సంస్కృతం, ఇంగ్లీషూ నేర్చుకున్నారు. ఆర్య విజ్ఞానం ఆకళింపు జేసుకునేందుకు, కొంత హిందీ కూడా నేర్చు

కున్నారు. వివేకానందుని చదివి, అర్థం చేసుకున్నారు. వేదాంతంలో అద్వైతమే చివరి సోపానమన్నారు.

* * *

గుర్రం వెంకట సుబ్బరామయ్యగారు భగవాన్‌కి చాలా సన్నిహితంగా వుండేవారు. విద్యావంతులు. "రమణ గీత"కు తెలుగు పద్యాలు రాశారు. ఆయన కోసం భగవాన్, భగవద్గీత లోంచి కొన్ని శ్లోకాలు ఏరి, "శ్రీ భగవద్గీతా రత్నమాలిక"అని పేరు పెట్టారు.

* * *

"మారిస్ ఫ్రీడ్‌మన్" పోలిష్ జ్యూ. సూక్ష్మగ్రాహి. ఆత్మ సిద్ధికోసం భగవాన్ని అర్థించారు. ఆయన తర్కం అంతా విని, "BE STILL AND KNOW THAT I AM GOD" అనే బైబిల్ వాక్యాన్ని చెప్పారు, భగవాన్. అంటే, తర్కం వ్యర్థమని, నిశ్చలత్వం ముఖ్యమని భగవాన్ సూచనగా తీసుకున్నారాయన.

* * *

"కోహెన్" అనే జ్యూ "గురు రమణ" అని ఇంగ్లీషులో ఒక గ్రంథం రాశారు.

"డాక్టర్ సేన్" అనే ఫ్రెంచి ఆమె, డాక్టరు మీసు, డంకన్ గ్రీన్‌లీస్ మొదలైన విదేశీయులు భగవాన్ భక్తులు. ఆర్థర్ ఆస్ బోర్న్, మిస్ మెర్టన్, మొదలైన పాశ్చాత్యులు భగవాన్ని నమ్ముకుని శ్రీరమణనగర్‌లో స్థిర నివాసం ఏర్పరచు కున్నారు.

* * *

గిద్దలూరు నరసింహారావుగారు "అరుణాచల పంచరత్నం, సద్విద్య" అను రెండు పుస్తకాల్ని తెలుగులో ద్విపదగా రాశారు. చింతా దీక్షితులుగారు భగవాన్ మీద చాలా రాశారు. దేవరాజ

మొదలియార్, "DAY TO DAY WITH BHAGAWAN" అనే గొప్ప గ్రంథం రాశారు, ఇంగ్లీషులో. సూరి నాగమ్మగారు "శ్రీ రమణాశ్రమ లేఖలు" రాశారు.

రమణభక్తులు - రామస్వామిపిళ్ళై, రాజేశ్వరానంద, కుంజుస్వామి, సాంబశివరావు, శ్యామా అయ్యర్, సత్యానందస్వామి వెంకటరత్నం, అన్నామలైస్వామి, కృష్ణస్వామి, జగదీష్‌స్వామి, జగదీశశాస్త్రి, రమణ పాదానంద, రాజయ్యర్, మొదలైనవారు భగవాన్ సమకాలీకులు.

* * *

భగవాన్ దివ్యత్వం, జ్వాలలాంటి ఆయన పరిత్యాగం అపారమైన వారి శక్తిసంపద, వ్యక్తిత్వపు సత్తా, అపార మేధా సంపత్తి, చలాన్ని ఆకర్షించగా - చలం, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, సహాధ్యాయులకు, మహోపాధ్యాయులకు, మిత్రులకు, ఆప్తులకు, ఆశ్రితులకు, రచనలకు, ప్రచురణలకు, పాఠకులకూ, ప్రభుత్వానికి-అందరికి, అన్నింటికి "అభినవనోవా" మాదిరిగా 1950 - జనవరిలో విజయవాడకు "ఫేర్‌వెల్" చెప్పి, స్థిర నిశ్చయ భావంతో అరుణాచలం చేరి, భగవాన్ శ్రీ రమణ మహర్షి సూచించిన విచార మార్గాన సౌరిస్‌గారితో కలిసి సాధన చేసి, ఆత్మవిచార తత్వాన్ని తన కలం బలంతో మరింత సూటిగా, శక్తివంతంగా, సులభంగా, సౌందర్యవంతంగా, అక్షరాల్లో అనేక గ్రంథాలుగా ఉత్తరాలుగా, కావ్యాలుగా అభిషేకించారు.

చలం - సౌరిస్ ఆధ్వర్యంలో "శ్రీ రమణస్థాన్" గొప్ప ఆశ్రమంగా శ్రీ రమణనగర్‌లో ఏర్పడి, ఎందరో రమణ భక్తులకే కాక, ఇంకెందరికో ఆశ్రయమిచ్చి, ఆదుకుంది. ఓ ముప్పై ఏళ్ళు అరుణాచలంలో దేదీప్యమానంగా వెలిగింది.

భగవాన్ సమక్షంలో ఎవరూ, ఏ భేదమూ చూపడానికి వీల్లేదు. ఎన్నో కలతలతో కూడిన ప్రపంచం ఆయన పాదాల ముందు ప్రణమిల్లి, ప్రేమతో కౌగలించుకునేది. ఆ వాతావరణమే సంశయాల్ని, సందేహాల్ని, సమస్యల్ని, సమస్త తాపాల్ని హరించేది. దానికి తోడు ఆయన ప్రేమ, దయకల పలకరింపు, సమదృష్టి, మౌన తేజస్సు - అక్కడ చేరిన వారందర్నీ ఒకటిగా చేసేది.

భగవాన్‌తో ఆధ్యాత్మిక విషయాలే కాదు - సంసారపు గొడవలు, చదువులు, ఉద్యోగాలు, ఇంకా అనేక సమస్యలు - అందరూ అన్నీ చెప్పుకునేవారు. వారి, వారి స్థితుల్ని బట్టి, భగవాన్ వారికి చెప్పి, రాసి, ఓదార్చి, తృప్తిపరచేవారు. చాలావరకు రాత్రి ఎనిమిది గంటల తర్వాత భగవాన్ సమక్షంలో ఎన్నో విషయాల మీద చర్చ జరిగేది. ఒక్కోరోజు రాత్రి చాలా పొద్దుపోయేవరకు మాట్లాడేవారు భగవాన్. కథలు, కబుర్లు, అనుభవాలు, గ్రంథాల్లోంచి చర్చ, మహాత్ముల జీవిత చరిత్రల నుంచి ఎన్నెన్నో సంగతులు చెప్పేవారు. అందరూ ఆనంద పారవశ్యంతో వినేవారు. ఉత్తమ కళాకారుడు మాదిరిగా ఆయన ఆ యా సంగతుల్ని అభినయించి చూపేవారు. భక్తి విషయాల్ని పారవశ్యంతో చెప్పేవారు. అటువంటప్పుడు ఆయన కళ్ళల్లోంచి ఆనందభాష్పాలు ధారలుగా కారేవి. ఒక్కోరోజు రాత్రి భగవాన్ పడుకునేప్పటికి పదకొండు గంటలయ్యేది.

ఆధ్యాత్మిక తత్వానికీ, ఆర్థిక తత్వానికీ పొత్తు కుదరక ఆశ్రమంలో కలతలు రేగాయి. ఆశ్రమ యాజమాన్యానికై తగాదాలు, గొడవలు, ఘర్షణలు ఆరంభమయ్యాయి. ఆశ్రమ నిర్వహణ కమిటీ అధ్యక్షుడుగా నిరంజనానందస్వామి ఎన్నిక అయ్యారు. కాని, ఆ కమిటీ అధికారం చెల్లదంటూ కొందరు

కోర్టులో వ్యాజ్యం వేశారు. ఆధ్యాత్మిక సాధకుల్లో అధికార వ్యామోహం తలెత్తేప్పటికి పరస్పర నిందారోపణలు బయలు దేరాయి. కోర్టువారు ఒక కమిషన్ వేశారు. వారు ఆశ్రమానికివచ్చి, భగవాన్ని ప్రశ్నించగా, "ఈ ఆశ్రమం కాలక్రమేణా అభివృద్ధి చెందింది. కొందరు ఆశ్రమవాసులు నా పేరు ఉపయోగించి, నిధి వసూలుచేశారు. వారికి నేను ఎటువంటి అనుమతీ ఇవ్వలేదు. వారిని నేను ఆపనూ లేదు. అందుచేత నిధి వసూలు అవుతూనే వుంది. ఒకరు మానేస్తే, ఆ పనికి మరొకరు పూనుకుంటున్నారు. దానాలు అందుకోవడం నాకు ఇష్టం లేదు. కాని, వారు నా మాట వినరు. వృధాగా సలహాలు ఇవ్వడం నా అభిమతం కాదు. అందువల్ల నేను వారిని అడ్డు పెట్టను. డబ్బు చేరుతున్నది గనుక, ఆశ్రమం అభివృద్ధి చెందుతోంది" అన్నారు.

ఆ అభివృద్ధి అంతా చూసి, "అమ్మ పోయింది-అమ్మయ్య తేలికపడ్డాను. హాయిగా వుండవచ్చు-ఏ గుహలోనైనా ఒంటరిగా కూర్చోవచ్చు, అనుకున్నాను. బంధాలన్నీ తెంచుకోవాలను కున్నాను. నిజం చెప్పాలంటే, ఇప్పుడు మరింత బంధం చుట్టుకుంది. ఇంక ఎటూ కదలలేను. ఈ గురుపీఠం వుంది చూశారూ, ఇది చాలా దుర్భరమైంది. దీన్ని నిర్వహించడం కష్టతరం. ఏళ్ళ అనుభవంతో మాట్లాడుతున్నాను. నా ఇష్టప్రకారం కదలడానికి వీల్లేకుండా నా చుట్టూ కర్రలతో కట్టారు. దీనికీ, జైలుకీ తేడా ఏమిటి?" అన్నారు భగవాన్.

భగవాన్ నిత్య జీవిత కార్యక్రమం చివరి వరకూ ఒకే విధంగా వుంది. జబ్బు చేసినప్పుడు తప్ప, రోజంతా చిన్న ధ్యాన మందిరంలోనే వుండేవారు. కాని తమ చుట్టూ జరిగే సంగతు లన్నింటికీ సదా సంపూర్ణ ఎరుకలో వుండేవారు. ఎవరైనా ఆశ్రమాధికారులతో తగాదాపడి, ఆశ్రమ నిబంధనలు కఠినంగా వున్నాయని భగవాన్‌తో ఫిర్యాదు చేసి ప్రయోజనం లేదు.

ఎందుకంటే, ఆయనే ఆశ్రమ నియమాల్ని తు. చ. తప్పకుండా పాటించి, విధేయులై వుండేవారిలో మొదటివారు. అప్పుడప్పుడూ కొందరు ఆశ్రమాధికారులతో గొడవపడటం చూసి, "ముక్తి, మోక్షం, స్వేచ్ఛ, శాంతి, ఆనందం కావాలంటూ ఆశ్రమానికి వస్తారు. క్రమంగా ఆశ్రమ వ్యవహారాల్లో అనవసరంగా తల దూరుస్తారు. తాము ఆశ్రమానికి ఎందుకు వచ్చారో ఆ సంగతి పూర్తిగా మరచిపోతారు" అన్నారు భగవాన్.

భగవాన్ ఆశ్రమ గొడవల్లో కలగజేసుకొనేవారు కాదు. ఒకసారి మద్రాసు నుంచి కొంతమంది వ్యాపారస్తులూ, ఉద్యోగులూ, ఇంకా అనేక వృత్తులవారూ, భక్తులూ ఓ బస్సులో శ్రీ రమణాశ్రమానికి వచ్చి, భగవాన్ ముందు కూర్చున్నారు. భగవాన్ మౌనంగా, గంభీరంగా, స్థిరంగా, దృఢంగా, రాయి అంత నిశ్చలంగా కూర్చున్నారు. వచ్చినవారికి ఏం మాట్లాడాలో తోచలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని, కొంతసేపు కూర్చుని వెళ్ళిపోయారు. వారంతా ఆశ్రమాధికారంమీదా, అది విధించిన నిబంధన మీద తిరుగుబాటు చేసినవారు. ఆశ్రమాధికారులు అక్రమంగా, అన్యాయంగా ప్రవర్తిస్తున్నారనీ, ఆ విషయాన్ని భగవాన్ దృష్టికి తెచ్చి, ఆశ్రమాన్ని సంస్కరించాలనీ బయలుదేరి వచ్చిన యోధులు. భగవాన్ ఆ సంగతి తెలుసుకుని "వాళ్లు ఇక్కడకు ఎందుకు వచ్చారు? తమను సంస్కరించుకోవడానికా? లేక ఆశ్రమాన్ని సంస్కరించడానికా?" అన్నారు.

ఆశ్రమాధికారులు తమకు వీలుగా, అనుకూలంగా ఆశ్రమంలో కొన్ని నియమాలు, నిబంధనలు, పద్ధతులు, కట్టుబాట్లు ఏర్పరిచారు. అందరూ భగవాన్ని రాజాధిరాజులాగ కొలిచి, ప్రార్థించి, పాదాలమీద పడుతున్నా, భగవాన్ ఆశ్రమ పద్ధతులకు నియమ నిబంధనలకు విధేయులై వుండేవారు. ఆశ్రమం విషయంలో

ఆయన ఎప్పుడైనా, ఏదైనా, అభ్యంతరం తెలిపినా, నిరోధించినా అది కేవలం నిజమైన సాధకునికో, భక్తునికో ఆశ్రమాధికారులవల్ల బాధ, ఇబ్బంది కలిగి వుండాలి. అటువంటప్పుడు ఆయన చాలా వరకు గంభీరమైన మౌనంతోనో, చమత్కారమైన మాటలతోనో కథలతోనో, హ్యూమర్‌తోనో ఆశ్రమాధికారులకు తెలిసేటట్లు చెప్పేవారు. అంతటితో ఆ సమస్య సక్రమంగా పరిష్కారమయ్యేది. భగవాన్ ఆశ్రమాధికారులకే కాదు, నిత్య జీవన పద్ధతులకూ, శారీరక బాధలకూ అణగి, నమ్రతతో, శమ - దమాదులతో వుండేవారు. తనను చేరిన వారిని భౌతిక వాంఛల నుంచే గాక మానసికంగా స్వేచ్ఛ పరిచేవారు. భగవాన్ తనకై ఎప్పుడూ ఏదీ, ఎవరినీ అడగలేదు. ఎవరైనా తనకు కానుకలు, బహుమతులు ఇస్తే, "మీరు వాటిని నాకు ఇవ్వడం, గేలం ముల్లుకు ఎర గుచ్చి, చేపను లాగాలని చూసినట్లు వుంటుంది. గేలం వేసేవాడు చేపల క్షేమం కోరి, ఎర గుచ్చిపెడతాడా? అతడు ఎర గుచ్చడం చేపకు తిండి పెట్టే ఉద్దేశ్యమా?" అని నిర్మొహమాటంగా అనేవారు.

భగవాన్ శ్రీ రమణాశ్రమంలో తనకు పెట్టిన ఆహారాన్నే తీసుకున్నారు. అవసరమైన బట్టలే వాడుకున్నారు. తనకు ఏ ప్రత్యేకత చూపినా, సమ్మతించేవారు కాదు. తనకోసం వచ్చిన భక్తుల్ని, తన వలె చూడమనీ, వారికి సేవ చెయ్యమనీ చెప్పేవారు; ఆశ్రమవాసులకు. ఆ సంగతి చాలామందికి సమ్మతమయ్యేది కాదు. అయినా వారికి సద్వర్తన, సమదృష్టి నేర్పడానికి భగవాన్ తరచు సరిగా తిండి తినేవారు కాదు. కాఫీ వంటివి తాగేవారు కాదు. అవన్నీ వారి దృష్టిని ఆకర్షించడానికే గాని, ఆగ్రహంతో చేసినవి మాత్రం కావు. అప్పటికీ వారి అహం అణగకపోతే, ఏదో సందర్భంలో వారిని తీవ్రంగా ఖండించేవారు. అయినప్పటికీ వారు ఇంకా మూర్ఖంగా ప్రవర్తించినా, తనకు

ప్రత్యేకత చూపినా భగవాన్ మౌనం వహించేవారు. గంభీరంగా వుండిపోయేవారు. ఇంకా అవసరమైతే, వారి అజ్ఞానం మీద గట్టిగా అరచి, కేకలు వేసేవారు. ఒకసారి తనకోసం ఫేన్ వేస్తే, అంగీకరించక, అందరికీ ఫేన్స్ పెట్టమన్నారు. గతిలేక ఆశ్రమాధికారులు అందరికీ హాల్లో ఫేన్స్ ఏర్పాటు చేశారు. ఒక్కోసారి ఎవరైనా తప్పుగా ప్రవర్తించినా, చెడుగా నడచినా, పక్షపాతం చూపినా-ముఖ్యం తనకు పరిచర్య చేయడానికి సిద్ధపడిన వారి విషయంలో, భగవాన్ కోప్పడేవారు. కాని, చిన్న చిన్న తప్పుల్ని తెలియక చేసిన వాటినీ క్షమించేవారు. కాని, ఆయన చుట్టూ చేరి, ఎన్నేళ్లు పడివున్నా, ఎంత చదివి, విని, తిరిగి, చూసినా, చేసినా అనుభవం వున్నా ఆయన నేర్పదలచుకున్న ప్రేమ, సమత్వం ఎవరికి, ఎంత అబ్బాయో! సమస్త చరాచరాల్ని ఈశ్వర స్వరూపంగా చూడమనీ, అంతా ఈశ్వరుడికి అర్పించమనీ, అనాలోచిత చిత్తులై జీవించమనీ భగవాన్ గట్టిగా నొక్కి చెప్పేవారు. తనకు సేవ చెయ్యడంకన్నా, తన బోధ ప్రకారం నడవడం ముఖ్యమనేవారు భగవాన్. ఆయన చూపే ఆగ్రహం తమపై అపార కరుణవల్లనేనని తెలుసుకున్న వారెందరు?

వేదపారాయణ జరుగుతున్నా, పాట సాగుతున్నా, భోజనానికి గంట కొట్టగానే భగవాన్ లేచి, "దయతో భిక్షకు గంట కొట్టారు. మనం ఆలస్యంచేస్తే, పెట్టకుండా నిరాకరించడంలో వారికే న్యాయం వుంటుంది. కనుక త్వరగా భోజనానికి వెడదాం" అని బయలుదేరేవారు.

ఆశ్రమంలో మాంసాహారం నిషేధం. కాని, భగవాన్ ఎన్నడూ మాంసాహారం మాట ఎత్తలేదు. అడిగిన వారికి సాత్వికాహారం సంగతే చెప్పారు. మితాహారం, మితనిద్ర, మిత భాషణ మంచిదన్నారు భగవాన్. చాలాసార్లు విస్తర్లో వడ్డించిన పదార్థాలన్నీ

కలిపి తినేవారు. నెమ్మదిగా భోజనం చేసేవారు. వడ్డించినవన్నీ శుభ్రంగా, పూర్తిగా తినేవారు. ఒక్క మెతుకు విడిచిపెట్టకుండా తినేవారు.

భగవాన్ అనారోగ్యంతో వున్నప్పుడూ, రాత్రి బాగా పొద్దు పోయిన తర్వాత, మధ్యాహ్నం విశ్రాంతివేళా భగవాన్ దర్శనానికి ఎవరైనా వస్తే, ఆశ్రమాధికారులు అనుమతి ఇచ్చేవారు కాదు. కొన్నాళ్ళ తర్వాత ఆ సంగతి తెలిసి, "నా కోసం అన్ని వేళలా ప్రజలు వస్తారు. దర్శన సమయమంటూ పెడితే, వారు తిరిగి వెళ్ళిపో వలసి వస్తుంది. దర్శనానికి టైమ్ ఏమిటి? మీరు వాళ్ళను లోపలకు రానివ్వకపోతే, నేనే వెళ్ళి, వరండాలో కూర్చుని, వాళ్ళను కలుసు కుంటాను. మీ హాలూ, తలుపులూ అవీ మీరు చూసి వేసుకోండి", అన్నారు భగవాన్.

భగవాన్ ఆశ్రమంలో అందరితోపాటు ఒకరుగా వుండేవారు. ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తూనో, ఏదో ఒక పుస్తకం చదువుతూనో, రాసుకుంటూనో వినేవారికి ఏదో ఒకటి చెపుతూనో, వింటూనో వుండి తన చుట్టూ జరిగే ప్రతిదానికి సర్వసాక్షిగా వుండి పర్యవేక్షిస్తో, పరి శీలిస్తో వుండేవారు. కొన్ని సందర్భాల్లో మితిమీరిన వారి అహం గమనించి భగవాన్ గట్టిగా మందలించేవారు. భగవాన్ కోప్పడ్డా రంటే, కోపం నటించేవారనీ, లేక విషయాల విషయంలో కోపం చూపేవారనీ అన్వయించుకోవాలిగాని, అపార్థానికి చోటివ్వరాదు. బిడ్డను సరిదిద్దాలని తల్లి కోప్పడుతుంది. కోప్పడ్డప్పుడు గాని, అంతకు ముందుగాని, ఆ తర్వాతగాని ఆమె హృదయంలో బిడ్డ యెడల ఎటువంటి చెడు తలంపూ, ఆలోచనా, భావనా వుండదు. వుండేది ప్రేమ ఒక్కటే! భగవాన్ తన పరిధిలోకి వచ్చినవారి పైననే కదా, ఆయన కోపం చూపేది. అది నిజంగా ప్రేమే !

కీళ్ళ నొప్పులవల్ల భగవాన్ సోఫాలో కాళ్ళు బారజాపుకుని కూర్చునేవారు. ఒకసారి ఆశ్రమానికి కొంతమంది యూరోపియన్లు వచ్చారు. వారిలో ఒకామెకు కింద కూర్చోవడం బొత్తిగా చేతకాక, గోడను ఆనుకుని, కాళ్ళు భగవాన్‌కి ఎదురుగా బారజాపి కూర్చున్నది; ఆయన్ని చూస్తో. సరిగ్గా కూర్చోమని ఆమెను భగవాన్ పరిచారకుడు హెచ్చరించాడు. ఆమె అతి కష్టం మీద కాళ్ళు వెనక్కి లాక్కుని కూర్చున్నది. తక్షణం భగవాన్ తన కాళ్ళనూ వెనక్కి లాక్కుని పద్మాసనంలో కూర్చున్నారు. భక్తులు ఎంత బ్రతిమాలినా, పరిచారకుడు తన తప్పు క్షమించమని వేడుకున్నా, మోకాళ్ళు నొప్పులు పెడుతున్నా భగవాన్ లక్ష్యపెట్టక, "అది ఆశ్రమ నిబంధన అయితే, అందరితోపాటు నేనూ దానికి విధేయుడనై వుండాలి కదా? కాళ్ళు బారజాపి కూర్చోవడం, అమర్యాద అయితే, హాల్లో వున్న ప్రతి ఒక్కరి యెడలా నేను అమర్యాదగా ప్రవర్తించినట్లే", అన్నారు. వెంటనే పరిచారకుడు ఆమె దగ్గరకు వెళ్ళి బ్రతిమాలి, ఆమెను ఇష్టం వచ్చినట్లు కూర్చోమన్నాడు. ఆమె కూర్చున్నా, భగవాన్ మాత్రం మామూలుగా కూర్చోలేదు.

భగవాన్ తిరువణ్ణామలై వచ్చిన మొదట్లో, తరచు గిరి ప్రదక్షిణం చేసేవారు. ఆయనతోపాటు ఆశ్రమవాసులందరూ వెళ్ళేవారు. ఉదయం బయలు దేరితే, రాత్రికి తిరిగి ఆశ్రమానికి వచ్చేవారు. రాత్రి బయలు దేరితే, తెల్లవారేప్పటికి వచ్చేవారు. ఒక్కొక్కసారి మధ్యలో అక్కడక్కడా ఆగుతూ, భక్తులు పెట్టే ప్రసాదాలు తింటూ రెండు, మూడు రోజులు గిరి ప్రదక్షిణం చేసేవారు. కాని, 1922 నుంచి, భగవాన్‌తో కలిసి గిరి ప్రదక్షిణం చేసే సంఖ్య పెర

గడం వల్లా, ఆశ్రమంలో చక్కబెట్టేవారు లేక పోవడం వల్లా, గిరి ప్రదక్షిణాలు విరమించుకున్నారు. భగవాన్‌తోపాటు ఆశ్రమమంతా కదిలితే, ఆ సమయంలో ఆశ్రమానికి ఎవరైనా కొత్తవారు వస్తే, వారికి ఇబ్బంది కలిగేది. ఆ తర్వాత భగవాన్ ఆశ్రమం వదలి ఎక్కడికీ వెళ్ళలేదు. ఉభయ సంధ్యల్లో కొండ మీదకు వెళ్ళేవారు. భగవాన్ని ఎంతోమంది, ఎన్ని చోట్లకో ఆహ్వానించారు. ఆయన ఎక్కడకూ వెళ్ళలేదు. ఆయన రోజులో ఎక్కువ భాగం ఆశ్రమంలో గడిపినా, ఆయనకు ఆశ్రమంలో దేనిపైనా ఆసక్తి, అనురాగం, వాంఛా, మమకారం, ఇష్టం, కోర్కె ఏమీ లేదు. ఆయనిది కేవలం నిష్కామకర్మాచరణ మాత్రమే !

దాదాపు పాతిక సంవత్సరాల కాలం శ్రీ రమణాశ్రమం మహాద్భుతంగా వెలిగింది. దేశ, విదేశాల నుంచి ఎందరో వచ్చి, భగవాన్ని దర్శించి, రకరకాల ప్రశ్నలు వేశారు. ఆ ప్రశ్న లన్నింటికీ భగవాన్ ఓర్పుగా, ఓపికగా, ప్రశాంతంగా, సహజంగా పూర్తిగా, చ మ త్కా ర ం గా సమాధానాలు ఇచ్చారు. ఆ సమా ధానాలు సరళంగా, సహజంగా, నూతనంగా, స్పష్టంగా, సూటిగా వుండేవి. 1936 - 39 మధ్యకాలంలో భగవాన్ మంచి ఆరోగ్యంగా వున్నారని చెప్పవచ్చు. అది శ్రీ రమణాశ్రమానికి స్వర్ణయుగమని అనవచ్చు. భగవాన్ ఎల్ల వేళలా అందరికీ దర్శనం ఇచ్చేవారు. అవసరమైనవారికి సమాధానాలు, సూచనలు, సలహాలు ఇచ్చేవారు. ఆయన చూపే ప్రేమ, దయ, కరుణ, అపారం. అన్నింటియందూ ఆయన దివ్యజీవనం ప్రకాశమానంగా వుండేది. ఆశ్రమం చేరిన వారందర్నీ అక్కడి పవిత్ర వాతావరణం ప్రభావితుల్ని చేసేది. ఇతర ఆశ్రమాలు మాదిరిగా శ్రీ రమణాశ్రమంలో ఎటువంటి బలవంతపు నిబంధనలూ లేవు. నిర్ణీత, నిర్బంధమైన కార్య క్రమాలంటూ ఏమీ లేవు. మీటింగులు, సమావేశాలు, భజనలు, చర్చలు ఏమీలేవు.కాని,కొందరుభక్తుల,ఆర్తులప్రశ్నలకు భగవాన్ సమాధానాలు ఇస్తూ వుండేవారు. వాటిని క్లుప్తంగా ఇక్కడ పొందుపరుస్తున్నాను:

ప్రశ్న :- అరుణాచలం వచ్చాక, మీలో వచ్చిన మార్పు ఏమిటి ?

భగవాన్ :- నే నెప్పుడూ ఒకే విధంగా వున్నాను. నాలో సంకల్పం లేదు. మామిడితోపులో ప్రవేశించేవరకు, కళ్ళు మూసుకుని వున్నాను. కళ్ళు తెరచి చూస్తున్నప్పటి నుంచీ చురుకుగా పనిచేశాను. అంతే భేదం. ఇంతే మార్పూ లేదు.

మొదట్లోనే "నేను దేహం కాదు" అని గుర్తించాను. అరుణాచలం వచ్చాక, అన్ని గ్రంథాలూ చదివాక నాకు కలిగిన అనుభవం ఆ గ్రంథాల్లో వుండటం గమనించాను.

" నేను పరబ్రహ్మను " అనేది కేవలం భావన మాత్రమే. అది ఒక ఆలోచన మాత్రమే! అది మానసికం. "నేను పరబ్రహ్మను" అని పరబ్రహ్మ అనదు. పరబ్రహ్మ అట్లా అనవలసిన పనీ లేదు. అనుకోవలసిన అవసరమూ లేదు. ఎందుకంటే, పరబ్రహ్మ స్వయంప్రకాశం.

పోతే, తథ్యమైన నేను కూడా, అట్లా అనదు. ఎందుకంటే, అది సదా పరబ్రహ్మ నిష్ఠము గనుక. "నేను పరబ్రహ్మను" అనే తలంపు, అన్ని తలంపులకూ కారణమైన మిథ్యా నేనుకు కలుగుతుంది. అది ఆత్మ నిష్ఠ కాదు. ఆత్మనిష్ఠులై వుండటమే అన్ని మతాల సారం. సాధనలో నిర్వికల్ప సమాధి కూడా ఒక స్థితే. నాకు సాధనతో ఎప్పుడూ, ఏమాత్రం సంబంధంలేదు. నేనెప్పుడూ ప్రాణాయామం చేయలేదు. జపమూ చేయలేదు. నాకు మంత్రాలు తెలియవు. తెలిసిన తర్వాత వాటికి ఆకర్షితుడనూ కాలేదు. ఇప్పటికీ నా మనసు వాటి మీద దృష్టి పెట్టడానికి నిరాకరిస్తుంది.

ప్రశ్న :- స్వామీ, మేము మీలో చాలా మార్పు చూశాం.

భగవాన్ :- అవును, చూస్తారు. దానికి కారణం, మీరు దేహధారులమనుకుంటూ, నన్నూ ఒక దేహధారిగా చూడటంవల్ల.

ప్రశ్న :- భగవాన్ని ఏది అరుణాచలం చేర్చింది ?

భగవాన్ :- మిమ్మల్ని ఏదీ ఇక్కడకు తీసుకొచ్చింది ?

ప్రశ్న :- మీ ఆధ్యాత్మిక దృక్పథంలో మీరు మధుర నుంచి తిరువణ్ణామలై వచ్చిన రోజుకీ, ఇప్పటికీ ఏమైనా మార్పు వుందా ?

భగవాన్ :- ఎంత మాత్రం లేదు. ఏమాత్రం మార్పు లేకుండా ఒకే అనుభవం అప్పుడూ, ఇప్పుడూ - పొడవునా వుంది.

ప్రశ్న :- అటువంటప్పుడు భగవాన్‌కి ఏం అవసరం వచ్చింది, అరుణాచలాన్ని స్తుతిస్తో, స్తోత్రాలూ అవీ రాయడం? అవి మాకోసమా ? మీకోసమా ?

భగవాన్ :- అవి ఎందుకు రాశానో నాకు తెలియదు. బహుశా అవి ఇతరులకోసమనుకుంటాను.

ప్రశ్న :- జీవితమంటే ఏమిటి ?

భగవాన్ :- అది నువ్వు చూసే దృష్టిమీద ఆధారపడి వుంటుంది.

* * *

ప్రశ్న :- నా నిజ స్వరూపం ఏమిటి ? అది నాకెట్లా తెలుస్తుంది? నేను లేననే భావం నాకు ఎప్పుడూ కలగదే! సర్వకాల, సర్వావస్థల్లో "నేనున్నాను" అనే భావమే కలుగుతుంది. కనుక నేను సదా వున్నాను కదా ? అది మబ్బుల చాటున సూర్యుని మాదిరిగా కావచ్చు. కాని, నా నిజ స్వరూపం ఏమిటో నాకు తెలియకున్నది. దాన్ని ఎలా తెలుసుకో గలుగుతాను?

భగవాన్ :- చిత్తనిరోధం వల్ల కలిగేది ఆత్మప్రాప్తంకాదు. ఆత్మ ఎప్పుడూ వున్నదే. అది మన నిజస్వరూపంగా వుంది. కాని, నిరోధం వల్ల ఏ స్థితి ఏర్పడునో అదే నీ స్థితి.అదే నీ నిజస్వరూపం.అది శుద్ధ నిర్వికల్ప స్థితి. ఆ నిర్వికల్ప జ్ఞానస్థితినుంచి ఏ మహాత్ములైనా తిరిగి లోకవ్యవహారదశకు అంటే, సంకల్ప దశకు వచ్చినా, వారిలో గత స్వరూపానందమే స్ఫురణగా వెలుగుతుంది. అప్పుడు వారికి వుండేది కేవలం దృక్ మాత్రమే. కాని, దృశ్యం కాదు. ఎందుకంటే, వారికి ఆత్మ తప్ప తక్కినదంతా దృశ్యజాలం. అద్దం లేకపోతే ప్రతిబింబానికి ఉనికిలేనట్లు, జ్ఞానం లేకపోతే జ్ఞేయానికి ( దృశ్యానికి ) ఉనికి లేదు. తెలుసుకోబడే దాన్ని, తెలుసుకునేది జ్ఞానం. ఆ జ్ఞానాన్ని తెలుసుకునేందుకు, ఇంకో జ్ఞానం లేదు. అందుచేత జ్ఞానం దానికది తెలియ వలసినదే! అలాగే తెలుసుకునే వాడిని తెలుసుకునేందుకు, ఇంకో తెలుసుకునేవాడు లేడు.

ప్రతిబింబాన్ని చూసి, "అసలు దర్పణం వుందా ? లేదా?" అని అనడం అవివేకం. సమస్త జ్ఞేయం జ్ఞానం యొక్క అంతరమందు భాసిస్తుంది. జ్ఞానమంతా ఒకటే. దాన్ని విడిచేయడానికీ, ముక్కలు చేయడానికీ వీలులేదు. అన్నీ దాంట్లోనివే. అదే "చిత్". అదే చైతన్యం. అది దానంతట అది ప్రకాశిస్తుంది. అది స్వయంప్రకాశం.

దృష్టిని జ్ఞేయమగు సకల పదార్థం నుంచి మరల్చి, అంతర్ముఖం చేసినట్లయితే, ఆ దశలో కేవలం శుద్ధ జ్ఞానం, అంటే, చైతన్యం మిగులుతుంది. అదే

నీ స్వరూపం. అంటే, చిత్తనిరోధానంతరం, శేషించి నదే నీ నిజస్వరూపం. అట్టి నీ స్వరూపమందే సకల జగత్తూ జ్ఞేయ రూపంలో ప్రకాశించుచున్నది.

* * *

ప్రశ్న :- ఈ సృష్టి ఆనందం కోసమా? దుఃఖం కోసమా? దేని కోసం సృష్టింపబడ్డది ?

భగవాన్ :- సృష్టి మంచిదీ కాదు, చెడ్డదీ కాదు. అది ఎలా వుందో, అలా వుంది. మనిషి మనసు దానిపై అన్ని రకాల నిర్మాణాలు చేసింది, తనకు అనుకూలంగా వీలైన పద్ధతుల్లో.

స్త్రీ, ఎప్పుడూ స్త్రీయే. కాని, మనిషి మనసు స్త్రీని అనేక పేర్లతో — అమ్మ, అక్క, భార్య అంటుంది. మనుష్యులు ఆ స్త్రీలను ప్రేమిస్తారు. పాముల్ని ద్వేషిస్తారు. ఈ బంధాలు దుఃఖకారణాలు.

సృష్టి, మర్రి వృక్షం మాదిరిగా వుంది. పక్షులు దాని పళ్ళు తినడానికి, దానిపై వాలతాయి. దాని కొమ్మల్లో నీడకై చేరతాయి. మనుష్యులు దాని నీడలో సేద దీర్చుకుంటారు. కాని, కొందరు దాని కొమ్మలకు ఉరి పోసుకుని చనిపోతారు. అయినా ఆ చెట్టు దాని సహజీవనాన్ని అది ప్రశాంతంగా సాగిస్తుంది. జరిగిపోతున్న సంఘటనలతో ఎటువంటిసంబంధంలేకుండా. మనస్సే తన కష్టాల్ని తాను సృష్టించుకుని, ఏడ్చి, బాధపడి, సహాయం కోసం చూస్తుంది.

భగవంతుడు ఒకరికి శాంతిని, ఒకరికి అశాంతిని ఇచ్చే పక్షపాతికాడు. సృష్టిలో అందరికీ, అన్నింటికీ చోటు వుంది. కాని, మనిషి మంచిని చూడ్డానికి నిరాకరిస్తాడు. కాని, భగవంతుడు అతన్ని నిరాకరించడు. ఆయన నిరంతరం అతన్ని ఉద్ధరించడానికి సహాయంగా గురువుల్ని, జ్ఞానుల్ని పంపుతాడు. తద్వారా తన తప్పు తాను తెలుసుకుని, బాగుపడతాడనే ఉద్దేశ్యంతో.

* * *

ప్రశ్న :- ఈ విశ్వానికి మూలమేది ? దీనికి కారణం ఏమిటి ?

భగవాన్ :- మీకు స్వంత ఆందోళనలు, ఆరాటాలు, ఆతృతలు అంటూ ఏమీ లేవా ?

ప్రశ్న :- నాకు వున్నాయనుకోండి. అందుకే ఈ జీవితం మృత్యువు-చైతన్యం-ప్రజ్ఞ-స్ఫురణ-తెలివి-జ్ఞానం అనే వాటి గురించి తెలుసుకోవాలనుకుంటున్నాను.

భగవాన్ :- "నేను" అంటే ఎవరు? తెలుసుకునేది ఎవరు? తెలుసుకునేది ఏమిటి? మీరు జీవించి వున్నారా ?

ప్రశ్న :- నేను నా దేహాన్ని చూస్తున్నాను కనుక, నేను బ్రతికే వున్నాననుకుంటున్నాను.

భగవాన్ :- ఎల్లవేళలా మీరు మీ దేహాన్ని చూస్తున్నారా ? చూడగలుగుతున్నారా ? నిద్రలో దేహం-ప్రపంచం ఎక్కడ వున్నాయి ? ఎట్లా వున్నాయి ?

ప్రశ్న :- నాకు తెలియదు. అదంతా మర్మం, మాయగా వుంది.

భగవాన్ :- నిద్రలో దేహం, ప్రపంచం ఏమౌతున్నాయో మీకు తెలియక పోవచ్చు. కాని, అంత మాత్రం చేత మీరు లేకుండా పోయారా ?

ప్రశ్న :- నాకు తెలియదు.

భగవాన్ :- పోనీ, ఇప్పుడు వున్నానని ఎట్లా అనుకోగలుగు తున్నారు ?

ప్రశ్న :- నేనిప్పుడు ఎరుకలో, మెలకువలో వున్నాను. నా దేహం కదులుతోంది, చూస్తోంది, యోచిస్తోంది.

భగవాన్ :- మీ దేహం కదిలి, యోచిస్తున్నట్లు చూస్తున్నారు; మీరు ఇక్కడవుండి, నిద్రిస్తూ అన్నిచోట్లా తిరిగి చూస్తున్నట్లు చూస్తున్నారు.

ప్రశ్న :- ఇదంతా అయోమయంగా వుంది. నిత్యమైన 'నేను' శాశ్వతంగా వున్నట్లు, నా అహం మాత్రం మారు తున్నట్లు అనుకోవచ్చునా ?

భగవాన్ :- అంతే, మీలో రెండు "నేను"లు వున్నట్లుగా అను కుంటున్నారా? ఒకటి శాశ్వతమైన నేను, మరొకటి మిథ్యా నేను, 'అహం'గా. అది సంభవమా ?

ప్రశ్న :- అసలు సత్యానికి నాకు మార్గం చూపండి.

భగవాన్ :- శాశ్వతం, నిత్యసత్యం, వాస్తవం—అదే అసలు తెర. ఆ తెరపై అనేక చిత్రాలు వచ్చి, పోతూ వుంటాయి. యావత్ విశ్వం, మనుషులు, సమస్త వస్తు సము దాయం, ఆలోచనలు, సంగతులు, సంఘటనలు, విష యాలు-అవన్నీ కేవలం బొమ్మలు, చిత్రాలు మాత్రమే; ఆ స్థిర తెరపై. అంతే! ఎప్పుడూ వుండేది తెర ఒక్కటే. అది స్థిరం, శాశ్వతం, నిత్యసత్యం.

ప్రశ్న :- మాకు తాంత్రిక సాధన గురించి చెప్పండి?

భగవాన్ :- పరిపక్వం చెంది, ఆత్మాభివృద్ధి అధికం చేసుకునేందుకూ, లేదా—దాన్ని పరిపూర్తి చేసుకొనేందుకూ ఈ లోకాన అవతరించిన వారికే తాంత్రిక సాధన లాభిస్తుంది. ప్రారంభ దశలో వున్నవారికీ, పరిపక్వం కానివారికీ ఆ సాధన అపకారం చేస్తుంది.

* * *

ప్రశ్న :- "చిజ్జ్యోతి" అంటే ఏమిటి ?

భగవాన్ :- సమస్తం చిత్. మన ఆలోచనలు, ఆశలు, ప్రయత్నాలు అన్నీ — మంచి — చెడు, అంతా - చిత్. ఆ చిత్తే, ఆత్మ. దానికి ఏ పేరైనా పెట్టుకోవచ్చు.

విశ్వంలో గోళాలు లేస్తూ, అణగుతూ వున్నా, ఆ చిత్ మాత్రం మారక, చెదరక నిశ్చలంగా, శాంతంగా వుంటుంది. అదే అన్నింటికీ మూలం. అగ్నికి వేడి వలె, సూర్యునికి కాంతి వలె - "ఎరుక" దాని సహజ స్వభావం.

సృష్టి - స్థితి - లయ కారణమూ అదే.

ఏది స్వయం ప్రకాశమో, దేనిచే సమస్తం ప్రకాశిస్తుందో, ఏది లోపల మనస్సుగా, బైట ఇంద్రియ గోచర ప్రపంచంగా కనబడుతోందో ఆ సచ్చిత్తే, చిజ్జ్యోతి. ఆ జ్యోతే, ద్రష్టకు దృక్కునిస్తుంది. దృశ్యాన్ని ప్రకాశింపజేస్తుంది. కాని, అది దృశ్యం కాదు. అయినా దాని కాంతితో సమస్తాన్ని చూడవచ్చు.

* * *

ప్రశ్న :- "చిదాత్మ" అంటే ఏమిటి ?

భగవాన్ :- వర్ష రూపంలో పడిన చినుకు, నదిలో పడి, నదై - మహాసముద్రంలో కలిసి, మహాసాగరమైనట్లు, మూర్తీ భవించిన ఆత్మ, విశ్వాత్మలో కలిసి "చిదాత్మ" అవుతుంది.

* * *

ప్రశ్న :- ధ్యానం ఎట్లా చేయాలి ? అసలు ఎందుకు చేయాలి?

భగవాన్ :- ఒక ఆలోచన మీద మనసును ఏకాగ్రం చేయడమే ధ్యానం. అలా ఏకాగ్రం చేయగా తక్కిన ఆలోచనలన్నీ కలిసి, ఒక్క పెట్టున ఏకాగ్రం చేయ బడిన, ఆ ఒక్క ఆలోచన మీద విరుచుకుపడతాయి. తత్ఫలితంగా ఆలోచనల మధ్య తీవ్ర పోరాటం ఏర్పడుతుంది.

నిరంతర సాధనవల్ల, ఏకాగ్రం చేయబడిన ఆలోచన క్రమంగా బలపడి, తక్కిన ఆలోచనల్ని తరిమేస్తుంది. ఈ రకమైన పోరాటం, నిరంతర ధ్యానంతోపాటు సాగుతూ వుంటుంది. లక్ష్యసిద్ధికోసం ధ్యానంలో మనసుచేత చురుకుగా పనిచేయించాలి. బైట ఏదీ తనపై ప్రభావం చూపకుండా, అనుక్షణం చూసు కోవాలి.

ధ్యానానికి కావలసింది, అనుగ్రహం కాదు, నిరంతర సాధన. ఏకాగ్రత, మేధస్సులో కాదు; హృదయంలో. నీ నిజస్వభావమే, ధ్యానం. ఆలోచనారహితస్థితే ధ్యానం. ఇంక మిగిలేది నువ్వు. అంటే, "నువ్వు" అన్నే, "నేను", ఆ "నేనే", దైవం - సత్యం -

ఆత్మ. దాన్ని అందుకోవడానికే నువ్వు ధ్యానం చేయాలి, ధ్యానమంత ఉత్తమమైనది మరొకటి లేదు.

* * *

ప్రశ్న :- పరిపూర్ణ నిరహంకార స్థితిని పొందేదెట్లు ?

భగవాన్ :- మనసు దాని మూలంలో అది మునగకపోతే, అహం చావకపోతే, సహజస్థితిని ఎట్లా పొందగలం? ఎక్కడ అహం లేదో, అక్కడ మనం "అదై" వుంటాం. అంటే, అసలు సత్యమై వుంటాం. వేదాల ఉద్దేశ్యం కూడా "అదే మనమై వున్నాం" అని చెప్పడం. పరమోన్నతమైన ఆ శక్తి ఉనికినీ, చైతన్యాన్నీ, నాశనరహితమైన ఆత్మ స్వభావాన్నీ, దాన్ని పొందే విధానాన్ని గ్రంథాలూ, శాస్త్రాలూ తెలియ జేస్తున్నాయి.

అహంకారం నాశనం కావడమే, ఆత్మ. అహంకారం వున్నంతకాలం, బంధం- అజ్ఞానం తప్పవు. "నేను ఎప్పుడు - ఎక్కడ - ఎట్లా బందీనైనాను?" అని అనవసరంగా ఆలోచిస్తో కూర్చోవద్దు. త్వరగా విముక్తి మార్గం తెలుసుకో.

అసంగతమైన, అసంబద్ధమైన ప్రశ్నలు వదులు. త్వరపడు. ముందున్నది విమోచన మార్గం. దాన్ని అనుసరించు.

ఆనందానికీ, శాంతికీ ప్రధాన శత్రువు, "అహం - కారం". అందుచేత దాన్ని రెచ్చగొట్టకూడదు. సమస్యలు, సందేహాలు, సంశయాలు, ప్రశ్నలు

తెచ్చిపెట్టుకోకూడదు. వాటి సమాధానాలకోసం, సంతృప్తికోసం మరిన్ని ప్రశ్నలు వేసుకుని నిన్ను నువ్వు వేధించుకోకు. అదంతా తెలివీ, ప్రకటనా, ఆర్భాటం మాత్రమే. ఏ పద్ధతిలోనైనా అహంకారం వుండనే వుంటుంది. కనుక అసలు ప్రశ్న, ప్రశ్నగానే పరిష్కారం కాకుండా మిగిలి వుంటుంది.

ఉత్పన్నమైన ప్రశ్నను పొడిగించడం కన్నా, దాన్ని అరెస్ట్ చెయ్యి. దాన్ని ఖైదులో బంధించి, " నే నెవరు ? " అనే విచారణతో ప్రశ్నను తోసెయ్యి.

అయినా అహంకారం నీడలా నిన్ను వెన్నంటే వుంటుంది. దాన్ని పూడ్చెయ్యాలని గొయ్యి తీసి, ఆ గోతిలోకి దిగి, ఆ నీడను అందు పూడ్చి, తాను గోతిపైకి రాగానే, ఆ నీడా ఎప్పటి మాదిరిగానే అతని వెనక ప్రత్యక్షమౌతుంది. అందుచేత ఆ నీడను అసలు గమనించకపోవడమే సరైనమార్గం. అహంకారం వున్నంతకాలం అజ్ఞానం, బంధం తప్పవు. ఆత్మదర్శనమైందా, హృదయగ్రంధి పీడిందా, సందేహాలు తొలగుతాయి. సర్వ కర్మల కారణం తొలగుతుంది. అదే నిరహంకారస్థితి. అదే ముక్తి. అంటే, ఏమీ తలెత్తకపోవడం. అహంకారం ఎప్పటికీ తలెత్తకుండా చావడం.

నిద్ర, నిరహంకార స్థితికి నిదర్శనం. అదే చైతన్యం. అంటే, అదే శూన్యం, ఆత్మ, పరమాత్మ. దాన్నే " I AM " "నేనున్నాను" అని అంటారు. ఆ స్థితిని

అందుకున్నవారు కూడా, ఆ స్థితి ఏమిటో మాటల్లో వర్ణించి చెప్పలేరు. అది "సచ్చిదానందస్థితి". శాంతి, ఆనందం, మోక్షం, అన్నీ అదే!

* * *

ప్రశ్న :- శాంతి అంటే ఏమిటి?

భగవాన్ :- మన స్వభావమే, మన స్వరూపమే శాంతి. కాని, మనకు మనమే అశాంతిని ఆపాదించుకుంటాం. మళ్లా శాంతికోసం తంటాలు పడతాం. నిజం చెప్పాలంటే మనమెప్పుడూ శాంతిలోనే వుంటాం. వేదాలు ఆత్మ గురించి ప్రస్తావిస్తూ, దాన్ని సంపూర్ణ శాంతిగా అభివర్ణించాయి.

"శాంతి, శాంతి" అని అలమటించడం ఎట్లా వుంటుందంటే పీకలోతు నీళ్ళలో వుండి దాహం తీరలేదన్నట్లు వుంటుంది.

ప్రశ్న :- ఆనందం ఎట్లా లభిస్తుంది ?

భగవాన్ :- సామాన్యంగా అందరూ జీవితంలో శాంతిని, ఆనందాన్ని కోరుకుంటారు. కాని, అవి దుర్లభమైనవి. ఏదో కష్టం కలిగినప్పుడు శాంతి, ఆనందంకోసం ఎదురుచూస్తారు. తాత్కాలిక ఉపశమనం కలిగితే, వూరుకుంటారు. మళ్ళా బాధ కలిగితే, ఏడుస్తారు. కాని, దాని శాశ్వత నివారణకు, శాశ్వత ఆనందానికి యోచించరు. దానికోసం గురువుల్ని అర్థిస్తారు, ఆశ్రమాలు చేరుతారు, సాధనలు చేస్తారు. కాని, నిలిచి దుఃఖకారణమేమిటో యోచించరు.

అనంతమైన ఆనందాన్ని అందరూ ఆకాంక్షిస్తారు. కాని, దాన్ని తమకు విడిగా బైట వుందని వెదుకుతారు. అక్కడే పొరబడుతున్నారు. తాము కోరే ఆనందం ఎప్పుడూ తమలోనే సహజంగావుంది. ఆ దారిని నెమ్మదిగా, జాగ్రత్తగా వెనక్కి వెళ్ళి, మూలం చేరుకోవాలి. అక్కడ తనని తాను చూసుకోవచ్చు. నిత్యానందాన్ని కనుక్కోవచ్చు. ఉన్నది ఆనందం ఒక్కటే. అది నిత్యసత్యం. అది పరిపూర్ణం. నిత్యనూతనం. అది ఎప్పుడూ మన చుట్టూ వుంది. కాని, ప్రపంచం దాన్ని అనేకంగా, నిరంతరం కదిలి మారేదిగా చూపుతుంది. అదే సుఖం, సంతోషం.

బాహ్య సంగతులవల్ల మనలో కలిగే మార్పే సంతోషం. అవి ఒక్కోసారి సంతోషాన్ని ఇవ్వవు కనుక అది శాశ్వతానందం కాదు. కలత, కలలూ లేని గాఢ నిద్రే సుఖావస్థ. అది ఆనందమైన స్థితి. దానికోసం కొందరు మత్తుమందులు తీసుకుంటారు. వాటివల్ల ప్రయోజనం లేదు. అందుకే ఆనందమనేది మనిషి ఆంతరంగిక స్వభావమంటున్నారు కొందరు పెద్దలు.

కుక్క బొమికను కొరుకుతుంది. అది దాని అంగట్లో గుచ్చుకుని రక్తం కారితే, అది ఆ రక్తాన్ని ఇష్టంతో తాగి, ఆ రక్తం బొమికలోంచే వస్తోందనుకుని ఆనందించినట్లు, సుఖ - సంతోషాలు బైట నుంచే వస్తాయనుకుంటారు. కాని, అవి నిజంగా మనలోంచే మన ఆనందంలోంచే కలుగుతాయి.

మనం నిరంతరం ఏదో ఒకటి కోరుకుంటూ వుంటాం, ఆ కోర్కెతో భయం పుడుతుంది. భయం, కోర్కె రెండూ ఆనందానికి పరమ శత్రువులు. కోర్కె తీరకపోతే, అశాంతి. కోర్కె అనేది, అంతులేని అగాధం వంటిది. దాన్ని దేనితోనూ నింపలేము. దానికి అంతూ లేదు. అదొక జ్వాల. భయమూ అంతే! ఆ రెండూ వున్నంతకాలం, ఆనందం శూన్యం. వాటిని జయిస్తేనే, నిజమైన శాంతి. వాటిని జయించిన వాడే, తాను వాటిని ఎట్లా జయించాడో చెపుతాడు.

* * *

ప్రశ్న :- స్వామీ, తమ సన్నిధిలో వున్న పదిరోజులూ శాంతి పొంది, ఆ స్థితిని కొన్నాళ్లు ఇంటిదగ్గర కూడా అనుభవించాను. క్రమంగా శాంతి పోయింది. తిరిగి నాకు నా పాత బుద్ధిమాంద్యం, అవివేకం వచ్చేశాయి.

భగవాన్ :- మనసును దృఢపరిస్తే, శాంతి శాశ్వతంగా నిలుస్తుంది. నిరంతర సాధనవల్ల మనసుకు శక్తి లభిస్తుంది.

* * *

ప్రశ్న :- అన్ని యోగాల ఆంతర్యం, వృత్తినిరోధం. దానికి EFFORT - ప్రయత్నం ముఖ్యం. EFFORT అంటే యోగమే కదా ? కాని జిడ్డు కృష్ణమూర్తిగారు EFFORTLESS - CHOICELESS - AWARENESS - అంటారు ఏమిటి ?

ගవాన్ :- అవును. అదే సహజ స్థితి. అహంకారం వున్నంత వరకు, ఎంతటివారూ ప్రయత్నించకుండా వుండలేరు. పైగా ఆ ప్రయత్నాన్ని ధర్మంగా, బాధ్యతగా, విధిగా, సాంప్రదాయంగా భావిస్తారు.

మనిషి ఏదో ఒకటి చేయకుండా వూరికే వుండలేడు. ఆ ఏదో ఒకటి చేసేటప్పుడు తనని తాను లోపలా బైటా శారీరకంగా, మానసికంగా, శుభ్రం చేసుకోవడం మంచిది. అంటే, ఏళ్ళతరబడి పోగుజేసి, నిలవ వుంచుకున్న వ్యక్తిత్వాన్ని క్రమంగా వదులుకోవడమూ, ఏ బంధమూ లేకుండా స్వేచ్ఛగా వుండటమూ. అంటే, ఆలోచించకుండా వుండటం. ఎప్పుడూ తాను తానుగా వుండటం. అంటే, తనని తాను తప్ప మరి దేన్నీ తీసుకోకపోవడం. అన్నింటినీ తోసెయ్యడం.

ఈ పద్ధతి చాలా ఆశ్చర్యకరంగా, అద్భుతంగా విస్మయకరంగా, సంభ్రమంగా వుంటుంది. కాని, ఆచరణకు అసాధ్యం.

ఇదంతా తనని తాను తెలుసుకోవడానికి మార్గం. ఎందుకంటే, ఎవరికైనా, ఎప్పటికైనా "నేనెవరిని?" అనే ప్రశ్న కలగక మానదు. అందుచేత అనుక్షణం ఏం చేస్తున్నా "నే నెవరిని ? చేసేదెవరు ?" అని ప్రశ్నించుకోవాలి. అంటే, ఆ "నేను" ను తప్ప మరి దేన్నీ లక్ష్యపెట్టక, అన్నింటినీ తోసెయ్యాలి. తెలుసుకోవడానికీ, తోసెయ్యడానికీ అసలు ఏమీ లేదు. కాని, అంతా వుందనుకుంటున్న మనకు ఈ ప్రపంచం, ఈ దేహం, ధనం, ఉనికి, వ్యక్తిత్వం

స్వార్థం, సాధన, ధ్యానం, ఆత్మసాక్షాత్కారం అన్నీ, అంతా అబద్ధపు ఆలోచన మాత్రమే! చివరికి మనమూ ఒక ఛాయ మాత్రమే.

దేవుడు - దెయ్యం ; స్వర్గ - నరకాలు, అన్నీ అంతా అసలు నువ్వు వుంటేనే వుంటాయి. నువ్వు లేకపోతే, ఏదీ లేదు. కాని, నువ్వూ, నీ ఆలోచనలూ, ఆశలూ, ఆశయాలూ, ప్రయత్నాలూ అన్నీ నీ మనోకల్పన. ఈ నామ - రూపాలన్నీ అసత్యం. అసలు వున్నది, ఆత్మ ఒక్కటే. అదే "అసలు నేను". అది భౌతికం కాదు. అది ఇచ్ఛా, భావనా కాదు. అది ఏదీ కాదు. అట్లా అన్నింటినీ వివేకంతో "కాదు - కాదు" అంటూ నిరాకరిస్తో, నెమ్మదిగా జాగ్రత్తగా, శ్రద్ధగా, నిజంగా విచారణ చేస్తే క్రమంగా తాను చివరికి ఏదీ కాకుండా అఖండ ఆత్మగా అనుభవేద్యమౌతుంది. అదే అసలు పరమాత్మలో ఐక్యం కావడం. అందుకే జీసస్ అంటారు "నేనూ, నా తండ్రీ ఒకటే" అని. అలా అనడంలో ఆయనిది ఆత్మభావం.

"అయితే మనం ఏం చెయ్యాలి ?" అనే ప్రశ్న కలగక మానదు. మనమా? మనం చేయవలసింది, చూడవలసిందీ వూరికే వుండటం. ఈ భూలోక రంగస్థలంపై మనకు ఇవ్వబడిన పాత్రను సక్రమంగా అభినయించడం.

ఏది కొత్తగా నేర్చుకోవాలన్నా, గురువు అవసరం. ఎవరి వలన సకలం తెలుస్తుందో, వారే గురువు. ఆ సకలమే, సత్యం. ఆ సత్యం అందరిలో వుంది. కాని, మనల్ని నడిపేందుకు ఆ సత్యం ఒక రూపంలో దర్శనమిస్తుంది. ఆ రూపాన్ని "గురువు" అంటాం. అంటే, "గురువు" అనే ఆయన మనకు విడిగా, బైట వున్నారని భావిస్తాం. కాని, ఆ గురువు మనలోని ఆ భావాన్ని, భ్రాంతిని, మాయని, అజ్ఞానాన్ని తొలగించి, మన లోపలి గురువును మేల్కొల్పుతారు. అంటే, మన పొరపాట్లను, మనం తెలుసుకునేటట్లు చేస్తారు. పక్వదశకు వచ్చినప్పుడు, మనల్ని సరైన దారికి మళ్లించి నడుపుతారు. అంతేకాని, ఆయన మనకు ఆత్మసాక్షాత్కారాన్ని కలిగించరు. కాని, ఆ దారిలోని అడ్డంకుల్ని, అవరోధాల్ని, అభ్యంతరాల్ని తొలగిస్తారు.

దేహాత్మ బుద్ధివలన తాను ఒక ప్రత్యేక వ్యక్తిననే అజ్ఞానం - భ్రాంతి - మాయ కలుగుతాయి. అలాగే గురువును కూడా తనవలె దేహధారి అయిన ఒక ప్రత్యేక వ్యక్తి అనుకుంటారు. అలా అనుకోవడమే పెద్ద పొరపాటు. ఆ భావం పోవడానికే ధ్యానం.

అటువంటి ద్వంద్వ భావం వున్నంతకాలం, బాహ్య గురువు అవసరం. అసలు సత్యం తెలుసుకున్న తర్వాత తానూ, గురువూ ఒకటేనని తెలుసుకుంటాడు. తనతోపాటు గురువూ అశాశ్వతమనీ, శాశ్వతమైనది ఆత్మ ఒక్కటేననీ తెలుసుకుంటాడు. ఆ ద్వంద్వ భావం అదృశ్యం కావడమే, అజ్ఞానం తొలగడం. ప్రతి ఒక్కరిలో ఆత్మగా, శాశ్వత దివ్యకాంతిగా వున్నారు గురువు. నిరాకార ఆత్మే గురువు. గురువూ, ఆత్మా, ఈశ్వరుడూ ఒకటే.

గురువును మొదట బాహ్యంగా కనుక్కోవడం, తర్వాత లోపల దర్శించడం విషయంలో వి. వెంకట్రామన్‌తో "ఇప్పటి

వరకు మీరు మొదటిదే చేశారు" అన్నారు భగవాన్. అంటే, మీరు గురువును బాహ్యంగానే చూశారు.ఇంక ఆయన్ని ఆంతర్యంలో దర్శించండి" అని అర్థం.

వెంకట్రామన్ శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యులు. ఆయన కోర్కె, తన గురువైన రామకృష్ణ పరమహంస స్థితికి తక్కువస్థితి కానివారిని, సజీవంగా, దేహంతో అంటే, రక్త, మాంసాదులతో వున్నవారిని దర్శించాలని. ఆ తర్వాత ఆయన శ్రీ రమణమహర్షి పేరు విన్నారు. వారి దర్శనానికి ఆశ్రమానికి వచ్చారు. వస్తో ఒక పూలమాల తెచ్చారు. ఆయన హాల్లో ప్రవేశించిన సమయానికి భగవాన్ దగ్గర ఎవరూ లేరు. ఆయన తెచ్చిన పూలమాలను భగవాన్ చేతికి ఇచ్చారు. ఆయన దాన్ని రెండు భాగాలుగా విడదీసి,ఒకభాగం గుడిలో లింగానికీ,రెండోభాగం అక్కడ గోడకు వేళ్ళాడుతున్న శ్రీ రామకృష్ణ పరమహంస పటానికి వేయమని పరిచారకునికి ఇచ్చారు. అది చూసి వెంకట్రామన్ ఎప్పటికీ తన గురువు శ్రీ రామకృష్ణ పరమహంసేనని గుర్తించారు. ఆయన హృదయం శాంతపడింది. ఆయన్ని ఉద్దేశించి, "మీరు దక్షిణామూర్తి గురించి విన్నారా ?" అని అడిగారు భగవాన్. "వారు మౌన దీక్ష ఇస్తారని విన్నాను" అన్నారు వెంకట్రామన్.

"ఇక్కడా అదే ఉపదేశం పొందుతారు" అన్నారు భగవాన్. అని "అసలు ఏది మిమ్మల్ని ఇక్కడకు తీసుకొచ్చింది?" అని మళ్ళా అడిగారు.

"మీ గురించిన యోచన" అన్నారాయన.

"అదే సాధన. అది చాలు" అన్నారు భగవాన్. అంటే, మననం ముఖ్యమని అర్థం. ఆ మననమే గురువై నడుపుతుంది. గురువు అనుగ్రహమే నిరంతర మననాన్ని లభింపజేస్తుంది.

శరణాగతి పొంది మనసును శాంతపరచి,గురువు అనుగ్రహం పొందటం అంత తేలికైన పని కాదు. దానికి కూడా గురువు అనుగ్రహం కావాలి. నిరంతరం సంపూర్ణ ఎరుకలో వుండాలి, తీవ్ర సాధన చేయాలి,భారమంతా గురువుపై వుంచాలి.

గురువు ఎప్పుడూ నిర్మలంగా, శాంతంగా, మౌనంగా వుంటాడు. ఆయన మౌనం అపారం. ఆ మౌనంతో మనలోని ప్రత్యేక వ్యక్తిత్వపు భావనని తొలగిస్తాడు. ఆ మౌనమే ఆయన బిగ్గరగా అరిచే ఉపదేశం. అన్నిటికన్నా మౌనోపదేశం గొప్పది.

గురువులందరి లక్ష్యం ఒకటే - మానవాళికి సహాయం చేయడం; ప్రజల వికాసంకోసం పాటుపడటం. వారు అహంకారంలో అణగిపోకుండా, భ్రాంతిలో మునిగిపోకుండా, ఉద్ధరించి వారి ఆత్మోన్నతికి సహాయపడటం. కాని, గురువులందరిదీ ఒకటే పద్ధతి కాదు. వారి భాషలూ భిన్నమే. చాకలి బట్టల్ని రాతిబండమీద బాదటం, బట్టల్ని చింపాలని కాదు; వాటిని అతుక్కున్న మురికిని వదలగొట్టడంకోసం. అలాగే గురువు మనోమాలిన్యాల్ని పోగొట్టేం దుకు అనేక కఠిన నియమాల్ని ఏర్పరుస్తాడు. మత్తగజంలాంటి అహంకారాన్ని అణచగలిగేది, సింహం వంటి గురువు ఒక్కడే. వెదికేవారికి దారిచూపడం, గురువు పని. అంతేకాని, మతస్థాపన, దీక్షలివ్వడం, ఉపదేశాలు చేయడం కాదు.

* * *

**1935** - జనవరి మొదటి వారంలో "పిగ్గోట్" అనే ఒక ఇంగ్లీషు ఆమె పాల్ బ్రంటన్ రాసిన పుస్తకం చదివి, ఉత్తేజితురాలై భగవాన్ దర్శనానికి వచ్చింది. ఆమె వచ్చిన సమయానికి ఆశ్రమంలో, భగవాన్ సన్నిధిలో చాలామంది వున్నారు. భగవాన్ సోఫాలో కూర్చుని ఎటో చూస్తున్నారు.

పిగ్గోట్ :- స్వామీ, ఆత్మానుభవానికి ఆటంకాలేవి ?
భగవాన్ :- వాసనలు.
పిగ్గోట్ :- వాటిని పోగెట్టేదెట్లు ?
భగవాన్ :- ఆత్మజ్ఞానం వల్ల.
పిగ్గోట్ :- ఆత్మా నుభవానికి సాయపడేవి ఏమిటి ?
భగవాన్ :- శ్రుతివాక్యాలు, జ్ఞానుల బోధలు.
పిగ్గోట్ :- ఆత్మసిద్ధికి గురువు అవసరమా ?
భగవాన్ :- గురువు అనుగ్రహ ఫలితమే ఆత్మసాక్షాత్కారం. ఉపదేశాలకన్నా, ఉపన్యాసాలకన్నా, శ్రవణ, ధ్యానాదులకన్నా గురువు అనుగ్రహం ఎక్కువ ఫలితాన్ని ఇస్తుంది.

జీవితంలో గురువు అనుగ్రహ ఫలితమే, ముఖ్యమైన - ప్రధానమైన సంగతి. తక్కినవన్నీ రెండో పక్షానికి చెందినవి ! అనే మాటను ఆధారంగా తీసుకుని అరవిందబోసు భగవాన్ని అడిగారు, "సాధకుని ప్రయత్నం ఫలించడానికి గురువు అవసరం అనుకుంటాను. భగవాన్ మా కోసం అట్లా అనుకుంటారా? " అని.

"మీకు సాధన ముఖ్యం, అవసరం. అనుగ్రహం ఎప్పుడూ వుండనే వుంది" అని, కొంతసేపు ఆగి, "పీకలోతు నీళ్ళలో నిలబడి "దాహం, దాహం" అని అరుస్తున్నారు మీరు. సూర్యుణ్ణి చూడాలంటే, ఆయన ప్రకాశించే దిక్కుకు తిరగాలి" అన్నారు భగవాన్. అంటే, దృష్టి మార్చుకోమని అర్థం.

భగవాన్ ఆ విషయాన్నే శివప్రకాశం పిళ్ళెకు హామీగా "పులినోట పడ్డ మాంసంకండ తప్పిపోయినట్లు, గురువు అనుగ్రహం పొందినవారు తరించకపోరు. ఎప్పటికి తరించబడకుండా విడవబడరు" అన్నారు.

మరొక భక్తునితో, "నువ్వు భగవాన్ని వదలి వెళ్లిపోవాలన్నా, భగవాన్ నిన్ను వదలి పోనివ్వరు" అన్నారు భగవాన్.

"గురువులోంచి అనుగ్రహం ప్రసరించింది కాదు, ప్రసరించ బడింది, అని వుండాలి" అని ఒక సందర్భంలో భగవాన్ సుందరేశ అయ్యర్‌ని సరిదిద్దారు.

తమకు ఎంతకీ పురోభివృద్ధి కనుపించడం లేదని "నేను ఇలాగే వుంటే, నరకానికి పోతాను" అన్నాడు ఒక భక్తుడు భగవాన్‌తో.

"నువ్వు నరకానికి వెళ్ళినా, నిన్ను భగవాన్ వదలక వెనక్కి తీసుకొస్తారు" అన్నారు భగవాన్ అతనితో.

అవకాశం కల్పించిన అటువంటి సందర్భాన్ని ఆధారంగా తీసుకుని చాడ్విక్ "భగవాన్, తమకు శిష్యులు లేరన్నారు" అన్నారు.

"అవును, లేరన్నాను" అన్నారు భగవాన్.

చాడ్విక్ :- ముక్తి పొందాలనుకునేవారికి గురువు అవసరం అన్నారు భగవాన్.

భగవాన్ :- అవును, అన్నాను.

చాడ్విక్ :- అయితే నేనేం చెయ్యాలి? ఇన్నేళ్ళూ నేను ఇక్కడ కూర్చోవడం వట్టి మూర్ఖం, దండగ అంటారా? నేను చేసింది కాలం వృథా చేయడమేనా? భగవాన్ తాను గురువును కాదన్నారని నేను ఇప్పుడు వెళ్ళి, మరొక గురువును వెతుక్కుని, దీక్ష తీసుకోవాలా?

భగవాన్ :- అంత దూరం నుంచి ఏ శక్తి మిమ్మల్ని ఇక్కడికి తీసుకొచ్చింది? ఇన్నేళ్ళూ ఇక్కడ ఏ శక్తి మిమ్మల్ని

నిలిపింది ? ఎక్కడైనా గురువును వెతుక్కోవలసిన అవసరం వస్తే, మీరు ఏనాడో వెళ్ళిపోయి వుందురు.

చాడ్విక్ :- అయితే భగవాన్‌కి శిష్యులు వున్నారా ?

భగవాన్ :- నేను చెప్పినట్లు - భగవాన్ ప్రకారం - ఆయనకు శిష్యులు లేరు. కాని, శిష్యుని దృష్టి నుంచి గురువు అనుగ్రహం సముద్రం మాదిరిగా వుంది. శిష్యుడు ఒక చిన్న పాత్ర తీసుకుని ఆ సముద్రం దగ్గరకు వెడితే, ఆ పాత్ర పట్టేంత నీరే తీసుకుంటాడు. "తనకు అంత తక్కువ నీరు ఏమిటి ?" అని ఫిర్యాదు చేసి ఏం ప్రయోజనం? పెద్ద పాత్ర తీసుకువెళ్ళినవాడు ఎక్కువ నీరు తీసుకుంటాడు. అది వారి వారి పాత్రల మీద ఆధారపడి వుంటుంది.

చాడ్విక్ :- నిజంగా, గట్టిగా తెలుసుకోవాలని విశ్వాసంతో అడుగుతున్నాను "భగవాన్ నాకు గురువు అవునా, కాదా ? భగవాన్ ఒప్పుకోకపోతే ... ..." అని ఆపేశారు.

భగవాన్ :- (భగవాన్ నిటారుగా నిలబడి) దుబాసీ వంక చూస్తూ, స్థిరనిశ్చయభావంతో, చాడ్విక్‌ను చూపిస్తూ,"ఆయన్ని అడగండి, వ్రాతమూలకమైన పత్రం ఏమైనా భగవాన్నించి కావాలేమో?"

భగవాన్ చెప్పక చెప్పిన ఉపదేశం, ఇచ్చిన హామీ అర్థమై, చాడ్విక్ పరమానంద భరితులయ్యారు.

* * *

ఒకసారి దిలీప్‌కుమార్ రాయ్ భగవాన్ని అడిగారు. "మహర్షి గురువు అవసరాన్ని నిరాకరిస్తారు అని కొందరూ, దానికి భిన్నంగా కొందరూ చెపుతారు. అయితే భగవాన్ ఏమంటారు?" అని.

భగవాన్ :- నేను ఎప్పుడూ గురువు అవసరం లేదని చెప్పలేదు.

దిలీప్ :- అరవిందులు తరచు అంటూవుండేవారు "మహర్షికి గురువు లేరు" అని.

భగవాన్ :- అది మీరు "గురువు" అని పిలవబడే దానిమీద ఆధారపడి వుంటుంది. దత్తాత్రేయునికి ఇరవై నలుగురు గురువులున్నారు. అంటే, ప్రపంచంలో ఏ రూపమైనా, ఏదైనా, ఎవరైనా గురువు కావచ్చు. గురువు తప్పని సరిగా అవసరం. గురువు మినహా మనోకికారణ్యం నుంచి మనల్ని మరెవ్వరూ బైటికి తీయలేరని ఉపనిషత్తులు చెపుతున్నాయి. దాన్నిబట్టి గురువు అవసరమే !

దిలీప్ :- అంటే, గురువు అంటే, మానవరూపంలో వున్న ఒక వ్యక్తా ? మహర్షికి అటువంటి గురువు ఎవరైనా వున్నారా ?

భగవాన్ :- ఎప్పుడో ఒకప్పుడు, నాకూ గురువు అవసరమై వుంటారు. నేను అరుణాచలేశ్వరునికి స్తుతి కీర్తనలు పాడలేదా ? గురువంటే, ఏమిటి ? గురువంటే, భగవంతుడు - ఆత్మ. తన కోర్కెల్ని ఈడేర్చమని మొదట ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. కాని, సమయం వచ్చినప్పుడు అతడే తన కోర్కెల్ని ఈడేర్చమని ఈశ్వరుణ్ణి ప్రార్థించడు. ఇంక తనకోసమే ప్రార్థిస్తాడు.

అప్పుడు అతన్ని నడపడానికి ఈశ్వరుడు ఏదో ఒక రూపంలో గురువుగా దర్శనమిస్తాడు. అదీ, అతని ప్రార్థనా ఫలితమే !

* * *

''శంకరాచార్యులవలె మీరూ దేశసంచారం చేసి, ఉపన్యాసాలిచ్చి,ఉపదేశాలిచ్చి,ప్రజల్ని ఎందుకు సన్మార్గులుగా చేయకూడదు?'' అని ఒకరు భగవాన్ని అడిగారు.

భగవాన్ :- మహాత్ములు దేహం ధరించడమే లోకానికి గొప్ప మేలు చేసినట్లు, అనుగ్రహం చూపినట్లు. వారు ఏమీ చేయక వూరికేవున్నా, వారి శక్తి తరంగాలు నలువైపులకూ వ్యాపించి, లోకాన్ని సాత్విక తేజోమయం చేస్తాయి.

కార్యరంగంలో ఒక్కొక్క మహాత్ముని పాత్ర, ఒక్కొక్క విధంగా వుంటుంది. తనను అర్థించినవారికి భగవాన్ ఇచ్చే ఉపదేశం, వారి వారి సంస్కార స్వభావాలకు అనుకూలంగా వుండేది. అది వారి హృదయాల్లోకి సూటిగా దూసుకుపోయి, ఒక మార్గం చూపి, వారి జీవితాల్నే నడుపుతుంది.

ఒకసారి పరమహంస యోగానందులు భగవాన్ని అడిగారు. ''ప్రజల ఆత్మ ఔన్నత్యానికీ, జీవన పురోభివృద్ధికీ ఏ విధమైన ఆధ్యాత్మిక మార్గం మంచిది?'' అని. దానికి భగవాన్, ''ఏ ఆధ్యాత్మిక మార్గమైనా సరే, ఆయా వ్యక్తుల, ఆర్తుల గుణగణాలమీద, సంస్కార స్వభావాలమీద, ఆధ్యాత్మిక పరిపక్వతమీదా ఆధారపడి వుంటుంది. అందరికీ మూక ఉమ్మడిగా ఆదేశాలు, ఉపదేశాలు ఇచ్చి నడపడమంటూ ఏమీ లేదు''

అన్నారు. ఎందుకంటే, ఉపదేశమంటే, ఒకదాన్ని దాని స్వస్థలంలో దాన్ని చేర్చడం. లేక దూరంగా కనుపించేదాన్ని, దగ్గరకు తెచ్చి, చూపడం.

ఉపదేశం, వినేవాని స్థితిని బట్టి వుంటుంది. కాని, ముఖ్యంగా శరణాగతి చెందినవారికే ఉపదేశం అవసరం. అంటే, అహంకారం మూలంలో లీనమైనవారికి. మనసు స్వస్థానం వదిలి, భ్రష్టమైన వృత్తిరూపం దాల్చి, ఇంద్రియ సుఖాలవెంట పరుగెత్తి, దెబ్బలుతిని, అలిసి, విసిగి, వేసారి, నిరుత్సాహం చెంది, అసంతృప్తి పడి, తాను ఆత్మకూ, స్వస్థానానికి దూరంగా వున్నాననీ, దాన్నించి భిన్నమనీ అనుకుంటూ వుండగా - అప్పుడు గురువు అవసరమై వచ్చి, "నువ్వు ఈ దేహం కాదు, ఆత్మస్వరూపుడవు" అని చెప్పడమే, ఉపదేశం. "అదే గురు కృప. అదే ఆత్మ బోధ. దాన్నే అజ్ఞానపు నిద్ర నుంచి మేల్కొల్పడం" అని కూడా అంటారు. అప్పుడు అతనికి స్వరూపజ్ఞానం లభిస్తుంది.

మొదట్లో తన స్వభావం. తన స్థితీ సహజస్థితికి భిన్నంగా వున్నా, తీవ్ర సాధనవల్లా, మనో నిర్మలత్వంవల్లా, గురువులో నమ్మకంవల్లా "గురుయోగం" సాధ్యమౌతుంది. అంటే, గురు స్వభావంతో, గురుస్థితిలో ఐక్యం కావడాన్ని గురుయోగమంటారు.

ఉపదేశం, దీక్షా రెండూ విడదీయ శక్యంకానివి. దీక్ష లేకుండా, ఉపదేశం లేదు. ఉపదేశాన్ని అనుసరించని దీక్ష, దీక్ష కాదు.

భగవాన్ బోధ ఉత్కృష్టమనీ, ఆయన దర్శనం, ఉనికీ ఉత్తేజాన్ని కలిగిస్తుందనీ సాధకులకు తెలియడమే కాదు, ఆయన గురువై దీక్ష ఇచ్చి, ఉపదేశం చేస్తారని తెలుసుకోవడం కూడా సాధకులకు అవసరం. అటువంటి సద్గురు శరణాగతి పొందటం, బాహ్యంగా ఒక వ్యక్తికి శరణాగతి కావడం కాదు. విశ్వమంతా

విస్తరించివున్న విశ్వాత్మకు శరణాగతి చెందటం, అదే తనలోని ఆత్మకు శరణాగతి చెందటం. ఆ సంగతి తెలుసుకోవడం, సాధకునికి ఎంతో సహాయపడుతుంది.

భగవాన్ ఎప్పుడూ, ఎవరినీ తన శిష్యులుగా తీసుకోలేదు. అలాగే ఎవరికీ, ఎప్పుడూ దీక్ష ఇవ్వలేదు; ఉపదేశం చేయలేదు. అసలు ఆయన ఎప్పుడూ, దేనికీ ఎటువంటి ప్రకటనా చేయలేదు. కాని, ఆయన మార్గం, వారి వారి భావాలకు తగినట్లు సరిపోతుంది. ఆయనలో అదే విశేషం.

"స్పర్శ - దృష్టి - మౌనం" అని దీక్ష మూడు రకాలు. పక్షి తన గుడ్లమీద కూర్చుని పొదుగుతుంది. అది స్పర్శ దీక్ష. చేప గుడ్లమీద దృష్టిపెట్టి పొదుగుతుంది. అది దృగ్దీక్ష. తాబేలు గుడ్ల గురించి యోచిస్తో పొదుగుతుంది. అది మౌనదీక్ష.

మౌన, దృక్ దీక్షలు రెండూ అరుదు. దృష్టితో దీక్ష ఇవ్వడం, సరైన పద్ధతి. భగవాన్ భక్తులవైపు దృష్టి నిలిపేవారు. ఆ చూపు ఎదుటివారిమీద నిలిచి, వారి అంతరాంతరంలోకి చొచ్చుకు పోయి, వారి ఆలోచనా విధానాన్నే మార్చేసేది. భగవాన్ చూపు, కరెంట్ మాదిరిగా ఒళ్ళంతా ప్రసరించి, బ్రహ్మాండమైన కాంతిని, శక్తిని ఇచ్చి ఆపాదమస్తకం ఆనందంలో ముంచేది" అంటారు అనుభవజ్ఞులు.

* * *

భగవాన్ని ఒకరు అడిగారు, "స్వామీ, మీకు కలలువస్తాయా?" అని. దానికి భగవాన్ "నిద్రపోయినవారికి కలలు వస్తాయి" అన్నారు.

"అయితే మీరు నిద్రపోరా?" అని మళ్లా ప్రశ్నించారు.
"మేల్కొన్నవాడు, నిద్రనుంచే మేల్కొంటాడు" అన్నారు.

శరణాగతి పొంది మనసును శాంతపరచి,గురువు అనుగ్రహం పొందటం అంత తేలికైన పని కాదు. దానికి కూడా గురువు అనుగ్రహం కావాలి. నిరంతరం సంపూర్ణ ఎరుకలో వుండాలి, తీవ్ర సాధన చేయాలి,భారమంతా గురువుపై వుంచాలి.

గురువు ఎప్పుడూ నిర్మలంగా, శాంతంగా, మౌనంగా వుంటాడు. ఆయన మౌనం అపారం. ఆ మౌనంతో మనలోని ప్రత్యేక వ్యక్తిత్వపు భావనని తొలగిస్తాడు. ఆ మౌనమే ఆయన ఖిగ్గరగా అరిచే ఉపదేశం. అన్నిటికన్నా మౌనోపదేశం గొప్పది.

గురువులందరి లక్ష్యం ఒకటే - మానవాళికి సహాయం చేయడం; ప్రజల వికాసంకోసం పాటుపడటం. వారు అహంకారంలో అణగిపోకుండా, భ్రాంతిలో మునిగిపోకుండా, ఉద్ధరించి వారి ఆత్మోన్నతికి సహాయపడటం. కాని, గురువులందరిదీ ఒకటే పద్ధతి కాదు. వారి భాషలూ భిన్నమే. చాకలి బట్టల్ని రాతిబండమీద బాదటం, బట్టల్ని చింపాలని కాదు; వాటిని అతుక్కున్న మురికిని వదలగొట్టడంకోసం. అలాగే గురువు మనోమాలిన్యాల్ని పోగొట్టేం దుకు అనేక కఠిన నియమాల్ని ఏర్పరుస్తాడు. మత్తగజంలాంటి అహంకారాన్ని అణచగలిగేది, సింహం వంటి గురువు ఒక్కడే. వెదికేవారికి దారిచూపడం, గురువు పని. అంతేకాని, మతస్థాపన, దీక్షలివ్వడం, ఉపదేశాలు చేయడం కాదు.

* * *

**1935** - జనవరి మొదటి వారంలో "పిగ్గోట్" అనే ఒక ఇంగ్లీషు ఆమె పాల్ బ్రంటన్ రాసిన పుస్తకం చదివి, ఉత్తేజితు రాలై భగవాన్ దర్శనానికి వచ్చింది. ఆమె వచ్చిన సమయానికి ఆశ్రమంలో, భగవాన్ సన్నిధిలో చాలామంది వున్నారు. భగవాన్ సోఫాలో కూర్చుని ఎటో చూస్తున్నారు.

కొందరు అగరువత్తులు వెలిగించేవారు. శీతాకాలమైతే, భగవాన్ సోఫా పక్కన నిప్పుల కుంపటి పెట్టేవారు. స్వామి ఆ కుంపటి నిప్పుల్లో చేతులు వేడిచేసుకునేవారు.

ఆరు గంటలకు వేదపారాయణ పూర్తయ్యేది. ఆ తర్వాత స్వామి స్నానానికి వెళ్ళేవారు. ఆరున్నరగంటలకు కాఫీ - టిఫిన్ తీసుకునేవారు. తర్వాత పరిచారకునితో కలిసి, కొండమీదకు వెళ్ళేవారు. తక్కిన ఆశ్రమవాసులు తమ, తమ పనుల్లో నిమగ్నులయ్యేవారు-కొందరు పువ్వులు కోయడం, కొందరు పూలదండలు కట్టడం, కొందరు వంటా, కొందరు బజారుపనులు చేయడం, కొందరు ఆశ్రమ నిర్వహణ- ఆవిధంగా తలొక పనీ చేసేవారు.

భగవాన్ కొండదిగి వచ్చేప్పటికి హాలు కడిగి, శుభ్రం చేసి, అన్నీ సిద్ధంగా వుంచేవారు. ఎనిమిది గంటలకు భగవాన్ హాల్లోకి వచ్చి, కూర్చునేవారు. స్వామి సన్నిధి అందరికీ ప్రవేశార్హత వుంది. అన్ని వేళలా ఆశ్రమం తలుపులు తెరిచే వుంచేవారు.

భగవాన్ హాల్లోకి రాగానే, అందరూ లేచి నిలబడేవారు. అది చూసి, "నేను వస్తే లేచేవారు, ఎవరు వచ్చినా లేవాలి" అన్నారు. భక్తులు తెచ్చిన పళ్ళు, ఫలహారాల్లోంచి భగవాన్ కొంచెం తీసుకునేవారు.తక్కింది అక్కడ వున్నపిల్లులకూ, పిట్టలకూ, కుక్కలకూ, ఇతర జంతువులకూ పెట్టి ఇంకా మిగిలితే బోజనంలో అందరికీ వడ్డించేవారు.

తొమ్మిది గంటలకు భక్తులతో, యాత్రికులతో, సాధకులతో హాలు నిండిపోయేది. వారిలో కొందరు ధ్యానంలో, కొందరు పరధ్యానంలో, ఇంకొందరు పఠనంలో - జపంలో - మననంలో - సమాధి స్థితిలో అట్లా, అట్లా వుండేవారు. కొందరు తాము రాసినవి చదివి వినిపించేవారు. కొందరు తాము గీసినవి

చూపేవారు. కొందరు పాడి వినిపించేవారు. కొందరు ప్రశ్నించే వారు. మరి కొందరు వాదించేవారు. కొందరు వేధించేవారు. కొందరు రోధించేవారు. కొందరు శోధించేవారు. కొందరు పూజించేవారు. కొందరు వూరికే చూస్తూ కూర్చునేవారు. కాని, భగవాన్ మాత్రం మౌనంగా వుండేవారు. అన్ని జరుగుతున్నా పిట్టలు, పిల్లులు, ఉడతలు, కోతులు, నెమళ్ళు హాలుమధ్య యదేచ్ఛగా తిరిగేవి.

భగవాన్ పలనిస్వామి దగ్గర కర్రిలు చెక్కడం, పావుకోళ్ళు చేయడం, కొబ్బరి చిప్పలతో పనిముట్లు చేయడం నేర్చుకున్నారు. వ్యవధి వున్నప్పుడల్లా, భగవాన్ ఏదో ఒక పని చేస్తూ వుండేవారు. కొందరు అణచుకోలేని ఆవేశం, తన్మయత్వంతో వెళ్ళి, భగవాన్ని తాకేవారు. అందుచేత ఆయన చుట్టూ కర్రిలతో బందోబస్తు చేశారు.

అంతలో మౌనస్వామి టపా తెచ్చేవారు. పోస్టలో పేపరు వస్తే, భగవాన్ ముందుగా పేపరు చూసేవారు. భగవాన్‌కి రోజూ ఎన్నో ఉత్తరాలు దేశ, విదేశాల నుంచి వచ్చేవి. అందులో కొన్ని బలే తమాషాగా వుండేవి - "మహర్షి - ఇండియా" అంటే చాలు, శ్రీ రమణాశ్రమానికి వచ్చేవి. ప్రతి ఉత్తరాన్ని భగవాన్ శ్రద్ధగా పరిశీలించేవారు - పోస్టు ముద్ర - ఎడ్రస్‌లతో సహా ప్రతి ఉత్తరాన్నీ శ్రద్ధగా చదివేవారు.

ఒకరోజున మౌనస్వామి, ఉత్తరాలు తెచ్చి, భగవాన్ పక్కన పెట్టి, వాటిల్లో "భారతి" అనే తెలుగు మాసపత్రిక వుంటే, దాన్ని మహర్షి అనుమతితో తీసుకుని, కొంతసేపైన తర్వాత దాన్ని తిరిగి భగవాన్‌కి ఇచ్చి, "భగవాన్, ఎంత దొంగ!" అంటూ వెళ్ళి పోయారు. ఎప్పుడూ, ఏమీ మాట్లాడని మౌనస్వామి, భగవాన్ని ఉద్దేశించి అట్లా అనడానికి భగవాన్ ఏంచేశారా?అని ఆ సమయంలో అక్కడ వున్నవాళ్ళంతా - భగవాన్‌తో సహా, ఆశ్చర్యపోయారు.

ఆ "భారతి"లో సౌరిస్ రాసిన వ్యాసం "అరుణాచల లేఖ" భగవాన్ చదివించుకున్న తర్వాత "భగవాన్ ఎంత దొంగ!" అన్న మౌన స్వామి మాట అర్థమైంది. ఆ వ్యాసంలో సౌరిస్ "భగవాన్ ఎంత దొంగ" అని రాశారు.

ఉదయం పదకొండు గంటలకు ఆశ్రమంలో భోజనానికి గంట కొట్టేవారు. భోజనశాలలో బ్రాహ్మణ - అబ్రాహ్మణ పట్టింపు వుంది. ఏ పట్టింపూలేని భగవాన్, ఆ విభాగం మధ్య కూర్చునేవారు- ఇరు పక్షాల వారికీ కన్పించేటట్లుగా. భగవాన్ భోజనం చేయడం ఆరంభించేవరకూ ఎవరూ ఏ పదార్థమూ ముట్టుకునేవారు కాదు. అందరికీ వడ్డించేవరకూ భగవాన్ తినేవారు కాదు.

భోజనానంతరం భగవాన్ తాంబూలం వేసుకునేవారు. దాన్ని పూర్తిగా నమిలిన తర్వాత, నోరు శుభ్రంగా కడుక్కునే వారు. పరిచారకుని నిర్లక్ష్యం వల్ల, వరసగా కొన్ని రోజులు భగవాన్‌కి తాంబూలం ఇవ్వడం మరచిపోవడంతో ఆయన తాంబూలం వేసుకోవడం మానేశారు.

మధ్యాహ్నం రెండు గంటల వరకు భగవాన్ విశ్రాంతి తీసుకునేవారు. చివరి సంవత్సరాల్లో భగవాన్ ఆరోగ్యంకోసం ఆశ్రమాధికారులు విశ్రాంతి సమయంలో హాలు తలుపులు మూసేస్తే, ఒకాయన తెలియక లోపలకు వెడితే, పరిచారకుడు కటువుగా మాట్లాడి కసిరాడు. ఆ సంగతి తెలిసి భగవాన్ మర్నాడు భోజనా నంతరం హాలు బైట మెట్లమీద కూర్చున్నారు. ఎంతకీ లోపలకు వెళ్ళని భగవాన్ని చూసి, "ఏమిటి బైట కూర్చున్నారు?" అని ఒకరు సాహసించి అడిగితే, "రెండు గంటల వరకూ ఎవరూ హాల్లో ప్రవేశించకూడదు కదా?" అన్నారు. ఆ తర్వాత ఆశ్రమం వారు తమ తప్పు తెలుసుకుని, భగవాన్ని ఎంతో బ్రతిమాలారు. అప్పటినుంచి అందరికీ, అన్ని వేళలా భగవాన్ దర్శనం కలిగే ఏర్పాటు చేశారు ఆశ్రమాధికారులు.

భగవాన్ ఎప్పుడూ, ఏ సిద్ధాంతం గురించీ మాట్లాడలేదు. అప్పటికి, ఆ పరిస్థితికి తగినట్లుగా వివేకవంతంగా, అవసరమైనంత వరకే మాట్లాడేవారు. భగవాన్ చాలావరకు మౌనంగా వుండేవారు. ఆయన సమాధానాలు హాస్యోక్తులతో, చమత్కారంగా, ఒక్కొక్కసారి సరదాగా నవ్వు పుట్టించేవిగా, వ్యంగ్యంగా వుండేవి. కొన్ని మాటల అర్థాలు అమోఘంగా వుండేవి. ఎవరైనా భగవాన్ని ఇంగ్లీషులో ప్రశ్నిస్తే, దానికి ఆయన సమాధానం ఎవరి చేతనైనా చెప్పించేవారు. అవసరమైనచోట, ఆ చెప్పేవారిని సవరించేవారు.

సాయంత్రం నాలుగూ ముప్పావుకి భగవాన్ కొండమీదకు వెళ్ళి, తిరిగి వచ్చిన తర్వాత, వచ్చిన ప్రతి ఉత్తరానికి మౌనస్వామి రాసిన సమాధానాల్ని భగవాన్ సరిచూసేవారు. ఆ తర్వాతే ఆ ఉత్తరాలు పోస్టు చెయ్యాలి.

సాయంత్రం భగవాన్ సమక్షంలో వేదపారాయణ, ఉపదేశ సారం చదివేవారు. తర్వాత శ్రీసూక్తం, పురుషసూక్తం చదివేవారు. ఆరున్నర తర్వాత ఆశ్రమంలో ఆడవాళ్ళు వుండరాదన్న నిబంధన ప్రకారం, ఆడవాళ్ళంతా భోజనంచేసి వెళ్ళిపోయేవారు.

ఆశ్రమంలో రాత్రి ఏడున్నర గంటలకు భోజనం. భోజనానంతరం కొందరు ధ్యానంలో, కొందరు భగవాన్‌తో కబుర్లుచెప్తూ వుండేవారు. ఉద్యోగాలు చేసేవారు ఆ సమయానికి ఊళ్ళోంచి వచ్చేవారు. ఒక్కొరోజు రాత్రి చాలా పొద్దుపోయేది. భగవాన్ ఎన్నో సంగతులు చెప్పేవారు. ఆ సమయంలో అందరూ స్వేచ్ఛగా అన్ని అన్ని విషయాలూ మాట్లాడేవారు.

ఏ పరిచారకుడైనా భగవాన్ కాళ్ళకు నూనెరాసి మర్దన చేస్తామని వస్తే "ఇన్నాళ్ళూ మీరు మాట చేత, చూపు చేత అనుగ్రహం

జ్ఞాని ఏ యూనివర్సిటీలోనూ చదవవలసిన అవసరం లేదు. ఏ లేబరేటరీలోనూ పరిశోధన చేయవలసిన అవసరం అంతకంటేనూ లేదు. జ్ఞానికి విశ్వ రహస్యాలు, విశ్వవిజ్ఞానం ఎట్లా అవగత మౌతాయో అన్న సంగతి భగవాన్ చెప్పిన కొన్ని విషయాలగురించిన సంగతులు తెలుసుకుంటే, స్పష్టమౌతుంది.

అసలు ఉన్నది ఒక్కటే. దాన్ని ఏ పేరుతో నైనా - పరబ్రహ్మ - మూలప్రకృతి అని పిలవవచ్చు. అది అవాగ్మానస గోచరం. అది ఆలోచనకు, ఊహకు అందకుండా వుంది. కాని, అదే పరిపూర్ణమైన చైతన్యం - CONSCIOUSNESS. అదే అసలు సారం. అది మన భావనలో పదార్థంగా, శక్తిగా ఏర్పడుతుంది. కాని, నిజానికి పదార్థం - శక్తి రెండూ స్వతంత్ర ప్రతిపత్తికలవి మాత్రం కావు. అవి రెండూ అసలు పరబ్రహ్మకు - మూల ప్రకృతికీ ద్విముఖాలు - రెండు అవస్థలు - రెండు దశలు. మానవ మేధస్సులో భావనలు, ఊహలు, ఆలోచనలు మాటల్లోకి వచ్చేప్పటికి పదార్థం - శక్తి (MATTER - SPIRIT) అని చెప్పవలసి వస్తుంది. పదార్థమంటే, అనుకునే పదార్థం కాదు, శక్తిసారంతో కూడిన పదార్థం. అదే మూలప్రకృతి. అదే శక్తి. అదే ఆత్మ. అదే పరబ్రహ్మ. "సత్" అన్నా, "శాశ్వతత్వం" అన్నా అదే. అంతా అదే! అన్నింటికి అదే ఉపాధి - మార్గం. దాన్నించే ఆకాశం ప్రకాశిస్తుంది.

అటువంటి "సత్" నుంచి లేక, మూలప్రకృతి నుంచి - ప్రకృతి లేక, విశ్వం ఆవిర్భవించింది. ఆవిర్భవించిన ఆ విశ్వం, ద్వంద్వమయం. కాని మూల ప్రకృతి ఆ ద్వంద్వాన్ని నిరంతరం కలుపుతూ వుంటుంది. ఆ ద్వంద్వమే SUBJECTIVE AND OBJECTIVE, MATTER AND SPIRIT, పదార్థం, శక్తి. అంటే, ఆ ద్వంద్వం మధ్య "అసలు సత్, లేక మూలప్రకృతి" ఒక వంతెన మాదిరిగా నిలుస్తుంది. కాని, మూలప్రకృతిలో మాత్రం ఎప్పుడూ మార్పు వుండదు.

ప్రతీదీ కేంద్రాకర్షణ శక్తులవల్ల, ఆకాశపు హద్దుల్లో వుంచ బడుతుంది. కాని, మంచు కరిగి నీరై, నీరు ఆవిరై, ఆ తర్వాత సర్వవ్యాపకమైనట్లు, వాటి రూపాలు మాత్రం మారతాయి. అంతే! అట్లా మార్పులు చెందుతూ, సూక్ష్మరూపం పొందుతూ, మూలపదార్థంలో - "చిత్"లో ఆత్మ రూపం పొందుతుందే కాని, శూన్యం మాత్రం కాదు. అది శూన్యమైతే, ఈ బ్రహ్మాండం కూడా శూన్యం కావలె. బ్రహ్మాండం శూన్యమయ్యేదే అయితే, అది అంతం కావాలి. ఇంక దాన్ని అనంతమని ఎట్లా అనడం? అంతం వుంటే, ఆది వుండి తీరవలసిందే! ఆది వుంటే, అది ఎప్పుడో ఒకప్పుడు సృష్టింపబడి వుండాలి. కనుక ఏదీ సూక్ష్మరూపం ధరించినా, శూన్యం మాత్రం కాదు.

ఈ విశ్వానికి ఒక కారణం లేదు. కారణం వుండి వుంటే, అది ఒకప్పుడు అంతం కావడం నిశ్చయం. ఎక్కడైతే అంతం వుంటుందో, అక్కడ సరికొత్తది, మనకు తెలియనిది ఆవిర్భ విస్తుంది.

అసలు దీని కంతకూ మూలం ఏమిటి? అంటే, "దైవం" అని చాలామంది చాలా తేలికగా సమాధానం చెపుతారు. జగత్తుకు మూలకారణం భగవంతుడని నిర్ధారణ చేయడానికి గాని, సిద్ధాంతీకరించడానికి గాని వీలులేదు. ఎందుకంటే, ఒక దాని కొకటి పరస్పరాధారంవల్ల ముగింపు లేక అనంతంగా అల్లుకునే గొలుసు మాదిరిగా వుందీ జగత్తు. ఆ జగత్తుకు మూలకారణం వుంటుందని భావించడం పొరపాటు.

ఈ విశ్వానికి కారణాలు చెప్పే మతాలు, శాస్త్రజ్ఞులు వారి, వారి సిద్ధాంతాల మీద, ఊహలమీద ఆధారపడి వుంటాయి. వారు, ప్రతి ఒక్కరూ ఈ విశ్వం ఎప్పటికో ఒకప్పటికి అంతం కాక తప్పదంటారు. కాని, వారు ఈ అనంత విశ్వాన్ని ఓ చోటు నుంచి, ఓ కోణంనుంచి వారికి లభ్యమైన టెలిస్కోప్ నుంచి చూసి, పరిమిత జ్ఞానంతో వివరిస్తారు.

ఈ విశ్వమంతా ఓ శక్తిమయం. ఆ శక్తి కంటికి కనుపించేది కాదు. కాని, మనం దాని పర్యవసానాన్ని, ఫలితాన్ని మాత్రం చూడగలం. ఆ విధంగా మనం చూసేదే MATTER _ పదార్థం. శక్తిఫలితాలే, పదార్థం, ప్రపంచంగా కనబడుతుంది. కాని, పదార్థాన్ని, శక్తిని విడదీసి చూడ్డం అసాధ్యం, కష్టం. తమలో క్రమం లేనివాళ్ళు, ఈ అనంత విశ్వంలో ఓ క్రమాన్ని ఎట్లా చూడగలరు? ఆ క్రమాన్ని ఎట్లా తీసుకురాగలరు? అందరి మాదిరి గానే, ఈ శాస్త్రజ్ఞులు కూడా అపనమ్మకంగా, సంశయంగా వున్నారు.

ప్రతీదీ నిరంతరం మార్పు చెందుతూ వుంటుంది. ప్రతి మార్పుకూ ఒక కారణం వుంటుంది. ఆ కారణం వల్లనే, ఒక పని జరుగుతుంది. ఆ కర్మ, ఫలితాన్ని ఇస్తుంది. అదే ధర్మం - సత్యం- సూత్రం-నియమం-శాసనమై ఈ విశ్వాన్నంతా నడుపుతోంది.

అలాగే ప్రపంచం నిరంతరం మార్పు చెందుతూ వుంటుంది. ఈ క్షణం, ఓ క్షణంలో మరుక్షణంగా మారుతుంది. అసలు వున్నది అనంతమైన కదలిక మాత్రమే. ఇంకేం లేదు. ఆ కదలిక వల్ల ఈ ప్రపంచం వేరు, వేరు రూపాలు ధరించి, అనేక పేర్లతో విలసిల్లుతోంది. ఆ విధంగా ఈ ప్రపంచం పరిణామం చెందుతోంది. మనిషి నుంచి మేరుపర్వతం వరకు ఆ ధర్మమే పనిచేస్తుంది. ఆ సూత్రం, మాత్రం మారదు. కనుక మార్పులోని ధర్మాన్ని చూడ్డమే, సత్యాన్ని తెలుసుకోవడం.

ఈ విశ్వమంతా ఓ శక్తి సముద్రం. అందుండే చిన్నా, పెద్దా తరంగాల్లోని శక్తీ, అసలు సముద్రంలోని శక్తీ ఒక్కటే. సముద్రమే ఒక పెద్ద శక్తితరంగం. "సముద్రం - తరంగం" అనే వాటి నుంచి భిన్నత్వంలోని ఏకత్వాన్ని తెలుసుకోవచ్చు. సముద్రంలో నిరంతరం విరుచుకుపడే తరంగాలు ఎట్లానో, ఈ సృష్టిలో కల్లోలాలు అట్లాను. అవి ఎందుకు కలుగుతాయంటే,

జవాబు లేదు. అవి వస్తాయి, పోతాయి. తరంగాల రాకపోకలు సముద్రంలోనే. తరంగాలు, సముద్రంలో లేచి, సముద్రంలోనే అణగుతాయి. అవి అసలు సముద్రానికి భిన్నం కావు. అంతా ఒకటే శక్తి తరంగం. ఆసంగతి అనుభవపూర్వకంగా తెలుసుకుంటే అన్ని ఆందోళనలూ అణగుతాయి. శాంతి కలుగుతుంది.

సమస్త గోళాలూ, లోకాలూ, సౌరమండలాలు, జగములు ఏ ఆధారంపై నిలిచి, చలిస్తున్నాయో - పరిభ్రమిస్తున్నాయో - వాటిని నడిపే శక్తి ఏదో - వాటిని వెలిగించే తేజస్సు ఏదో - అది అవ్యక్తం. ఆ అవ్యక్తంనుంచి,ఈ విశ్వమంతా ఆవిర్భవించింది. అంటే, విశ్వచైతన్యక్షేత్రంలో ఒక ఘట్టంగా ఈ ప్రపంచం వ్యక్తమైంది. విశ్వం నిరంతరం కదులుతోంది. ఆ చలనశక్తినే, "ఆత్మ - బ్రహ్మం - పురుష" అని అంటారు. కాని, ఏపేరుతోనైనా దాన్ని పిలవవచ్చు.

ఈ చైతన్య సాగరంలో "నేను" అనే ప్రత్యేక తలంపు, కేవలం ఒక నీటిబుడగ మాత్రమే. దాన్నే "జీవుడు లేక, వ్యక్తి" అంటారు. ఆ నీటిబుడగ కూడా నీరే. ఆ నీటిలోంచి లేచినదే,ఆ నీటి బుడగ. ఆ బుడగ ఎప్పటికైనా అందు కలసి పోవలసినదే! కాని అది కాలంలో కొంతకాలం ఒక ప్రత్యేక నీటిబుడగగా నీటిలో తేలి, ఆడుతుంది. దాని జీవితకాలం, అనంతకాలంలో అల్పాతి అల్పం. ఆ బుడగ బ్రద్దలై, మహా సాగరంలో నామ - రూపం లేకుండా కలిసిపోతుంది.

ఆ నీటిబుడగ, ఆత్మకు ప్రతిరూపం. నీటిబుడగైన ఆ జీవుడు సుషుప్తి, స్వప్న, జాగ్రత్ - మూడు అవస్థల్లోనూ (జ్ఞానపరంగా) వాస్తవం. కాని, అసలు ఏమీ లేనేలేని, యాతనలు, బాధలుపడుతూ, అనేక అనుభవాల్లోంచి నడుస్తూ, ద్వంద్వాల్లో పడి కొట్టుకుంటూ, జనన - మరణ వలయంలో ఇరుక్కుంటాడు జీవుడు. అవన్నీ వాస్తవమనే దృష్టితో.

ఆ జీవుడు దేహంతో కలిసి, ప్రపంచ విషయాలతో సంబంధం పెట్టుకుని, "నేను - నాది" అనే భావంతో వుంటాడు. నానా యాతనలు పడుతూ, విముక్తికై చూస్తాడు. దీని కంతకూ కారణం, జీవునికి "తాను అసలు పరబ్రహ్మనుంచి విడి" అనే భావం కలగడమే.

దేహం, జడం. దాన్ని నడిపేది, ఆత్మశక్తి ఆ శక్తి అన్నింటిలో, అన్ని కాలాల్లో ఒకటిగా, సాక్షిగా వుంది. అసలు వున్నదీ ఆ ఆత్మ ఒక్కటే! అదే ఈ జగత్తుకు చిద్వస్తువు. అంటే, "సత్, లేక చైతన్యం". ఆ సత్ యొక్క ప్రకాశమే, చిత్. సత్ యొక్క స్వభావం, ఆనందం. ఆ మూడూ కలిసి "సచ్చిదానందం". కాని, అంతా ఒకటే ఆత్మ. ఆ ఆత్మశక్తి లేకపోతే, దేహం వుత్త అర్థంలేని చట్రం. ఆ దేహం, నాశనమయ్యేది. కాని, ఆ దేహం "నేను" అనదు. అలాగే ఆత్మకూ "నేను" అనవలసిన పని లేదు. అయితే ఈ "నేను" ఏమిటి ? అది ఎట్లా, ఎక్కడ నుంచి పుట్టింది ?" అని యోనిస్తే, చైతన్యశక్తిరూపమైన ఆత్మకూ, జడదేహానికీ మధ్య నిరంతరం "నేను - నేను" అంటున్నదే, అహమిక. అదే, అంటే, జీవుడే, అహమన్నమాట.

ఆ అహం మొదటినుంచీ మనలో గట్టిగా, లోతుగా పాతుకుని వుంటుంది. అది నిరంతరం శ్రమించి, బాధపడి, నలిగి తనకో ప్రత్యేక స్థానం, తన కాళ్ళపై తాను నిలిచే శక్తి, సామర్థ్యం సంపాదించుకుంటుంది. అనంత చైతన్య సాగరంలోంచి లేచిన జీవుడు, "సీటిబుడగ" అనే అద్దె కొంపలో తాత్కాలికంగా అద్దెకు దిగుతాడు. ఆ జీవుని వెంట, ఎప్పుడూ ఒక నౌకరు వుంటాడు. అతడే "ప్రాణం." ఆ ప్రాణం చేతనాపూర్ణం. జడదేహానికి చైతన్యాన్ని ఇచ్చేది, ఆ ప్రాణమే. ఆ నౌకరు ఇంటినీ రాత్రిం - బవళ్ళు శ్రద్ధగా, కంటికి రెప్పలాగ క్షణం ఏమరకుండా కావలి

కాస్తూ వుంటాడు. నమ్మినబంటు వంటి ప్రాణం, తనే ఇంటిని జాగ్రత్తగా, చూసుకుంటున్నాడనే ధైర్యంతో, అద్దెకొంపలో చేరిన జీవుడు అనేక ఆటలాడతాడు. అందుచేత ఆ జీవుడు తన జీవిత కాలంలో సగభాగం నిద్రలోనే గడుపుతాడు. జీవుడు ఇంటిని నౌకరైన ప్రాణానికి అప్పగించి నిద్రపోయినట్లు నిద్రపోయి, స్వస్థలం చేరి సుఖంగా వుంటాడు. ప్రాణం ఒక్కటే ఇంటిని (దేహాన్ని) అంటిపెట్టుకుని, కావలికాస్తూ వుంటుంది. జీవుడు ఎక్కడ ఎట్లా వున్నా ప్రాణం మాత్రం, ఇతరులు ఎవరినీ తన ఇంట్లో ప్రవేశించనీయదు. కాని, ఒక్కొక్కసారి నౌకరు ఏమరపాటున వుంటాడనీ, అటువంటి సమయాల్లో ఇతరులెవరో ఆ ఇంట్లో చొరబడతారనీ, చొరబడి నానా హంగామా చేస్తారనీ అంటారు.

జీవుడు ప్రస్తుతం వుంటున్న అద్దెకొంప నచ్చకపోతే, ఏదో ఒక వంక చూపి, ఇల్లు ఖాళీచేసి, ముందు నౌకర్ని బైటికి పంపి, తాను తీరికగా తప్పుకుంటాడు. ఆ అద్దెకొంపలోంచి వెళ్ళిన జీవుడు మహాసాగరంలో నిలవలేక, అలవాటు చొప్పున కాని, పాతవాసనల ఫలితంగా కాని, వేరొక కొంప అద్దెకు తీసుకుంటాడు. అక్కడా అంతే! ఆ విధంగా జీవుడు అనేక కొంపలు మారి, చివరికి స్వస్థలం చేరుకుంటాడు.

జీవుడు గాఢనిద్రలో హృదయంలోనూ, మెలకువలోనూ, మేధస్సులోనూ వుంటాడంటారు. "నువ్వు పరిమితమైన నీటిబుడగవు కావు, అపరిమితమైన ఆత్మవు" అని గురువు తెలియజెప్పినప్పుడు, జీవుడు గుర్తించి, ప్రత్యేక వ్యక్తిత్వం వైపు మొగ్గడం తగ్గిస్తాడు. ఆ సత్యాన్ని తెలుసుకోవడమే, తాను అదిగా (THAT) వుండటం. అంటే, అసలు పరబ్రహ్మగా విశ్వచైతన్యంగా, శక్తిగా, ఆత్మగా నిలవడం. దాన్నే ఆత్మసాక్షాత్కారమంటారు. అంటే, నువ్వు, నువ్వుగా వుండటం.

భగవాన్ని దర్శించిన వారిలో కొందరి సంగతులే రికార్డు అయ్యాయి. అందులోనూ కొన్నే ప్రకటింపబడ్డాయి. కాని, ఇంకా ఎందరో, ఎన్నెన్నో దివ్యానుభవాలు, గొప్ప గొప్ప సంగతులు, అద్భుతమైన విషయాలు ఏ ప్రకటనా లేకుండా వారి, వారి హృదయాల్లో అమూల్య నిధులుగా నిలిచిపోయాయి. నిజమైన ఆర్తుల ప్రశ్నలన్నింటికి భగవాన్ ప్రేమతో, ఓర్పుతో సమాధానాలిచ్చారు. ఆ ప్రశ్నలూ, సమాధానాలు వీలైనంత వరకు ఇందు క్రోడీకరించి, క్లుప్తంగా చూపబడుతున్నాయి.

పాల్ బ్రంటన్ రాసిన "A Search in Secret India" అనే గ్రంథం చదివి, మహర్షిని దర్శించడానికి పాశ్చాత్య దేశాల మేధావులు, తత్వవేత్తలు, జిజ్ఞాసువులు, సాధకులు, సాధువులు ఎందరో వచ్చారు. వారిలో "ఇవాన్స్ వెంజి", ఒకరు. ఆయన టిబెట్ భాష నేర్చుకుని, "THE BOOK OF THE DEAD-THE LIFE OF MILA-REPA-TIBETAN SECRET DOCTRINES" అనే మూడు గ్రంథాలు రాశారు. ఆయన శ్రీ రమణాశ్రమానికి వచ్చి, భగవాన్ని దర్శించి అనేక ప్రశ్నలడిగి తెలుసుకున్నారు.

వెంజి :- యోగాసనాలకు జింక, లేడి, పులి మొదలైన జంతువుల చర్మాలు ఉపయోగించడంకోసం వాటిని చంపవచ్చునా ?

భగవాన్ :— మనస్సే పులి - లేడి - జింక ...

వెంజి :- అంతా మాయ అయితే, ఒకరు మరొకదాన్ని చంపడం సాధ్యమా ? అసలు చంపవచ్చునా ?

భగవాన్ :— మాయ ఎవరికో ముందు ఆ సంగతి తెలుసుకోండి. నిజం చెప్పాలంటే, ప్రతి ఒక్కరూ, ప్రతిక్షణం ఆత్మాంతకులే !

వెంజీ :- పులి, లేడి, జింక చర్మాలు యోగాసనములకు ఉపయోగించడంవల్ల లాభమేమిటి?

భగవాన్ :- ఆ చర్మాలు అయస్కాంతశక్తికి అనుకూలమైనవనో, ప్రతికూలమైనవనో చెపుతారు. ఆ సంగతుల్ని కొందరు యోగులు గ్రంథాల్లో వ్రాశారు. కాని జ్ఞానమార్గంలో అవన్నీ అనవసరం. నిశ్చలత్వమే ఆసనం. నువ్వు వున్నదే ఆసనం. ఆసనం, ముద్ర నిజంగా ఆత్మలో వుండాలి. అది లోపలి సంగతి. తక్కినవన్నీ బైట సంగతులు.

వెంజీ :- ధ్యానానికి ఏ సమయం మంచిది? ఏది అనుకూలమైన కాలం ?

భగవాన్ :- కాలమంటే ఒక భావన, ఒక తలంపు, ఒక ఐడియా మాత్రమే! అసలు వున్నది సద్వస్తువు ఒక్కటే. మీరు ఆ సద్వస్తువు గురించి ఏం యోచిస్తే, అది, అదే అవుతుంది. అది ఆ రూపంలోనే దర్శనమిస్తుంది, గోచరిస్తుంది. మీరు ఆ సద్వస్తువును "కాలం" అని పిలిస్తే, అది కాలమే అవుతుంది. లేదా, "ఉనికి - స్థితి" అంటే, అదే అవుతుంది, దాన్ని. మీరు ఏమనుకుంటే, అది అదే అవుతుంది. దానికి మీరు "కాలం" అని పేరుపెట్టి, దాన్ని రాత్రిం-బవళ్ళుగా, నెలలు - సంవత్సరాలుగా, గంటలు - నిమిషాలుగా విభాగం చేశారు. జ్ఞానమార్గంలో కాల ప్రసక్తి లేదు. కాని, ప్రథమంలో సాధకులకు కొన్ని నిబంధనలు, క్రమశిక్షణలూ అవసరం.

వెంజి :- జ్ఞాన మార్గం అంటే ఏమిటి ?

భగవాన్ :- జ్ఞాన, యోగాదులకు మనో నిగ్రహం, ఏకాగ్రత అవసరం. వ్యక్తి, సమిష్టిలో (ఈశ్వరునిలో ఆత్మలో) ఐక్యం కావడమే యోగం. అయితే ఈ వియోగం ఎట్లా వచ్చింది? అని యోచిస్తుంది, జ్ఞాన మార్గం. వియోగం, సద్వస్తువు నుంచే !

వెంజి :- మాయ అంటే ఏమిటి ?

భగవాన్ :- మాయ ఎవరికి ? ముందు దాన్ని తెలుసుకోండి. అప్పుడు మాయ అదృశ్యమౌతుంది. సర్వ సాధారణంగా అందరూ మాయ గురించి తెలుసుకోవాలని చాలా తాపత్రయపడతారు. కాని, అసలు "మాయ ఎవరికి ?" అని యోచన చేయరు. అలా యోచించక పోవడం, మూర్ఖం, అవివేకం.

మాయ వ్యక్తం. అది బైట సంగతి. కాని, సాధకుడు-అన్వేషకుడు మాయ మన లోపల వున్నట్లూ, అదేదో వ్యక్తమైనదిగానూ పరిగణిస్తాడు. "అనంతం, అవ్యక్తం' అనే వాటిని తెలుసు కోవడంకన్నా, "అక్కడ - ఆ క్షణం" అనే వాటిని తెలుసుకోవడం మంచిది.

వెంజి :- ఆత్మసిద్ధికి కర్మాచరణ అభ్యంతరమా?

భగవాన్ :- ఏమాత్రం కాదు. జ్ఞానిని ఏ కర్మా బంధించదు. అతను ఏం చేసినా అవిఅతనిని అంటవు. అవి అతను కోరి చేసినవి మాత్రం కావు. వారికి అసలు కర్మ చేస్తున్నాననే ధ్యాసే వుండదు. కర్మలు వాటంతట అవి వారి ద్వారా జరుగుతాయి. అంతే ! వారు

అన్నింటితోపాటు ఆ కర్మలకూ సాక్షిగా వుంటారు. ఏ బంధం, ఆసక్తి లేకుండా వారు పనులు చేస్తారు. వారు చేసే పనులకు ఓ ఉద్దేశ్యం, ఓ ఆశయం, ఓ ఆశ, ఆలోచన, యత్నం అంటూ ఏమీ వుండవు. జ్ఞాన మార్గాన నడిచేవారు సర్వ కర్మలూ ఆచరిస్తూ, విచారణ సాగించవచ్చు. వారికి కర్మ, బంధం కాదు. అది అడ్డూరాదు. కాని, సాధకునికి మొదట్లో కొంత తికమక కలుగుతుంది. క్రమంగా వారికీ ఏ కర్మాచరణా బంధం కాదు.

వెంజి :- అభ్యాసం - సాధన అంటే ఏమిటి?

భగవాన్ :- నిరంతరం "నేను"ను అన్వేషించడం. అహం, మూలం కనుక్కోవడం. అసలు నేనే - అహమే - ఆత్మే - వాస్తవత్వమే - సత్పదార్థమే, సచ్చిదానందం. దాన్ని విస్మరించినపుడే బాధ, దుఃఖం అన్నీ వచ్చి పడతాయి. సాధన తీవ్రమయ్యే కొద్దీ అవి బాధించవు.

వెంజి :- ఆత్మసిద్ధికి బ్రహ్మచర్యం అవసరమా?

భగవాన్ :- బ్రహ్మలో చరించడమే, బ్రహ్మచర్యం. దానికీ, మామూలుగా ఉపయోగించే "బ్రహ్మచర్యం" అనే మాటకీ ఏమీ సంబంధం లేదు. నిజమైన బ్రహ్మచారి, బ్రహ్మమే. అంటే, అతడు బ్రహ్మ స్థితుడు. అతడు ఆత్మానుభవం, ఆనందమని తెలుసుకుంటాడు. దాన్ని సాధనలో తెలుసుకోవడానికి, చాలా వాటికి మల్లె అదీ ఒక ఉపకరణం మాత్రమే. అందుచేత గృహస్థు కూడా ఆత్మ సిద్ధి పొందవచ్చు.

వెంజి :- యుద్ధాలు అన్యాయం కాదా ?

భగవాన్ :- ఆత్మస్థితునికి యుద్ధంలో ఒకరు చనిపోయినా, అనేకులు చనిపోయినా భేదం వుండదు. అంతా ఆత్మగా గుర్తించే వారికి, చావు ఏమిటి? పుట్టుక ఏమిటి? అతడు సమస్త ప్రాణి కోటినీ చంపవలసి వచ్చినా, అటువంటి శుద్ధాత్మునికి ఏ పాపమూ అంటదు.

ఆ సందర్భంలో భగవాన్ భగవద్గీతలోంచి ఒక శ్లోకం చదివారు :

శ్లో॥ యస్యనాహం - కృతో భావో బుద్ధిర్యస్యనివిస్యతే
హత్వాపి స ఇమాం లోకాన్న హంతిననిబిశ్వతే.

తా॥ "నేను కర్తను", అనే భావం లేని వాడూ, బుద్ధి నిస్సంగమైన వాడూ, అతను లోకంలోని ప్రాణు లన్నింటినీ చంపినా, చంపనట్లే. అతడు బంధితుడూ కాదు. (చలం)

చంపడానికి ప్రేరేపించిన శక్తే, శిక్షించడానికీ, పూనుకుంటుంది. ఆ శక్తి చేతిలో వ్యక్తి, సంఘం, ప్రపంచం అన్నీ పరికరాలు.

వెంజి :- ఈ జన్మలో చేసిన కర్మ ఫలం, వచ్చే జన్మలో పనిచేస్తుందా?

భగవాన్ :- అసలు మీరు ఇప్పుడు జన్మించారా? ఇతర జన్మల గురించి యోచిస్తా రెందుకు ? సత్యమేమిటంటే, పుట్టుక - చావు, లేదు. పుట్టిన వాడినే, చావు గురించి యోచించనివ్వండి.

వెంజీ :- మహర్షి నిర్వికల్ప సమాధిలో ప్రవేశిస్తారా ?

భగవాన్ :- కళ్ళు మూస్తే, నిర్వికల్పం. కళ్ళు తెరిస్తే, సవికల్పం. ఎప్పుడూ వుండేది, తనదైన స్థితి, అదే సహజస్థితి.

వెంజీ :- సిద్ధులు కల యోగులున్నారు. వారి గురించి భగవాన్ ఏమంటారు?

భగవాన్ :- సిద్ధులూ, శక్తులూ ప్రకటనలవల్ల వ్యక్తమౌతాయి. అవి మనసుకు సంబంధించినవి.

వెంజీ :- కైలాసం, కాశి వంటి పుణ్యక్షేత్రాలు దర్శించడంవల్ల ప్రయోజనం వుంటుందా?

భగవాన్ :- వుంటుంది.

వెంజీ :- ఆ క్షేత్రాల్లో చనిపోతే, ఫలితం వుంటుందా?

భగవాన్ :- వుంటుంది; "కాశి- కైలాసం - మృత్యువు" అంటే ఏమిటో ముందు స్పష్టంగా అర్థమైతే.

వెంజీ :- జ్ఞానికి ఏకాంతవాసం అవసరమా ?

భగవాన్ :- ఏకాంతం మనసులోని సంగతి. మనుష్యుల మధ్య మసలినా, మనో పవిత్రతను నిలుపుకున్నవాడు ఏకాంతవాసే! అడవిలో వుండి, ఆలోచిస్తోవుంటే; అది ఏకాంతవాసం ఎట్లా అవుతుంది? కోర్కెలతో వున్నవారికి అది సాధ్యం కాదు. అనాసక్తుడు ఎప్పుడూ ఏకాంతవాసే!

"అసలు ఏకాంత మంటే ఏమిటి?" అని ఒకరు భగవాన్ని అడిగారు.

భగవాన్ :- ఏకాంతమంటే, బైట ప్రపంచం నుంచి విడినివాసం కాదు. ఆత్మలో స్థిరంగా నిలవడం. ఏకాంత వాస మంటూ ఉన్నచోటూ, అన్నీ వదిలేసి, మరో

చోట నివాస ముంటే, అక్కడా పరిసరాలు - పరి
స్థితులూ ఎదురౌతాయి. అక్కడా సరిపడక ఆ
చోటూ వదిలి, మరో చోటుకు వెడితే, అక్కడా
అంతే!

ఆలోచనా రహితమే, అసలైన ఏకాంతం. మనల్ని
తరిమేది, మన మనస్సే. ముందు దాన్ని సిద్ధం
చెయ్యాలి. అప్పుడు మనం ఎక్కడ వుంటె అక్కడ,
ఆనందంగా, హాయిగా వుండవచ్చు. ఎవరో,
ఎక్కడికో వెళ్ళారని నువ్వూ అన్నీ వదిలేసి వెళ్ళకు.
ఉన్నచోటే నిశ్చల మనస్సుతో, శ్రద్ధగా సాధన
చెయ్యి. బైట సత్సంగం వుంటుందంటున్నావు. అది
సరే. అసలైన సత్సంగం, నీలోనే వుంది. అదే
నిజమైన గుహావాసం.

* * *

"ఆత్మ, ఆత్మ అంటారు, అది ఎక్కడ వుంది?" అని
ఒకరు భగవాన్ని అడిగారు. ఆ ప్రశ్నించిన వారి చేతిలో ఒక దిన
పత్రిక వుంది. భగవాన్ ఆ పత్రిక చూసి, "పత్రికలోని అక్షరాలకింద
వున్న అసలు కాగితాన్ని విస్మరించి, కాగితం కనుపించడంలేదే,
అన్నట్లు వుంది వారి ప్రశ్న," అన్నారు.

సూర్య - చంద్ర - గ్రహాల - నక్షత్రాలనుంచి ప్రసరించే
కాంతిని మనం చూస్తాం, అనుభవిస్తాం. కాని, ఆ కిరణ ప్రసార
సహాయంతో సైన్టిస్ట్ వాటి వేగాన్ని, శక్తిని, సామర్థ్యాన్ని,
విలువనీ - వాటి వాటి మధ్య గల దూరాల్ని తమకు గల శాస్త్ర
పరిజ్ఞానంతో లెక్కలు కట్టి చెపుతాడు. "రేడియో యాక్టివ్
వేవ్స - ఎలక్ట్రాన్స - న్యూట్రాన్స" అంటూ సైంటిస్ట్ ఏం
చెప్పినా, అవి మన బుద్ధికీ, తెలివికీ ఇంద్రియాలకు, మనసుకూ

అందకపోయినా, అసలు కాంతి అంటే ఏమిటో మనకు ఏమాత్రం తెలియకపోయినా, సైన్టిస్ట్ చెప్పాడని, నిశ్చయంగా నమ్ముతాం. కాని, ఒక మహాత్ముడో, మహర్షో, జ్ఞానో, యోగో "ఆత్మ" అనేది ఒకటి వుందని చెపితే, నమ్మడానికి జంకుతాం. సైన్టిస్ట్ చెప్పినట్లుగానే మనసుకూ, దేహేంద్రియాలకూ అతీతమైనది, అఖండమైనది, శాశ్వతమైనది, అక్షయమైనది, మారనిది, నిత్య సత్యమైనది; అపారం. అనంతం అయిన "ఆత్మ" ఒకటి మనలో - విశ్వమంత టిలో - ఒకటిగా - సమంగా వున్నదంటే నమ్మడానికి వెనుకాడతాం ఎందుకంటే, ఆత్మ గురించిన సంగతులన్నీ కేవలం ఒక సమాచారంగా వుంటాయి గనుక. ఆత్మను వర్ణించడానికీ, దాని విలువ కట్టడానికీ మాటలు ఒక్కటే సాధనం. అందుచేతనే ఎటువంటి మహాత్ములు చెప్పిన మాటలూ, సరైన - ఖచ్చితమైన విజ్ఞానాన్ని అందివ్వలేక పోయాయి.

అసలు వున్నది ఒక్కటే. దాన్ని ఏ పేరుతో అయినా పిలవవచ్చు. రేడియో యాక్టివ్ వేవ్స్, అనవచ్చు లేదా, ఆనంద తరంగాలనీ అనవచ్చు. ఏదన్నా, అదే. అన్నీ, అంతా అదే. అది దేహాన్ని నడిపించే శక్తి అయినా, అది నశించే దేహం వంటిది కాదు. బాధపడే ఇంద్రియాలు వంటిదీ కాదు. అది ప్రాణీ, జీవుడూ కాదు. అది మనం అనుకునే మనసూ కాదు, బుద్ధి- తెలివీ ఏదీ కాదు, కాని, అది కేవలం సాక్షీభూతంగా, సర్వకాల సర్వావస్థల్లో, సమస్త విశ్వంలో ఒకటిగా, సమంగా, శాశ్వతంగా మారకుండా వుంటుంది. అది తప్ప ఇంకోటి లేదు. దాన్నే అనేక పేర్లతో పిలుస్తారు. సత్ - చిత్ - ఆనందం - అన్నీ అదే. అంతా అదే. అన్ని పేర్లూ, దాని పేర్లే. అన్ని రూపాలూ, దాని రూపాలే !

అటువంటి ఆత్మకు అన్యంగా, భిన్నంగా ఇంకా ఏదో వుందనుకోవడం, వుత్త భ్రమ - అజ్ఞానం — అవిద్య. అలాగే

దానికి అన్యంగా ఏ దేవుడూ లేడు. దేవుడు అనేవాడు ఒకడు విడిగా వుండివుంటే. ఆయన ఆత్మరహితుడై వుంటాడన్నమాట. అది అసంభవం. కనుక ఆత్మే, సత్యం - వాస్తవం - దైవం - శాశ్వతం - శక్తివంతం - చైతన్యవంతం. అటువంటి ఆత్మ గురించి యోచించడం, మాట్లాడటం, అసత్యం - అజ్ఞానం. అందుచేత భగవాన్ ఎప్పుడూ ఏకత్వాన్నే బోధించేవారు. ఆ ఏకత్వంలో ఏమీ వుండదు, ఏదీ మిగలదు. అదే జీవితలక్ష్యం కావాలన్నారు భగవాన్.

"మనిషిలో ఆత్మ అనేది ఎక్కడ వుంటుంది?" అంటే, పువ్వు - సౌందర్యంలో, వృక్ష - బలంలో, జంతువు - అంగ సౌష్టవంలో, దాని వేగంలో, మానవుని - హృదయంలో ఉన్నది ఒక్కటే! ఆత్మ. అదే ఈశ్వరుడు. కాని, మరికొందరు ఆత్మ స్థానాన్ని సహస్రారంలో వెదకమన్నారు. ఇంకొందరు భ్రూమధ్యలో అన్నారు.

ఎంత మాట్లాడినా ఉన్నది ఆత్మ ఒక్కటే. ఇంకోటి లేదు. తక్కినవన్నీ నామ - రూపాలతో కూడిన ప్రపంచం. అది మనో కల్పితం. అంటే, సాక్షిగా వున్న "నేనే" ఆత్మ. దాన్ని మించి విడిగా, అన్యంగా, భిన్నంగా ఇంకా ఏదో వుందనుకోవడమే, అజ్ఞానం - అవిద్య - భ్రమ. ఆత్మే, వాస్తవం, యదార్థం. అది సత్యవంతమైనది, దివ్యమైనది, శాశ్వతమైనది, శక్తివంతమైనది, చైతన్యవంతమైనది. దాని గురించి మాట్లాడమే, యోచించడమే అసత్యం.

ఆత్మ ఎప్పుడూ అంతటా, ఒకటిగా, శాశ్వతంగా మార్పు చెందకుండా వుంటుంది. ఓ గొయ్యి తవ్వి, ఆ మట్టి అంతా బైట పోస్తే, అక్కడ అగాధం ఏర్పడుతుంది. ఆ అగాధాన్ని చూసి, "ఇక్కడ అగాధం వుందే!" అని ఆశ్చర్యపోతాం. కాని, ఆ అగాధం అక్కడ ఎప్పుడూ వుంది. కాని, అది మట్టితో కప్పబడి

వుంది. మనం చేయవలసింది, ఆ మట్టిని తొలగించడం. అలాగే జ్ఞానాన్ని కప్పిన, మూసిన, మాయ పొరను, అడ్డు తెరను తొలగించడం. దానిపైనున్న గట్టి పెంకును బద్దలు కొట్టాలి. అప్పుడు ఆత్మ ప్రకాశిస్తుంది.

మనకు అన్నిటికన్నా అత్యంత సన్నిహితమైనది, ఆత్మ. దాన్ని తెలుసుకోకపోతే, మనకు విడిగా, దూరంగా ఏదైనా వుంటే, ఇంక దాన్నెట్లా తెలుసుకోగలం ?

అసలు తెరను గమనించకుండా, దానిపై కదలాడే బొమ్మల సంగతుల్ని, సంఘటనల్ని, విషయాల్ని గమనించడమే, మన దృష్టి. తెరే, ఆత్మ. ఎప్పుడూ వుండేది, ఆ తెరే. సీలో మాదిరిగా, అందరిలో, ప్రపంచ రూపాలన్నింటిలో ఆత్మ వుంది. ఆత్మ మహా సాగరమైతే, ఈ రూపాలూ, అహాలూ దాని నుంచి లేచిన బుడగలు. అవి అశాశ్వతమైనవి. ఒడుదుడుకులు, కష్టాలు, ఈ ద్వంద్వాలూ అన్ని అవస్థలూ, అహానికే గాని, ఆత్మకు కావు. అవి దాన్ని అంటవు.

అన్నీ, అంతా, అందరూ ఆత్మ స్వరూపాలే ! కాని, ఎవరూ దానికి ఎప్పుడూ ఎరుకలో వుండరు. బాధలు, కష్టాలు, దుఃఖాలు, యాతనలు అన్నీ అనుభవిస్తారు కాని, దేహాత్మబుద్ధి వీడరు. అది అన్నింటిలోకీ చిత్రమైనసంగతి. అందుచేత మనం చేయవలసింది ఆ దేహాత్మబుద్ధిని పొగొట్టుకోవడం. అంటే, "నేను" అనే ప్రత్యేక వ్యక్తిత్వం నాశనం కావడం.

పుట్టేది గిట్టేది దేహం. నిద్రలో ఆ దేహం ఎరుకలో వుండదు. అయినా నువ్వు వుంటావు. వుంటావుగాని, దేహస్ఫురణ వుండదు. అంటే, నువ్వు నిద్రలో దేహం కాదు. అవునా ? అటువంటప్పుడు నువ్వు మేల్కొన్న తర్వాత దేహివి ఎట్లా అవుతావు ? ముందు ఆ సంగతి యోచించి, తెలుసుకుంటే, సర్వం

ఆ "భారతి"లో సౌరిస్ రాసిన వ్యాసం "అరుణాచల లేఖ" భగవాన్ చదివించుకున్న తర్వాత "భగవాన్ ఎంత దొంగ!" అన్న మౌన స్వామి మాట అర్థమైంది. ఆ వ్యాసంలో సౌరిస్ "భగవాన్ ఎంత దొంగ" అని రాశారు.

ఉదయం పదకొండు గంటలకు ఆశ్రమంలో భోజనానికి గంట కొట్టేవారు. భోజనశాలలో బ్రాహ్మణ - అబ్రాహ్మణ పట్టింపు వుంది. ఏ పట్టింపూలేని భగవాన్, ఆ విభాగం మధ్య కూర్చునేవారు- ఇరు పక్షాల వారికీ కన్పించేటట్లుగా. భగవాన్ భోజనం చేయడం ఆరంభించేవరకూ ఎవరూ ఏ పదార్థమూ ముట్టుకునేవారు కాదు. అందరికీ వడ్డించేవరకూ భగవాన్ తినేవారు కాదు.

భోజనానంతరం భగవాన్ తాంబూలం వేసుకునేవారు. దాన్ని పూర్తిగా నమిలిన తర్వాత, నోరు శుభ్రంగా కడుక్కునే వారు. పరిచారకుని నిర్లక్ష్యం వల్ల, వరసగా కొన్ని రోజులు భగవాన్‌కి తాంబూలం ఇవ్వడం మరచిపోవడంతో ఆయన తాంబూలం వేసుకోవడం మానేశారు.

మధ్యాహ్నం రెండు గంటల వరకు భగవాన్ విశ్రాంతి తీసుకునేవారు. చివరి సంవత్సరాల్లో భగవాన్ ఆరోగ్యంకోసం ఆశ్రమాధికారులు విశ్రాంతి సమయంలో హాలు తలుపులు మూసేస్తే, ఒకాయన తెలియక లోపలకు వెడితే, పరిచారకుడు కటువుగా మాట్లాడి కసిరాడు. ఆ సంగతి తెలిసి భగవాన్ మర్నాడు భోజనా నంతరం హాలు బైట మెట్లమీద కూర్చున్నారు. ఎంతకీ లోపలకు వెళ్ళని భగవాన్ని చూసి, "ఏమిటి బైట కూర్చున్నారు?" అని ఒకరు సాహసించి అడిగితే, "రెండు గంటల వరకూ ఎవరూ హాల్లో ప్రవేశించకూడదు కదా?" అన్నారు. ఆ తర్వాత ఆశ్రమం వారు తమ తప్పు తెలుసుకుని, భగవాన్ని ఎంతో బ్రతిమాలారు. అప్పటినుంచి అందరికీ, అన్ని వేళలా భగవాన్ దర్శనం కలిగే ఏర్పాటు చేశారు ఆశ్రమాధికారులు.

అహంకరణను "ఆత్మ" అని చాటుతుంది. అహంకారం నుంచి జనించే ఇంద్రియాలూ, మనసూ ఆత్మనిరూపణకు చాలవు. అసలు వాటి ఉనికికి ఆధారం ఆత్మేకదా? ఆత్మలేక అవి నిలవలేవు. ఆత్మకు మార్పు లేదు. అది ఎప్పుడూ ఒకే రీతిగా ఒకటిగా, వుంటుంది. మధ్యలో వచ్చింది, అహంకారం.

ఆ అహంకారం లేవగానే, దాని వెనక వ్యక్తిత్వం తలెత్తుతుంది. అంటే, మేల్కొంటుంది. తర్వాత స్ఫురణ - భావన - తలంపు పుడతాయి. ఆ తలంపుల్లో ఒకటి 'నాకు ఆత్మసిద్ధి కాలేదు. నన్ను నేను తెలుసుకోలేకుండా వున్నాను" అని. అదంతా అహంకారం ఆడించే ఆట. దానికి కారణం, నువ్వు దాని వలలో చిక్కుకోవడం.

మెలకువలోని "నేను" కేవలం అహంభావన. నిద్రలోని "నేను" నిజమైన, సహజమైన "నేను". నిజానికి నిద్రలో వున్నదీ, మెలకువలో వున్నదీ ఒకటే "నేను". కాని, నిద్రలో నిర్గుణంగా వుండి, మెలకువలో సగుణమై నానాత్వం తాలుస్తుంది. నిద్రలోని "నేనే" నిజమైనది, శాశ్వతమైనది. అదే ఆత్మ.

ఆ ఆత్మను గురించి తెలుసుకునే విధానమే, "ఆత్మ విచారణ మార్గం" అంటారు. ఆ మార్గంలో మర్మం లేదు, నిగూఢత్వంలేదు. అది గుప్తవిద్య కాదు. దాని ఉద్దేశ్యం, మనసును దాని మూలం వైపు తిప్పడం. కాని, దాన్ని తెలుసుకోవడానికి ఒకటి అడ్డు వస్తుంది - అజ్ఞానం. అజ్ఞానమంటే, ఆత్మను మనో - దేహాలుగా భావించే మిథ్యాజ్ఞానం. ఆ జ్ఞానం తొలగిందా, ఆత్మ మిగులుతుంది. జ్ఞానం గోచరిస్తుంది. కాని, నిజం చెప్పాలంటే, జ్ఞాన - అజ్ఞానాలకు అతీతమైనది ఆత్మ. అది సదా సహజ స్థితిలో వుంటుంది.

ఆత్మవిచారణ చేయకపోతే, జీవితంలో లోకవిచార
ప్రవేశిస్తుంది. విచారణకన్నా ఏ భక్తీ, ఏ సత్కర్మా అధికంకాదు
ఆత్మవిచారణ, ఒక విభజన కాదు. కేవలం తానేదై వున్నాడో
దాని మీద దృష్టి కేంద్రీకరించడం. అంటే, నిరంతరం మనలో
"నేను - నేను" అని అంటున్న దానిపై దృష్టి పెట్టడం.

అజ్ఞానపు తెర తొలగించడానికే, ఈ సాధనలన్నీ. ఆత్మను
తెలుసుకోవడంకోసం చేసే సాధన, ప్రయత్నం దానికైన ఆశ
అన్నీ స్వప్నంలోని భాగాలు, కాకపోతే, భ్రాంతి. ఆత్మను
తెలుసుకోవడమంటే, మనలో రెండు "నేను"లు వున్నట్లూ,
ఒకటి మరొక దాన్ని తెలుసుకోవడంవలె కాదు. అసలు సత్యాన్ని
అసత్యంగా భావించే పొరపాటును పోగొట్టడం.

ఆత్మసిద్ధికోసం చేసే సాధన ఎట్లా వుంటుందంటే, "మీరు
మీ ఇంట్లో వుంటూ, మీరు మీ ఇంట్లోకి వెళ్ళడానికి ఏది దారి
ఎన్ని దారులున్నాయి? ఆ దారుల్లో ఏది మంచిది? ఏది దగ్గర
దారి? ఏది సులభమైనది?" అన్నట్లు వుంటుంది. అసలు సంగతి
ఏమిటంటే, ఆత్మ నీలోనే వుంది. నువ్వే ఆత్మస్వరూపానివి
దానికోసం ఏ సాధనలు చేయనవసరం లేదు. అవి గ్రంథాల్లో
వుండే సంగతి కాదు. ఆత్మ ఎప్పుడూ అవగతమవుతూనే వుంది
ఆధ్యాత్మిక క్రమశిక్షణలో దాన్ని చేరుకోవడమే, జీవితలక్ష్యంగా
చెపుతారు.

లోదృష్టి వల్ల ఆత్మవిచారణ సాధ్యమౌతుంది. కంటికి
కనపడక, నీటిలో కరిగివున్న ఉప్పును రుచి ద్వారా తెలుసుకున్నట్లు
బుద్ధి ద్వారా ఆత్మను తెలుసుకోవచ్చు. విచారం ద్వారా కాక
మరొక మార్గాన అంటే, దొంగ, పోలీసు అధికారియై, తనని తాన
పట్టుకోవడం వంటి మార్గాన ఆత్మను తెలుసుకోవచ్చు.

లోదృష్టితో వుండి, ఆత్మలో ఐక్యం కావాలంటే. మనో
విజృంభణ పూర్తిగా అణగి నాశనం కావాలి. అట్టి సమాధి

స్థితిలోనే, ఆత్మ అనుభవేద్యం కాగలదు. అట్టివారికి ప్రపంచం భిన్నంగా తోచదు. వారు సహజ సమాధిస్థితిలో, చలించక నిలుస్తారు. సమస్త కార్యకలాపం, సినీమా తెరమీద బొమ్మలు మాదిరిగా కదిలి, గతించిపోతుంది. దానికంతకూ వారు సాక్షి భూతులుగా వుంటారు.

నిజం చెప్పాలంటే, ఆత్మసాక్షాత్కారమనేది కేవలం మాట మాత్రమే. కాని, ఆత్మసాక్షాత్కారం అనేప్పటికి ప్రజలు ఏదో మహోత్యం జరుగుతుందని ఎదురుచూస్తారు. అది ఒక మెరుపులాగ ఆకాశంలోంచో, స్వర్గంలోంచో వూడిపడుతుందనే భావనలో వుంటారు. ఏదైనా కొత్తగా వచ్చిందంటే, అది పోతుంది. కొత్తగా పుట్టింది అయితే, అది చస్తుంది. నిర్మాణం అయిందంటే, అది నాశనమౌతుంది. పొందేది అయితే, నష్టమౌతుంది. కాని అది అటువంటిది కాదు. "నేను ఈ దేహం. నేను ఇది, నేను అది" అనే భావం పోవడమే, ఆత్మసిద్ధి. అంటే, నువ్వు అసలైన నువ్వుగా మిగలడం.

ఆత్మ పొందేదే అయితే, అది నష్టం కావడానికీ వీలు వుంటుంది. అంటే, అది అశాశ్వతమన్నమాట. అది కలిగించే ఆనందం కూడా తాత్కాలికమే అవుతుంది. అందుచేత పొందేదేదీ శాశ్వతం కాదు. ఆత్మ ఎప్పుడూ వుండేదే! దానికోసం ఆరాట పడటం, ఆతృత చెందటం, ఆశించడం, ప్రయత్నించడం మూర్ఖం. భవిష్యత్తులో జరిగేదానికి ఎందుకు ఆందోళన చెందటం? అక్కడ ఆ క్షణంలో వున్నదే ముఖ్యం. అంటే, "ఆ క్షణం" - అదే వర్తమానం. ఉన్నదీ అదే ! కనుక నువ్వు ఎప్పుడూ ఆత్మవే. ఆత్మను ఎరిగిన వాడవే. అసలు నువ్వే ఆత్మ. కాని, అజ్ఞానం వల్ల నువ్వు ఆ యదార్థానికి ఎరుకలో లేవు. అంతే! కనుక వర్తమానమే ముఖ్యం. భవిష్యత్తుకోసం చూస్తూ వర్తమానాన్ని

వృథా చేయకూడదు. ఆ క్షణం మీదే దృష్టి పెట్టాలి. మనం ఎప్పుడూ అద్వైత, ఆత్మయై వున్నాం. దాన్ని నిష్కామ కర్మాచరణ ద్వారా, భక్తి - జ్ఞాన - యోగ - విచారణ మార్గాల ద్వారా తెలుసుకోవాలి.

ఆత్మసాక్షాత్కారానికి అవరోధాలు స్మృతి, జ్ఞప్తి, ఆలోచించే అలవాటు, విషయ వాసనలు, పోగుచేసుకునే బుద్ధి. నిజంగా, శ్రద్ధగా ఆత్మను తెలుసుకోవాలంటే, గట్టి కోరిక వుంటే, ఆత్మ దర్శనం కాకమానదు. ఆ సంకల్పమే, గురువై మనల్ని ఆ మార్గాన మరింత సులభంగా నడుపుతుంది. దానికి మనసంతా పూర్తిగా కేంద్రీకృతశక్తితో ఎరుకలో వుండి పనిచేయాలి. ఎందుకంటే. ఆత్మ సాక్షాత్కారానికి దేహం కాదు అడ్డు, అహంకారం. అదే దేహాత్మ బుద్ధి. అహంకారం చావకపోతే, మృత్యువు దాన్ని పోగొట్టదు. కనుక బ్రతికి వుండగానే అహంకారం నాశనమైతే, మృత్యువు దాన్ని తిరిగి పుట్టించదు.

ఆత్మసిద్ధి అసాధ్యం అనుకోవడం కూడా ఒక తలంపే. ఆ తలంపే ఆత్మసిద్ధికి అడ్డు, అవరోధం, ఆటంకం. ఆ తలంపు కలగడమే, అజ్ఞానం. దాన్ని నిరోధించావా, అంతా చక్కబడుతుంది. అజ్ఞానానికి సమమైనదే అహంకరణ. దాని మూలాన్ని చేరితే, అది అదృశ్యమౌతుంది.

"నేను" అనే మొదటి తలంపు ఎక్కడనుంచి పుడుతుందో గమనిస్తే, " నేను " అనే అహంభావం అదృశ్యమై, అనంతమైన "అహమహం" అనే స్ఫురణ కలుగుతుంది. అంటే, దేహాత్మబుద్ధి నశిస్తుంది. "నేను దేహాన్ని" అనే నిశ్చయభావం కూకటివేళ్ళతో కూలుతుంది.

అందుచేత "నేను" అను మొదటి తలంపు, పుట్టు చోటు తెలుసుకుని అక్కడ నిశ్చలంగా నిలవాలి. అక్కడ వున్న దేదో అది అంతటా ఒకటిగా, సమంగా, నిత్యసత్యంగా, శాశ్వతంగా

వుంది. అదే అంతనీ చూసుకుంటుంది. అక్కడ ప్రత్యేక వ్యక్తిత్వపు శక్తి ఏదీ పనిచేయదు. సముద్రం, అలలను లక్ష్యపెట్టనట్లు; ఆత్మ, దేహాన్ని గుర్తించదు.

నువ్వు చేయవలసింది, నిశ్చలంగా వుండటం. ఆ నిశ్చలతే "నేను" అన్న స్ఫూర్తి. అదే ఆత్మస్థితి. అది వర్తమానాల వాస్తవత్వాన్ని అనుభవిస్తుంది. అది అన్నింటికీసంపూర్ణఎరుకలో వుంటుంది. అదే మన సహజ స్వభావం. అప్పుడు కలిగే సహజ స్థితినే "నిర్వికల్ప సమాధి" అంటారు. ఎందుకంటే, ఆ స్థితిలో మనసు సంశయాలనుంచి, స్వేచ్ఛ పొందుతుంది. ఆ స్థితిలో వున్న వారికి ఒక దానివెంట మరొకటి సంభవించే అవకాశాలూ, బహుశా జరగవచ్చుననే ఆశలూ- వాటి మధ్య వూగిసలాడవలసిన పనీ వుండదు. అంటే, ఏ రకమైన వికల్పం వుండదు.

నువ్వు చూడవలసిందీ, చేయవలసిందీ నిశ్చలంగా, వుండటం. అంటే, నువ్వు; వున్నట్లేవుండటం. అంటే, నువ్వేం చేస్తున్నా, నువ్వు నువ్వే. నువ్వు, నువ్వు కాకుండా పోవు. కాని, మమకారం లేకుండా, యిష్టాయిష్టాల ప్రమేయం లేకుండా పనిచేయాలి. లేదా ఆ పని జరుగనివ్వాలి. జరిగే వాటికి మనసును గొడవపడనివ్వకూడదు.

నీ పని, వుండటం. అంటే, "అలా వుండాలి. ఇలా వుండాలి. అలా వుంటాను. ఇలా వుంటాను" అని కాదు. నిశ్చలంగా, స్థిరంగా వుండటం. అదే నీ ధర్మం. ప్రతి పవిత్ర గ్రంథం, ప్రతి మహాత్ముడూ "వూరికే వుండు. BE QUITE. BE STILL" అంటారు. అందుచేత "BE - వుండు. అది చాలు" అంటారు భగవాన్.

ఊరికే వుండటం అసాధ్యం. ఏళ్ళతరబడి అనేక ఏళ్ళ పోగుచేసుకున్న విషయవాసనల నుంచి బైటపడి, వూరికే నిశ్చలంగా వుండటం సాధ్యం కాదు. దానికి గట్టి సాధన

చెయ్యాలి - "BE STILL" అంటే, సర్వేంద్రియాల సంచలనాన్ని నిలిపి, వున్నట్లు వుండటం. ఆ సాధనామార్గం, ప్రేమకు కళ్ళు తెరిపిస్తుంది.

ప్రశాంతంగా వుండాలంటే, తప్పనిసరిగా ధ్యానం ద్వారా మౌనస్థితికి వెళ్ళాలి. ధ్యానానికి కావలసింది అనుగ్రహం కాదు, నిరంతర సాధన. అది నీ చేత జరిగే సంగతి. నువ్వే ధ్యానం. నీ నిజ స్వభావమే ధ్యానం. ఆ ధ్యానం నీకు విడిగా లేదు. దానికి నువ్వే కేంద్రం. అదే హృదయం - ఆత్మ - దైవం. అదే అసలు నువ్వు. దాన్ని అందుకోవడానికే - నిన్ను నీవు తెలుసుకోవడానికే, నువ్వు ధ్యానం చేస్తావు. అందుకే "ధ్యానమంత ఉత్తమమైనది లేదు" అన్నారు భగవాన్.

ఆత్మసిద్ధి కలిగిందంటే, అసలు తామేదో అదైనారన్నమాట. అంటే, పరిపూర్ణులైనారని అర్థం. అంటే, ఆత్మస్వరూపులైనారు. ఆ స్థితిని మాటల్లో వర్ణించడం బహు కష్టం. ఆ స్థితిని అందుకున్న వారు అదీ - ఇదీ, ఏదీ కాకుండా, ఆత్మగా మిగులుతారు. ఊరికే వుండటమంటే, అదే. అంటే, ఏ మాత్రం ప్రత్యేక వ్యక్తిత్వపు స్ఫురణా లేకుండా నిరంతరం తాను, తానుగా వుండటం. అంటే, SEEING IS BEING.

అందుచేత ఎప్పుడూ ఆత్మను తెలుసుకునేవాడివిగా వుండక పోవడమే, పరిపూర్ణంగా వుండటం. ఆ స్థితిలో వున్నవారు సంసారం చేయవచ్చు. గుహలో జీవించవచ్చు. వారికి అన్నీ, అంతా, ఒకటే. అటువంటి మహాత్ములు ఇట్లా వుండాలి, అట్లా వుండాలి అక్కడ ఉండాలి, ఇక్కడ వుండాలి అనేది లేదు.

ఆత్మలో ఐక్యమైనవారికి ప్రపంచం లేదు. ప్రపంచం పట్టదు. వారికి బాధ, దుఃఖం ఏమీ వుండవు. దానికి కారణం,

వారిలో అవిద్య నాశనం కావడం. అసలు అవిద్య అనేది వాస్తవంగా లేదు. సమస్త శాస్త్రాలూ "అవిద్య" అనేది లేదని చెప్పడానికి చేసే ప్రయత్నాలే. అవిద్య కేవలం, అజ్ఞానం. కాకపోతే, ఆత్మను మరవడం. సూర్యునిముందు చీకటి లేనట్లే, జ్ఞానప్రకాశంలో అవిద్యకు తావు లేదు.

ఆత్మ సిద్ధించినవారికి శక్తులు ఉత్పత్తి కావచ్చు. వారి చుట్టూ జనం చేరి గోల చేయవచ్చు. అయినా వారు చలించరు. వారి స్థితి భిన్నం కాదు. అటువంటివారికి ఏకాంతవాసంతో పని లేదు. వారు నిరంకుశాధికారులుమల్లేనో, చంటిబిడ్డలు మాదిరిగానో వుంటారు. వారికి ఎటువంటి జాగ్రత్తలు, ఆందోళనలు వుండవు.

"ఆత్మసాక్షాత్కారం పొందినవారు మళ్ళా ఆ స్థితిని పోగొట్టుకోవడమంటూ వుంటుందా ?" అని ఒకరు భగవాన్ని ప్రశ్నించారు.

"అవకాశం లేకపోలేదు. సాధన మొదట్లో చాలా అవకాశం వుంది. ఏమాత్రం బంధం, మమకారం కోర్కెవున్నా - ఆ కోర్కె ఎటువంటిదైనా - చివరికి దైవ సంబంధమైన కోర్కె అయినా సరే, కోర్కె మిగిలి వుంటే, వారు తిరిగి మామూలు ప్రపంచంలో పడిపోయే ప్రమాదం లేకపోలేదు.

"అదంతా వాసనల ఫలితం. వాసనలు మనల్ని మన సహజస్థితి నుంచి లాగేస్తాయి, లేదా అడ్డు పడతాయి. వాసనలన్నీ ఒకే ఒక్క సారిగా పోవు గనుక, వాటిని అన్నింటినీ పూర్తిగా సర్వ నాశనం చేయాలి. అంటే, ఏ కోర్కె లేకుండా పోవాలి. లేకపోతే ఎంతటివారి విషయంలోనూ ప్రమాదం వుండనే వుంటుంది.

"ఆత్మ సాక్షాత్కారమనేది కొందరికి మెరపుమల్లే కలిగి, పోతుంది. మెరపులాగ వచ్చేది, మెరపులాగే పోతుంది. అది ఆత్మసాక్షాత్కారం కానే కాదు" అన్నారు భగవాన్.

కాని, భగవాన్ విషయంలో మాత్రం అలా జరగలేదు. ఆయన పొందిన అంతిమస్థితి, చివరివరకు ఒకే విధంగా నిలిచి వుంది.

"ఫలానా వారు మోక్షం పొందారు. ఫలానా వారు జీవన్ముక్తులు. ఫలానా వారికి ఆత్మదర్శనమైంది. ఫలానా వారికి ఈశ్వర సాక్షాత్కారం కలిగింది. నిర్వాణస్థితి అందుకున్నారు" అని అంటారు. కాని, అది సరి కాదు "ముక్తి" అనే మాటకు అర్థం మనకు స్పష్టంగా, పూర్తిగా తెలియక, ఆ సంగతి అనుభవం లోకి రాక, దాన్ని తప్పుగా ఉపయోగించడమే అవుతుంది. ముక్తి పొందేది ఎవరు? దేహమా? కాదు. ముక్తి పొందేది ఎప్పుడూ జీవితం. కాని వ్యక్తి కాదు. ఫలానా వారు మోక్షం పొందారని చెప్పడానికి బాహ్యంగా ఏమైనా గుర్తు వుంటుందా? కాని ఒక గుర్తు వుంటుంది - ముక్తి పొందినవారు ఎప్పుడూ ఈ ప్రపంచంలో జరిగే ఏ సంగతికీ, ఏ విషయానికీ, ఏ సంఘటనకూ "REACT - రియాక్ట్" కారు. అంటే, వారు ప్రతిక్రియ చేయరు,వారు కేవలం ఏదో ఒకటి చేస్తారు, అదీ తమకు ఆ క్షణాన ఏం చెయ్యాలనిపిస్తే, అది చేస్తారు. కనుక మనం చేయవలసిందీ, వారిని చూసి నేర్చుకోవలసిందీ ఏమిటంటే, మనంకూడా క్రమంగా ప్రతిక్రియల్ని తక్షణ కార్యాల్లోకి మార్చుకో వాలి. మనం చేసే ఆ పనులు పవిత్రంగా వుంటే, క్రమంగా మనలో అనాసక్తభావం ఏర్పడుతుంది. అదే మోక్షం. అంటే, పవిత్రమైన, నిర్మలమైన కార్యకలాపం సాగించడం వల్ల, అహంకారం దాని కదే అదృశ్యమౌతుంది.

ఆత్మ సాక్షాత్కారం వంటి అంతిమ స్థితిని పొందిన తర్వాత వారి దేహం నిలవవచ్చు, లేదా నిలవకపోవచ్చు. ఏమైనా వారికి దేహస్ఫురణ మాత్రం వుండదు.

తాము పొందిన లేక, తమకు కలిగిన, లేక తాము వున్న స్థితి ఏమిటో అసలుసత్యం తెలుసుకున్న మహాత్మలే వర్ణించి

చెప్పలేరు. వర్ణించాలంటే, వారు తమ స్థితికి బైట నిలబడి, మాట్లాడాలి కదా ? వారే ఆ స్థితి అయిన తర్వాత ఇంక వారు ఆ స్థితిని ఎట్లా వర్ణించగలరు? వర్ణింప శక్యంకాని దాన్ని, వారు మాత్రం మాటల్లో ఎట్లా వర్ణిస్తారు? అది మాటకీ, భావానికీ, ఊహకూ, నామ-రూపాలకూ, మనసుకూ, కాల - దూరాలకూ అతీతమైన స్థితి.

తమకు కలిగిన దివ్యానుభూతుల్ని మాటల్లో వర్ణించి చెప్పడానికి ప్రయత్నించేప్పటికి వేదాంతులు, తత్వవేత్తలు, మహర్షులు భిన్నంగా తోస్తారు. వారి హృదయాంతరాళంలో ఏమి వుందో, ఏం జరుగుతూవుందో, ఏం జరిగిందో - అదంతా మర్మం, మాయ అనవలసిందే! అది తెలియాలంటే, మనమూ ఆ లోపల ప్రవేశించాలి. ఎవరికి వారు, ఆ పరమ సత్యాన్ని తెలుసుకోవాలి. అలా తెలుసుకున్న తర్వాత వారూ అంతే! వారూ దాన్ని వారి మాదిరిగా మాటల్లో వర్ణించలేరు.

ఆత్మసాక్షాత్కారం పొందినవారు ఇదంతా ఆనంద తరంగాలుగా చూస్తారు. వారి మనస్సు నిశ్చలంగా, శాంతంగా వుంటుంది. ఏ అలజడీ, కలతా, ఘర్షణా, గందరగోళం, తికమక ఏమీ లేకుండా శాంతంగా వుంటుంది. అది నిశ్చల, గంభీర, అగాధ సముద్రం మాదిరిగా వుంటుంది. ఆ మహాసముద్రంపై తేలిఆడే తరంగాలే, ఆనందం. అంటే, శాంతి నుంచి ఆవిర్భవించినదే, ఆనందం.

శ్రీ రమణాశ్రమం దినదినాభివృద్ధి చెందింది.
పెరిగింది. కాని, భగవాన్ ఎప్పటిమల్లే చేతిలో ఓ కర్రా
కౌపీనంతో వుండేవారు. " నా చుట్టూ ఈ భవనాలతో, క
ఇంత పెద్ద ఆశ్రమం తయారైంది. నేను వీటిని కోరలేదు.
నేను ఎవరినీ ఏమీ అర్థించలేదు. కాని, ఏ నిర్మాణాన్నీ
అయినా ఇంత విస్తరించింది. అవి అట్లాజరగవలసివుండి,
అనుకున్నాను. అందుచేత, నేను దేన్నీ, దేనికీ కా
అనను, అనలేదు" అన్నారు భగవాన్.

**1937**లో శ్రీ రమణాశ్రమానికి పోష్టాఫీసు
వరసగా మొదటి రెండు రోజాలూ ఆశ్రమానికి వచ్చిన
పైన భగవాన్ తమ చేత్తో పోష్టాఫీసు ముద్ర వేశారు.

**1939** లో మహాపూజానంతరం పల్లాకుత్తులో వుం
గుంపుకు భగవాన్ స్వయంగా అన్ని రకాల తినుబం
విందు చేశారు. ఆ విందులో కోతులన్నీ బుద్ధిగా,
కూర్చున్నాయి. భగవాన్ వాటన్నింటికీ పదార్థాలు అం
అవి బాగా అన్నీ తిని, సంతోషంతో గెంతుతూ పెద్దపెద్ద
ఆరంభించాయి.

ఒకసారి ఉత్తరహిందూదేశపు మహారాణి స్క
పునర్నిర్మాణానికి పూనుకుంటే, భగవాన్‌తోసహా ఓ
మంది స్కందాశ్రమానికి వెళ్ళి, ఓ రోజంతా అక్కడ
చేశారు. ఆ రోజంతా అక్కడే వంటలు, భోజనాలు,
కబుర్లు. ఆ రోజంతా అక్కడే గడిపారు.

మరొకసారి శ్రీ రమణాశ్రమవాసులందరూ స్కందా
భోజనాలు ఏర్పాటు చేశారు. ఆ రోజుకు మద్రాసు,
విల్లుపురంనుంచి భక్తులు వచ్చారు. ఆ ముందురోజు
వంటలు చేశారు - దధ్యోదనం, పులిహోర, చక్కెర

ఉప్పుపొంగలి, వడలు, పూరీలు, కూటు, వరవలు మొదలైనవి ఎన్నో పదార్థాలు చేశారు. ఉదయమే భగవాన్‌తో కలిసి అందరూ స్కందాశ్రమం చేరుకున్నారు. అక్కడ అందరూ భగవాన్ చుట్టూ కొలువుతీర్చి కూర్చున్నారు. ఆశ్రమంలో జరిగినట్టు అన్నిజరిగాయి- పోస్ట్ వచ్చింది. పేపరు తెచ్చారు. అన్నీ ఆయా సమయానికి జరిగాయి. భగవాన్ తన గిరి జీవితం గురించిన కథలు, కబుర్లు చెప్పారు. సాయంత్రం అందరూ కిందికి దిగివచ్చారు.

* * *

ఒకసారి ఆశ్రమానికి ఒక పక్షవాతపు రోగిని తీసుకొచ్చారు. అతన్ని భగవాన్ ముందు వుంచారు. కొంతసేపటికి అతనికి అతనే పైకి లేచి, భగవాన్‌కి సాష్టాంగ నమస్కారం చేసి, భగవాన్ చేతికి ఒక నోట్ బుక్ అందించాడు, అప్పటివరకు తనకు తాను లేచి, కదలలేని ఆ పక్షవాతపు రోగి. ఆ నోట్ బుక్‌లో అతని జాతకం రాసి వుంది: "నీకు పక్షవాతం వస్తుంది. ఆ తర్వాత ఒక మహాత్ముణ్ణి దర్శిస్తావు.ఆయన అనుగ్రహంవల్ల గొప్ప మహాత్యంగా నీ రోగం నయమౌతుంది" అని. స్వస్థత చెందిన ఆ పక్షవాతపు రోగి, భగవాన్‌కి కృతజ్ఞత చెప్పుకుంటూ బైటికి వెళ్ళిపోయాడు. అక్కడ వున్నవారంతా ఆశ్చర్యంతో చూడ్డం చూసి, "నేను అతనికోసం ఏమీ చేయలేదు. జ్ఞానికి సంకల్పాలు ఏమీ వుండవు" అన్నారు భగవాన్.

* * *

ఒకాయన తన వ్యాధి గురించి భగవాన్‌తో చెప్పుకున్నారు. దానికి భగవాన్ "ఈ దేహమే, ఒక వ్యాధి. దానికి మరో వ్యాధి వచ్చింది. అంతే, వ్యాధికి వ్యాధి వచ్చిందన్నమాట -

కనుక ముందు అసలు వ్యాధికి మందు ఇస్తే, కొత్తగా వచ్చిన వ్యాధి మనల్ని అంటదు, బాధించదు. అసలు సంగతి యోచించక కొత్తగా వచ్చిన దాని గురించి యోచించి లాభమేమిటి? దానితోవన దాన్ని వదలి, అసలు వ్యాధి సంగతి చూడండి'' అన్నారు.

* * *

ఒక వూరు నుంచి ఓ దంపతులు శ్రీ రమణాశ్రమానికి వచ్చి, కొన్ని నెలలు వుండి, వెళ్ళేరోజున భర్త, ఇంటికి వెళ్ళనని మొండికేశాడు. దానికి భగవాన్, ''ఇంక ఎక్కడికి పోతారు, సంసారం వదలి? ఆకాశంలోకి ఎగిరిపోతారా? మీరు భూమి మీద వున్న సంగతి మరచిపోకండి. మీరు ఎక్కడ వుంటే అక్కడ, సంసారం తయారౌతుంది. అన్నీ వదలి వచ్చేశాను అనుకున్నాను. ఇప్పుడు చూడండి నాకెంత సంసారం తయారైనదో! ఇది సంసారంకంటే పెద్దది'' అన్నారు.

* * *

ఒకసారి సుందరేశయ్యర్, ''నేను నలభై ఏళ్ళు భగవాన్ సన్నిధిలో వున్నాను. ఇప్పుడు నాకు మరో ఊరుకు బదిలీ అయింది. నేను భగవాన్‌కి ఎట్లా దూరంగా వుండగలను?'' అని చాలా దిగులుగా భగవాన్‌తో చెప్పుకున్నారు.

దానికి భగవాన్ ''చూడండి, నలభై ఏళ్ళు భగవాన్‌తో వుండి, ''ఈనాడు భగవాన్‌కి దూరంగా వుండటం'' అనే సంగతి గురించి యోచిస్తున్నారా?'' అన్నారు. ఆ తర్వాత ఆయన బదిలీ ఆగిపోయింది.

* * *

ఒక రోజున ఆశ్రమానికి ఒక దిగంబర సాధువచ్చి "నా భవిష్యత్తు ఏం కాబోతోంది?" అని భగవాన్ని అడిగితే, "ఆయనకు చెప్పండి, వర్తమానం ఎలా వుందో, భవిష్యత్తూ అలా వుంటుందని" అన్నారు భగవాన్.

* * *

ఒకాయన అనేకచోట్ల, అనేకమంది మహాత్ముల్ని - మహర్షుల్ని - యోగుల్ని - గురువుల్ని దర్శించి; ఆయా మత గ్రంథాలన్నీ చదివి, వారి సాధనా మార్గాల్ని అనుసరించి, వాటి గురించి భగవాన్‌తో చెప్పి, "ఆ మార్గాల్లో ఏది సరైన దారి? నేను ఏ దారిని వెళ్ళాలి?" అని చాలా సీరియస్‌గా అడిగారు. దానికి భగవాన్ అంతకన్నా సీరియస్‌గా, అదే సమయాన హాల్లోంచి బైటికి వెడుతూ, "వచ్చిన దారినే వెళ్ళండి" అన్నారు. ఆ మాట ఆయనకు ఎంతవరకు అర్థమైనదో కాని, ఆయన వెళ్ళిపోయారు.

* * *

భగవాన్ భక్తుడు రంగన్న కొడుకు, "రమణ కళ్యాణం" అని ఒకటి రాసి, దాన్ని భగవాన్‌కి ఇచ్చాడు. భగవాన్ దాన్ని చదివి, సరిగా వుందని, "స్వామి షష్టిపూర్తి, వివాహంవలె ధ్వనించేట్టు రాశారు. ఇంక దీనికి ఏముంది? ఇదంతా వివాహ కార్యక్రమంలాగ వర్ణించారు. ప్రజలు చాలా తెలివిగా స్వామిని వివాహ బంధాల్లోకి, పెళ్ళి గొడవల్లోకి లాగాలని చూస్తారు. ఎందుకంటే, ఆ సంగతులు వాళ్ళ సవ్వాలకు, సరదాలకు

చక్కిలిగింతలు పెట్టుకున్నట్లు వుంటాయి. మనుష్యులు తమ ఆంతర్యాల్లో ఏమున్నా వాటిని స్వామికి అంటగడతారు. బావుంది. వాళ్ళను ఆ విధంగానే ఆనందించనివ్వండి" అన్నారు.

* * *

ఒకసారి భగవాన్ మనుష్యుల మధ్య శత్రుత్వం గురించి మాట్లాడారు. "మనల్ని ఎవరైతే ఖండిస్తారో, కాదంటారో, తిడతారో, నిందిస్తారో, నిరాకరిస్తారో వారు మన మిత్రులు. ఎందుకంటే, మన శత్రువైన దేహాన్ని వారు నిందిస్తారు, ఖండిస్తారు. మన మనో శత్రువుకు శత్రువైన దేహానికి శత్రువు, మనకు ఆప్త మిత్రుడు కావాలి కదా? అవునా? ఎవరైతే మనల్ని కొనియాడుతారో వారి నుంచి జాగ్రత్త పడాలి" అన్నారు.

* * *

ఆశ్రమం హాల్లోకి, వంటింట్లోకి కోతులువచ్చి నానా గోల చేస్తున్నాయని పరిచారకుడు వాటిని కొడితే, "నువ్వు కొట్టేది కోతుల్ని కాదు, నన్ను. ఆ దెబ్బలన్నీ నాకు తగులుతున్నాయి. ఆ బాధంతా నేను పడుతున్నాను" అని, "ఇదంతా అడవి. అనాదిగా కోతుల నివాస స్థలం. మానవుడు ఇటు రాకముందు ఎన్నో ఏళ్ళనుంచి ఈ కోతులన్నీ ఇక్కడ వుంటున్నాయి, హాయిగా. ఇప్పుడు మనం వాటి మధ్యకు వచ్చి, వాటి నివాస స్థలమంతా ధ్వంసం చేసి, ఇళ్ళు కట్టుకుంటున్నాం. మనది దురాక్రమణ. వాటికి కష్టం కలిగి, అల్లరిచేస్తే మనం కోపం తెచ్చుకోవడంలో న్యాయమేముంది? మనం కొంత బాధను భరిస్తేనేం?" అన్నారు.

* * *

రొనాల్డ్ నిక్సన్ కేంబ్రిడ్జి నుంచి వచ్చిన ప్రొఫెసర్. ఆయన వారణాసి, లక్నోలలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా పనిచేసి, యశోదా మాత శిష్యులై, సన్యసించి, కాషాయం కట్టి, "కృష్ణప్రేమ" గా పేరు మార్చుకుని, హిమాలయాల్లో ఆల్మోరా దగ్గర ఒక ఆశ్రమం నిర్మించుకుని, ప్రశాంత జీవితం గడుపుతూ, హిందూ సాంప్రదాయ పద్ధతుల్లో చాలా నిష్టగా కృష్ణ విగ్రహాన్ని పూజించేవారు.

కృష్ణప్రేమ అరవిందయోగి దర్శనార్థం పాండిచేరి వచ్చి, అక్కడనుంచి భగవాన్ దర్శనార్థం శ్రీ రమణాశ్రమానికి వచ్చారు. ఆయన భగవాన్ని దర్శించి, తన అనుభవాన్ని ఇట్లా రాసుకున్నారు:

"నేను భగవాన్ వున్న హాల్లో ప్రవేశించేప్పటికి, కొందరు ధ్యానంలో కూర్చున్నారు. నేనూ వారితో కలిసి భగవాన్ ముందు మౌనంగా కళ్ళు మూసుకుని కూర్చున్నాను. కూర్చున్నానో, లేదో పదే, పదే "నువ్వెవరు ?" అనే ప్రశ్న నాలో నాకే వినపడ నారంభించింది. మీరు నమ్మండి, నమ్మకపోండి నేనా ప్రశ్నను నిర్లక్ష్యం చేయనారంభించాను. అయినా ఆ ప్రశ్న నన్ను విడవ కుండా నా చెవుల వినపడుతోంది.చివరికి సమాధానం చెప్పాలనుకుని, "నేను కృష్ణ సేవకుడను" అని చెప్పాను. ఆ సమాధానంతో ప్రశ్న రూపం మారింది. "కృష్ణ ఎవరు?" అని.

"అది సరే కాని అసలు నన్ను ప్రశ్నించే నువ్వు ఎవరు ?" అని నేను ఎదురు ప్రశ్న వేశాను.

కళ్లు తెరచి చూశాను. ఎదురుగా సోఫా శూన్యంగా వుంది. భగవాన్ మాయమయ్యారు. మళ్ళా కళ్లు మూశాను. ఆయన పెదవులపై చిరునవ్వు విరిసింది. అర్థయుక్తమైన నవ్వు నవ్వారు భగవాన్, నన్ను చూసి. అప్పుడు తెలిసింది. ఆయన నామ, రూపాతీతులని. ఆ తరవాత కృష్ణప్రేమ తాను వెంట

తెచ్చుకున్న కృష్ణవిగ్రహాన్ని భగవాన్‌కి చూపారు. భగవాన్ దాన్ని ఎంతో ప్రేమగా తన చేతుల్లోకి తీసుకున్నారు.

* * *

ఒకాయన తన కొడుక్కి ఆశ్రమంలో ఉపనయనం చేశారు, భగవాన్ సమక్షంలో. ఆ సందర్భంలో భగవాన్ ఉపనయనం గురించి చెప్పారు:

"ఉపనయనమంటే, ఇంకో కన్ను. అది జ్ఞాననేత్రం. మూడో కన్ను వుంది. దాన్ని తెరచి, అసలు సత్యాన్ని దర్శించు" అని అర్థం. ఆ సమయంలో అతనికి ప్రాణాయామం కూడా నేర్పుతారు. తండ్రి, తనయుడికి బ్రహ్మోపదేశం చేసి, జోలె కట్టి, కొడుకును భిక్ష ఎత్తమంటాడు. అందులో ప్రథమ భిక్ష, మాతృభిక్ష. తల్లి మూడు పిడికెళ్లు బియ్యం పోస్తుంది; ఆ జోలిలో. గురుకులవాసం చేసి, జ్ఞాననేత్రం తెరచి, ఆత్మానుభూతి పొందాలనేది ఉపనయనం యొక్క తాత్పర్యం" అని.

* * *

నిద్ర సుఖావస్థ. అది ఏ బాధలూ లేని స్థితి. కాని, ఆ నిద్రలో దేహస్ఫురణ, ఎరుక ఏమీ లేకుండా "నువ్వు" వుంటావు. అంటే, నిద్రలో వున్నా, "నువ్వు" దేహం కాదు. నిద్రలో నీకు అసలు మనిషినన్న తలంపే వుండదు. అందుచేత ప్రపంచం, దాని దైన్యం నిద్రలో మనకేమీ పట్టవు.

నిద్రలో లేని దేహం, మేల్కొగానే తగుల్కొని, మళ్ళా నిద్ర పోయేవరకు లిప్తకాలం వదలక, ఊపిరాడనివ్వక, ఉపశమనం విమోచనం లేకుండా మనని గట్టిగా పట్టుకుని విడదీయ శక్యం కాకుండా, నీడగా వుంటుంది. ఆ దేహాన్ని విస్మరించి అసలు

మనమేమిటో మనకి మనం తెలుసుకునేందుకు కూడా అవకాశం ఇవ్వకుండా మనల్ని అంత గట్టిగా పట్టుకుని వెంటనంటి వుంటుంది. అంటే, జాగ్రదవస్థలో మనం అంత గట్టిగా దేహస్ఫురణలో లీనమై వుంటాం. మెలకువ రాగానే మనసు బైటికివచ్చి, ప్రవృత్తమౌతుంది. దానితో ఆలోచనలు రేగుతాయి. శరీరం చేష్టలు ఆరంభమౌతాయి. ఆ ఆలోచనలవల్ల "కర్తా - విషయాలు" అనే ద్వంద్వభావం ఏర్పడుతుంది. ఇవన్నీ కలిస్తే, మనం మేల్కొన్నాం అంటాం.

ఆ మెలకువతో దేహం, ప్రపంచం వాస్తవాలుగా తోస్తాయి. అంటే, మెలకువలోని దేహాత్మబుద్ధివల్లనే, ప్రపంచం పుడుతోంది. అంటే, మెలకువలో అహం లేచి, ఇంద్రియాల ద్వారా విషయాల్ని గ్రహించి, తాను దేహం అని భ్రమించి, అహంకరణను "ఆత్మ" అని చాటుతుంది.

ఆ అహం వెనుక వ్యక్తిత్వం తలెత్తుతుంది. అంటే, దేహం మేల్కొంటుంది. తలపులు కలుగుతాయి. ఆ తర్వాత అహం ఆడించే ఆట అంతా, ఇంతా కాదు.

నిద్ర, మెలకువ దేహానికే. అలాగే పుట్టేదీ, గిట్టేదీ దేహమే. నిద్ర - మెలకువలో వుండే "నువ్వు" ఒక్కటే. రెండు కాదు. కాని, మేల్కొని, దేహంలో ఇరుక్కొని, నానా అగచాట్లూ పడతాము.

నిద్ర, మెలకువ కాని మరో అవస్థవుంది. అది స్వప్నావస్థ. ఆ అవస్థ కూడా ప్రపంచాన్ని సృష్టించుకుంటుంది. జాగ్రదావస్థ కూడా ప్రపంచాన్ని సృష్టించుకుంటుంది. కనుక దాన్ని "పెద్దకల" అన్నారు. మెలకువకీ, కలకీ అంతే భేదం.

కల కల్పించినవి "వట్టి కల" అని నిరూపించేది మెలకువ. కాని, కల, మెలకువల్లో జగత్తు తోస్తుంది. అలా తోచేది తలపులకు విషయంగా వుంటుంది. తలపూ, గ్రహణా రెండూ మనో వ్యాపారాలే!

కలలో వ్యక్తి ఎన్నో రూపాలు తాలుస్తాడు. ఎన్నో అనుభవాలు పొందుతాడు. కాని, కలలోని నీరు కలలోని దాహాన్ని తీరుస్తుంది. కలలో శరీరం తాను కల్పించిన వాటిని వేరు వేరు నామ - రూపాలతో గ్రహిస్తుంది.

కల క్షణకాలంలో గడచిపోయినా, ఆ అనుభవం ఎంతో కాలం జరిగినట్లు అనిపిస్తుంది. మెలకువ తర్వాత కూడా ఆ అనుభవం తెగత్రెంపులు లేనిదై వుంటుంది. అటువంటప్పుడు ఒక్కొక్కసారి ఏది కలో, ఏది నిజమో తెలియకుండా వుంటుంది. ఎందుకంటే, జాగ్రత్ - స్వప్నాలు రెండూ మనోకల్పితాలు గనుక. అందుచేత ఆ రెండింటిలో భేధం కనపడదు, వుండదు, లేదు.

ఈ గొడవంతా లేనిది నిద్రావస్థ. నిద్రలో మనం శుద్ధ చైతన్యానికి దగ్గరగా వెళ్ళవచ్చు. ఒక్కనిద్రలోనే నిర్విషయానందం సాధ్యం. కాని, నిద్ర ఆనంద స్థితి కాదు. నిద్ర, "ఆనందస్థితి" అని అనుకుని మనం జీవితమంతా నిద్రలో గడపకూడదు. నిద్రలో కాలమంతా గడపాలన్నా సాధ్యం కాదు. కాని, నిద్రలో అప్రయత్నంగానో, అవ్యాజంగానో లభించే ఆనందాన్నో, సుఖాన్నో మెలకువలో పొందాలంటే, ఎంతో సాధన చెయ్యాలి. ఆ సాధనాయత్నంలో ఆలోచనలు క్షణం కూడా ఆగక అడ్డు వస్తాయి. అందుచేత ఏ విధంగా చూసినా ఆనందానుభవానికి అటు నిద్రావస్థా, ఇటు జాగ్రదావస్థ - రెండూ అనువైన స్థితులు కావు గనుక, నిద్రలోని నిశ్చలతా, మెలకువలోని ఎరుకా కలసిన స్థితి - " జాగ్రత్ - సుషుప్తి " అనే స్థితిని పొందాలి.

ఈ సందేహాలు, సంశయాలు, సమస్యలు, ప్రశ్నలు ఆలోచనలు, భావాలు, తలపులు - ఎవరికి కలుగుతున్నాయో వారు దాన్ని తెలుసుకోకపోతే, అవన్నీ ఎప్పటికీ ముడి వీడక, గజిబిజిగా వుండిపోతాయి.

అన్నింటికీ అతీతంగా, శాశ్వతంగా "స్థిర స్థితి" అనేది ఒకటి వున్నట్లు తెలుస్తోంది. జాగ్రత్ - సుషుప్తి - స్వప్న ఈ మూడు అవస్థలూ "స్థిర స్థితి" లోని చరరాసులు. అవి, సినిమా తెరపై కదలాడే బొమ్మలు వంటివి. తెర స్థిరం. వచ్చి - పోయే బొమ్మలు, తాత్కాలికం.

శాశ్వతంగా, స్థిరంగా వుండే తెరను విస్మరించి, దానిపై కదలాడే బొమ్మల్ని వాస్తవంగా, సత్యంగా భావిస్తాం. కాని, ఆ బొమ్మల రాకపోకలు మాత్రం తెరను ఏ విధంగానూ బాధించవు, బంధించవు. అంటే, తెరమీద నీరు, తెరను తడపదు. అగ్ని తెరను కాల్చదు. ఆ స్థిర స్థితిని మామూలుగా వుండే మూడు అవస్థలూ ఏ మాత్రం బాధించకుండా, ఒకదాన్ని ఒకటి అధిగమిస్తూ పోతూ వుంటాయి. ఎందుకంటే, ఆ మూడు అవస్థలూ మానసికాలు. ఆ అవస్థలకు ఎప్పుడూ లోనుకాకూడదు. వాటి మధ్య పడి, మన నిజ స్వభావాన్ని కలుషితం కానివ్వరాదు. కనుక ఆ నిజస్థితిని తెలుసుకుని, అందు నిలవాలి. కాని, మన జీవితం అందుకు భిన్నంగా నడుస్తుంది, జరుగుతుంది.

"నేను నిద్రపోయాను" అని జాగ్రదవస్థలో అనేవాడు, "నేను" అని తనని తాను ప్రత్యేకంగా వ్యక్తపరచుకుంటాడు. నిద్రలోని ఆ "నేను" మేల్కొన్న తర్వాత తానుగా అన్వయించుకుని, "నేను నిద్రపోయాను" అని అంటాడు. ఆ "నేను" ఎవరు ?

నిద్రలోని "నేను" నిజమైన - సహజమైన "నేను". అదే "అసలు నేను". మెలకువలోని "నేను" కేవలం అహంభావన. నిజానికి నిద్రలోని "నేను" మెలకువలోని "నేను" ఒకటే. కాని, నిద్రలోని "నేను" నిర్గుణంగా వుంటే, మెలకువలోని "నేను" సగుణమై నానాత్వం తాలుస్తుంది. నిద్రలోని "నేనే" నిజమైనది, శాశ్వతమైనది.

జాగ్రదవస్థలో క్షణం వదలని దేహంలోంచి, అన్నింటినీ అంతసీ అనుక్షణం చూసి, తెలుసుకుని గ్రహిస్తాం. మన కోర్కెలకు ఆధారమైన వాటిని అనుభవిస్తాం. అనుభవించేది "అసలు నేను" కాదు. అందుచేత ఆ ఆనందమేదో అది మనకు విడిగా, బైట దూరంగా వుందనుకుని, దానికోసం ప్రయత్నించడం పెద్దపొరపాటు. ఆ ఆనందం తమలోనే వుందని గ్రహించడమే, జ్ఞానం. అది ఎట్లా వుంటుందంటే, ఒకామె మెడలో కంఠాభరణం వుంచుకుని, అది పోయిందనుకుని, దానికోసం వెదకి గొడవపడి, అలసిపోయి - చివరికి ఎవరో చెప్పగా అది తన మెడలోనే వుందన్న సంగతి తెలుసుకుని, అంతసేపూ లేదనీ, పోయిందనీ విచారపడిన ఆమె, సంతోషించినట్లు వుంటుంది - ఎప్పుడూ తమలోనే వున్న ఆనందం అప్పుడే తమకు తెలిసినట్లు భావించి, సంతోషించడం.

అసలు నీ నిజస్వభావం, నీ నిజస్థితి ఏమిటంటే, అది తలుపులు లేని కేవల స్థితి. అదే నీ ఉనికి. అది జ్ఞానుల స్థితి. అది నిద్రా - జాగ్రత్ రెండు అవస్థలూ ఏకకాలంలో పనిచేసే స్థితి. కాని, అది ఏ ఒక్క అవస్థా కాదు. దాన్నే "పూర్ణచిత్" అంటారు. అది నిద్రకీ, మెలకువకీ మధ్య స్థితి. అది స్తబ్దత కాదు. క్షణభంగురమూ కాదు. అది శాశ్వతం.

జాగ్రత్ - సుషుప్తి – స్వప్న ఈ మూడు అవస్థలకూ అధిష్ఠానదేవత "త్రిపురాదేవి" అంటారు. ఆమెను శుద్ధ అఖండ చిత్ స్వరూపిణిగా వర్ణిస్తో అజ్ఞానులకు ఆమె రూపం, జాగ్రద్రూపంగానూ, జ్ఞానులకు కేవలం నిర్వికల్ప స్వాత్మ రూపంగానూ భాసించును అంటారు.

జాగ్రత్ - సుషుప్తి - స్వప్న మూడు అవస్థల్నీ వర్జించిన పిమ్మట, కేవలం సాక్షిరూపంగా మిగిలిన అవస్థను "తురీయ అవస్థ" అంటారు.

బెంగుళూరు నుంచి ముగ్గురు లేడీ డాక్టర్లు వచ్చారు. వారిలో ఒకామె భర్త ఆ మధ్య జరిగిన విమాన ప్రమాదంలో మరణించారు. ఆమె "పునర్జన్మ వుందా ?" అని భగవాన్ని అడిగింది.

భగవాన్ :- "జన్మ" అంటే ఏమిటో మీకు తెలుసా ?

ఆమె :- తెలుసు. నేను ఇప్పుడు వున్నాను. భవిష్యత్తులోకూడా నేను వుంటాననేది తెలుసుకోదలిచాను.

భగవాన్ : భూత - భవిష్యత్ - వర్తమానాల గురించా మీరు అడుగుతున్నది ?

ఆమె :- అవును. నిన్న ఫలితమే నేడు. అదే గతం. రేపు, భవిష్యత్తు. అది నేటి ఫలితం. "నేడు" అంటే, వర్తమానం. అవునా, స్వామీ ?

భగవాన్ :- భూత, భవిష్యత్తులు లేవు. ఉన్నది వర్తమానం ఒక్కటే. "నిన్న" అది నీ అనుభవంలో వున్నది అంటే, అదీ వర్తమానమే. "రేపు" అనేది నీ అనుభవంలో వుండాలనుకున్నా, అదీ వర్తమానమే అవుతుంది. కాబట్టి అనుభవం ఒక్కటే, వర్తమానంలో వుంటుంది. అనుభవానికి అతీతంగా ఏమీ లేదు.

ఆమె :- గతం, భవిష్యత్తు - రెండూ కేవలం భ్రాంతి, భావన, ఊహేనంటారా ?

భగవాన్ :- అవును. చివరికి వర్తమానం కూడా ఊహే. ఎందుకంటే కాల భావన పూర్తిగా మానసికం.

అలాగే, ఆకాశం, దూరం కూడా మానసికమే. కాబట్టి, జనన - మరణాలు కాల - దూరాలకు చెందినవి. చివరికి అవి కూడా ఊహే !

*　　　*　　　*

"భయంకరమైన మృత్యుభీతినుంచి తప్పించుకోవడం ఎట్లు ?" అని ఒకరు అడిగారు.

భగవాన్ :- మృత్యుభీతి నిన్నెప్పుడూ ఆవరించి వుంటుంది. మీరు దీర్ఘ సుషుప్తిలో వుంటే, అంటే, స్వప్న రహిత నిద్రలో వున్నప్పుడు, మృత్యుభీతి వుంటుందా ? క్లోరోఫాామ్ ప్రభావంలో వున్నప్పుడు, మీకు అనుభవం కలుగుతుందా ? మీరు పూర్తి జాగ్రదవస్థలో వున్నప్పుడే, మీకు అనుభవం కలుగుతుంది. మృత్యుభీతి కలుగుతుంది. ఆ భావాన్నే వెంటాడుతుంది. అంటే, ఈ ప్రపంచాన్ని పరికించినప్పుడు - అంటే, దేహాత్మబుద్ధి ఏర్పడిన తర్వాతనే మృత్యుభీతి కలుగుతుంది. దేహాత్మబుద్ధి లేక, ప్రపంచాన్ని గమనించని స్థితిలో, ఏ భయమూ, భావమూ కలగదు.

భగవాన్ పునర్జన్మ గురించిన ఆలోచనను తోసెయ్యమన్నారు. "పుట్టేది, చచ్చేది - దేహం. ఎప్పుడూ వుండేది "నువ్వు". అదే అసలు సత్యం. దాన్ని ముందు తెలుసుకో" అన్నారు భగవాన్. ఎందుకంటే, నిజమైన పునర్జన్మ - అహం నాశనమై ఆత్మగా మిగలడం.

నిద్ర, తాత్కాలిక మృతి అంటే, మృతి - తాత్కాలికమని అర్థం. అందుచేత బ్రతుకూ, తాత్కాలికమే. ఆ విధంగా చావు .

బ్రతుకులు రెండూ తాత్కాలికమైతే, శాశ్వతమైనది, స్థిరమైనదీ ఒకటి ఉండవలె. అదే అసలు సత్యం. అదే, నేను. అదే ఆత్మ. అదే అన్నీ, అంతా.

"సముద్రంలో కలిసిన నదులన్నీ ఆవిరై, అడవుల్లో, కొండల్లో వర్షించి, సెలియేరులై, నదులై తిరిగి సముద్రంలో కలుస్తాయి. అలాగే ప్రతి ఒక్కరి వ్యక్తిత్వాలు - "నేను"లు, "జీవులు" నిద్రలో కోల్పోబడతాయి. మేల్కొగానే, వారి వారి ప్రారబ్ధ కర్మలనుబట్టి, వాసనలనుబట్టి యథాప్రకారం ఆయా దేహాల్లో ప్రవేశించి పనిచేయ నారంభిస్తాయి. దాని ప్రకారం మృత్యువుతో స్థితి నాశనం కాదు." అనే ఒక వాదం బయలుదేరింది.

"జీవనసారంవున్నంతకాలం జన్మలు కలుగుతూనే వుంటాయి. ఎందుకంటే, మనలోని నిగూఢమైన, శక్తివంతమైన, సామర్థ్యవంతమైన అవకాశాలన్నీ చావు సమయంలో హృదయంలో చేరి, నాశనం కాకుండా వుంటాయి. ఆ విధంగా పునర్జన్మ కలుగుతుంది." అనే మరొక వాదం కూడా ప్రచారంలో వుంది.

బృహదారణ్యక ఉపనిషత్తులో జ్ఞానులు తిరిగి జన్మించరనీ, చీకటి దారిని (అజ్ఞానంలో బ్రతికినవారు) పయనించినవారు తిరిగి జన్మ ఎత్తుతారనీ, సూక్ష్మ శరీరంతో ఫలాన్ని అనుభవించిన తర్వాత జన్మిస్తారనీ ఉంది.

బుద్ధ భగవానులు సాధకులను ఆత్మసాక్షాత్కారం వైపు నడపడమే తన ప్రధాన ఉద్యమంగా, ఉద్దేశ్యంగా, నిజమైన కార్యంగా చేపట్టి వుండవచ్చు. కాని, ఆయన్ని చేరిన కొందరు అర్థంలేని, అప్రస్తుతపు, తాత్కాలిక సంతృప్తికోసం, కుతూహలంతో "జీవితానంతరం ఏమిటి?" అనే ప్రశ్నలు వేస్తే, బుద్ధుడు సమాధానం చెప్పడానికి నిరాకరించాడు. ఎందుకంటే, దేహాత్మ ప్రభావంవల్ల "జన్మ - మృత్యువు - పునర్జన్మ" అనే భావనలు

కల్గుతాయనీ, ప్రతి ఒక్కరూ, ప్రతి ఒక్కటీ, అన్నీ - అంతా ఆత్మేననీ ఆయన భావన.

"మరణానంతరం ఏమౌతాం?" అనే దానికన్నా, ఆ క్షణంలో ఎట్లా వున్నామో తెలుసుకోవడం ఉత్తమం అన్నాడు బుద్ధుడు. అంటే, ఈ జీవితం వెనుకనున్న సత్యాన్ని తెలుసుకోమని. కాని, ప్రజలు ఆ విషయానికి దృష్టి మరల్చరు, శ్రద్ధచూపరు, చెవి నివ్వరు. ఎంతకీ ప్రజలదృష్టి, ఆసక్తి, శ్రద్ధ అంతా ఎప్పుడో, ఎక్కడో ఏం కాబోతోందో అనే దానిపైనే ఆలోచన, ఆందోళన, అశాంతి. దృష్టి అంతా ఎప్పుడో ఎక్కడో ఏదో తటస్థపడుతుందనే దానిమీదా, స్వర్గ - నరకాలమీదా, పునర్జన్మ మీదా. దానికి కారణం అసలు సత్యాన్ని విస్మరించి, మాయని, నిగూఢత్వాన్ని కోరటం.

"మాయ, భ్రాంతి మీద మమకారం, అవే వాస్తవం అనుకోవడం, బంధాల్ని తెచ్చిపెట్టుకోవడం - అవి మనల్ని జనన మరణ వలయంలో పడద్రోయడం, సంసార కూపంలో కూల దోయడం జరుగుతోంది," అన్నాడు బుద్ధుడు. ఆ విషయాన్నే భ్రాంతి నుంచి దృష్టి మరల్చు, విమోచనకై వెదకు" అన్నారు రమణ భగవానులు.

జ్ఞానసిద్ధి పొందినవారు మరణానంతరం ఆత్మలో లీనమై వుంటారనీ, కొందరికి మాత్రం కొన్ని, కొన్ని సంస్కారాలు మిగిలి వుంటాయనీ, ఆ సంస్కారాలే సంకల్పరూపంలో నిలుస్తాయనీ, ఆ సంస్కారాలు తీరేంతవరకు ఇష్టం వచ్చిన రూపం ధరించి లోకంలో సంచరిస్తూ అదృశ్యులౌతూ వుంటారనీ అంటారు. ఏమైనా "పునర్జన్మ" అనేది కేవలం ఆలోచనకు చెందింది. ఆత్మసిద్ధి వల్ల ఆ ఆలోచన ఆగిపోతుంది. జనన - మరణ వలయ భ్రాంతి తొలగుతుంది.

"నేను" అనే ఆలోచనే, వ్యక్తికి జన్మనిస్తుంది. ఆ ఆలోచన చావడమే, మృత్యువు. కనుక జీవితంలో ఆ "నేను" ఏమిటో తెలుసుకోవాలి. ఈ జన్మకు ఏది కారణమైనదో, అదే మరుజన్మకూ కారణమౌతుంది. చనిపోయిన తర్వాత, ఆత్మ పరిపూర్ణత చెందాలంటే, ఆత్మ వున్నట్లే కదా ? అంటే, వ్యక్తి దేహం కాదనీ, "ఆత్మ" అనీ నిశ్చయమౌతోంది.

"ఆత్మహత్య చెడ్డపనేనా"? అని ఒకరు భగవాన్ని అడిగారు.

భగవాన్ :- అమాయకమైన దేహాన్ని చంపడం నిజంగా చెడ్డ పనే ! ఆత్మహత్య మనసులో జరగాలి. ఎందుకంటే, బాధ అక్కడే కేంద్రీకృతమై వుంటుంది. మనసే నిజమైన అపరాధి. అదే హత్యకు ప్రేరణ కలిగిస్తుంది. తత్ఫలితంగా అమాయక దేహం శిక్ష అనుభవిస్తుంది.

*　　*　　*

"నేనెవడను ?" అను విచారణ ఎట్లా చేయాలి ? అని ఒకరు భగవాన్ని అడిగారు. దానికి భగవాన్ :

"నీవు వున్నావని నీకు తెలుసు. నీ ఇంట్లోకి నిన్ను ఇతరులు దారి చూపి తీసుకుపోవడమేమిటి ? బైట ప్రపంచం ఎన్నో సంగతులతో, విషయాలతో, సంఘటనలతో, నామ - రూపాలతో నిండివుంది. వాటి గురించిన నీ యోచన, ప్రస్తావన అన్నీ నీ లోని తలపులు. ఆ తలపులకు స్థానం, మనసు. ఆ మనసు నీలో వుంది. కాబట్టి, ప్రపంచం కూడా నీలో వుంది.

"ఆ ఆలోచనలు నీవి. వాటికి కారణం, నువ్వు. వాటిని పెంచడమే, బంధం. వాటిని చంపడమే, ముక్తి. వాటిని పెంచడం, చంపడం నీ చేతిలోని పని. ఆలోచనలు మారతాయి కాని, నువ్వు మారవు. నశించే వాటిని విడిచి, మార్పులేని నిన్ను అనుసరించు.

ఏం చెయ్యాడానికీ, ఏది నిర్ణయించుకోవడానికీ సామర్థ్యం నీలో వుంది కనుక, ఆలోచించడం మానసవసరం లేదు. వాటి మూలమేదో వెదికి పట్టుకో !

నే నెవరు? అనే విచారం వుందే, అది కేవలం ఆలోచనా భ్యాసం కాదు. హృదయం, ప్రేమభావంతో నిండటం. తాను, తానుగా వుండటం. సదా నిశ్చలంగా లోదృష్టి కలిగి వుండటం. అది అనుభవంలో వుండటం.

అటువంటి దానికి కొందరు అరుదుగా అదుపులో వుంటారు. స్వచ్ఛమైన, నిర్మలమైన, పవిత్రమైన, నిష్కారణమైన శాంతి - ఆనందం లోపల్నుంచి పెల్లుబికి రావాలి. వాటిని "ఫీల్ - FEEL" కావాలి. అది ఆలోచనారహితమైన స్ఫురణ.

విచారణ ఉద్దేశ్యం, వీలైనంత ఎక్కువ కాలం, తాను, తానుగా వుండటం. "ఎవరు నువ్వు?" అని ఎవరైనా నిన్ను అడిగితే, "నేను ఫలానా" అని అంటావు. అవునా ? కాని, నువ్వు దేహం కాదు. "దేహం, నన్ను నిర్మించింది" అని అనిపించినప్పుడు, "ఈ దేహం ఎవరిది? " అనే సంశయం సహజంగా కలుగుతుంది. కాని, వెంటనే "ఈ దేహం నాది " అని అంటావు. అంటే, నువ్వు దేహానికి భిన్నంగా వున్నావన్న మాటే కదా ?

నువ్వు భోక్తవు. దేహం, భోజ్యం. అయినప్పుడు దేహం, నీకు భిన్నంగా వుందని తెలుస్తోంది. కాని, నిజానికి నీకూ, నీ దేహానికి మధ్య విభాగం, నీకు అర్థం కావడం లేదు. అంటే, అసలు నువ్వు ఎవరివో,నీకు అర్థం కావడం లేదన్నమాట.

తానున్నానని అందరికీ ఎరుకే. కాని, ఆ తానెవరో మాత్రం ఎవరికీ తెలియదు. అందరి పేరూ, "నేను". సర్వేశ్వరుడికైనా "నేనే" పేరు. ఉన్నదీ ఆ "నేను" ఒక్కటే. అదే అసలు

నేనే. అదే ఆత్మ. దాన్ని తెలుసుకునేందుకు ఇంకో "నేను" లేదు. కాని, "దేహాత్మబుద్ధివల్ల, నేను - నాది; "నేను అది", "నేను ఇది" అని అంటాం.

ఆ నేను ఏమిటో, మధ్యలో అది ఎక్కడ పుట్టిందో దాన్ని తెలుసుకోవడమే, విచారణ మార్గం.

విచారణ మార్గం, అన్వేషణ కాదు. అంతర్యుద్ధం. అహం పూర్తిగా ఆత్మలో లీనమయ్యేవరకూ, సాగే పోరాటం. దానికో పద్ధతి, సిద్ధాంతం, నియమం, దీక్ష, ఉపదేశం, మతం, సాంప్రదాయం ఏమీ లేదు. అది మానసికం కాదు. కాని, మనసు దానికి సంపూర్ణ ఎరుకలో వుండాలి.

పరిపక్వ దశలో వున్నవారికి విచారణమార్గం, ఎక్కువ అనుకూలం. తక్కినవారు తమ, తమ స్వభావాల్ని బట్టి భక్తి - జ్ఞాన - కర్మ - యోగ - జప - తప మార్గాల్ని అనుసరించాలి. అవన్నీ ఏకాగ్రతకు సహకరిస్తాయి.

"నేను, ఇది. నేను, అది. నేను, మనిషిని" అని అనుకోవడంకన్నా; "నేనున్నాను" అనేది యదార్థం. ఉనికి ఒక్కటే సహజం, సత్యం. "నేను మనిషిని" అని ఎవరూ తననుతాను నిబంధించుకోనవసరం లేదు. "నేనున్నాను. నేను, అదే నేను" అనే స్థిరభావంతో వుండటం సహజం.

నువ్వు అదీ కాదు, ఇదీ కాదు, ఏదీ కాదు. కాని, నువ్వు వున్నావు. అంతే!

"నేను" దేహానికి చెందింది కాదు. అది లోపలి సంగతి "నువ్వు" అసలైన సత్యానికి విడిగా, భిన్నంగా లేవు గనుక దానికి ఎరుకలో వున్నానని అనవు. ఎందుకంటే, నువ్వే, అది

అదే, నువ్వు. ఆ అనుభవం చాలా ఆనందదాయకమైనది. ఆ భావన ఆ అనుభవం అన్ని కలతల, కలవరాల, దుఃఖాల నుంచి విముక్తి కలిగిస్తుంది.

* * *

"ఆధ్యాత్మిక అనుభవాల్లో అత్యుత్తమమైనది ఏది?" అని ఒక సాధకుడు భగవాన్ని అడిగాడు.

భగవాన్ :- ఆత్మసాక్షాత్కారం.

సాధకుడు :- దాన్ని తెలుసుకోడం ఎట్లా ?

భగవాన్ :- ఎవరి ఆత్మను ? ఎవరు ?

సాధకుడు :- నా ఆత్మను. కాని, నే నెవరని ?

భగవాన్ :- ముందు మీ సంగతి మీరు తెలుసుకోండి.

సాధకుడు :- ఎలా తెలుసుకోవాలో నాకు తెలియదు.

భగవాన్ :- మీరు వేసిన ప్రశ్న గురించి కొంచెం యోచించండి. "నాకు తెలియదు" అని అంటున్నవారు ఎవరో ముందు వారిని తెలుసుకోండి. అలాగే, మీరు వేసిన ప్రశ్న "నేను" ఎవరో, ఆ తెలియనిది ఏమిటో తెలుసుకోండి.

సాధకుడు :- ఎవరో, ఏదో నాలోంచి పలుకుతోంది.

భగవాన్ :- ఆ ఎవరో, ఏదో ఏమిటి ?

సాధకుడు :- బహుశా ఏదో శక్తి కావచ్చు.

భగవాన్ :- దాన్నే తెలుసుకోండి.

సాధకుడు :- అసలు నే నెందుకు పుట్టాను ?

భగవాన్ :- పుట్టింది ఎవరు? మీ ప్రశ్నలన్నింటికీ ఒకే సమాధానం వుంది.

సాధకుడు :- అయితే నే నెవర్ని ?

భగవాన్ :- (నవ్వుతూ) మీరు నన్ను పరీక్షించ
మీరు ఎవరో మీరే తెలుసుకోవాలి.

సాధకుడు :- ఎంత యత్నించినా ఆ "నేను"
పోతున్నాను. కనీసం అది స్పష్టంగ
పడం లేదు.

భగవాన్ :- మీలో "నేను - నేను" అంటు
స్పష్టంగా తెలియడం లేదా? అయి
"నేను" లు వున్నాయా? ఒక
"నేను" తెలియకుండా, కనపడ
కాకుండా వున్నాయా ?

సాధకుడు :- "నే నెవర్ని?" అనే విచారణకన్నా
ఒక ప్రశ్న వేయవచ్చునా? ఆ
మీరెవరు? మీరెవరో నాకు తెలిస్తే

మూలం వైపు - కేంద్రానికి మళ్ళించడం. ఇది చాలా చురుకుదనంతో కూడిన విచారమార్గం. అది అసలు సత్యాన్ని - జ్ఞానాన్ని - అపరిమితమైన దాన్ని తెలుసుకునేందుకు సూటైన మార్గం. ఎందుకంటే, అసలు వున్నదేదో అది నువ్వు గనుక.

సాధకుడు :- ఎందుకు ఆత్మవిచారణ ఒక్కటే జ్ఞానమార్గంగా నిర్ణయించబడుతుంది.

భగవాన్ :- జ్ఞానమార్గం ఒక్కటే అసలు సత్యాన్ని తెలుపుతుంది. ఆత్మ సంగతి తెలిసినా తర్వాత, ఇంక తెలుసుకో వలసిందీ, సాధించవలసిందీ, పొందవలసిందీ ఏమీ లేదు; వుండదు కూడాను. అదే గొప్ప ఆనందం. ఆ ఆనందం ఎప్పుడూ నీలో వుంది నువ్వే ఆ ఆనంద స్వరూపానివి. దాన్ని నీకు నువ్వే తెలుసుకోవాలి. నీ దుఃఖకారణం, నీలో అహంకారం మాదిరిగా వుంది. నీ మీద నువ్వే కొన్ని హద్దుల్ని పెట్టుకుంటున్నావు. తిరిగి ఆ హద్దుల్ని తొలగించ డానికి నానా యాతనలు పడతావు. స్వేచ్ఛ లేక కొట్టుకుంటావు. ఆ అశాంతికి కారణం, అహంకారం. దానివల్లే కష్టాలు. దాన్ని నిరాకరించి, అన్వేషించావా, ఆనందం అభిస్తుంది. స్వేచ్ఛ పడతావు. నువ్వు ఎప్పుడూ ఆత్మగానే వుండు. అప్పుడు కోర్కెలూ, సందేహాలూ అదృశ్య మౌతాయి. చివరికి గురువు అనుగ్రహం కావాలనే కోర్కెకూడా జ్ఞానమార్గానికి అడ్డమే. ఆత్మను విడచి అన్యంగా తలచినా, బాధ - కష్టం - దుఃఖం - అశాంతి తప్పవు. ఆత్మగా వుండ టమే, ఆనందం. ఎందుకంటే, ఆ ఆనంద స్వరూపమే, నువ్వు గనుక.

సాధకుడు :- జ్ఞానమార్గం గృహస్థుకు సాధ్యమా ?

భగవాన్ :- మమకారంతో చేస్తే, అది నిష్ఫలం. వైరాగ్యంతో చేస్తే, అది బంధం కాదు. మేల్కొన్న స్థితి, జ్ఞానం కాదు, అజ్ఞానం. నిద్ర అజ్ఞానం కాదు, అదే సరైన స్థితి. నిద్ర - మెలకువకు అతీతమైనది, ఆత్మస్థితి.

సాధకుడు :- భగవంతుని దర్శించేదెట్లు ?

భగవాన్ :- భగవంతునిగా వుండటమే, ఈశ్వర సాక్షాత్కారం.

సాధకుడు :- ఆత్మసాక్షాత్కారాన్ని ఎట్లా పొందగలను ?

భగవాన్ :- పొందడానికి ఆత్మవిడిగా, ప్రత్యేకంగా వుంటే కదా ? అదెప్పుడూ అంతటా ఒకటిగా వున్నదే ! "నేను ఆత్మను దర్శించలేదు" అనే భావాన్ని తీసేసుకోవడమే, ఆత్మస్థితి. అదే, శాంతి. ఆత్మ లేకుండా వున్న క్షణమంటూ వుండదు. అలాగే ఆత్మను చేరుకోవడమూ లేదు. నువ్వే, అదైవున్నావు. అసలు సంగతి ఏమిటంటే, నువ్వు ఆనందస్వరూపమన్న సంగతి విస్మరిస్తున్నావు. సమాధిస్థితి ఒక్కటే, అసలు సత్యాన్ని తెలిపేది. ఆలోచనలు వాస్తవాన్ని కప్పుతాయి - సమాధిస్థితిలో "నేను వున్నాను" అనే భావం ఒక్కటే వుంటుంది. ఇంకే ఆలోచనలూ వుండవు. ఆత్మే, దైవం - "నేనున్నాను" అని నిరంతరం అంటున్నదేదో, అదే దైవం. నిశ్చలంగా వుండటమే, ఆత్మస్థితి.

సాధకుడు :- గురు కృప సంపాదించడం ఎట్లా ?

భగవాన్ :- కృపే, ఆత్మ. దాన్ని సంపాదించవలసిన పనిలేదు. అది ఎప్పుడూ వున్నదే. దాన్ని తెలుసుకోవడమే గురు కృప.

* * *

"మనసును అదుపులో పెట్టేది ఎట్లు" అని ఒకరు భగవాన్ని అడిగారు.

భగవాన్ :- ముందు ఆ మనసును చూపించండి ? మనస్సంటే, అంతులేని ఆలోచనలే కదా ? వాటిని ఓ ఆలోచనతో ఎట్లా ఆపుతావు ? అంటే, "మనసును అదుపులో పెట్టాలి" అనే ఆలోచనతో తక్కిన ఆలోచనల్ని అదుపులో పెట్టాలని చూడ్డం. అంతేనా ? అలా అదుపులో పెట్టాలనే ఆశా, ప్రయత్నమే అవివేకం, బుద్ధితక్కువతనం.

కాని, ఉన్నది ఒక్కటే మార్గం - అది, మనసును మూలం వైపు తిప్పడం. అంటే, మనసును మూలం దగ్గర నిలపడమే. కాని, అది మనోరాహిత్యం కాదు. అప్పుడు మనసు దానికది హీనమైపోతుంది. దాన్నే "చిత్తనిరోధం" అంటుంది యోగం.

మనసు వెనుదిరిగి, అంటే మూలం వైపు తిరిగి, తాను ఎక్కడ పుట్టి బయలుదేరిందో ఆ తావుకు చేరిందన్న మాట. అలాగే ప్రతి ఆలోచననూ ఆపి, ప్రశ్నిస్తే ప్రతి ఆలోచనా మొదటి ఆలోచనవలె గతిలేక, బలవంతంగా వెనక్కి మళ్ళుతుంది. వెనక్కి మళ్ళిన ఆలోచన, మూలం చేరి నిశ్చలమౌతుంది.

ఆలోచనలు మూలస్థానం చేరినట్లు చేరి, అందు నిగూఢంగా వుండి, మరింత బలం చేకూర్చుకుని, సమయం చూసి బైటికి చొచ్చుకుని వస్తాయి - ముఖ్యం ధ్యానసమయంలో.

మనసు ఒక గొడ్డు వంటిది. అది ఇతరుల పొలాల్లో దొంగమేత మేయడానికి అలవాటుపడి, తన శాలలో

సుఖంగా వుండక, యజమానికి సులభంగా లొంగక బైట చెడతిరుగుతుంది. యజమాని దాన్ని క్రమంగా మచ్చిక చేసుకోవాలి. మచ్చికైన తర్వాత అది శాల వదిలి బైటికి పోదు. అలాగే, మనసును కూడా మన స్వాధీనంలోకి తీసుకోవాలి. అది ఒకసారి అంతర్యంలో ఆనందం అనుభవించిందా, అది మళ్ళా బైటికి పోదు.

ఈ సాధనలో సిద్ధులు లభించవచ్చు. సిద్ధులు కలగాలని వాటిని కోరుకోవడం, అవి లభించాలని ఆశించడం, సాగే సాధనకు అంతరాయం కలుగుతుంది. సిద్ధులు, పశువుల్ని కట్టే తాళ్ళు వంటివి. అవి మనల్ని ఎప్పటికప్పుడు కిందికి లాగుతూనే వుంటాయి. సుఖంగా రైల్లో కూర్చుని ప్రయాణం చేయక, మన సామాను నెత్తిన పెట్టుకుని కూర్చోవడం మాదిరిగా వుంటుంది; సిద్ధులు కలిగివుండటం. సిద్ధులు సాధకుణ్ణి తికమక పెడతాయి. అవి అసలు సత్యాన్ని కప్పెస్తాయి. అవి ముఖ్యంగా సమాధి స్థితికి పెద్ద అడ్డు.

భగవాన్ని సేవించే కొందరి సాధకుల్లో తమకు సిద్ధులు, శక్తులు కావాలని ఆంతర్యంలో గట్టిగా వాంఛించడం గమనించి, "శక్తులు - సిద్ధులు, మహిమలు, తన్మయత్వాలు, అనుభవాలు మొదలైనవి ఇంద్రియ గోచరాలు. అవి లోకంలో స్థూలాకృతి లోనూ, మనసులో సూక్ష్మాకృతిలోనూ కనుపిస్తాయి. ఏమైనా అవీ విషయాలే! మనం విషయిని చూడ్డానికే ప్రయత్నించాలి. "మేం చూశాం, మేం విన్నాం" అనుకోవడం వుత్త వెర్రి" అన్నారు భగవాన్.

భగవాన్ ఎప్పుడూ సిద్ధులూ, శక్తులూ మొదలైన వాటికి ప్రాముఖ్యం ఇవ్వలేదు. వాటి వెనుకనున్న అసలు సత్యం తెలుసుకో మనేవారు. ఆ అసలు సత్యం, మనలోనే వుంది. అది మన గురించిన సత్యం. దానికి సంబంధించిన ప్రయోగాత్మక జ్ఞానమే.

మనల్ని విముక్తి పరుస్తుంది. దాన్ని ఎవరికి వారు తెలుసుకోవాలి. అంటే, తనను విస్మరించి, తనకు సంబంధించిన సత్యం మినహా మరొకదాన్ని తెలుసుకోజూసేవాడు, అసలు సత్యాన్ని తెలుసుకోలేడు.

లోకోత్తర విషయాలు తెలుసుకోవాలనుకోవడం, విశ్వరూపాలు - దివ్యదృశ్యాలు చూడాలనుకోవడం, బ్రహ్మనాదాలు వినాలనుకోవడం సాధకుని లక్ష్యం కాకూడదు. సాధకుని లక్ష్యం, ఆత్మలబ్ధికావాలి. అవన్నీ ధ్యానానికి విఘ్నాలు. వాటికి సమ్మోహితులై, సాధన పాడుచేసుకోకూడదు.

బ్రహ్మస్థితి సిద్ధపురుషులస్థితి అనీ, సిద్ధపురుషుడు పుట్టుకతోనే ధర్మం - జ్ఞానం - వైరాగ్యం కలిగివుంటాడనీ అన్నారు శంకరులు. సిద్ధపురుషుడు అంటే, ఆధ్యాత్మిక పరిభాషలో "పరిపూర్ణుడు" అని అర్థం, "సిద్ధపురుష" అనే పదాన్ని అనేకులు అనేక కాలాల్లో, అనేక విధాల అవగాహన చేసుకున్నారు. ఆ విధంగానే దాన్ని ఉపయోగించుకున్నారు. ప్రపంచంలో పలుచోట్ల - టిబెట్, చైనా, ఇండియా, మధ్య ఆసియా - మొదలైన ప్రాంతాల్లో ఇప్పటికీ సిద్ధపురుషుల ఆశ్రమాలు వున్నాయనే ప్రతీతి వుంది. వారు ఈశ్వరావతారంవలె వుంటారు. వారు తమ శక్తి సంపన్నతతో ప్రజల్ని అనేక విధాల రక్షిస్తూ వుంటారనీ, ఆ సందర్భంలో అర్హులైన కొందర్ని ఏరి తీసుకుని, దీక్ష ఇచ్చి, ఉపదేశాలు చేసి లోకోద్ధరణకు వారిని లోకంలోకి పంపుతారనీ వింటాం. వారికి సంకల్పం కలిగితే తప్ప, ఇతరులెవరూ వారిని సమీపించలేరనీ, దర్శించలేరనీ అంటారు. కాని, వారు మాత్రం అనేక రూపాల్లో ప్రపంచంలో తిరుగుతూ అనేక మహిమలు చేస్తారంటారు. ఏమైనా, వారు గాలిలో ఎగిరినా, నీళ్ల మీద నడచినా - ఏం చేసినా అవి మహాత్యాలుగా చేయడానికి కాదు, వారు చేసేది. అవి వారి సహజ క్రియలు. అంతే! సిద్ధ పురుషుడు నిశ్చయంగా విరాట్ పురుషుడే!

కాని, ఈ రోజుల్లో సిద్ధులంటే, గారడీ, మహిమలతో గాబరా పెట్టడం. కాని, ఎంత గొప్ప గారడీ చేసినవానినీ మనం సిద్ధపురుషుడు అనము. అదే ఏ అడవుల్లోనో, కొండల్లోనో, కాషాయంకట్టో, జడలు పెంచో, మహాత్యాలు చేస్తేనో ఆశ్చర్యపోయి దాన్నే అద్భుత మహిమగా చెప్పుకుని,అతన్నిసిద్ధపురుషుడని అనకపోయినా, చాలావరకు వానిని సిద్ధపురుషుడుగానే తీసుకుంటాం. వారు చేసే మహాత్యాల్ని దివ్యత్వానికి ఎత్తేస్తాం.

భగవాన్ సిద్ధుల్ని ప్రోత్సహించలేదు. పైగా అవి అసహజ స్థితికి దోహద కారులని కొట్టేశారు. అసలు మనం ఏమైవున్నామో, ఆ పరమసత్యాన్ని తెలుసుకోవడమే, సహజస్థితిలో నిలవడం. అదే నిజమైన సిద్ధి. నిత్యాత్మ దృష్టి కలవానికి తపఃపరిపాకంచే పక్వదశయందు సిద్ధులు కలుగుతాయి. స్వప్నంలోపొందినదాన్ని, మెలకువలో చేపట్టగలమా? సిద్ధులూ అంతే? కాని, సిద్ధులు అనగానే “అణిమ - లఘిమ” వంటి అసహజమైన, అస్వభావికమైన శక్తులనుకుంటారు. సిద్ధులు సహజంగా, నిజంగా మన సొంతం కావు. అవి ఎప్పటికీ మనవిగా వుండవు. అవి త్వరలోనే పోతాయి. ఎందుకంటే, అవి వాస్తవం కావు. అసత్యమైనవి. అవి అహంకార జనితాలు. సిద్ధులుపొందినవారు బందీలై, అజ్ఞానంలో కూరుకుపోతారు.అల్పమైన మహిమలు చేయడంవల్ల సాధకులు నిస్సందేహంగా పతనమౌతారు, అప్పుడు అది పరిపూర్ణత చెందని సాధన మాత్రమే అవుతుంది.

ప్రజల్ని ఆకర్షించి, పేరు - ప్రఖ్యాతులు, సంపాదించాలని సాధన చేసి సంపాదించే శక్తులు, మనసును తమ ఇష్టప్రకారం నడచుకునే స్థితికి తీసుకుపోతాయి, అదే అహమిక. క్రమంగా అతడు భ్రష్టుడౌతాడు. జారిపడతాడు. నిజమైన సాధకుడు నిరహంకార స్థితిని పొందేలోపుగా, అప్రయత్నంగా అతనికి సిద్ధులు లభిస్తాయి. అవి వ్యామోహకరములు, సాధకునికి అభివృద్ధి నిరోధకాలు. కాని, అతడు ఆ సిద్ధుల్ని నిరాకరిస్తాడు.సహజ స్థితి ఏర్పడ్డ తర్వాత

సిద్ధులు లభిస్తే, వారికి వాటి ప్రసక్తే వుండదు. అవి వారిని ఏమాత్రం కదిలించవు. వారు వాటివల్ల చలించరు. సిద్ధుల్ని ప్రకటించుకోవడం, ప్రదర్శించడం జ్ఞాన మార్గానికి పెద్ద అవరోధం.

మనోబలంచేత సంపాదించేవి శక్తులు. మనోనాశనం తర్వాత లభ్యమయేది, ఆత్మ. అందుచేత యోగి లక్ష్యం, మనోలయం కాదు, మనోనాశనం. లయమైతే అది మళ్ళా ఏదో ఒక రూపాన, ఎప్పుడో ఒకప్పుడు బైటకి పొడచూపే అవకాశం లేకపోలేదు. మనసుకు ఆత్మకు భిన్నంగా గుర్తించకపోవడమే, మనోనాశనం.

అనుభవాలు కలగవచ్చు. దివ్యదృశ్యాలు కనుపించవచ్చు. అప్పుడు కూడా "ఇవన్నీ ఎవరికి కలుగుతున్నాయి?" అని ప్రశ్నించుకుంటే, "నాకు" అని సమాధానం వస్తుంది. ఆ "నేను ఎవరు?" అని మళ్ళా ప్రశ్నించుకుంటే, అది అక్కడ ఆగి, వెనక్కి తిరిగి మూలం చేరుకుంటుంది. అదే సాధన. విసుగుచెందకుండా, ఆ సాధన చేయాలి. ఓర్పు అవసరం. "ఈ సాధన కష్టం" అనే భావనే ఈ సాధనామార్గంలో పెద్ద ప్రతిబంధకం. ముందు ఆ భావం పోవాలి. ఆత్మసిద్ధి అసాధ్యం కాదు. సాధన ముఖ్యం.



ఒక కాలేజీ ప్రొఫెసర్ "స్వామీ, మేము మా బాధల్లో, కష్టాల్లో, నష్టాల్లో, దుఃఖాల్లో, యాతనలలో వుండి మిమ్మల్ని ప్రార్థిస్తాం, అర్థిస్తాం, ఆరాధిస్తాం. ఉత్తరాలు రాస్తాం, విన్నవించుకుంటాం. "నా బిడ్డవంటి భక్తుడు దీనావస్థలో వున్నాడు" అని "మీరు మమ్మల్ని దయతలుస్తారా?" అని అడిగాడు. దానికి భగవాన్, "అలా అనుకుంటే, అతడు జ్ఞానే కాదు. జ్ఞాని, ఒక మహాజ్వాల.

ఆయన దగ్గిర చేరినవారు, అనేక రకాలు. మామూలు బొగ్గు అయితే అంటుకోవడానికి, ఎక్కువ టైమే పడుతుంది. రాకసిబొగ్గు అయితే, కొంత తక్కువ కాలంలో మండుతుంది. అదే తుపాకి మందు అయితే, అంటించిన వెంటనే అంటుకుంటుంది. జ్ఞాని అనుగ్రహం వారి వారి స్థితిగతుల్నిబట్టి వుంటుంది. వారు ఆయన వైపు దృష్టి మరల్చితే, దివ్యచైతన్యం దానికది కదిలి పనిచేయ నారంభిస్తుంది. సూర్యకాంతి అన్నిటిపై సమంగా ప్రసరిస్తుంది. కాని, వారి వారి అర్హతలను బట్టి ఆ శక్తిని పొందగలుగుతారు'' అన్నారు.

జ్ఞాని దృష్టిలో ఇదంతా ఆత్మే, దైవ సమానమే. వారికి ''తాను - ఇతరులు'' అనే విభాగం లేదు. వారు ''నేను - నువ్వు'' అనే మాటలు ఉపయోగించినా, వారి దృష్టిలో ''నేను - నువ్వు అది, అంతా'' ఆత్మే. ఆ భావమే వుంటుంది. ఈ భూమి మీద వున్నంత కాలం ''నేను - నువ్వు'' అనక తప్పదు; ఎంతటి వారికైనాసరే. జ్ఞానిలోంచి కొన్ని మాటలు వెలువడతాయి. అవి ఆయనలోంచి సంకల్పించి, ఉద్దేశించినవి కావు. కాని, అవి అట్లా జరుగుతాయి.

అందరి మాదిరిగా జ్ఞానికి దేహంవుందిగనుక,తింటాడు-తిరుగు తాడు-మాట్లాడతాడు-పనులు చేస్తాడు. దాన్నిబట్టి వారికీ మనలాగే దేహాత్మ భావం వుంటుందనుకోవడం పొరపాటు.అది మన అజ్ఞానం. వారి విషయం మనం అక్కడే పొరపడతాం. వారి దేహేంద్రియాలు కదిలి, ఏదో ఒక పనిచేస్తున్నా, వాస్తవానికి వారేమీ చేయనట్లే.

జ్ఞాని, తాను దేహిననుకోడు. కనీసం తాను ధరించిన దేహాన్నైనా, గమనించడు. ఆ దేహాన్నే ఆత్మగా చూస్తాడు. తాను కర్త కాకపోయినా, కర్త ననుకుని అన్నీ తన దేహం ద్వారా

జరుగుతున్నాయనుకునే అజ్ఞాని, జ్ఞాని చేసే పనుల్నిబట్టి, జ్ఞానిని కూడా తనవలె దేహధారేననుకుంటాడు. ఆ జ్ఞానికీ నామ- రూపాలు అంటగడతాడు. అసలు సత్యం జ్ఞానికి తెలుసును గనుక, జ్ఞాని, అజ్ఞానివలె తికమకపడడు, కలవరపడడు. జ్ఞాన - అజ్ఞానాలు జ్ఞాని దృష్టిలో వాస్తవం కావు. జ్ఞాని తన సహజ స్థితిలో ఆత్మకు భిన్నంగా ఇతరులు వున్నారనుకోడు. ఆయనకు అంతా ఆత్మే. బంగారం అనేక ఆకారాల్లో వున్నా, కంసాలికి అదంతా ఒకే బంగారం. అలాగే జ్ఞానికి అంతా ఆత్మే. దేహాత్మ బుద్ధివల్ల, "నువ్వు - నేను, జ్ఞాన - అజ్ఞానం" అనే ద్వంద్వ భావం కలుగుతుంది. అది దాటిన స్థితి, జ్ఞాని స్థితి. అజ్ఞానం అంటూ ఒకటి లేదు. "నేను అజ్ఞానిని" అని తెలుసుకోవడమే, జ్ఞానం. అంతే కాని, అజ్ఞానమనేది ఒకటి పుట్టుకురాదు, ఎవరిలోంచీ. ప్రతి ఒక్కరూ జ్ఞానవంతులే.

భగవాన్ సూచించినది జ్ఞానమార్గం. అది సాధకుని నిర్మలంగా, నిశ్చలంగా, ఏకాంతంగా వుంచుతుంది. దానికి శాస్త్రాలతో, మంత్రాలతో, తంత్రాలతో, జప - తప - యోగ - యాగాదులతో గాని; నియమ - నిష్ఠలతో గాని; గ్రంథాలతో గాని, చివరికి ఎటువంటి పద్ధతులతో గాని ; ఆచార - వ్యవహార సాంప్రదాయాలతో గాని పనిలేదు. అది స్వతంత్రమైనది, స్వేచ్ఛమైనది. జీవితంలో ప్రతి క్షణం ఏకత్వాన్ని గమనిస్తూ, అనుసరిస్తూ, ప్రకటిస్తూ వుండటమే జ్ఞానం.

తానే కాదు. అందరూ, ఎప్పుడూ అదై, అంతే, అసలు చిద్వస్తువై. ఆత్మయై వున్నారనీ; సహజంగా ప్రతి ఒక్కరూ స్వేచ్ఛాజీవులనీ, నిత్యముక్తులనీ తెలియజెప్పి, ఎవరికి వారు ఆ పరమసత్యాన్ని తెలుసుకోవాలనీ, అదే ఆత్మ విచారమార్గమనీ, దానికి దృష్టి మార్చుకోవడమే ముఖ్యమనీ చెప్పినవారు భగవాన్.

ఆత్మవిచారణ తప్పక ఆత్మసిద్ధి కలిగిస్తుందన్నారు, భగవాన్ చాలా నిశ్చయంగా. ఎందుకంటే, అజ్ఞానాంధకారంలోపడి కొట్టుకునే వారికి, విచారమార్గం సూర్యోదయం వంటిది. సూర్యునికి అభిముఖంగా తిరిగిన వారందరిపై ఆ కాంతి పడునట్లు, భగవాన్ సూచించిన మార్గాన నడిచే వారందరికీ, సాధన సిద్ధిస్తుంది.

విచారమార్గం అగ్నిజ్వాలై, విషపూరితమై పెరిగే ఆలోచనల్ని కాల్చేస్తుంది. ఈ సాధన ముఖ్యోద్దేశం - పై పై సంగతుల్ని, విషయాల్ని తోసెయ్యడం. అవన్నీ మనోకల్పితం గనుక.జ్ఞానమే మనల్ని విముక్తి పరుస్తుంది. మోక్షానికి జ్ఞాన మొక్కటే, సూటైన మార్గం. జ్ఞానమంటే, తనని తాను తెలుసుకుని తాదాత్మ్యం చెందటమే కాని, రాయివలె కావడం కాదు. శూన్యమగుటా కాదు.

ఈ సాధనామార్గం, అనాదిగా వున్నదే. కాని, భగవాన్ దీన్ని మరింత వెలుగులోకి తీసుకొచ్చారు. ఇది అద్వైత సిద్ధాంతం మీద ఆధారపడివుంది. దీనికి నియమ నిబంధనలు లేవు. కాని వర్క్‌షాపులో, వంటింట్లో, గుహలో, గుడిలో, అడవిలో ఎక్కడైనా, ఎప్పుడైనా ఈ సాధన చేయవచ్చు. దీనికి దేశ, కాలాలతో పనిలేదు. దీనికి ఏ భేదమూ లేదు. ఇది కేవలం జ్ఞానమార్గం. అసలు మనం ఏమై వున్నామో, ఆ చిద్వస్తువుమీద ఏకాగ్ర చిత్తంతో దృష్టి నిలపడం - కాని, దానికి బదులు మనం ఆ చిద్వస్తువును విషయాలతో, వస్తువులతో, సంగతులతో రోజు - రోజుకీ అనేక విధాల దట్టంగా చెత్త చేర్చి కప్పేస్తాం. అదీ, మన మామూలు జీవితం. ఆ విధంగా కాలంలో కప్పబడిన చెత్తగుట్టనంతా తవ్వి బైటపోస్తే, ఆ చోట ఖాళీ ఏర్పడుతుంది. అదే చిదాకాశం. అదే మహాశూన్యం. అదే నిరామయం.

ఆ మహాశూన్యాన్ని నింపుతో అసలు సత్యం ప్రకాశిస్తుంది. అంటే, ఆ సత్యాన్ని ఎప్పుడో, ఎక్కడో దర్శించడం కాక, అప్పుడే, అక్కడే - అదీ నీలోనే దర్శించవచ్చు. "కాబట్టి ముందు నిన్ను నీవు తెలుసుకో," అంటారు భగవాన్. ఎందుకంటే తనని తాను తెలుసుకున్నప్పుడే శాంతి, ఆనందం. అదే వాస్తవం.

ఈ సాధనామార్గంలో కర్మ - భక్తి - యోగమార్గాలూ వున్నాయి. జ్ఞానియై విశ్వాత్మలో ఐక్యమౌతాడు. యోగియై, విశ్వతేజస్సును దర్శిస్తాడు. భక్తుడు నిష్కామ యోగియై, ఆనందంలో తన్మయత్వం పొందుతాడు. కాని, అజ్ఞానంవల్ల మనుష్యులు జ్ఞాన మార్గం వదలి భక్తిమార్గం, తాంత్రికమార్గం, యోగమార్గం తదితర మార్గాలు చేపడతారు.

తననుంచి మినహా బైటు ప్రపంచం నుంచి సత్యాన్ని తెలుసుకోదలిస్తే, అది నిజమైన జ్ఞానం కాదు. అది మనిషికి ఆనందాన్ని ఇవ్వదు. తనని తాను తెలుసుకోకపోతే, భయాల్లో - బంధాల్లో, చిక్కుకుపోతాడు. భయాలకూ, కోర్కెలకూ కారణం దేహం; తాను దేహం అనే భావన. దేహమే అంతా అయినట్లు నమ్మకం. అదే మొదటి తప్పు. ముందు మనం ఆ తప్పుడు ఆలోచనా విధానంనుంచి తప్పుకోవాలి. లేకపోతే, ఆలోచనల్ని దేహం వెంబడిస్తుంది. దేహం మినహా మరో ఆత్మకు ఆస్కారం లేదు అంటారు కొందరు. కాని, ఆ దేహం జాగ్రత్ - స్వప్నావస్థల్లో మాత్రమే వుంది కాని, నిద్రావస్థలో లేదు. నిద్రావస్థలో దేహం లేకపోయినా, "నేను" వుంటుంది. ఆ "నేనే" ఆత్మ. కాబట్టి మన ఆలోచనలు, భావాలు, భయాలు, బంధాలు, అభిప్రాయాలు, తలపులూ - అన్నీ, అంతా తప్పుడు తడిక. మన తప్పు మనం తెలుసుకుని, దాన్ని బైటికి లాగడం మంచి పని. కాని, మన

మతం, నమ్మకం, సాంప్రదాయం, మనం చేసే సాధనా, దాన్ని తీసి బైట పారేయనీయక వాటిని ఇంకా ఇంకా పొడిగిస్తాయి. మనసును పాడుచేస్తాయి. అందుచేత తనను తాను తెలుసుకోవాలంటే ముందు తనని తాను నిరాకరించుకోవాలి. జ్ఞాపకాలకు ఆటస్థలమైన గతాన్ని పూర్తిగా ఊడ్చెయ్యాలి. అలాగే, ఏ అరమరికా లేకుండా తనకి తాను భక్తి, ప్రేమలతో అర్పించుకోవాలి.

నిరంతర సాధనవల్ల అహంకారం అదృశ్యమై, ఆత్మ మిగులుతుంది. ఆ ఆత్మను మరవడమే, మరణం. దాని స్మరణే - స్ఫురణే జీవనం. అసలు సత్యం - "నేనున్నాను" అనేది. అదే "వుండటం". ఆ వుండటమే, ఆ అనుభవమే, ఎరుక. ఆ ఎరుకే, ఆనందం.

* * *

"జ్ఞానికి, యోగికి తేడా ఏమిటి ?" అని ఒకరు భగవాన్ని ప్రశ్నించారు.

భగవాన్ :- జ్ఞానే యోగి, నిజమైన భక్తుడు అంటుంది గీత. యోగం, కేవలం సాధన. ఆ సాధనలో జ్ఞానం సిద్ధిస్తుంది. జ్ఞానం సిద్ధించాక, యోగం అవసరంలేదు. అన్ని రకాల సాధనలనూ "యోగం" అనే పిలుస్తారు. భక్తి - జ్ఞాన - కర్మ - అష్టాంగ మొదలైనవి ఆయా యోగాల పేర్లు. యోగమంటే, కలయిక. వియోగం వున్నప్పుడే, కలయిక సాధ్యం. మనిషి సహజంగా ఎప్పుడూ "నేను వియోగిని" అనే భ్రాంతిలో వుంటాడు. ఆ భ్రాంతి తొలగి పోవాలి. దాన్ని తొలగించే విధానాన్ని, యోగమంటారు. "ఉన్నది ఒక్కటే ఆత్మ" అని తెలుసుకున్నవానికి, సంయోగ, వియోగాలతో పని లేదు.

"ఏ యోగ విధానం మంచిది?" అని మరొకరు ప్రశ్నించారు.

భగవాన్ :- అది వ్యక్తి అభిరుచి మీద ఆధారపడివుంటుంది. ఒకరికి ఒక పద్ధతి, ఒక తీరు ఒక విధానం సులభంగా వుంటే, మరొకరికి మరొక పద్ధతి సులువుగా వుంటుంది. అంతా, అన్నీ ఒకటే, సమానమే.

జీవుడు జనన - మరణ వలయంనుంచి విముక్తుడు కావడానికి చేసే కర్మాచరణే, కర్మయోగం. అంతా దైవమే అయినా తాను పరబ్రహ్మనుంచి విడిపడ్డాననే తపనతో, నిజమైన భక్తి - విశ్వాసాలతో, ప్రేమతో, తిరిగి ఆ దైవంలో కలవాలనే తాపత్రయంతో, వుండుటే, భక్తియోగం. అజ్ఞానంలో పడి కొట్టుకునే జీవుడు కాంతి కోసం, విమోచనకోసం చేసేదే జ్ఞానయోగం. జీవుని స్వభావం విచారణ ద్వారా తెలుసుకోవడమే, మహాయోగం. అదే భగవాన్ మార్గం. అది "నే నెవడను?" అను విచారమార్గం.

* * *

జ్ఞాని ప్రార్థిస్తారా ?" అని ఒకరు భగవాన్ని అడిగారు.

భగవాన్ :- జ్ఞానికి ప్రార్థనేమిటి? దేనికోసం, ఎవరిని ప్రార్థించడం? ఎందుకు ప్రార్థించడం ? ప్రార్థించడానికి తననుంచి ఏదిమాత్రం విడిగావుంది? తనకు భిన్నంగా వున్న దాన్ని దేన్నో ఉద్ధరించడానికా, ఆ ప్రార్థన ?

"నేను" అనే వ్యక్తిత్వం వున్నప్పుడే, ప్రార్థన. ఆ భేదభావమే, అజ్ఞానం. ఆ అజ్ఞానంవల్లనే "నేను నిస్సహాయుణ్ణి, అజ్ఞానిని" అనే భావం కలుగుతుంది.

దేవుడికి తన ధర్మం, తన బాధ్యత తెలుసు. మధ్య మన మధ్యవర్తిత్వం దేనికి ? నిన్ను నువ్వు తెలుసుకుంటే చాలు !

జ్ఞానికి కోర్కెలు, సంకల్పాలు వుండవు. వున్నా అవి శుద్ధ సాత్వికాలు. అవి ఆయన్ని ఏమాత్రం అంటవు. మనం బాధలు పడుతున్నట్లు, జ్ఞాని బాధలు పడడు. ఎందుకంటే ఆయన మనసు ఆత్మానందంలో లీనమైవుంటుంది. అంటే, దేహబాధ ఆయనకు కలలో బాధ మాదిరిగా వుంటుంది. అంటే, బాధ, దేహంలో లేదు. అది మనసులో వుంది. వారి దృష్టిలో బాధ కూడా ఆత్మలో ఒక భాగం మాత్రమే. కొందరు జ్ఞానులు బాధపడుతున్నట్లు కనుపించవచ్చు. కొందరు సమాధిస్థితిలో వుండవచ్చు. కొందరు మరణించడానికి ముందు, అదృశ్యం కావచ్చు. అంతమాత్రం చేత, వారి జ్ఞానంలో భిన్నత్వం వుందనుకోకూడదు.

జ్ఞాని, సిద్ధులకోసం చూడడు. కాని, సిద్ధులు నీడలాగ వారి వెంటనంటి వుంటాయి. జ్ఞాని దేహధారుడై ఇతరులకు సిద్ధులు, మహిమలు చూపించుకోవచ్చు. కాని, ఆత్మలో ఐక్యమైతే, ఇంక సిద్ధులేమిటి ? సిద్ధులు ప్రారబ్ధకర్మానుసారం ప్రాప్తిస్తాయి.

కరెంటు ఆపేసిన తర్వాత కూడా నెమ్మదిగా తిరిగే "ఫేన్ FAN" కదలికతో పోల్చారు, జ్ఞాని ప్రారబ్ధకర్మను, భగవాన్. ఫాన్ గత తీవ్ర చలనంవల్ల,ఆపేసిన తర్వాత కూడా కొంతసేపు నెమ్మదిగా తిరిగి, తిరిగి ఆగుతుంది. కాని, దానికి కొత్త కదలికలు పుట్టవు. పాత కదలికలు క్రమంగా తగ్గడం తప్ప. ప్రారబ్ధవశాత్తు తన శరీరంతో ఏఏ పనులు చేయవలసివుంటే, ఆ పనులన్ని చేసిగాని, జ్ఞాని దేహం చాలించరు. దేహం వున్నంతవరకు, జ్ఞానికీ ప్రారబ్ధం తప్పదు. ప్రారబ్ధం అనుభవించవలసిందే ! దానికి భగవాన్ జీవితమే సాక్షి. ఆయన దేహం ఎటువంటి యాతనలు పడ్డా, ఆయనేమీ చలించలేదు, గొడవపడలేదు.

కట్టెల దుకాణానికి వెళ్ళి, కట్టెలు కొని, వాటిని నెత్తిన పెట్టుకుని, త్వరగా ఇంటికి వచ్చి, ఆ కట్టెల్ని విసిరి పారెయ్య గలిగినంత త్వరగా విసిరి పారెయ్యాలని చూసినట్లు, జ్ఞాని తన దేహాన్ని వీలైనంత త్వరగా విసిరిపారెయ్యాలని చూస్తాడు. కాని, జ్ఞానికి దేహ స్ఫురణ వుండదు.

సర్వభూత సమభావన కలవాడే జ్ఞాని. కాని. "జ్ఞానిని సేవించుకుంటూ, వారి చుట్టూవుండే వ్యక్తులు, ఏదో ప్రత్యేకమైన అనుగ్రహం పొందినవారని కొందరు భావిస్తారు. జ్ఞాని అట్లాంటి ప్రత్యేకత చూపితే, ఆయన జ్ఞాని ఎట్లా అవుతాడు ? కొలనులో పద్మం వికసిస్తుంది. దాని అడుగున నత్తలు, కప్పలు పడివుంటాయి. ఎక్కడినుంచో తుమ్మెదవచ్చి, దాని మకరందాన్ని తాగిపోతుంది," అన్నారు భగవాన్. జ్ఞాని సన్నిధే ముక్తి. అది అన్నింటికన్నా గొప్ప సంగతి. అసత్యాన్ని, అసత్యంగా తెలుసుకోవడం, తాను ఏదీ కాకుండా "నేను"గా వుండటమే, జ్ఞానం.

జ్ఞానికి శాస్త్రాలతో పనిలేదు. అజ్ఞానికీ వాటితో పనిలేదు. ఒక్క ముముక్షువులే శాస్త్రాల్ని తాకేది.

జ్ఞానికీ కలలు వస్తాయి. కాని, ఆ కలా, ఆ కల తర్వాత వాస్తవం కూడా ఒక కలేనని ఆయనకు తెలుసు. జ్ఞాని ప్రపంచాన్ని అసత్యమని, తనకంటే వేరని తలచడు. నీళ్ళతో నిండిన కుండల్ని ఆడవాళ్ళు నెత్తిన పెట్టుకుని, దృష్టిఅంతా ఆ కుండలమీద కేంద్రీకరించి, అవి కింద పడిపోకుండా మాట్లాడుతో నడుస్తారు. అలాగే జ్ఞానులు లోకవ్యవహారాల్లో వున్నా, వారి మనసు పరబ్రహ్మంలో లీనమై వుంటుంది. వారి లక్ష్యం చెదరదు.

జ్ఞానమంటే, సత్యసిద్ధి. సంపూర్ణ సత్యమే, ఈశ్వరుడు. సమష్టి అయిన రజస్సే, జీవుడు. సమష్టి అయిన తమస్సే, జగత్తు. ఆ మూడూ అసలు వున్నదానికి, ఆత్మకూ భిన్నం కాదు, వేరూ

కాదు అనే ఎరుకే జ్ఞానం. అటువంటి జ్ఞానం క
కలగదు. సాధనా ఫలితంగా పరిపక్వమైన
సంపూర్ణంగా ప్రకాశిస్తుంది. అలా ఒక్కసారిగ
మరల తొలగదు.

* * *

భగవంతుడు ఒక వ్యక్తేనా ? అని ఒక క్రై
అడిగాడు.

భగవాన్ :- అవును. ఆయనే, మొదటి వ్యక్తి
"నేను". అది ఎప్పుడూ నీ ముందు
నువ్వు ప్రపంచ విషయాలకు
భగవంతుడు తెరవెనక్కి పోతాడ
విసర్జించి, ఆయన్నే అన్వేషిస్తే,
పరమేశ్వరుడుగా నిలుస్తాడు. :
ఆయనే, ఆత్మ.

"వ్యక్తిగత దైవం అంటూ ఒకరు వున్నా
అమెరికన్ భగవాన్ని అడిగారు.

భగవాన్ :- వున్నారు. వారే ఈశ్వరుడు.

అమెరికన్ :- (ఆశ్చర్యంతో) ఏమిటీ, కాళ్ళు -చే
చెవులు - వగైరాతో వున్నారా ?

భగవాన్ :- అవును, వున్నారు. నీకు అవయ
ఆయనకు ఎందుకు వుండకూడదు

అంతలో కోహెన్ అందుకుని, "దైవానికి
మాదిరిగా అవయవాలు వున్నాయని పురాణ

నవ్వుకున్నాను" అన్నారు. దానికి భగవాన్, "అటువంటి అవయవాలే నీకూ వున్నప్పుడు నిన్నుచూసి నువ్వు ఎందుకు నవ్వుకోలేదు ?" అన్నారు.

"నాకు దేవుణ్ణి చూపించేవారెవరు ?" అని ఒక హిందువు భగవాన్ని అడిగాడు.

భగవాన్ :- ఎవరి సహాయంతో ఇదంతా చూస్తున్నారో, వారే ఆ దైవాన్ని చూపుతారు. మీ ఆత్మే, మీకు మార్గదర్శి. అదే దారి చూపుతుంది.

ఒకరోజున ఒక ముస్లిం భగవాన్ని సమీపించి, చాలా నిజాయితీగా, తెలుసుకోవాలనే దృష్టితో "భగవంతునికి రూపం వుందా ?" అని అడిగాడు.

భగవాన్ :- "భగవంతునికి రూపం వుందని ఎవరన్నారు ?" అని ఎదురు ప్రశ్న వేశారు.

ముస్లిం :- భగవంతుడు నిరాకారుడైతే, విగ్రహారాధన పొరపాటు కాదా ?

భగవాన్ :- భగవంతునికి రూపం వుందని ఎవరూ అనలేదు. మీకు రూపం వుందా ?

ముస్లిం :- లేకేం ? వుంది ! కాని, నేను దేవుణ్ణి కాను.

భగవాన్ :- అయితే మీరు రక్త-మాంసాదులతో కూడిన మనిషన్న మాట ? అందంగా దుస్తులు ధరించిన ఎముకలగూడు అన్నమాట ?

ముస్లిం :- అవును. ఈ దేహాకారంలోవున్న నా వునికికి ఎరుకలో వున్నాను.

భగవాన్ :- మీరు దేహానికి ఎరుకలో వున్నారన్నమాట ? మిమ్మల్ని మీరు దేహంగా ఎంచుకుంటున్నారు.

అవునా ? మీరు, ఆ దేహమా ?
మరచి గాఢనిద్రలో వున్నప్పుడు ఆ

ముస్లిం :- అవును, నేనే. ఆ దేహం, నాదే !

భగవాన్ :- అయితే ఆ దేహం చనిపోయినప్పుడ

ముస్లిం :- చనిపోయిందని దాన్ని పూడ్చిపెడత

భగవాన్ :- "నేను" అనే మీరు ఇంకా వున్నారు
దేహం. దీన్ని తీసుకుపోవద్దు. దీన్ని
నేను గడించాను. దీనిమీద పట్టుబ
ఇవన్నీ నావి. నేను వాటితో ఇక్కడే
మీరెందుకు అనకూడదు ?

ముస్లిం :- నేను దేహంలో వున్న ప్రాణిని,
కాని, నేను దేహాన్ని కాదు.

భగవాన్ :- ఇప్పటివరకు స్థిరనిశ్చయభావంతో
నేను" అన్నారు. మీకో రూపం కూ
ఆ అనుకోవడమే, అజ్ఞానం. ఆ అ
లైన అనర్థాలకు, కష్టాలకు, బా
మూలం. ఆ అజ్ఞానం అంతమయ్యే
నిరాకారస్థితిని, మీ స్వభావాన్ని
ఇదంతా తన ప్రజ్ఞ, ప్రతిభ, పె
చూపించుకోవడానికి చేసే తర్కం

అంతటితో ఆ ముస్లిం మౌనం వహించాడు

* * *

"భగవంతుణ్ణి ఏ విధంగా ప్రార్థించాలి ?" అని ఒకరు భగవాన్ని అడిగారు. దానికి భగవాన్, "భగవంతుణ్ణి ప్రార్థించే "నేను" ఒకటి వుంటుందికదా ? ఆ "నేను" ఎప్పుడూ నిశ్చలంగా, నిర్మలంగా, నిశ్చయంగా ఆ క్షణంలో భగవంతునికి బహు సన్నిహితంగా వుంటుంది.

"అదీ, ఇదీ, అన్నీ, అంతా చూసేవాళ్లు, భగవంతుని ఎందుకు చూడరు? అందరూ ఎప్పుడూ అంతటా ఆ భగవంతుణ్ణి చూస్తున్నారు. చూస్తారు. అయినా చూడలేరు. ఎందుకంటే, వాళ్ళకు భగవంతుడు తెలియదు. కనుక దైవమంటే ఏమిటో ముందు తెలుసుకోవాలి. భగవంతుడూ, భగవన్నామం రెండూ ఒకటే. భేదం లేదు. అందుకే ఎవరైనా, ఏ నామజపమన్నా చేసుకుంటామంటే, తప్పకుండా చేసుకోండి అని ప్రోత్సహిస్తాను.

ప్రార్థన అంటే, మాటలు జపించడం కాదు, పరితపించడం. ఇతరులకోసం ప్రార్థించడంలో నీ సుఖం నీ క్షేమం ఇమిడివుంటుంది. అది స్వార్థం. ఈశ్వరుడికి మనవంటి మధ్యవర్తులు అవసరం లేదు. ఆయన ధర్మమేమిటో ఆయనకు తెలుసు."

"ఎంతకాలం మంత్రజపం చేస్తే, ఆత్మసిద్ధి కలుగుతుంది ?" అని ఒకరు భగవాన్ని అడిగారు. దానికి భగవాన్, "నేను మంత్ర జపం చేస్తున్నాను" అనే భావం వున్నంతవరకు, ఆత్మసిద్ధి కలగదు. అప్పుడు నువ్వే గుర్తిస్తావు "ఆ మంత్రజపం చేసేది, నేను కాదని. మంత్రం దానికది జరిగిపోతూవుంటే, అదే సహజస్థితి. అదే సిద్ధి. అదే విమోచన. "నేను" అనే స్ఫురణే, అహం స్ఫురణ. "నేను" అనేది అన్ని మంత్రాల్లోకి గొప్ప మంత్రం.చివరికి ప్రణవం ఓంకారం కూడా కొన్ని అక్షరాల కలయికే !"

ఆత్మవిచారణ తప్పక ఆత్మసిద్ధి కలిగిస్తుందన్నారు, భగవాన్ చాలా నిశ్చయంగా. ఎందుకంటే, అజ్ఞానాంధకారంలోపడి కొట్టుకునే వారికి, విచారమార్గం సూర్యోదయం వంటిది. సూర్యునికి అభి ముఖంగా తిరిగిన వారందరిపై ఆ కాంతి పడునట్లు, భగవాన్ సూచించిన మార్గాన నడిచే వారందరికీ, సాధన సిద్ధిస్తుంది.

విచారమార్గం అగ్నిజ్వాలై, విషపూరితమై పెరిగే ఆలోచనల్ని కాల్చేస్తుంది. ఈ సాధన ముఖ్యోద్దేశం - పై పై సంగతుల్ని, విష యాల్ని తోసెయ్యడం. అవన్నీ మనోకల్పితం గనుక.జ్ఞానమే మనల్ని విముక్తి పరుస్తుంది. మోక్షానికి జ్ఞాన మొక్కటే, సూటైన మార్గం. జ్ఞానమంటే, తనని తాను తెలుసుకుని తాదాత్మ్యం చెందటమే కాని, రాయివలె కావడం కాదు. శూన్యమగుటా కాదు.

ఈ సాధనామార్గం, అనాదిగా వున్నదే. కాని, భగవాన్ దీన్ని మరింత వెలుగులోకి తీసుకొచ్చారు. ఇది అద్వైత సిద్ధాంతం మీద ఆధారపడివుంది. దీనికి నియమ నిబంధనలు లేవు. కాని వర్క్‌షాపులో, వంటింట్లో, గుహలో, గుడిలో, అడవిలో ఎక్కడైనా, ఎప్పుడైనా ఈ సాధన చేయవచ్చు. దీనికి దేశ, కాలాలతో పనిలేదు. దీనికి ఏ భేదమూ లేదు. ఇది కేవలం జ్ఞానమార్గం. అసలు మనం ఏమై వున్నామో, ఆ చిద్వస్తువుమీద ఏకాగ్ర చిత్తంతో దృష్టి నిలపడం - కాని, దానికి బదులు మనం ఆ చిద్వస్తు వును విషయాలతో, వస్తువులతో, సంగతులతో రోజు - రోజుకి అనేక విధాల దట్టంగా చెత్త చేర్చి కప్పేస్తాం. అదీ, మన మామూలు జీవితం. ఆ విధంగా కాలంలో కప్పబడిన చెత్తగుట్టనంతా తవ్వి బైటపోస్తే, ఆ చోట ఖాళీ ఏర్పడుతుంది. అదే చిదాకాశం. అదే మహాశూన్యం. అదే నిరామయం.

వైకుంఠం వెళ్ళాలనీ అలా, అలా మనసు పోతూనే వుంటుంది, అంతులేకుండా; శాంతి- సుఖం - స్థిరత్వం వుండనీయకుండా.

శాంతో, ఆనందమో, స్వర్గమో, మోక్షమో కావాలంటే అన్నింటికీ మూలమైన తనను తాను ముందు తెలుసుకోవాలి. అప్పుడు అన్ని లోకాల్ని సంకల్పమాత్రం చేత తనలోనే దర్శించవచ్చు.

అసలు అవన్నీ వుండనీ, వుండకపోనీ ; నువ్వు వున్నావు కదా ? అది నిజం. నువ్వు ఎట్లా వున్నావు? ఎక్కడ వున్నావు? ముందు నీ సంగతి, నీ స్థితిగతుల్ని తెలుసుకో! ఆ వెనక లోకాల సంగతి యోచించవచ్చు.

* * *

"బుద్ధుడు, భగవంతుని గూర్చిన ప్రశ్నల్ని ఏల ఉపేక్ష చేశారు ?" అని ఒకరు భగవాన్ని అడిగారు.

భగవాన్ :- అందుకే బుద్ధుణ్ణి నాస్తికుడు, అజ్ఞాని అన్నారు. నిజం చెప్పాలంటే, బుద్ధుడు సాధకుల్ని నడపడమే తమ విధిగా, బాధ్యతగా, ధర్మంగా పెట్టుకున్నారు. సాధకుడు అక్కడే, అప్పుడే, ఆ క్షణంలోనే ఆనందాన్ని పొందేందుకు ఆయన వారిని తయారు చేశారు. అటువంటి ఆనందం వదలి, భగవంతుడు - భవిష్యత్తు మొదలైన విషయాలతో, వాటి గురించిన తర్కాలతో కాలం వృధా చేయడం ఆయనకు ఏ మాత్రం ఇష్టం లేదు. అందుకే బుద్ధుణ్ణి "శూన్యవాది" అని కూడా అన్నారు. సాధకుని ఆనందాన్వేషణ వైపు దృష్టి మరల్చడమే ఆయన పనిగా పెట్టుకున్నారు.

"దేవుడు వున్నాడా ?" అనే ప్రశ్నకు బుద్ధుడు మౌనం వహించాడు. ఆ విధమైన వ్యర్థపు ప్రశ్నలన్నింటికీ మౌనం వహించిన బుద్ధుడు చావు - పుట్టుకల, పునర్జన్మల గురించి మాట్లాడారు. కాని, హీనయాన - మహాయాన మహాత్ములు సైతం బుద్ధుణ్ణి తప్పుగా అర్థం చేసుకున్నారు. నాస్తికుడన్నారు.

దేహాత్మభావం వలన జన్మ - మృత్యు - పునర్జన్మ భావనలు కలుగుతాయి. కాని, నీవు ఆత్మవు. "నువ్వు" వుంటే, దేవుడు, దెయ్యం అన్నీ వుంటాయి. అలాగే స్వర్గ - నరకాలు, జనన - మరణాలు మొదలైన ద్వంద్వాలన్నీ వుంటాయి. దేనికైనా ముందు నువ్వు వుంటేనే. నువ్వు లేకపోతే. ఏదీ లేదు. కనుక ముందు నిన్ను నీవు తెలుసుకో ! ఎందుకంటే తనని తాను తెలుసుకున్న వానికి, సంశయాలు, సమస్యలు, సంగతులు, ప్రశ్నలు కలవు.

విభక్తి, విభాగం వున్నంతవరకు, భక్తి వుంటుంది. వియోగం వున్నంతవరకు, పునఃసంధాన విధానం వుంటుంది. ద్వంద్వం వున్నంతవరకు, భక్తుడు - భగవంతుడు వుంటారు.

ప్రతి కర్మకు, ఫలితం వుంటుంది. అవి కార్య - కారణాలు. ఆ కార్య-కారణ సంబంధం శక్తిజనితం. ఆ శక్తినే దైవం అంటారు. అందుకే ఫలదాత, దైవమంటారు.

"దైవం, జ్వాల; మనం, రవ్వలం, అనుకోవచ్చా ?" అని జినరాజదాస భార్య భగవాన్ని అడిగారు.

భగవాన్ :- రవ్వలు జ్వాలలోంచి లేచిపడతాయి. అవి లేచి, ఆకాశంలో వుంటాయి. కాని, మనం దైవం నుంచి విడిగా లేము.

ఆమె :- మనకు అన్యంగా, భిన్నంగా, విడిగా దైవం వున్నాడా? సహజంగా ఈ ప్రపంచానికి ఒక సృష్టికర్త వుండాలి కదా ?

తెలుసుకోవాలి. మనుష్యుల్లోనూ వికాసమనేది, అంతే ! ఈశ్వరాను గ్రహాన్ని తీసుకునే ఇచ్ఛా, శక్తి, సామర్థ్యం ఒకరినుంచి ఒకరిలో భిన్నంగా వుంటుంది.

దైవం, నామ - రూపరహితం. అది దివ్యతేజస్సుతో కూడిన చైతన్యశక్తి. అదే అంతటా వ్యాపించివుంది. ఈ విశ్వమంతా ఆ ఒకే ఒక చైతన్యంతో నిండివుంది.

మనం దేహంలో వున్నామనుకొన్నట్లు, కొందరు దైవం, హృదయంలో వుంటాడంటారు - కాని, హృదయమనేది భౌతికం కాదు. అది మనలో ఒక చోటూ కాదు. కాని, హృదయాన్ని భగవంతుని నివాస స్థలంగా చెపుతారు. అంతేకాని, దైవానికి మనలో ఒక ప్రత్యేక స్థానం అంటూ లేదు. సర్వాంతర్యామి, అనంతుడు, అజేయుడు అయినవాడు - ఇరుకు, మురికి అయిన మానవహృదయంలోనే వుంటాడని వూహించడం అర్థయుక్తం కాదని, ఆయన్ని ఓ దివ్యచైతన్యంగా సమాధి స్థితిలో తెలుసుకో జూస్తారు.

భగవంతుని నిశ్చయంగా మనసులో దర్శించవచ్చు. భక్తుని మనోకల్పనే, భగవంతుని రూపం, గుణం, స్వభావం. కాని, అది పరిపూర్ణం కాదు. అది భక్తుని సంకల్పం మాత్రమే. అందులో ద్వైత భావం వుంది. అది స్వప్న దృశ్యం మాదిరిగా వుంటుంది. ఆ దైవం ఏమిటో తెలిసిన తర్వాత, విచారణ ఆరంభమౌతుంది. అది ఆత్మ సాక్షాత్కారంతో పరిసమాప్తమౌతుంది. అందుచేత విచారమే తుది, చివరి మార్గం. అదే ఏకైక మార్గంగా తోస్తోంది. కొందరు విచార మార్గాన, కొందరు భక్తిమార్గాన దైవాన్ని తెలుసుకుంటారు. కాని, "నీలోకి చూసుకో" అనేది ఉపదేశం యొక్క అర్థం. మన హృదయం అనుభూతి పొందుతోంది గనుక, దాన్ని దైవ నివాస స్థలంగా నిర్ణయించారు.

ఏ ఒక్కరో అవతారం కావడమేమిటి? ప్రతి ఒక్కరూ భగవంతుని అవతారాలే! ఈశ్వరరాజ్యం ప్రతి ఒక్కరిలో వుంది. బుద్ధుడు, జీసస్, మహమ్మద్, కృష్ణుడు-అందరూ నీలోనే వున్నారు. అసలు సత్యం తెలుసుకుంటే, తక్కినవారంతా కూడా ఈశ్వరాంశ సంభూతులేనని బోధపడుతుంది. అందరిలో ఆ దైవం వున్నా, పరిపూర్ణ మానవుల్లో ఆయన చేతలు స్పష్టం.

అందరూ అన్నివేళలా, అంతటా ఆ భగవంతుణ్ణే దర్శిస్తున్నా, ఆయన్ని ఎరగరు. ఆయన నిత్యసాక్షాత్కారమై వుంటే, సర్వవ్యాపి అయిన ఆయన్ని, ఆ ఆత్మను తెలుసుకునేందుకు ఎవరూ ప్రయత్నించరు. కాని, ఆత్మ ఎప్పుడూ ప్రతి ఒక్కరి అనుభవంలో వుంటుంది.దానికన్న సహజం, సామాన్యం అయినది మరొకటి లేదు. దానికి ఏ ప్రయత్నం, సహాయం అవసరంలేదు.

భగవంతునికొరకు మీరు అనవసరంగా గొడవ పడతా రెందుకు? ముందు మీ సంగతి మీరు తెలుసుకోండి. సత్యాన్వేషణ చేయండి. ఆత్మకు భిన్నంగా, అన్యంగా మరో ఈశ్వరుడు లేడు. వుండి వుంటే, అతడు ఆత్మరహితుడుగా వుంటాడు. అది అసంభవం. ఆత్మకు భిన్నంగా నువ్వు లేవు, దేవుడూ లేడు. ఉన్నది ఆత్మ ఒక్కటే. అలాగే దైవ నిర్ణయం, విధి, ప్రారబ్ధం అంటూ ఏమీ లేవు" అన్నారు భగవాన్.

ఒకసారి ఒకరు "Where Psychology ends, Philosophy begins" అని భగవాన్ దగ్గర చదివితే, "Where Philosophy ends spirituality begins" అని భగవాన్ పూరించారు.

1945 డిశంబరు ఎనిమిదవ తేదీ ఉదయం పదిగంటలకు లోకమ్మగారు భగవాన్ కూర్చున్న హాల్లోకి వచ్చి, "రాత్రి రెండూ నలభై ఐదు నిమిషాలకు ఎచ్చమ్మాళ్ పోయిందిట" అన్నది. అది విని భగవాన్ వెంటనే, 'అవును, నేనూ పోవాలనే వున్నాను. కాని నాకు సమయం రాలేదు" అన్నారు. గంభీర స్వరంతో. ఆ మాట హాలులోవున్నవారందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది.ఎందుకంటే, భగవాన్ నోట, అటువంటి మాట ఎన్నడూ, ఎవరూ వినివుండలేదు. ఆయనకు పోవడమేమిటి ? కాని, ఆనాడు ఆయన నోటినుంచి అప్రయత్నంగానో, సూచన ప్రాయంగానో ఆ మాట వచ్చింది. ఆ మాట ముందుకాలంలో ఏదో ఘోరమైనదాన్ని సూచిస్తోందని పించింది కొందరికి.

ఎచ్చమ్మాళ్ తిరువణ్ణామలై వచ్చినప్పటినుంచీ రోజూ ఏదో ఒక వంటకంచేసి, భగవాన్‌కీ, తక్కిన ఆశ్రమవాసులకూ పెట్టేది. అన్నేళ్ళూ ఆమె వంటకం వచ్చేవరకు, భగవాన్ భోజనం చేసేవారు కాదు. కాని, చివరి రోజుల్లో ఆమె స్థితి గమనించి, "మాకు కుదరనప్పుడు భోజనం తెచ్చి పెట్టావు. సరి. ఇది ఇప్పుడు ఇంత పెద్ద ఆశ్రమం అయింది. నువ్వు కూడా ముసిలిదానవు అయ్యావు. పేదరికంలో వున్నావు. కాబట్టి నువ్వు మాతోపాటు ఇక్కడ తినరాదా ?" అన్నారు భగవాన్. ఆమె అందుకు అంగీకరించలేదు. అయినా ఆమె తన తృప్తికోసం ఏదో ఒక వంటకం తయారుచేసి, చివరివరకు ఆశ్రమానికి తీసుకొచ్చి, భగవాన్‌కి పెడుతూనే వుంది. ఆ ఎచ్చమ్మాళ్ చనిపోయింది.

"ఆమె దేహాన్ని ఏం చేశారు?" అని అడిగారు భగవాన్.

"దహనంచేసి, అస్తికల్ని స్వగ్రామం తీసుకువెళ్ళి, అక్కడ సమాధికట్టి, దానిమీద తులసిమొక్క పెడతారుట" అన్నారు చూసివచ్చినవారు.

కొన్నాళ్ళ తర్వాత "ఎచ్చమ్మాళ్ సంప్రదాయాన్ని మేము పాటిస్తాం" అన్నారు ఆమె బంధువులలో ఒకరు.

"ఆ కైంకర్యాధికారం ఆమెదేకాని, ఇతరులది కాదు" అన్నారు భగవాన్.

అప్పటికే చాలామంది రమణభక్తులు పరమపదించారు. వారిలో మొదటివారు అయ్యాస్వామి. ఆయన స్వగ్రామం వెళ్ళి, 1918 లో మరణించారు.

1929 లో శేషాద్రిస్వామి మహాసమాధి అయ్యారు. ఆయన భక్తులు శ్రీ రమణాశ్రమానికి తూర్పుదిశనున్న స్థలంలో శేషాద్రిస్వామిని సమాధిచేశారు. ఆ సమయంలో భగవాన్ అక్కడే వున్నారు. క్రమంగా ఆయన సమాధిపై ఒక ఆలయం వెలసింది. ఆ తర్వాత ఒక ఆశ్రమం ఏర్పాటయింది. ఈనాటికీ ఆ ఆశ్రమంలో శేషాద్రిస్వామి జయంతి, ఆరాధనోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి.

1936 లో గణపతిశాస్త్రిగారు ఖర్గ్‌పూర్‌లో మరణించారు. ఆయన మరణవార్త విని, భగవాన్ కన్నీరు కార్చారు. ఒకసారి భగవాన్ నాయనగారి గురించి గంటకుపైగా మాట్లాడారు. "నాయనగారి రచన, పాండిత్యం, శక్తి - అన్నీ అద్భుతం. అన్ని సామర్థ్యాలున్నా ఆయనలో ఎంత వినయమో !" అన్నారు.

నాయనగారి శతజయంతి ఉత్సవాలు దేశమంతా జరిగాయి. ఒకరు నాయనగారి గురించి మాట్లాడుతూ, "ఆయన వేదకాలపు ఋషిపుంగవులు మాదిరిగా వుండేవారు. విశాలమైన నుదురు, ప్రకాశవంతమైన కళ్ళు, వశీకరణం చేసుకోగల ముఖారవిందంతో వెలిగిపోయేవారు. ప్రతి అడుగునా ఆయన మాటల్లో మాధుర్యం, స్వరూపంలో గంభీరత్వం, అధికారత్వం కనుపించేవి" అన్నారు.

పరమ శాంత స్వభావుడు, బ్రహ్మచారి అయిన మాధవస్వామి, మలయాళీయుడు. ఆయన స్వగ్రామం, పాలఘాట్ దగ్గర. ఆయన శ్రీ రమణాశ్రమం వచ్చి, స్వామిపరిచర్యకు కుదిరి, స్వామి నీడవలె, ఆయన వెనక కమండలం పట్టుకుని వెళ్ళేవాడు. ఆయన ప్రేమ' భక్తి, శ్రద్ధ నిరుపమానమైనవి. ఆయన దేశసంచారార్థం వెళ్ళి 1946 లో కుంభకోణంలో మరణించారు. ఆయన అంత్యక్రియలకు శ్రీ రమణాశ్రమంనుంచి కుంజుస్వామి వెళ్ళారు.

* * *

1939 లో అలఘమ్మ సమాధిపై ఆలయ నిర్మాణానికి ప్రారంభోత్సవం చేశారు. నిర్మాణ నిమిత్తం ఆశ్రమాధికారులు డబ్బు వసూలుచేయడానికి బయలుదేరారు. ఆ సంగతి తెలిసి, "నా పేర ముష్టి ఎత్తవద్దని ఇదివరకే చెప్పాను. ఇప్పుడు మళ్ళా చెపుతున్నాను. వున్నదానితో తృప్తిపడండి. అయింది అవుతుంది. కానిది, కాదు. ఎవరి ప్రయత్నంవల్లా ఏదీ కాదు" అన్నారు భగవాన్. అయినా ఎవరూ ఆయన మాట లక్ష్యపెట్టినట్లు లేదు.

భగవాన్ తిరువణ్ణామలై వచ్చి యాభై సంవత్సరాలు అయిన సందర్భంలో 1946 లో స్వర్ణోత్సవాలు జరపడానికి ఆశ్రమాధి కారులు నిర్ణయించారు. ఆ ఉత్సవానికి ఎందరో భక్తులు దేశ-విదేశాల నుంచి వస్తారనీ, వారందరికీ చిన్న ధ్యానమందిరం సరిపోదనీ, కనుక మాతృభూతేశ్వరాలయం ముందు ఒక పెద్ద హాలు కట్టించాలనీ ఆనాడు శంకుస్థాపన ఏర్పాటుచేశారు.

1946 - సెప్టెంబరు - ఒకటవ తేదీన ఆశ్రమంలో జరపదలచుకున్న స్వర్ణోత్సవ కార్యక్రమ పత్రికను ఆశ్రమ అధికారులు భగవాన్‌కి చూపారు. ఆనాడు ఎందరో పెద్దలు ప్రసంగిస్తారనీ, గొప్ప గాయకులు పాడతారనీ ఆ కార్యక్రమంలో

వుంది. దాన్ని చూసి "వీరంతా దేన్ని గురించి మాట్లాడతారబ్బా? ప్రసంగించడానికి ఏముంది? ఉన్నది మౌనం. దాన్ని మాటల్లో ఎట్లా చెప్పడం?" అని, "ఇది నాకు ఇప్పుడు చూపుతున్నారు. ఇదంతా నేను కావాలన్నానా? మీ ఇష్టం. నా కార్యక్రమం నాది" అన్నారు భగవాన్. ఆరోజు ఆశ్రమంవారు గొప్ప "సావనీర్" విడుదల చేశారు.

* * *

సజ్జనుడు, పండితుడు, అల్పకాయుడేకాక, వికారాకారుడు, పరమ నిరుపేద అయిన రామనాథబ్రహ్మచారి, భగవాన్ విరూపాక్ష గుహలో వున్నప్పుడు వచ్చి, ఆయనతో స్థిరపడి, ఎంతో సేవచేసి, వైద్యం నిమిత్తం మద్రాసువెళ్ళి, **19-12-1946**న మరణించారు.

**18-1-1947** న శివప్రకాశంపిళ్ళై స్వగ్రామంలో మరణించారు.

* * *

**1947** ప్రారంభం నుంచీ భగవాన్ ఆరోగ్యం ఏమీ బాగా లేదు. అప్పుడప్పుడూ ఏదో ఒక రూపాన అనారోగ్యం ఆయన దేహాన్ని క్షీణింపజేసింది. కీళ్ళ నొప్పులతో ఆరంభమైన బాధ, వళ్ళంతా వ్యాపించి, బాధపెట్ట నారంభించింది. భగవాన్ క్రమంగా నీరసపడిపోయారు. అయినా ఆయనేమీ పట్టించుకోలేదు. ఆశ్రమ భోజనం భగవాన్ ఒంటికి సరిపడేంత శక్తిని ఇవ్వడం లేదనీ, భగవాన్ బలవత్తరమైన ఆహారాన్ని తీసుకోవాలనీ డాక్టర్లూ, భక్తులూ కోరినా, భగవాన్ అంగీకరించలేదు. అవన్నీ వీల్లేదని తోసేశారు. అందరితో పాటే గాని, తనకు ప్రత్యేకం, అధికం

పనికిరాదన్నారు. అప్పటికి ఆయన వయసు డెభ్భైసంవత్సరాలు. కాని, అనారోగ్యంవల్ల, ఎక్కువ వయసువారి మాదిరిగా కనుపించే వారు, భగవాన్.

1948 నాటికి భగవాన్‌కి కీళ్ళబాధ ఎక్కువైంది. కూర్చుంటే లేవలేరు. కాళ్ళకు నూనె మర్దనా చేసిన తర్వాత, కర్రసాయంతో నెమ్మదిగా పైకి లేచేవారు. ఒకరోజు అట్లా పైకి లేస్తూ, "ఆయిల్ లేకపోతే, ఈ మెషీన్ నడవదు" అన్నారు.

తాను కర్రసాయంతో పైకి లేవాలి గనుక, దగ్గర వున్న పరిచారకుడు ఆయన పైకి లేచేప్పుడు కర్ర చేతికి అందించేవాడు. ఒకరోజున అలా పైకి లేస్తూ, "యజమాని కర్ర చూపితే, కోతి లేచి ఆడుతుంది" అన్నారు.ఎటువంటి పరిస్థితిలోనూ ఆయన్నించి జోక్స్, చమత్కారపు మాటలు వస్తూనే వుండేవి.

పైకి లేవబోయి ఒక్కోసారి తూలేవారు లేదా, పక్కకు వొరిగేవారు. ఆయన క్రమంగా అంత నీరసపడ్డారు.

భగవాన్ దేహానికి వొణుకు ఆరంభమైంది. దృఢం, శక్తివంతం, గంభీరం, స్థూలం అయన ఆయన దేహం ముడుతలు పడి, శుష్కించి, శల్యమై, ఒంగి నీరసపడింది. అనేక విధాల వారి ఆరోగ్యం క్షీణించసాగింది.

"స్వామీ, మీరు వయసులో వున్నారు. అయినా మీకు తల వూగడం, కర్రసాయం ఏమిటి ?" అని ఒకరు భగవాన్ని అడిగితే, "ఓ పెద్ద ఏనుగును, చిన్న పూరిపాకలో కడితే, ఆ పాక గతి ఊహించుకోండి" అన్నారు భగవాన్.

1948 జూన్ పద్దెనిమిదవ తేదీన గోలక్ష్మికి జబ్బు చేసింది. ఆ మర్నాడు లక్ష్మికి ప్రమాదంగా వుండటం, భగవాన్ వెళ్ళి, నేలమీద కూర్చుని లక్ష్మి తలను ఒడిలో పెట్టుకుని, నిమురుతూ "అమ్మా, లక్ష్మి ! లక్ష్మి !! నేను నీ దగ్గర వుండాలను

కోంటున్నావా ?" అంటూ దాని కళ్ళలోకి సూటిగా చూసి, దాని ముఖానికి తన ముఖమద్ది, ముద్దు పెట్టుకున్నారు. కొంతసేపు లక్ష్మి దగ్గర కూర్చుని, తర్వాత దాని దగ్గర శలవు తీసుకుని, భోజనానికి వెళ్ళారు. పదకొండున్నర గంటలకు గోలక్ష్మి విముక్తి పొందింది.

ఆ సాయంత్రం లక్ష్మిని ఆశ్రమ ఆవరణలోనే సమాధి చేయడానికి నిశ్చయించుకుని, దాన్ని ఆ ప్రదేశానికి బండిలో తీసుకువెళ్ళారు. అక్కడ గోలక్ష్మిని స్నానం చేయించి, పసుపు పూసి, కుంకుమ బొట్టుపెట్టి, పూలదండలు వేసి, ఎర్రి పట్టుబట్ట మెడకు చుట్టి, అగరవత్తులు వెలిగించి, హారతి ఇచ్చారు. భగవాన్ అంతసేపూ అక్కడే వున్నారు. అక్కడ చేరిన వారికి గోలక్ష్మి కథ చెప్పారు. "లక్ష్మి ఆరుమాసాల దూడగా వచ్చి, తన మధుర హృదయంతో, ప్రేమతో, తెలివితో, మసలుకొని, చివరికి విముక్తి పొందింది."

ఆ తర్వాత గోలక్ష్మిని సమాధి చేశారు. కొన్నాళ్ళ తర్వాత ఆ సమాధిపై ఒక కట్టడం కట్టారు.

* * *

**1949** - ఫిబ్రవరి - మూడవ తేదీ. సాయంత్రం మాతృభూతేశ్వరాలయానికి శిల్పాలు చెక్కిన స్తపతి, కడు వృద్ధులు. భగవాన్ని, ఆలయాన్ని, మిత్రుల్ని చూడ్డానికి ఆశ్రమానికి వచ్చారు. ఆయన నడవలేక ప్రయాసపడుతున్నారు. చాలా కాలానికి కనుపించిన ప్రాణమిత్రుణ్ణి చూసినట్లు భగవాన్ ఆయన్ని దూరంనుంచే చూశారు. స్తపతి భగవాన్ ముందు సాష్టాంగపడి, ఆయన పాదాల్ని తాకి, కన్నీరు కార్చారు. తర్వాత, భగవాన్ పక్కన కూర్చున్నారు. భగవాన్ ఆయన యోగక్షేమాలు కనుక్కున్నారు.

మొదలియార్ పాటి భగవాన్ని విరూపాక్ష గుహలో దర్శించి నప్పటినుంచీ, ఎచ్చమ్మాళ్ మాదిరిగా ఆమె కూడా రోజూ ఒక వంటకం చేసి భగవాన్‌కి పెట్టేది. ఆ తర్వాత ఆమె కొడుకు కూడా ఆమె దగ్గరకు వచ్చేశాడు. ఆమెకు చివరి రోజుల్లో చూపుపోయింది. అయినా ఆశ్రమానికి వచ్చేది. ఒకసారి ఆమెను ఒకరు అడిగారు "అవ్వా, నీకు కళ్ళు కనపడవు కదా ? ఇంక భగవాన్ని ఏం చూస్తావు ?" అని. దానికి ఆమె గొప్ప తన్మయత్వంతో, "నేను భగవాన్ని చూడ్డం కాదు, దయార్ద్రమైన ఆయన చూపు నా మీద పడుతుందని వచ్చాను" అంది. ఆమెకు భగవాన్ అంటే అంత ప్రేమ, విశ్వాసం.

భగవాన్ ఎడమచెయ్యి భుజం దగ్గర మాంసంముద్ద ఆకారంలో చిన్న కురుపువంటిది ఒకటి పొటమరించింది. ఎవరూ దాన్ని సీరియస్‌గా తీసుకోలేరు. ఫిబ్రవరిలో ఆశ్రమ డాక్టరు దాన్ని ఆపరేషన్ చేశారు. దానితో భగవాన్ భూలోకవాసం చరమాంకం ఆరంభమైంది. చీకటి తెరలు నెమ్మదిగా కిందికి జారడం ఆరంభించాయి.

భగవాన్ దేహాన్ని బాధిస్తో, కృంగదీస్తో, అందరినీ భయపెడుతో ఆ కురుపు మళ్ళా మార్చిలో చాలా పెద్దగా పొటమరించింది.

మాతృభూతేశ్వరాలయానికి కుంభాభిషేకం, ఆ ఆలయం ముందు కట్టిన పెద్ద హాలుకు ప్రారంభోత్సవం ఏర్పాటుచేయబడింది. మార్చి పధ్నాల్గో తేదీనుంచి, పదిహేడవ తేదీవరకు ఉత్సవాలు జరుప నిశ్చయించారు. ఆ సందర్భంగా ఆశ్రమంలో మూడు ప్రత్యేక యాగశాలలు కట్టారు. ఎంతోమంది వేద పండితులు వచ్చారు. మరొకచోట వేదపారాయణ, హోమములు, అర్చనలు. ఆ ఉత్సవాలకు దేశ - విదేశాలనుంచి ఎందరో భక్తులు వచ్చారు. మాతృభూతేశ్వరాలయానికి ముందుకట్టిన పెద్ద హాలుకు "జూబిలీ

హాలు" అని పేరు పెట్టారు. ఆ హాల్లో భగవాన్ కూర్చునేందుకు నల్లమార్బుల్ రాతితో ఒక సోఫా తయారుచేయించారు. ఆశ్రమంలో ఎన్నో సంగతులు జరుగుతున్నాయి. కానీ, ఏ ఒక్క సంగతీ ఆశ్రమాధికారులు ముందుగా భగవాన్‌కి తెలియపరచలేదు.

సామవేదపఠనం, నాదస్వరం, పూజలు, కచేరీలు అన్నీ ఆరంభమయ్యాయి. పూరీ పీఠాధిపతులు వచ్చారు. వారికి శ్రీ రమణాశ్రమంవారు ఎంతో గౌరవ మర్యాదలు చేయబోతే, ఆయన అంగీకరించక అందరితోపాటు భగవాన్ పాదాలముందు కృష్ణాజినం పరచుకుని, ప్రణమిల్లి కూర్చున్నారు.

జూబిలీహాలు దర్బారులాగ అలంకరించారు. దానికి ప్రారంభోత్సవం చేయవలసినదిగా భగవాన్ చేతికి ఒక పెద్ద తాళంచెవి ఇచ్చారు. భగవాన్ బలహీనంగా వుండటంచేత,అంత పెద్ద తాళంచెవి తిప్పలేక తిప్పలు పడుతోవుంటే, చిన్న స్వామి చూసి, దాన్ని తీసుకుని తిప్పారు. వైకుంఠంలో శ్రీ మహావిష్ణువులె, కైలాసంలో మహేశ్వరుని మాదిరిగా సమస్త భక్తగణంతో భగవాన్ జూబిలీహాలులో ప్రవేశించారు. రాతి సోఫాపై ఎర్రటి వెల్వెట్ కార్పెట్ పరచి, చుట్టూ పట్టుదిళ్ళు వేశారు. భగవాన్ సోఫాలో ఆసీనులైన తర్వాత, భక్తులందరూ నమస్కరించారు. ఆ తర్వాత భగవాన్ని యాగశాలకు తీసుకు వెళ్ళారు. అప్పటికే రాత్రి పదిగంట లయింది. భగవాన్ బాగా అలసిపోయారు.

రాత్రిం-బవళ్ళు ఆశ్రమ ఆవరణ అంతటా ఒకటే పెద్ద కోలాహలం. ఎటుచూసినా గుంపులు, గుంపులుగా జనం. దారితప్పి, మహానగరంలో చిక్కుపడిపోయిన పల్లెటూరి పిల్లవాని మాదిరిగా, భగవాన్ ఒక్కరే మౌనంగా కూర్చున్నారు. అంత వైభవంగా, బ్రహ్మాండంగా ఉత్సవాలు జరుగుతున్నా, భగవాన్‌కి ఏదీ పట్టలేదు. అయినా సర్వాధికారి భగవాన్ చేత సాంప్రదాయికమైన కొన్ని పనులు చేయించారు, ఆ సందర్భంలో.

పదిహేడవతేదీ ఉదయం, పదకొండు గంట
శ్వరాలయం మెట్లన్నీ ఎక్కించి, గర్భాలయంలో
అందున్న శివలింగాన్ని భగవాన్‌చేత తాకించార
బైటికివచ్చి, ఆలయశిఖరంపైనున్న అర్చకు
ఆరంభించండి," అన్నట్లు భగవాన్‌చేత చేతితో సై

ఆ కార్యక్రమం పూర్తిఅయిన తర్వాత,
సోఫాలో కూర్చోమన్నారు. కూర్చున్న తర్వాత
ఖాన్ ఆయన్ని పూలమాలలతో అలంకరించి, భగ
ఇంగ్లీషులో చదివింది.

భోజనం వేళయినా, పూజ పూర్తికా
భోజనానికి లేవలేదు. మద్రాసు నుంచి వచ్చిన
పాడారు. ఆ రాత్రి శ్రీ చక్రపూజ పూర్తిఅయ్యే
గంటలయింది.

మొత్తంమీద స్వర్ణోత్సవాలు వైభవంగా
చేతిమీద కురుపును పరీక్షించడానికి మద్రాస్‌నుం
పరీక్షచేసి, కురుపు ఆపరేషన్ చేశారు అయినా పు
మళ్ళా విపరీతంగా పెరిగింది. చెయ్యి తీసెయ్యడ
సలహా ఇచ్చారు. రోజు రోజుకి భగవాన్ నీ
ఆయనకు నారింజరసం తప్ప, మరో ఆహా
నెమ్మదించింది. గుండె బలహీనమైంది. కాళ్లు, చే
ఏది తిన్నా వాంతి అయ్యేది.

జ్ఞానికి అంగచ్ఛేదం పనికిరాదన్నారు,
అసలు ఆపరేషన్ కూడదన్నారు మరికొందరు.
ఆపరేషన్‌కు అంగీకరించక, "ఎందుకు గ
దేహమంటేనే రోగం. దాని గతికి దాన్ని ఒ

చెయ్యి తీసెయ్యడం దేనికి ? రోజూ పుండు కడిగి, కట్టుకట్టితే చాలు" అన్నారు. "గొడవ పడతారెందుకు?" అని భగవాన్ అన్నారని, అందరికీ కొండంత ధైర్యం వచ్చింది. కురుపు నయమై పోతుందనుకున్నారు. కాని, క్రమంగా భగవాన్ వరండాలోకి కూడా రాలేకపోవడంతో దర్శనం నిలిపేశారు. అందరిలో దిగులు, నిరాశ అలుముకున్నాయి.

జూన్ ఒకటవ తేదీన ఆశ్రమం ముందు పెద్ద రాయి తెచ్చి పడేశారు, దాన్ని భగవాన్ విగ్రహంగా చెక్కడానికి. ఆ బండ రాయికి పూజ చేశారు. వైద్యనాథ స్తపతి దాన్ని చెక్కడం ఆరంభించారు. ఏమీ పట్టనట్లు అన్నీ చూస్తున్నారు భగవాన్.

భగవాన్ ఆరోగ్యం రోజురోజుకూ క్షీణించడం గమనించిన ఒకామె, "స్వామీ, మీరు మమ్మల్ని ఒదిలిపోవద్దు. మీరెప్పుడూ ఇట్లాగే మాకు దర్శనం ఇస్తూ వుండాలి" అంది అమాయకంగా.

దానికి భగవాన్, "అదిగో, అలా బైటికి చూడు !" అని పోలు బైట చెక్కుతున్న విగ్రహాన్ని చూపి, "వాళ్ళు భగవాన్ని చెక్కుతున్నారు. ఆ భగవాన్ ఎప్పుడూ మీకు దర్శనం ఇస్తారు" అని పక్కకు తిరిగి, "ఇప్పుడు వీళ్ళు నన్ను ఈ దేహానికి అంటి పెట్టుకుని వుండమంటున్నారు. అంటే, అర్థమేమిటో తెలుసా ? నేను దేహాన్ని వదలడానికి ఏ మాత్రం వీల్లేదు. ఎందుకంటే, నేను వాళ్ళకు ఎప్పుడూ దర్శనం ఇస్తూ వుండాలి. అలాగే వాళ్ళు ఎప్పుడూ నన్ను చూడ్డానికీ, ఇద్దరం సజీవులమై వుండాలి. బాగానే వుంది. అయితే పిల్లల గతి ఏమిటి ? వాళ్ళూ ఎప్పుడూ దర్శనం పొందాలి. ఎవరూ చావడానికి వీల్లేదు" అన్నారు.

"ఆమె అభ్యర్థనలోని మరో భాగం, మీరు మమ్మల్ని వదలి పోవద్దు" అని. ఆ మాటకు భగవాన్ "నేను వెళ్ళిపోవడం

లేదు. ఎక్కడికి వెడతాను ? ఎక్కడికి వెళ్ళగలను ? ఇక్కడే వుంటాను'' అన్నారు.

ఆ మాట అందరికీ గొప్ప హామీగా తోచింది. సర్వ సాధారణంగా ప్రతి గురువు దేహం చాలించే ముందు తన శిష్యుల్ని ఉద్దేశించి ఓదార్పుగా, ''నేను మళ్ళా త్వరలో తిరిగి వచ్చి,మిమ్మల్ని తీసుకుని ఉద్ధరిస్తాను''అని అంటారు. కాని, భగవాన్ అట్లా అనలేదు. గురువుల అందరి లక్ష్యం, మానవాళికి సహాయం చేయడం. ప్రజలు అహంకారంతో అణగిపోకుండా, భ్రాంతిలో మునిగిపోకుండా, అజ్ఞానంలో కూరుకుపోకుండా వాళ్ళ వికాసంకోసం సహాయపడతారు. ఆ గురువుల పద్ధతులూ భిన్నంగా వుండవచ్చు. భగవాన్ పద్ధతి - వెదికేవారికి దారి చూపడం.

''సకాలంలో అన్నీ సక్రమంగా జరుగుతాయి'' అని భగవాన్ అన్నారని, భక్తులలో ధీమా ఏర్పడింది. ఆయుర్వేదం మందులు ఇచ్చారు. మూలికావైద్యం చేయించారు. అయినా కురుపు నయం కాలేదు.

ఆ రోజుల్లో భగవాన్ భాగవతం నుంచి ఒక శ్లోకం అనువదించారు. దాని తాత్పర్యం : కర్మ ఫలితంగా ఏర్పడిన దేహం, కొన్నాళ్ళు వుంటుంది. చివరికి గతించిపోతుంది. తాగి మత్తులో వున్నవాడు, కట్టుకున్న బట్టలమీద దృష్టి పెట్టనట్లు, ఆత్మ సాక్షాత్కారం పొందినవారు, దేహాన్ని ఏమాత్రం లక్ష్య పెట్టరు. దాన్నే చూస్తూ కూర్చోరు.

దేహం అవతరణకు, కర్మ కారణం అంటుంది శాస్త్రం. ఆ కర్మ ఎలా వచ్చింది ? అంటే, దానికి జవాబుగా ''గత దేహం నుంచి'' అని. దాన్ని శాస్త్రం ప్రమాణంగా తీసుకుంది. ఆ ప్రకారం

జన్మలకూ, దేహాలకూ, కర్మలకూ అంతు వుండదు. "అసలు ఎవరి దేహం ? ఎవరి కర్మ?" అని ప్రశ్నించుకుంటే, విచారణ ఆరంభమౌతుంది.

"భగవాన్, మీరు నిజంగా బాధపడుతున్నారా ?" అని ఒకరు భగవాన్ని అడిగారు.

దానికి భగవాన్, "నలిగినా, నరకబడినా చెరకులోని తీపిదనం పోనట్లు "ఇందంతా ఏమీ లేదు - శుద్ధ ఎరుక. నిర్గుణం, నిరాకారం" అని తెలుసుకున్న జ్ఞాని, తనను కత్తి గాయపరచినా ఏమీ గొడవ పడడు" అని యోగవాసిష్ఠంలోని ఒక శ్లోకం చెప్పారు.

"ఈ దేహం భగవాన్ అనుకుని, దానికి బాధ ఆపాదిస్తారు. అది ఎంత హృదయ విదారకమైన సంగతి" అన్నారు భగవాన్, ఒకసారి. మరొకసారి పరిచారకునితో, "మనసు లేకపోతే బాధ ఎక్కడ వుంది?" అన్నారు. పంచేంద్రియాలు పనిచేసి, ముఖ్యం, బాహ్యంగా - ప్రపంచం, దేహం వున్నాయని మనసుకు ఆ సమాచారాన్ని అందిస్తాయి. మనసు ఆ సమాచారం మీద పనిచేసి, తీర్పు ఇచ్చి, నిర్ణయాలు తీసుకుంటుంది. దాని ఫలితమే సుఖ - దుఃఖాలు, కష్ట - సుఖాలు, బాధా - సంతోషాలు ఆనంద - విషాదాలు - అన్నీ అట్లా ద్వంద్వంగా వుంటాయి.

"జ్ఞాని చెయ్యి కత్తితో నరికితే, అందరి మాదిరిగా వారికీ బాధ వుంటుంది. కాని, వారి మనసు సదా ఆనందంతో నిండి వుండటంచేత, సామాన్యులు పడేంత బాధ పడరు" అన్నారు భగవాన్ వేరొకసారి.

భగవాన్ బాధకు అతీతులే. భగవాన్‌కి వేసిన కురుపు సంగతి తెలిసిన డాక్టర్లు భగవాన్ని చూసి, "ఆయన ఆ బాధ

ఎలా భరిస్తున్నారో !" అని ఆశ్చర్యపోయేవారు. ఆపరేషన్ సమయంలో కూడా భగవాన్ ఏమీ సంబంధం లేనట్లు వుండేవారు.

"ఏసుక్రీస్తు మహా జ్ఞాని అయితే, ఆయన శిలువమీద ఎందుకు అరిచారు ?" అని ఒకరు భగవాన్ని అడిగారు. దానికి భగవాన్, "దేహానికి బాధ తప్పకుండా వుంటుంది. తాను దేహం అనుకున్న వారికీ బాధ తప్పదు. ఏసు దేహం శిలువమీద రియాక్ట్ అయింది. ఎందుకంటే, నిత్యజీవిత కార్యక్రమాల్ని నిర్వర్తిస్తున్నంత కాలం అంటే, చివరి వరకు దేహం రియాక్షన్స్ - దానికి వుండనేవుంటాయి. జ్ఞాని దేహం బాధపడుతున్నా, ఆ బాధ కూడా ఆత్మలో ఒక అంశం అనుకుంటాడు. అతనికి ఆత్మే, పూర్ణం. అతనికి బంధం - ముక్తి - బాధ అంతా ఒకటే. అవన్నీ చూసే వారిలోనే కాని, వారికి వుండవు. బాధ వారిని ఏమీ చెయ్యలేదు. బాధకు వారు చలించరు. వారు అన్ని అవస్థలకూ అతీతులు. కాని, కొందరు బాధపడుతున్నట్లు కనపడతారు. అంతే!" అన్నారు.

భగవాన్ తనకు ఏ వైద్యం అక్కర్లేదని అంటున్నా వినక, ఆశ్రమాధికారులు అనేక వైద్యాలు చేయించారు. భగవాన్ దేహం మొదటినుంచీ దుర్బలమైనది. ఆయనకు చిన్నప్పుడంతా ఉబ్బసం వుండేది. పదిహేనేళ్ళ తర్వాత, ఆ ఉబ్బసం పూర్తిగా నయమైంది. ఆయన జీర్ణశక్తి ఏనాడూ మంచిది కాదు. క్రమంగా కీళ్ళ బాధలు పట్టుకున్నాయి. వాటికి తోడు ఈ కురుపు వచ్చి పడింది. ఆ కురుపును డాక్టర్లు "సార్కోమా" అన్నారు. ఆ సార్కోమా వారి చివరి శక్తి సారాన్ని పిండేస్తోంది. కాని, అప్పుడప్పుడూ "సార్కోమా వున్న చెయ్యి బరువుగా, బాధగా వుంది" అనేవారు కాని, నాకు బాధగా వుందనేవారు కాదు, భగవాన్.

పాతాళలింగ ఆలయాన్ని శ్రీమతి తల్యార్ ఖాన్ బాగు చేయించి,అప్పటి గవర్నరు జనరలైన రాజాజీ చేత **14-5-1949**న

ప్రారంభోత్సవం చేయించారు. ఆ ఉత్సవానికి మద్రాసు గవర్నరు భావనగర్ మహారాజా సతీసమేతంగా వచ్చి, భగవాన్ని దర్శించారు.

ఒకరోజున భగవాన్ పాత భక్తుల్లో ఒకరు ఆశ్రమానికి వచ్చి, భగవాన్ ముందు సాష్టాంగపడ్డారు. భగవాన్ కురుపుకు కట్టుకట్టినట్లే, ఆయన ఎడం చెయ్యి భుజం దగ్గర ఓ కట్టువుంది. అది చూసి నవ్వుతూ, "మీరు నాతో పోటీకి వచ్చారే!" అన్నారు భగవాన్. భగవాన్ తప్ప అందరూ గొల్లున నవ్వారు.

ఇంకో రోజున సుబ్బరామయ్యగారు భగవాన్తో, "Will - Power - ఆత్మశక్తి" సాయంతో దేహ అనారోగ్యాన్ని నయం చేసుకోవచ్చునని మీరు చెప్పారుకదా ?" అన్నారు. దానికి భగవాన్, "అంటే, నా ఆత్మశక్తితో నా సార్కోమా నయం చేసుకోమని మీ అర్థం. అవునా ? నేను దాన్ని రమ్మన్నానా, ఇప్పుడు దాన్ని పొమ్మనడానికి ? దానికది వచ్చింది. ఇంక నా ఆత్మశక్తితో పనేముంది ?" అన్నారు.

"ఆత్మశక్తి–Will-Power" అదే ఇచ్ఛా శక్తి - అంటే, ఫలాఫలాలను సమంగా చూడగల మనోబలం. జయాపజయాలు ఇచ్ఛాశక్తివల్ల కాదు, ప్రారబ్ధంవల్ల కలుగుతాయి. ఇచ్ఛాశక్తితో విజయాలు సాధిస్తే అధికారదర్పం పెరిగి, ఆధ్యాత్మిక జీవనం కుంటుపడుతుంది.

ఆగస్టులో భగవాన్ సార్కోమాకు మూడో ఆపరేషన్ జరిగింది. రేడియం ట్రీట్మెంట్తో సార్కోమా తిరిగి పొటమరించదని డాక్టర్ల అభిప్రాయం. ఆపరేషన్ అనంతరం తనకేమీ జరగనట్లు భగవాన్ వరండాలోకి వచ్చి కూర్చుని, మామూలుగా దర్శనమిచ్చారు. ఆయన ముఖంలో బాధా చిహ్నాలేమీ లేవు. భోజనం, దర్శనం హాలులో ఏర్పాటు చేస్తే, "అందరితో పాటు నా భోజనం ఎప్పుడు?" అని గొడవపెట్టారు.

కొన్నాళ్ళు వేదపారాయణ ఆపేశారు ; భగవాన్ సమక్షంలో. భగవాన్ ఆరోగ్యంకోసం ప్రత్యేక సూర్యస్తోత్రాలూ, పూజలూ చేయించారు. యజుర్వేదంలోంచి నూటముప్పైరెండు శ్లోకాలు ప్రత్యేక వేదపండితులచే. నలభై ఎనిమిది రోజులు పారాయణ చేయించారు. భగవాన్ ఆరోగ్యంకోసం చవనప్రాసలేహ్యం ఇవ్వ బోతే, ఆయన నిరాకరించారు. లేహ్యం భగవాన్ వంటికి మంచిదని ఆశ్రమంవారన్నారు. దానికి భగవాన్ "నాకు మంచిచేసేది, అందరికీ మంచి చేస్తుంది. కనుక మీరందరూ తినండి" అని ఆ ఉదయం అక్కడ కూర్చున్న వారందరికీ ఆ లేహ్యం పెట్టమని పరిచారకుని చేతికి సీసా అందించారు భగవాన్. అతడు అందరికీ ఆ లేహ్యం పెట్టాడు.

ఒకరోజు సాయంత్రం భగవాన్ ఆరోగ్యం ఏమీ బాగాలేదు. ఏం బాగాలేదో ఆయనేమీ చెప్పరు. ఇతరులకూ తెలియదు. నిదానించి చూసినవారికి ఆయన ముఖంలో ఆ మధ్యాహ్నం నుంచీ అలసట కనుపించింది. వేదపారాయణ జరుగుతుండగా భగవాన్ తల పక్కకు ఒరిగి, క్రమంగా కిందికి ఒరిగి, చివరికి మరీ క్రిందికి తూలుతూ వాలిపోవ నారంభించింది. మధ్య మధ్య ఆయన ప్రయ త్నించి తలను నిటారుగా నిలుపుతూనే వున్నారు. ఆరుగంటలకు అందరూ ఆశ్రమం నుంచి వెళ్ళిపోయిన తర్వాత, ఓ డజనుమంది మిగిలారు, భగవాన్ దగ్గర.

సోఫామీపై కట్టిన తెల్లనిబట్టమీద, ఎర్రటి రక్తపు మరక కనపడింది. ఆ మరక క్రమంగా పెద్దదై, ఆ చేయి ఆనుకున్న దిండు గలేబికి రక్తం అంటుకుంది. ఆ రక్తంచూసి పరిచారకుడు, కంగారుపడి, డాక్టరు దగ్గరకు పరిగెత్తాడు. డాక్టరు రోజూ పుండు కడిగి కట్టుకడుతున్నారు. ఆ రక్తపు మరకచూసి, హాలంతా నిశ్శబ్దమైంది. కొందరు ఆడవాళ్ళు ఏడ్పులు ఆరంభించారు. మగవాళ్ళు ఆందోళనతో దిగులుగా కూర్చున్నారు. మహర్షి

మాత్రం దేన్నీ లక్ష్యపెట్టకుండా నిశ్చలంగా వున్నారు. తనకు ఏమీ తెలియనిది, తనకు ఏమాత్రం సంబంధంలేనిది ఏదో, తన చేతిమీదకు వచ్చినట్లు ఓ వింత దృష్టితో తన చేతిమీదవున్న పుండువంక చూశారు, భగవాన్. తనవల్ల హాల్లో వున్నవారందరికీ కష్టం, కలవరం, కలత, కలిగినందుకు క్షమించమని అడుగుతున్నట్లు అందరివంకా చూశారు.

డాక్టరు వచ్చి, కట్టుకట్టి, "వెళ్ళి విశ్రాంతి తీసుకోండి" అన్నారు. ఆ మాట విని భగవాన్ అందరివంకా మరొకసారి ప్రేమగా చూసి, పిల్లల్ని వదలలేని, కదలలేని తల్లిగా, కడుజాలిగా చూశారు. ఆ తర్వాత డాక్టర్నిచూసి, చిరునవ్వు నవ్వి, తనవల్ల అక్కడ వున్నవారికి కలిగిన మానసిక వ్యాకులత నుంచి వారిని తప్పించేందుకు డాక్టరు సలహాను నిరాకరించి, తన భక్తులమధ్య వుండిపోయారు, భగవాన్. అంతటి ప్రేమమూర్తులు భగవాన్.

కురుపు కొంత నయమనిపించింది. 24-9-1949 న, మొదలియార్ పాటి పరమపదించిన సంగతి విని, భగవాన్ ఆమె జీవిత విశేషాలు అక్కడ వున్నవారికి చెప్పారు.

నవంబరు చివరిలో సార్కోమాకు ఆపరేషన్ చేశారు. శిలువ వేస్తునప్పుడు జీసస్ ఎట్లా ప్రశాంతంగా వున్నారో, భగవాన్ ఆపరేషన్ చేస్తున్నప్పుడు అట్లా వున్నారు.

భగవాన్ రాతివిగ్రహాన్ని జూబిలీ హాలులోవున్న రాతి సోఫాముందు ప్రతిష్టించారు.

డిశంబరులో భగవాన్ బాగా నీరసించిపోయారు. తిండి, నిద్ర తగ్గిపోయాయి. సార్కోమా బాగా పెరిగింది. అయినా భక్తులకు రెండువేళలా దర్శనం ఇచ్చేవారు.

"ఇంక మావల్ల కాదు" అన్నారు డాక్టర్లు.

**1950** - జనవరి, ఐదో తేదీన భగవాన్ జయంతి. అదే చివరి దర్శనంగా భావించి, దేశ, విదేశాలనుంచి ఎందరో భక్తులు వచ్చారు. ఆశ్రమ ఆవరణ అంతటా అందంగా అలంకరించారు. ముగ్గులు పెట్టారు. తోరణాలు కట్టారు. సున్నాలు, రంగులు వేశారు. మేళ, తాళాలు పెట్టారు. సర్వాధికారి ఎంత బ్రతిమాలినా, కొత్తగా కట్టిన ప్రత్యేక గదిలోకి వెళ్ళలేదు భగవాన్. పోలీసులు, స్కౌట్స్ వచ్చారు. భగవాన్, జయంతి భోజనం అందరితో కలసి తినలేదు. బీదలకు భోజనాలు పెట్టారు. అంత హడావిడి జరుగుతున్నా, భగవాన్ ఒంటరిగా, దూరంగా రాజాధిరాజు మాదిరిగా కూర్చున్నారు. వచ్చిన ప్రతి పాత భక్తుణ్ణి ప్రేమగా పలకరించారు. ఆరోజున చాలామంది భగవాన్ ముందు పాడారు. అరుణాచలేశ్వరాలయం నుంచి ఏనుగు వచ్చి, భగవాన్‌కి నమస్కారం చేసింది.

ఉత్తర హిందూదేశపురాణి జయంతి ఉత్సవాన్ని సినిమా తీయించింది. కాని, భక్తుల్లో ఉత్సాహం తగ్గిపోయింది.

భగవాన్ కొన్ని రోజులో, వారాలో వుంటారనుకున్నారు, జయంతికి వచ్చినవారు. ఏ వైద్యంతో సార్కోమా నయమౌతుందో చెప్పమని కొందరు భగవాన్నే అడిగారు. దానికి భగవాన్, "నేను ఎప్పుడైనా, ఏ వైద్యమన్నా చేయించమని అడిగానా ? ఈ దేహాన్ని కోరి, మీరీ వైద్యాలన్నీ చేయిస్తున్నారు. నాకోసం మీరు అదీ, ఇదీ చేశారు. అందుచేత మీలో మీరే ఆలోచించి ఓ నిర్ణయానికి రండి. నన్ను అడిగితే, నేను ఎప్పుడూ అన్నట్లే—'ఏ వైద్యమూ అవసరం లేదు. జరగవలసింది జరగనివ్వండి' అని అంటాను."

ఆ తర్వాత భగవాన్‌కి హోమియో వైద్యం చేయించారు. ఎన్ని వైద్యాలు చేయిస్తున్నా, అందరి మనసులు తుఫాను తాకిడికి

అల్లల్లాడే చిగురుటాకులుమల్లే విపరీతంగా చలించేవి. మద్రాసు నుంచి డాక్టర్లు వెంట వెంటనే వచ్చేవారు. డాక్టర్లు రాగానే "భోజనం చేశారా?" అని వారిని ప్రేమగా అడిగేవారు, భగవాన్. అలాగే, "డాక్టర్లను బాగా చూస్తున్నారా?" అని ఆశ్రమ అధికారుల్ని అడిగేవారు.

ఒకసారి భగవాన్ డాక్టర్ టి. యస్. కృష్ణస్వామితో, "ఈ దేహముంది చూశారూ, ఇది వడ్డించిన విస్తరి వంటిది. అందున్న పదార్థాలన్నీ తిన్న తర్వాత, ఆ విస్తరి విసరిపారేయక, ఎవరైనా దాన్ని దాచిపెట్టుకుంటారా?" అన్నారు. మరొక సందర్భంలో, "ఈ దేహం "నేను" అనుకోవడం వృత్త మోసం, బంధహేతువు, పాపం, హత్యాసమానం. ఈ దేహాన్ని దృష్టిలో పెట్టుకుని కాయకల్పవ్రతాలూ అవీ చేయడం మూర్ఖం" అన్నారు.

ఒకసారి పరిచారకునితో, "అన్నింటి సహాయం పొందిన తర్వాత, ఈ దేహభారాన్ని ఎవరు మోస్తారు? నలుగురు మోసేభారాన్ని, నేను ఒక్కడినే మోయాలనుకుంటున్నారా?" అన్నారు భగవాన్.

అయినా కొందరు రమణ భక్తులు మూర్ఖంగా, "భగవాన్, మీరు ఈ మీ దేహం వుండాలని కోరుకోండి" అని కోరారు. దానికి భగవాన్, "ఇది కావాలని కోరుకునేది ఎవరురా, బాబు!" అని, "మీరు ఈ దేహానికి అధిక ప్రాధాన్యం ఇచ్చారు. అందుకే మీరు నన్ను, "మీరు చనిపోతున్నారు," అని అంటున్నారు. కాని, నేను వెళ్ళి పోవడంలేదు. ఎక్కడకు వెడతాను? ఇక్కడే వుంటాను." అన్నారు.

రోజూ కురుపులోంచి ఎంతో రక్తం కారిపోయేది. భగవాన్ భోజనం సరిగా చేసేవారు కాదు. మూత్రపిండాలు బాగా దెబ్బతిన్నాయన్నారు డాక్టర్లు. నాడి బలహీనమైంది. కూర్చోవడం, లేవడం కష్టమైంది. అయినా వీలైనంతవరకు భగవాన్ తమ

పనులు తామే చేసుకునేవారు. అందరికీ దర్శనమిచ్చేవారు. అందర్నీ ప్రేమగా పలకరించేవారు. కొందరి ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చేవారు. డాక్టర్లు, భక్తులు, ఆశ్రమవాసులు భగవాన్ని విశ్రాంతి తీసుకోమంటే, ఆయన వినేవారు కాదు. అసలు ఏమి కాబోతోందో అంతా భగవాన్‌కి తెలుసు. ఆయన తన అభీష్టాన్ని నెరవేర్చుకునే వారు. అంతే! రోజూ ఆయనతోనే ఆశ్రమ దినచర్య ఆరంభమయ్యేది. అది యథాప్రకారం జరిగేది.

* * *

భగవాన్ రోజూ సూర్యోదయానికి ఒక గంట ముందు స్నానం చేసేవారు. నిర్ణీతకాలం ప్రకారం దర్శనం ఇచ్చేవారు. ఉత్తర - ప్రత్యుత్తరాలు, పుస్తకాల అచ్చు విషయాలు పరికించే వారు. అడిగినవారికి సలహాలు, సూచనలు ఇచ్చేవారు.

జనవరి తర్వాత భగవాన్ మరీ నీరసించిపోయారు.ఆయనకు ప్రత్యేకంగా ఒక చిన్న స్నానాలగది, పడకగదీ కట్టించారు. వాటి ముందు చిన్న వరండా వుంది. ఆ వరండాలోంచి భక్తులు వరుసగా వెళ్ళి, భగవాన్ దర్శనం చేసుకునేవారు.

ఒకరోజున భగవాన్ దేహస్థితి మరీ ప్రమాదకరంగా వుందని దర్శనం నిలిపేశారు. ఆయన ఆరోగ్యం బావుండాలని భక్తులు ప్రార్థనలు చేశారు.

మార్చి మూడో వారం నుంచి రేడియోలో, పత్రికల్లో భగవాన్ ఆరోగ్య వివరాలు ప్రకటించారు.ఇరవై ఏడవ తారీఖునాటికి సార్కోమా కొబ్బరికాయంత అయింది. బి. పి. 88/60- దానికి తోడు జ్వరం, కీళ్ళ బాధ, మూత్రపిండాలు సరిగ్గా పని చేయకపోవడం, ఆకలీ తగ్గింది.

కలకత్తా నుంచి కవిరాజుగారినీ రప్పించారు. ఆయన వచ్చి, భగవాన్ని పరీక్షించి మందు ఇచ్చారు. గంట గంటకూ భగవాన్ మూత్రవిసర్జనకు వెళ్ళేవారు. "బెడ్‌పాన్" పెడతామంటే, ససేమిరా వీల్లేదన్నారు. "తాగడానికి నీళ్ళు కావలిస్తే, నేనే అడుగుతాను. మీరు అడగనవసరంలేదు" అన్నారు భగవాన్.

సార్కోమా భుజందాకా వ్యాపించింది. దేహమంతా విషపూరిత మైంది. బాధ భరించరానంతగా వుంటుందన్నారు డాక్టర్లు. భగవాన్ ఒక్కోసారి నిద్రలో మూలిగేవారుట. కాని, ఎంత బాధ వున్నా, ఎవరికీ తెలియనిచ్చేవారు కాదు. భగవాన్ ఎప్పుడూ నిశ్చలంగా వుండేవారు.

భగవాన్‌కి ప్రమాదం ముంచుకొచ్చిందని అందరికీ తెలిసింది. ఆ పౌర్ణమికి భగవాన్ యథాప్రకారం క్షౌరం చేయించుకున్నారు. అంతసేపూ మంగలి నటేశ్‌తో సరదాగా కబుర్లు చెప్పారట. ఆరోజు ఆరోగ్యమూ బావుంది.

శ్రీమతి తల్యార్‌ఖాన్ భగవాన్ని అడిగింది, "స్వామీ, మీరోగం నాకు ఇవ్వండి. ఆ బాధంతా నన్ను భరించనివ్వండి" అని. దానికి భగవాన్ "అసలు దీన్ని నాకు ఎవరు ఇచ్చారు?" అన్నారు.

ఏప్రిల్ పదవతేదీన,"ఈరోజునుంచి నేను ఏమీ తినను, తాగను. ఎందుకంటే, మల-మూత్రాలకు లేవనవసరం వుండదు. కమోడ్ అవీ ఉపయోగించనవసరంలేదు. బెడ్‌పాన్ కూడా అవసరం లేదు" అన్నారు భగవాన్.

పదకొండో తారీఖున భగవాన్ భోజనం చేయలేదు, మల-మూత్రాలూ బంధించాయి. నాడి తగ్గింది. బి. పి. 78/50. గుండె బలహీనంగా వుంది. శరీర ఉష్ణోగ్రత తగ్గింది. అయినా భగవాన్ స్థిరంగా, శాంతంగా వున్నారు.

"స్వామీ, మీరు మహాసమాధి అయిన తర్వాత, మేము ఎట్లా నడచుకోవాలో, ఏ పద్ధతులపై ఈ ఆశ్రమం నడపాలో మీరు చెపితే, ప్రయత్నిస్తాం" అని కొందరు ఆశ్రమవాసులు భగవాన్ని అడిగారు. భగవాన్ చిరునవ్వు నవ్వి, "ఇన్నాళ్లూ అన్నీ నన్ను అడిగే చేశారా? దీన్ని (ఆశ్రమాన్ని) ఓ మహత్తర శక్తి నడుపుతోంది. ఇకముందు కూడా ఆ శక్తే నడుపుతుంది. మధ్య మీరెందుకు గొడవ పడతారు?" అన్నారు.

పన్నెండవ తారీఖున నాడి 96. బి. పి. 68/36. భగవాన్ చాలా నీరసంగా వున్నారు. తనకు పరిచర్య చేస్తున్నవారిని "భోజనం చేశారా ?" అని ప్రేమగా అడిగారు. ఆ మర్నాడు రాత్రి తాను నిద్రపోతానని చెప్పి, పరిచారకుల్ని కూడా నిద్ర పొమ్మన్నారు, భగవాన్.

1950-ఏప్రిల్-పద్నాల్గో తేదీ-శుక్రవారం "భగవాన్‌కి ఇదే చివరి రోజు" అన్నారు డాక్టర్లు. సాయంత్రానికి దాదాపు పదిహేను వందలమంది భక్తులు చేరారు. అందరూ భగవాన్ దర్శనం చేసుకున్నారు. ఆ మధ్యాహ్నం ఇవ్వబోతే, టైమ్ అడిగి, "ఇంక టైమ్‌తో పనిలేదు" అన్నారు భగవాన్.

తమ జీవిత సర్వస్వాన్ని భగవాన్ సేవకు అర్పించుకుని భక్తి - శ్రద్ధలతో సేవించిన పరిచారకుల నుద్దేశించి, "Thanks" అని, "దాన్నే సంతోషం" అని కూడా అంటారని వారితో చెప్పారు భగవాన్.

చివరి ఘడియలు సమీపిస్తోండగా కరుణా స్వరూపులైన రమణులు కన్నులు మెల్లగా తెరచి, అనుగ్రహంతో చుట్టూ చూసి, పరిచారకుల్ని పిలిచి, "నన్ను కూర్చోబెట్టండి" అన్నారు.

భగవాన్ కంటికొనలనించి ఆనందభాష్పాలు రాలాయి. అవి చివరి క్షణాలని అక్కడ వున్న వారందరికీ అర్థమైంది. రక్షకుడు - జ్ఞానదాత - ఆశాకిరణం - జీవన నిధి అయిన భగవాన్ అస్తమించ బోతున్నారనిపించింది.

పట్టుకుంటే బాధ కలుగుతుందని జంకి, వెనకాడుతూ వుంటే, "గొడవపడకండి" అన్నారు భగవాన్. భ గ వా న్ తలను ఒకరు పట్టుకుని కూర్చున్నారు. పైన పంకా తిరుగుతోంది. డాక్టరు ఆక్సిజన్ ఇవ్వబోతే, తోసేశారు, భగవాన్. పరిచారకులు విసురుతూ వున్నారంటే, భగవాన్ ఇంకా సజీవంగా వున్నారను కున్నారు బైట వేచివున్నవారు. జనం మళ్ళా కిటికీల దగ్గర, గుమ్మాల దగ్గర గుంపులు, గుంపులుగా చేరారు. ఆవరణ అంతటా విషాదఛాయలు చీకట్లకంటే, గాఢంగా అలుముకున్నాయి. ఒక అమెరికన్ పత్రికా విలేఖరి, ఒక ఫ్రెంచి ఫోటోగ్రాఫరు చాలా చురుకుగా పనిచేశారు.

రాత్రి ఎనిమిదీ నలభై ఏడు నిమిషాలకు భగవాన్ పెద్ద శ్వాస విడిచారు. అంతే ! మరో శ్వాస తీసుకోలేదు. ఆయన శాశ్వత శాంతిధామంలో పూర్తిగా కలసిపోయారు. భక్తులు "అరుణాచల శివా ! అరుణాచల శివా ! అరుణాచల శివా ! అ రు ణా చ లా!!" అంటూ గద్గద స్వరంతో పాడుతున్నారు. ఆ క్షణాన ఆకాశాన పెద్ద నక్షత్రం దక్షిణదిశ నుంచి నెమ్మదిగా అరుణాచలంపై వాలడం అనేకమంది చూశారు. ఆ దృశ్యాన్నే అనేక చోట్లనించి, అనేకమంది చూసినట్లు చెప్పారు. ఆ సంగతి వింతగా, ఆశ్చర్యకరంగా చెప్పుకున్నారు.

రాత్రికి రాత్రి, భగవాన్ మహా నిర్యాణం చెందారన్న వార్త అగ్నిజ్వాలలాగ నలుదిక్కులకూ వ్యాపించింది. అన్ని ప్రాంతాల నుంచీ భక్తులు తండోపతండాలుగా వచ్చారు.

చరమాంకం సమాప్తమైంది. తెర పూర్తిగా కిందికి జారింది. "అసలు సత్యాన్ని తెలిపిన, అంతిమ జ్ఞానాన్ని బోధించినా సద్గురు రమణదేహధారిగా ఇంక లేరు. జంట నక్షత్రాలమల్లె మెరిసే, అంతరాంతరాళాల్ని శోధించే, దయార్ద్రమైన ఆ కళ్ళు ఇంక కనరావు. రోదించే హృదయాలకు శాంతినిచ్చే కరుణామయుడు. ఇంక కానరాడు. ఆ దివ్యవాణి ఇంకా వినరాదు. ఆ చైతన్యమూర్తి ఇంక కదలిరాడు" అంటూ ఒకటే ఏడ్చారు, నిలవలేనివాళ్ళు.

"రాముడు లేని అయోధ్య, కృష్ణుడు లేని వ్రేపల్లె, చల్లారిన యజ్ఞవేదిక మాదిరిగా వుంది, రమణాశ్రమం" అన్నారు ఒకరు.

భగవాన్ స్వరూపం ఆశ్రమంలో, భూమండలంలో అదృశ్యమై, ఆ మరుక్షణాన అనంత ఆకాశంలో, నిజమైన భక్తుల హృదయాంతరాళాల్లో తేజోరూపంలో అవతరించింది. జీవనది, మహాసాగర గర్భంలో కలిసింది. వెలుగురవ్వ, మహాజ్వాలలో లీనమైంది. దివ్యాత్మ, విశ్వాత్మలో ఐక్యమైంది. ఆయన రూపం ఆకాశమంతా విస్తరించింది. ఆయన నామం, అందరి హృదయాల్లో ప్రేమగా ప్రతిష్టింపబడి, ప్రతిధ్వనించింది.

శారీరకంగా, మానసికంగా ఎన్నడూ, ఎటువంటి పాపమూ, తప్పూ, చెడూ, పొరపాటుచేయని భగవాన్ దేహం, చివరి రోజుల్లో ఘోరయాతన పడింది. కాని, ఆయన అరుణాచల జీవితకాలమంతా ఆత్మ ఔన్నత్యాన్ని, ఈ పదార్థ ప్రపంచంపై ఆత్మాధిక్యతనూ, విజయాన్ని చూపి, దేహం ఎంత యాతన పడుతున్నా యథాప్రకారం చివరి క్షణం వరకు ఏ మార్పూలేకుండా, ఎటువంటి ఫిర్యాదు చేయకుండా, రోగం నయం చేయించుకోవాలనే కోర్కె లేకుండా, అన్ని వేళలా అందరికీ దర్శనమిస్తో జీవించారు.

"సూర్యాస్తమయ కాంతివలె, భగవాన్ చివరి రోజులు గొప్పగా వెలిగాయి. ఆయన మహాసమాధి అవుతారన్నా,

అయ్యారన్నా దిగులు, బాధ, దుఃఖం ఏమీ లేకుండా అందర్నీ ఒకే ఆటలో నిలిపి, తాను శాంతంగా నిష్క్రమించారు. భగవాన్ సూర్యుడైతే, ఆశ్రమం సౌరమండలం. ఆయన చుట్టూ పరిభ్రమించే భక్తులు ఉపగ్రహాలు" అన్నారు ఒకరు.

ఆశ్రమంలో ఏర్పడ్డ మహాశూన్యం నుంచి తేరుకుని, కోలుకోవడానికి ఎంతగా, ఎన్నేళ్ళు సాధనచేసీ, భగవాన్ని చూసి, విని, చదివినా చివరి నిమిషాన చాలామందిలో బాధ, దుఃఖం పోలేదు. ఆ బాధ, దుఃఖం, దిగులు, ఒంటరితనం, శూన్యం పోవడానికి కొందరికి చాలా కాలం పట్టింది.

భగవాన్ అందరికీ ప్రియతముడే కాదు, నమ్ముకున్న వారి జీవితాలకు కేంద్రమైనారు. అటువంటి వారందరికీ ఆయనే తల్లి-తండ్రి-గురువు-దైవం-సమస్తం. తమ విలువైనది, పొందదగినది, ప్రాణ సమానమైనది—అయిన భగవాన్ ఇంకెప్పటికీ కనపడకుండా వెళ్ళిపోయినారని కొందరు ఒకటే రోదించారు.

భగవాన్ భూమి మీదకు వచ్చిన పని పూర్తయివుండాలి. వెళ్ళిపోయారు. ఈ భూమిమీద ఆయన ఉనికి అంతమైనా, ఆయన వాణి పవిత్ర హృదయాల్లో నిర్మలంగా నిలిచే వుంది. ఏదో బలవత్తరమైన శక్తి తమను చుట్టుకున్నట్లే, కొందరికి అనుభూతి కలిగింది.

"గురువంటే, ఈ దేహం కాదు" అన్న భగవాన్ దేహం, క్షణకాలంలో నిర్జీవంగా మారిపోయింది. భగవాన్ మృతదేహాన్ని వరండాలో కూర్చోబెట్టారు. ఆ తర్వాత పెద్ద హాల్లోకి తీసుకు వెళ్లారు. పూలమాలలు వేశారు. తెల్లవార్లూ భక్తులు పాడుతూనే వున్నారు.

ప్రతిచోటా, ప్రతిక్షణం, ప్రతి దాంట్లో అనేక విధాల భగవాన్ ఉనికిని జ్ఞప్తికి తెచ్చుకుంటూ, భగవాన్ మాటలు తలచుకుంటూ, ఆయన కబుర్లు చెప్పుకుంటూ, ఆయన పాటలు పాడుకుంటూ, అనుభవాలు తలుచుకుంటూ ఆయన నామాన్ని స్మరిస్తూ ఆశ్రమ ఆవరణ అంతటా గుంపులు గుంపులుగా జనం కూడారు.

"నేను వెళ్ళిపోవడం లేదు. ఎక్కడకు వెడతాను? ఇక్కడే వుంటాను" అన్న భగవాన్ మాటలు మళ్ళా, మళ్ళా గుర్తు చేసుకుంటూ, ఎవరికి వారు తమను తాము ఓదార్చుకున్నారు.

ఏప్రిల్ పదిహేనవ తేదీ—ఉదయం పదకొండు గంటల తర్వాత భగవాన్ మృతదేహాన్ని స్నానం చేయించి, పూలమాలలు వేసి, పూజ చేసి, హారతి ఇచ్చి, అలంకరించిన పల్లకీ వంటి పాడిలో యోగాసనంలో కూర్చోబెట్టి, నలభై వేలమంది జనసందోహం మధ్య, మంచి ఖద్దరు బట్టతో కుట్టిన సంచిలో ఆ మృతకళేబరాన్ని కూర్చోబెట్టి, ఉప్పు, కర్పూరం, విభూతి వేసిన సమాధి గోతిలో వుంచి, కర్పూరం, ఉప్పు, విభూతివేసి, ఆ గోతిని పూడ్చారు.

ఆ తర్వాత భగవాన్ సమాధిపై శివలింగం ప్రతిష్ఠించారు.

భగవాన్ మహానిర్యాణంతో రమణనగర్ పూర్తిగా ఖాళీ అయింది. భక్తులు చెల్లాచెదురైనారు. ఆశ్రమంలో కళ, కళమండే అగ్నిజ్వాల అణగిపోయినట్లయింది.

భగవాన్ సమాధిపై బ్రహ్మాండమైన నిర్మాణం చేయాలని ఆశ్రమాధికారులు పెద్దఎత్తున ఏర్పాటుచేసి "ఆనందమయి - మా"ను ఆహ్వానించారు. ఆమె బెంగాలీ బ్రాహ్మణి. ఆమెకు దేశంలో ఎన్నో ఆశ్రమాలు వున్నాయి ఎందరో శిష్యులు వున్నారు. ఆమె ఎక్కడ వుంటే, అక్కడ రాత్రిం-బవళ్లు సంకీర్తన జరుగుతుంది. ఆమె కూడా గొప్పగా పాడేవారు. ఆమె వచ్చి, భగవాన్ సమాధిపై నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. ఆ సందర్భంలో ఆశ్రమంవారు ఆమెకు గొప్ప గౌరవం చేయబోతే, "ఈ అట్టహాసం అంతా ఎందుకు? నేను నాతండ్రికి శ్రద్ధాంజలిఘటించడానికి వచ్చాను. అందరితోపాటు నేనూ కిందే కూర్చుంటాను" అన్నారు.

"నేను ఎక్కడికి వెడతాను. ఎక్కడికి వెళ్ళగలను? ఇక్కడే వుంటాను. ఇప్పటికంటే, మరింత చైతన్యవంతంగా వుంటాను"అన్న భగవాన్ మాటల్ని కొందరు భక్తులు పదేపదే, మననంచేసుకుంటారు. కాని, అలా అనిన ఆ రూపం లేదీనాడు. అంతే భేదం. "నేను ఇక్కడేవుంటాను"అని భగవాన్అన్నారంటే, శ్రీ రమణాశ్రమంలోనే వుంటారని అనుకోవడం అసంగతం. ఎందుకంటే, అసలు వున్నదేదో అది అన్నికాలాల్లో, అంతటా ఒకటిగా వున్నదే. అదే ఆత్మ.

భగవాన్ని నిజంగా అర్థం చేసుకున్న వారందరిపై ఆయన జ్ఞానకాంతి నిశ్చయంగా పడుతుంది. ఆ కాంతే, ఆ దివ్యాత్మే

భగవాన్. భగవాన్ అవతరణ, బోధ, శుభవార్త, సందేశం, ఆయన చేపట్టిన కార్యక్రమం అవగాహన చేసుకుంటే, ఎవరూ అజ్ఞానులమని గాని, పాపులమని గాని, దిక్కుమాలినవారిమని గాని అనుకోరు.

నిస్వార్థమైన ప్రేమ, మచ్చలేని స్వచ్ఛమైన, పవిత్రమైన, ఉన్నతమైన బోధ—తనను విని, చూసి, అనుసరించిన వారివలనే అవమానాలకూ, నిందలకూ, హింసలకూ, బాధలకూ గురైన మహాత్ముడు జీసస్ - అపారమైన ఆయన ప్రేమ, దయ, కరుణ, నమ్రత, విధేయత—ఆయన్ని సిలువ ఎక్కించాయి.

సిలువమీద క్రైస్ట్ కథ సమాప్తం కానట్లే, సమాధితో భగవాన్ కథ అంతం కాదు.

